ఇక మనలను తిరిగి ఈ కర్మభూమిలో జన్మింపనీయక, ఏనాడును నశింపని శ్రీ వైకుంఠమునకు మనలను అతడు చేర్చును. ఇట్లుండగా, నీవు ఆనందించుట లేదేమి కారణము? నీవు ఈ లోకములోఉండునంతవరకు నీకు తగినదానిని తెలిపెదను, వినుము ఇచట ఉన్న దినములలో భగవానునకు చేయు కైంకర్యము వ్యర్థమని తలపక, పరమపదమునకు పోయి చేయవలసిన కైంకర్యములను అన్నిటిని ఈ లీలావిభూతిలోనే పొంది ఉజ్జీవింపవచ్చును. ఇట్లున్నచో, భగవదపచారము మొదలగు ఏ దోషములును మనలను చేరవు. విశేషజ్ఞానమును కల్గును.

ఈ పాశురమును దేశికులు ఆత్మోపదేశప్రక్రియలో రచించిరి. వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము. ఆచార్యులను **"తకవోర్"** అనుచు దయాపూర్వకముగా నిర్దేశించుట వారిదయాగుణ ప్రాధ్యానమును బట్టి. కృపామాత్ర ప్రసన్నాచార్యులుకదా మన ఆచార్యులు!

**తమిళ:-ఇప్పడి ప్రతిష్ఠితబుద్ధియాన ప్రపన్ననుక్కు స్వయంప్రయోజనమాన ఉత్తర కృత్యవిశేషత్తిలుకప్పికుమ్బడియై "మన ఏవ మనుష్యాణామ్ కారణం బంధమోక్షయోః, బంధాయ విషాయాసంగి ముక్త్యై నిర్విషయం మనః" - ఇత్యాదికళిల్పడియే ఉపకారతమముమాయ్, అన్తరఙ్గముమాన మనస్సై పఱ్ఱి ఉపదేశిక్కిఱాప్పోలే ప్రవృత్తమాన వాక్యవిశేషత్తాలే కాట్టుకిఱతు ముడివిల్ పాట్టు. శిఱు పయనిల్ - క్షుద్రఫలత్తిలే, పడియాత - ఆసక్తాళాకాత, తకవోర్ - కృపాశాలికళాన వాచార్యర్కళ్, ఎమ్మై - అకించనాళాన నమ్మై, శేర్క్క-(నమ్ముడైయ వాకించన్యనివేదనపూర్వకమాక అవన్ తిరువడికళిలే నమ్మై సమర్ప్పిక్క ("శోకమోహగ్రహగ్రస్తో విచరన్ భవసాగరే, ఇహాద్యవిధినా ప్రాప్త స్తవ పాదాబ్జపత్తనమ్" ఎన్గిఱపడియే నమ్మై సమర్ప్పిక్క-వెన్ఱపడి), అడైక్కలమ్ కొణ్డ తిరుమాల్ - రక్ష్యవస్తునాక స్వీకరిత్తవనాన శ్రియఃపతి, తానే - (కరణ-కళేబరాదిప్రదానమ్ముదల్ ఇవ్వళవు పణ్ణిన) తాన్-తానే, మరు పిఱవి యఱుత్తు - వేఱు జన్మత్తై అఱుత్తు, (జన్మాంతరారంభకమాన పుణ్యపాపాత్మకకర్మత్తై నశిప్పిత్తెన్ఱపడి), అఴియా వానిల్-వినాశ మిల్లాద పరమాకాశమాన నిత్యవిభూతియిలే, వైక్కుమ్ = (ప్రతిభూప్రదానత్తిలుమ్ పోకవొట్టాతపడి) వైక్కుమ్. మనమే - సర్వకారణమాన మనమే, నీ మకిఴాదే యిరుప్పదెన్కొల్-నీ సంతోషియామలిరుప్పదెత్తాలే, ("మా శుచః" ఎన్గిఱ శరణ్య వాక్యత్తాలే హర్షస్థానత్తిల్ ఒరుపడియాలుమ్ శోకిక్క ప్రాప్తియిల్లై యెన్ఱపడి. ఇఙ్గిరున్ద కాలమ్ - (సకలమాన వుపద్రవఙ్గళై యుణ్డాక్కుమ్) ఇన్ద లోకత్తి లిరుక్కవేణ్డియ కాలమ్, ఉఱువదుమక్కురైక్కేన్ - సంశయాదికళఱ్ఱిరుక్కిఱ ఉనక్కిప్పోదు యోగ్యమానదు శెయ్య చ్చొల్లుకిఱేన్, ఒరు పిఴైయు మ్పుకుఱాద వుణర్త్తి వేణ్డి - ఓరుపద్రవమ్ వారాదపడియాన**



**జ్ఞానత్తై యపేక్షిత్తుక్కొణ్డు. (భగవదపచారాదికళ్ వారాదపడి జ్ఞానభక్త్యాదికళై యపేక్షిత్తుక్కొణ్డెన్ఱపడి) నామ్ - న్యస్తభరనాన నామ్, పెఱువదెల్లామ్-పరమపదత్తిలే పెఱక్కడవ కైంకర్యఙ్గళై యెల్లామ్, ఇఙ్గే - అజ్ఞానాంధకారప్రచురమాన విన్ద సంసారమణ్డలత్తిలే, పెఱ్ఱు వాఴ్ - అదైన్దు సంతుష్టరాయిరుక్క, పేరడిమై - పెరియదాన కైంకర్యమ్, యార్క్కు ఎవర్కళుక్కు, ఎన్రు - ఏవంరూపమాక, నీయే యికఴేల్ - నీదానే ఇకఴాదే. (ఇఙ్గు శెయ్కిఱ పెరియదాన కైంకర్యమ్ మోక్షోపాయమన్ఱాకిల్ యార్క్కదు వేణు మెన్ఱు స్వరూపప్రాప్తత్తై యుపేక్షియాతే, పరమపదత్తిలుమ్ హేతువల్లాద కైంకర్యత్తై యపేక్షిత్త నీయే ఇత్తైయుమ్ స్వరూపానుగుణమెన్ఱు కైక్కొళ్ళెన్ఱు తాత్పర్యమ్. పేర- శెయ్ పెరిదాన కైంకర్యత్తాలెన్ఱ ప్రయోజన మెన్ఱు కొళ్ళాదే-ఎన్ఱర్థమ్. శేషం సమానమ్.**

గాథా - క్షుద్రే ఫలే నిరాశేషు కృపావత్స్వర్పయత్సు నః ।
గృహ్ణన్ రక్ష్యతయా శ్రీశ స్స్వయ మేవ పునర్జనిమ్ ।
విచ్ఛిద్యానశ్వరే వ్యోమ్ని స్థాపయే చ్చిత్తహర్షయుక్ ।
నాపి కస్మా ద్బ్రవీమ్యర్థం తవ యావ దిహ స్థితిః ॥
అనాగసం ప్రార్థ్య బోధం ప్రాప్యం సర్వం లభేమహి ।
ఇహ కిం శేషవృత్త్యేతి నోపేక్షస్వ త్వ మేవ హి ॥

పరమతనిరసనము

**20.** **శాక్కియర్ శైనర్కళ్ శార్వాకర్ శాఙ్గియర్ శైవర్ మఱ్ఱుమ్**
**తాక్కియర్ నూల్కళ్ శిదైయ త్తనిమఱైయిన్ కరుత్తై**
**వాక్కియ ముప్పదినాల్ వకైశెయ్దు వియాకరిత్తోమ్**
**తేక్కి మనత్తుళిదనై త్తిణియిరు ణీఙ్గుమినే**

శాక్కియర్ = బౌద్ధులు, శైనకర్ = జైనులు, శార్వాకర్ = చార్వాకులు, శాఙ్గియర్= సాంఖ్యులు, శైవర్ = శైవులు, (పాశుపతులు) మఱ్ఱుమ్ = మఱియు, తాక్కియర్ = తార్కికులు - అను వీరియొక్క, నూల్కళ్ = మతగ్రంథములు, శిదైయ = నశించి పోవునట్లు, తని మఱైయిన్ కరుత్తై = సాటిలేని వేదముయొక్క తాత్పర్యమును, వాక్కియమ్ ముప్పదినాల్ = ముప్పది వాక్యములను కల్గిన, ఈ రహస్యగ్రంథములో, వకై శెయ్దు = విభజించి, చూపి, వియాకరిత్తోమ్ = వివరించితిమి, ఇదనై = దీనిని, మనత్తుళ్ = (మీరు) మనస్సులో, తేక్కి = నిలుపుకొని, తిణి = దృఢమైన, ఇరుళ్ = అజ్ఞానమను చీకటిని, నీఙ్గుమిన్ = పోగొట్టు కొనుడు.

ముప్పదివాక్యములను కల్గిన ఈ రహస్యగ్రంథమునందు నకల వేదాంతార్థములను సంగ్రహముగా తెల్పితిమి, ఇక బౌద్ధులు, జైనులు, చార్వాకులు, సాంఖ్యులు, శైవులు, తార్కికులు మొదలగు పరమతముల గ్రంథములు తలెత్తలేవు. ఇట్టి రహస్యమును మనస్సున నిలుపుకొని, మీరు మీ అజ్ఞానమును పోగొట్టుకొనుడు.

20, 21, 22 పాశురములు మూడును రహస్యరత్నావళీహృదయమను రహస్యగ్రంథములోనివి. ఈ పాశురము కట్టళైక్కలిత్తుఱై అను వృత్తమున రచింపబడినది.

**తమిళ్:- ఇప్పడి యిన్ద రహస్యరత్నావళియై ముఢిక్క త్తామే వివరిత్తదుక్కు వేదబాహ్యమాన మతనిరాసపూర్వకవేదాంతార్థస్థాపనమ్ ప్రయోజనమాకైయాలే ఇవ్వర్థఙ్గళ్ మనస్సిలే ధరిత్తుక్కొణ్డు జ్ఞానత్తై ప్పెరుఙ్గోళెన్ఱు హితోపదేశమ్పణ్ణుకిఱార్ చరమగాథాత్రయత్తి లాద్యగాథైయాలే. (శాక్కియ) రిత్యాది. తనిమఱైయిన్ కరుత్తై - అదిత్వీయమాన వేదత్తి నభిప్రాయత్తై, వాక్కియ ముప్పదినాల్ - ముప్పదు వాక్యఙ్గళాల్, వకై శెయ్దు - (జీవనుక్కు జ్ఞాతవ్యమాన వర్థఙ్గళైయుమ్, చిదచిదీశ్వరస్వరూపఙ్గళైయుమ్ నన్ఱాక ప్రమాణపూర్వకమాయ్ పిరిత్తు,) శాక్కియర్-బౌద్ధర్, జైనర్-జైనర్కళ్, శార్వాకర్ - చార్వాకర్కళ్, శాఙ్కియర్ - సాంఖ్యర్కళ్, శైవర్ - పాశుపతర్కళ్, మఱ్ఱుమ్ - ఇవర్కళ్ తవిర, తాక్కియర్ - తార్కికర్ (కాణాదాదికళాన తర్కమాత్రోపజీవికళెన్ఱపడి) నూల్కళ్ - ఇవర్కళుడైయ శాస్త్రఙ్గళై, శిదైయ - అఴియుమ్బడి పణ్ణుకైక్కాక, వియాకరిత్తోమ్ -వ్యాఖ్యానమ్పణ్ణినోమ్, ఇదనై - ఇన్ద వర్థత్తై, మనదిల్- మనస్సిల్, తేక్కి-మఱవాదపడి ప్పణ్ణిక్కొణ్డు, తిణి యిరుళ్ = దృఢమాన వజ్ఞానాంధకారత్తై, నీక్కుమినే-పోక్కడియుఙ్గోళ్, (నామ్ శొన్న ఇన్ద అర్థఙ్గళై యథావత్తాక వఱిన్దాల్ అన్ద మతాంతరయుక్తికళాల్ మనస్సిల్ వన్ద వజ్ఞానఙ్గళ్ తానే నీఙ్గు మెన్ఱు తాత్పర్యమ్)**

గాథా- అర్హద్బుద్ధకణాదకాపిలకుదృక్చార్వాకశైవాద్యస
చ్ఛాస్త్రం నాశయితుం శ్రుతే రసదృశం భావం పరం త్రింశతా ।
వాక్యై ర్వ్యాకరవం విభజ్య విశదం భో స్సజ్జనా స్సుస్థిరం
మత్వేదం మనసా నితాంతనిబిడం యూయం తమో లుంపత ॥

పరమతవాదములను ఖండించుట

**21.** తళ్ళ త్తుణియినుమ్ తాయ్పోలిరఙ్గు న్దనిత్తకవా
లుళ్ళత్తుఱైకిన్ఱ వుత్తమన్ఱన్మై యుణర్న్దురైత్తో
ముళ్ళొత్తవాదియర్మున్నే వరి నెఙ్గణ్ ముక్కియర్పాల్
వెళ్ళత్తిడైయి నరిపోల్ విఴిక్కిన్ఱ వీణర్కళే



తళ్ళ త్తుణియినుమ్ = మనము (భగవానుని ద్వేషించి) దూరముగా నుండవలెనని నిశ్చయించుకొన్నను, తాయ్ పోల్ ఇరఙ్గుమ్ = తల్లి (తన బిడ్డ విషయమున దయజూపు) రీతిలో మనపట్ల కరుణ జూపునట్టి, తని తకవాల్ = సాటిలేని గుణముతో, ఉళ్ళత్తు ఉఱైకిన్ఱ = (మన) హృదయమునందు నివసించుచున్న, ఉత్తమన్ తన్మై = భగవానుని వైభవమును, ఉణర్న్దు = తెలిసికొని, ఉరైత్తోమ్ = ఈ రహస్యమునందు వివరించితిమి, ముళ్ ఒత్త వాదియర్ = (మన సిద్ధాంతమునకు) కంటకమువంటి ప్రతివాదులు, ఎఙ్గళ్ ముక్కియర్ పాల్ = మన ఆచార్యులవద్ద, మున్నే వరిన్ = ఎదురుగా (వాదించుటకు) వచ్చినచో, వెళ్ళత్తు ఇడైయిల్ = ఏటి ప్రవాహము నడుమ, నరిపోల్ = నక్కవలె, విఴిక్కిన్ఱ = చిక్కుకొని దిక్కులు చూచు, వీణర్కళ్ = నిష్ప్రయోజనులగుదురు.

లోకములో పుత్రుడు తన తల్లి పట్ల ద్వేషమును కల్గినవాడైనను, తల్లి అతనిని బయటకు గెంటక, అతని మంచినే అన్వేషించును. **"కుపుత్రో జాయేత క్వచి దపి మాతా న భవతి"** అను శంకరుల సూక్తి ఇచట స్మరణీయము అట్లే, మనము భగవానుని ద్వేషించి, దూరముగా తోసి వేసినను, అతడు సహజకరుణతో మనలను విడువక, మన మనస్సులలోనే అంతర్యామి రూపమున స్థిరవాసముచేయుచు, మనలను కాపాడుచున్నాడు. ఇట్టి సర్వేశ్వరుని స్వరూపస్వభావములను ఆచార్యుని సన్నిధిలో విని తెలిసికొను రీతిని ఇందు తెలిపితిమి. మన సిద్ధాంతమునకు ముల్లువలెనుండి, చెడ్డను చేయగోరునట్టి ప్రతివాదులు మన ఆచార్యులతో వాదింప ఎదురుగా వచ్చినచో, గొప్ప ప్రవాహములో చిక్కుకొని, దిక్కులు చూచు నక్కవలె గతిలేనివారై, ఓడి పారిపోవుదురు. ప్రతివాదులను ముల్లుగా పల్కుటకు అనుగుణముగా **"విధాయ వైదికం మార్గ మకౌతస్కుతకంటకమ్"** ఇత్యాది పరాశభట్టర్ సూక్తి స్మరణీయము.

ఇందలి వృత్తముకూడ కట్టళైక్కలిత్తుఱై

**తమిళ్:-ఇన్ద ఇరణ్డామ్పాట్టిల్ శ్రీహయగ్రీవకటాక్షత్తాల్ ఆచార్యముఖమాక తా మిన్ద రహస్యార్థఙ్గళై యఱిన్దపడియుమ్, అన్ద ఆచార్యర్కళిన్ వాదినిరాసప్రకారముమ్ అరుళిచ్చెయ్కిఱార్. (తళ్ళ తుణియిలు) మితి. నా మీశ్వరనై యఙ్గీకరియామిల్ అవనై త్తళ్ళివిడ తుణిన్దాలుమ్, తని త్తకవాల్ - అద్వితీయమాన తమ్ముడైయ కృపైయాల్, తాయ్పోలిరఙ్గుమ్, (ప్రజై ఉదిత్తు త్తళ్ళివిట్టాలుమ్ కారుణ్యత్తాల్, తాన్ ప్రజైయై యనుసరిక్కుమ్) తాయ్పోల్ కృపై పణ్ణువనాన, ఉళ్ళత్తుఱైకిన్ఱ - హృదయత్తిలే వసిక్కుమవనాన, ఉత్తమన్ - ఉత్తమనాన వీశ్వరనుడైయ, తన్మై - స్వభావత్తై, ఉణర్న్దు - ఆచార్యసకాశా త్తెఱిన్దు, ఉరైత్తోమ్ - నా మఱిన్దపడి ఇన్ద రహస్యత్తిలే శొన్నోమ్.**

**ఇనివేలాచార్యప్రభావమ్ శొల్లుకిఱతు. ముళ్మొత్త వాదియర్ – కంటకసదృశకళాన వాదికళ్. (అతికర్కశమాన యుక్తికళై చ్చొల్లుమవర్కళెన్ఱపడి) ఎజ్గళ్ ముక్కియర్పోల్ – ఎజ్గళుక్కు స్వామికళాయ్, వాదివిజయత్తల్ ప్రధానాళాయుమిరుక్కిఱ వాచార్యర్కళిడత్తిల్, మున్నే వరిల్ – వాదత్తుక్కాక మున్నే వన్దార్కళాకిల్, వెళ్ళత్తిడైయిల్ నరిపోల్ – ఉభయపార్శ్వ మహాప్రవాహాంతర్గతమాన జంబూకమ్బోల్, విళిక్కిన్ఱ వీణర్కళ్ – విళియా వీణ్ప్రయాసికళే, (అస్మత్సిద్ధాంతనిష్ఠాళుడైయ యుక్తిక్కుమేల్ యుక్తి తోన్ఱామైయాలే మౌనత్తుడన్ విళియాని నిన్ఱుకొణ్డు వ్యర్థప్రయాసికళావర్కళెన్ఱు తాత్పర్యమ్)**

**గాథా – ఉద్యుక్తానా మపి నిరసనే స్వస్య పుంసానం ప్రసూవ**
**త్కారుణ్యాబ్ధే ర్హృదయ వసతే రుత్తమస్య స్వభావమ్ ।**
**శ్రుత్వాఽ ర్యేభ్యో న్యగద మహితాః కంటకప్రాయవాచో**
**వ్యర్థా యేషాం ధురి ధృతఝురీమధ్యజంబూకసామ్యాః ॥**

**ఉపదేశమును పొందిన మనస్సుయొక్క ఒద్దిక**

**22. శెయ్యేన్ మఱమెన్ఱ దేశికన్తాదై యవనురైత్త**
**మెయ్యే యరుమ్పొరుళ్శూడియ వెణ్ మతి కాదలియామ్**
**పొయ్యే పకై పులనైయిరణ్డొన్ఱు పొరుజ్కురువి**
**కైయేఱు శక్కరక్కావలన్ కావలడైన్దవర్క్కే**

కై ఏఱు శక్కర క్కావలన్ = చేతిని అధిరోహించి, వేంచేసియుండు చక్రాయుధమును కల రక్షకుడైన భగవానుని, కావల్ = రక్షణకొఱకు, అడైన్దవర్క్కు = ఆశ్రయించిన, భాగవతులకు, మఱమ్ శెయ్యేల్ ఎన్ఱ = "పాపమును చేయకుమా" అని ఉపదేశించిన, దేశికన్ తాదై = ఆచార్యుడే తండ్రి, అవన్ = అతడు, ఉరైత్త ఉపదేశించిన, మెయ్యే = నిజమైన విషయములే, అరుమ్ పొరుళ్ = అరుదైన సంపద, శూడియ ఎణ్ మతి = (ఆ విషయమును) పొందిన ఎనిమిది గుణములనుకల బుద్ధియే, కాదలి ఆమ్ = ప్రియునకు తగిన భార్యగా అగును. పొయ్యే = విపరీతజ్ఞానమే, పకై= పగవాడు, ఐ ఇరణ్డు ఒన్ఱు పులన్ = పదకొండు ఇంద్రియములు, పొరుమ్ కరువి = పోరును సల్పుటకు తగిన సాధనములగును.

ఈ పాశురము అద్భుతమైన అలంకారిక ప్రక్రియలో అనుగ్రహింపబడినది. భాగవతవిరోధులను నశింప చేయుటకై తానే భగవానుని హస్తమును అధిరోహించి, వేంచేసియుండు సుదర్శనమును కల్గిన భగవానుడు తన దాసులను రక్షించు బాధ్యతను



స్వీకరించును. అట్టి దాసులకు ఆచార్యుడు పాపములను చేయకుండునట్లు సదుపదేశమును చేయును. ఆ ఆచార్యుడు వారికి మంచిని పల్కు తండ్రివంటివాడు. అతడు ఉపదేశించిన రహస్యములే వారికి సంపాదించి రక్షించుటకు తగిన అరుదైన సంపదవంటివి. ఆ అర్థములను గ్రహించిన, ఎనిమిది గుణములను కల్గిన బుద్ధియే ఆ దాసులకు ప్రియురాలైన భార్యవంటిది అగును. శరీరాత్మభ్రమ, ఆత్మ స్వతంత్రమను భ్రమ–మొదలగు విపరీతజ్ఞానములే చెడ్డను కల్గించు శత్రువులవంటివారు. వశీకరించుకొనిన పదకొండు ఇంద్రియములే, ఆ శత్రువులను నశింపజేయు సాధనములు. శరీరాత్మభ్రమ, స్వతంత్రాత్మభ్రమలు, బుద్ధియొక్క 8 గుణములు, – అను వీని వివరములు క్రమముగా అధికారసంగ్రహములోని 12వ, 45వ పాశురములలో కాననగును. బుద్ధిశబ్దము యొక్క స్త్రీలింగ స్వారస్యమునుబట్టి ప్రేయసిగా రూపింపబడినది. **"ప్రజానాం వినయాధానాత్ రక్షణాత్ భరణాత్"** అనునట్లు పితృకృత్యములు రక్షణము, వినయాధానము కావున, **"పాతి ఇతి పితా"** అనునది పితృశబ్ద వ్యుత్పత్తి కావున ఆచార్యుడు తండ్రిగా చెప్పబడినాడు.

ఈ పాశురము కూడ కట్టళైక్కలిత్తుఱైలో రచింపబడినది.

**తమిళ:–ఇప్పడి ఆబాధితమాన విన్ద సిద్ధాన్తజ్గళిలే అనైవర్క్కుమ్ ప్రేమమ్ వారాదిరుప్పా నేనెన్నిల్, హస్తారూపథసుదర్శననుమ్, ఆశ్రితర్కళుడైయ సర్వవిరోధినివర్తకనుమాన వన్ద సర్వరక్షకనిడత్తిలే నిరుపాధికప్రేమముడైయవర్కళుక్కే ఇంద్రియజయపూర్వకమాక వన్ద సర్వేశ్వరన్ గీతాదికళిలే అరుళిచ్చెయ్ద వర్థజ్గళిలే నిష్కర్షముమ్, ప్రేమముమ్ ఉణ్డా మెన్గిఱార్. (శెయ్యే) విత్యాది. కై యేఱు శక్కరక్కావలన్–(ఆశ్రితవిరోధినిరసనార్థమ్) తిరుక్కైయిలే యేఱానిఱ్కిఱ సుదర్శనముడైయ వన్ద రక్షకనిడత్తిలే, కాదలడైన్దవర్క్కే – ప్రేమ ముళ్ళవర్కళుక్కే, దేశికన్ తాదైయవన్ – సర్వాచార్యపితావాన వీశ్వరనాల్, శెయ్యేల్ మఱై మెన్ఱు – అధర్మత్తై చ్చెయ్యాతే యెన్ఱు (భగవత్కృతోపకారపరంపరైకళిల్ విస్మృతి పణ్ణాతే యెన్నవుమామ్) ఉరైత్త – శొల్లప్పట్ట, మెయ్యే అరుళ్ పొరుళ్ – యథార్థమాక కృపైయాలే వన్ద వర్థజ్గళై (మెయ్యే యురైత్త వెన్ఱు మన్వయిక్కలామ్) శూడియ వెణ్ మది – అవ్వర్థజ్గళై శిరోభూషణమాక వాక్కిక్కొణ్డ పరిశుద్ధబుద్ధియానతు, కరువిపోల్– –కరువిపోలే విషయజ్గళిలే మాఱి మాఱి ప్రవేశిక్కుమదాన, (కరువి – శతురజ్గమ్, శొక్కట్టన్కాయ్) ఐయ్యిరణ్డొన్ఱు పులన్ – జ్ఞానకర్మేంద్రియజ్గళ్ పత్తు, మనస్సు ఒన్ఱు) ఆక పదినొరు ఇన్ద్రియజ్గళుమ్, కాదలియామ్ – (కాదల్–ప్రేమమ్, అత్తై యడైన్దదానదు కాదలి) ప్రేమశాలికళామ్. భగవత్ప్రేమముళ్ళవర్కళిడత్తిల్ అవ్వాకారత్తై విట్టు "జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం", "వాణీ గుణానుకథనే శ్రవణం కథాయామ్" ఇత్యాదికళిఱ్పడియే భగవత్సేవోపయుక్తజ్గళా మెన్ఱు తాత్పర్యమ్.**

గాథా - హస్తారూఢసుదర్శనే విదధతాం ప్రీతిం పరాం రక్షకే
ప్రజ్ఞాఽమీషు న విస్మరేతి గురుణా ప్రాచోదితేష్వాదరమ్ ।
తత్త్వార్థేషు భజేత కిం చ ముహూరావృత్త్యాక్షశారై స్సమం
మిథ్యాశాస్త్రవవద్ధృషీకదశకం హృచ్ఛాప్నుయా త్తాం రతిమ్ ॥

వేదాంతసారములను ఆచార్యుడు దర్శించుట

23. అన్దమి లాదిదేవ నఴిశెయ్దదైత్తవలైవేలైయోద మదైయ
చ్చెన్దమిఴ్నూల్ వకుత్త శిఱుమా మనిచ్చర్శిఱు కైచ్చిఱాఙ్గైయదుపో
ఌన్దమెలా ముఱైప్ప వివై యెన్ఱు తఙ్గళిదయత్తడక్కి యడియోమ్
పన్దమెలా మఱుక్క వరుడన్దుకన్దు పరవుమ్ పొరుళ్కనివైయే

అన్దమ్ ఇల్ = అంతములేనివాడు, ఆదిదేవన్ = సర్వకారణమైయున్న వాడగు భగవానుడు అఴి శెయ్దు = (ప్రళయకాలమున) లయింపచేసి, అదైత్త=పిమ్మట సృష్టించిన, అలై వేలై ఓదమ్ అదైయ = అలలను కల సముద్ర జలమును మొత్తము, శెమ్ తమిఴ్ నూల్ వకుత్త = గొప్ప ద్రావిడవేదములను విభజించినవాడు, శిఱు మా మనిచ్చర్ = (ఆకారమున) చిన్నవాడు, (ప్రభావమున) గొప్పవాడును అగు అగస్త్యమహర్షియొక్క, శిఱు కై చ్చిఱాఙ్గై అదుపోల్ = చిన్న చేతిలోని పుడిసిలిలో అణగి పోయినట్లు, శన్దమ్ ఎలామ్ = వేదములన్నియు, ఉఱైప్ప ఇవై ఎన్ఱు = పలుకు విషయములు ఇవియే అని, తఙ్గళ్ ఇదయత్తు = (ఆచార్యులు) తమ మనస్సును, అడక్కి = అణచుకొని, అడియోమ్ = దాసులమగు మనయొక్క, పన్దమ్ ఎలామ్ అఱుక్క = కర్మబంధములన్నిటిని పోగొట్టుటకు, అరుళ్ తన్దు = మనపై కరుణను చూపి, ఉకన్దు = సంతోషించి, పరవుమ్ పొరుళ్కళ్ = (మనకు) గొప్పగా పలికి ఉపదేశించు అర్థములు, ఈ రహస్యములో ఇవైయే=మేము పల్కినవియే.

సర్వేశ్వరుడు ప్రళయకాలములో లయమును చేసి, మరల సృష్టించిన సముద్రజలమును అంతటిని అగస్త్యముని తన పుడిసిలో నుంచుకొని తాగివేసెను. అట్లే, సకలవేదార్థముల సారమును మొత్తము మన పూర్వాచార్యులు తమ మనస్సులో నుంచుకొనిరి. వారు మన కర్మపాశమును తొలగించి, ఉజ్జీవింపచేయగోరి, కృపతో సారభూతములైన అర్థములను మనకుపదేశించిరి. వానిని మేము ఈ రహస్యములో స్పష్టము చేసితిమి. **“శిఱుమామనిచ్చర్”** అను ప్రయోగము తిరువాయ్మొఴిలోని అట్టి ప్రయోగమును స్మరింపజేయును.



ఈ పాశురము, అనంతర పాశురమును తత్త్వత్రయ. చుళకమను రహస్య గ్రంథములోనివి. వృత్తము ఎణ్శీర్ ఆశిరియచ్ఛన్దవిరుత్తము.

**తమిళ:-ఇని తత్త్వత్రయచుళక మెన్గిఱ రహస్యత్తై చ్చెయ్యక్కడవరాయ్ ప్రబంధత్తిల్ ప్రతిపాద్యార్థఙ్గళై సంగ్రహేణ ముదల్పాట్టాలే కాట్టుకిఱార్. (అన్ద మిలా త్తేవ) నిత్యాది. అన్తమ్ - పరిచ్ఛేదమ్, అదిల్లాతవనుమ్, క్రీడాపరతంత్రనుమాన శ్రియపతియాలే, (దేశతః - కాలతో-వస్తుత శ్చ పరిచ్ఛేదరాహిత్యముమ్, స్వరూపగుణవిగ్రహఙ్గళాల్ పరిచ్ఛేదమిల్లామైయుమ్ శొల్లుకిఱతు) అఴిశెయ్దు అదైన్ద-సంహారకాలత్తిలే యదైయప్పట్టతాన. ఇదు శీరాఙ్గైక్కు విశేషణమ్. (ఓద ముదైయ వెన్ఱు పాఠమానాల్ స్పష్టమ్. ఓదమ్ జలమ్). శెన్దమిఴ్ నూల్ -శెవ్వియాన ద్రమిడశాస్త్రత్తై, వకుత్త - పిరిత్తు చ్చొన్నవరాన, శిఱు మా మనిశర్ - ఆకృతియాలే శిన్నవరాయ్, మాహాత్మ్యత్తాలే పెరియవరాన అగస్త్యరుదైయ, శిఱు కై చ్చిరాఙ్గైపోల్ - ఆకృతిక్కనుగుణమాక శిన్నదాన కైయినుదైయ చుళకమ్బోల్, (ఇదు “అడఙ్గి” ఎన్గిఱత్తిలన్వయమ్) శన్దమెల్లా ముఱైప్పదు - వేదఙ్గళెల్లామ్ శొల్లుకిఱ వర్థఙ్గళ్, ఇదు వెన్ఱు - నామ్ శొల్లు మిత్తత్త్వఙ్గళెన్ఱు, తఙ్గళిదయత్తడక్కి-స్వహృదయత్తిలడక్కిక్కొణ్డు, సమ్బన్ధమెల్లా మఱుత్తుకక్క, - నమ్ముదైయ బన్ధఙ్గళెల్లామ్ ఛేదిత్తు అదువే తఙ్గళ్ ఫలమాక వుకక్క, అరుళ్ తన్ద - కృపైయైలే తన్దదాన. పరవుమ్పొరుళ్కళ్ - విస్తారమాక వనుసన్ధిక్కుమ్ తత్త్వఙ్గళెల్లామ్, ఇవైయే - నా మిన్ద రహస్యత్తిల్ శొల్లుమవైయే. (ఇప్పాట్టిలాచార్యవాచిశబ్ద మిల్లామైయాలే అధ్యాహరిత్తుమ్ యోజిక్కలామ్. “సమ్బన్ధ మెల్లా” మెన్గైయాలే చిదచిత్స్వరూపముమ్, “అన్ద మిల్లా తేవ” నెన్గైయాలే ఈశ్వస్వరూపముమ్ సంగృహీతమ్. భగవద్గుణము, మాచార్యగుణముమ్ శొల్లుకైయాలే ఇప్పాట్టు స్తుతిరూపమాన మఙ్గళముమామ్.**

గాథా - సంహృత్యానంతభూమ్నా పునరుపజనితస్యాంబుధేః పూర మర్థం
వ్యాకర్తుం ద్రామిడోక్తే శ్చుళక ఇవ మునే ర్హ్రస్వకస్యాతిభూమ్నః ।
ధృత్వా తత్త్వాని చిత్తే శ్రుతిశతవితతాన్యాదృతార్థా ఇమేఽస్మ -
ద్బంధం ఛిత్వా దయార్ద్రైః ప్రముదితహృదయైః దేశికై ర్జ్ఞేయ మిత్థమ్ ॥

## అచేతనతత్త్వస్వరూపము

**24.** **ముక్కుణమాయైయిన్ మూవెట్టిన్ కీఴ్వరు మూవకైయు**
**మిక్కుణ మిన్ఱి యిలఙ్గియ కాలక్కుఴియినము**
**నఱ్కుణ మొన్ఱుడై నాకము నారా యణనుడమ్బాయ్-**
**చ్చిఱ్కుణమఱ్ఱ వైయెన్ఱురైత్తారెఙ్గదేశికరే**

ముక్కుణ మాయైయిన్ = (సత్త్వ-రజస్-తమస్సులను) మూడు గుణములయొక్క మూలప్రకృతులు, మూ ఎట్టిన్ కీఴ్ వరుమ్ = ఇరువదినాల్గు తత్త్వములుగా విభజింపబడు, మూ వకైయుమ్ = (ప్రకృతి, వికృతి, ప్రకృతి-వికృతి అను) మూడు రీతులును, ఇక్కుణమ్ ఇన్ఱి ఇలఙ్గియ = ఇట్లు మూడు విధములైన గుణములు లేక, ప్రకాశించు, కాల శుఴి ఇనముమ్ = పరిభ్రమించు కాలముయొక్క స్వరూపము, నల్ గుణమ్ ఒన్ఱు ఉడై నాకముమ్ = సత్త్వగుణము ఒక్కటినే కల, పరమపదముగా మాఱునట్టి శుద్ధతత్త్వము, (ఇట్లు మూడు విధములైన అచేతనము) నారాయణన్ ఉడమ్బాయ్ = భగవానునకు దేహమై, శిఱ్కుణమ్ అఱ్ఱవై ఎన్ఱు = జ్ఞానమును, గుణమును లేనివి అని, ఎఙ్గళ్ దేశికర్ = మా ఆచార్యులు, ఉరైత్తార్ = ఉపదేశించిరి.

ప్రకృతి, కాలము, శుద్ధసత్వము-అను అచేతనములు మూడింటిలో సత్త్వరజస్తమస్సులను మూడు గుణములనుకల మూలప్రకృతి, ప్రకృతి, వికృతి, ప్రకృతి-వికృతి అను మూడు విధములై, పిమ్మట ఇరువది నాల్గు తత్త్వములుగా విభాగమునొందుచున్నది. కాలమునకు ఈ మూడు గుణములు లేవు. అది గుణ రహితము. అదియును కలాకాష్ఠాదిరూపేణ పలు రీతులలో విభజింపబడినది. శుద్ధ సత్త్వముయొక్క పరిణామమే పరమపదము, అందున్న వస్తువులును. కావున ఈ మూడు అచేతనములును భగవానునకు శరీరములైయున్నవి, జ్ఞానము అను గుణమును లేనివి -అను ఈ విషయములను మన పూర్వాచార్యులు ఉపదేశించిరి.

ఈ వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

**తమిళ:-ఇన్దరహస్యత్తిలే ఆనాత్మనిరూపణపరమాన ప్రథమాధికారత్తిలే అచేతనఙ్గళాన త్రిగుణకాలశుద్ధసత్త్వఙ్గళై విశదమాక నిరూపిత్తు, అదుకళైయే సంగ్రహమాక నిరూపియా నిన్ఱుకొణ్డు, ఇదుకళన్ద సర్వేశ్వరనుక్కు శరీరఙ్గళెన్గిఱార్ ముడివిలొరుపాట్టాలే. (ముక్కుణై మాయైయి) నిత్యాది. ఎఙ్గళ్ తేశికరే - (ఆశ్రితరై వఴియిల్లా వఴియిలే పోకాదపడి విలక్కి, నల్వఴి కాట్టుకైక్కినిలవరాన) నమ్ముడైయ ఆచార్యర్కళే, ముక్కుణ మాయైయిన్**



**- సత్తరజస్తమోరూపఙ్గళాన మూన్ఱు కుణఙ్గళైయుడైయదాయ్, విచిత్రపరిణామియాకైయాలే మాయాశబ్దవాచ్యమాన ప్రకృతియిలే, మా వెట్టిన్ కీఴ్ -ప్రకృతిమహదహంకారభూత -పంచకతన్మాత్రపంచక-ఏకాదశేంద్రియరూపఙ్గళాలే ఇరుపత్తునాలువకైయాన తత్త్వఙ్గళుక్కు కీఴియిరుక్కిఱ. మూ వెట్టు-ఇరుపత్తునాలు, మూ వకైయుమ్-మూన్ఱు ప్రకారముమ్, (కేవలప్రకృతి, కేవలవికృతి-ఎన్ఱావతు, తమస్త్వాక్షరత్వావ్యక్తత్వరూపేణ వావదు త్రైవిధ్యమ్ కొళ్ళలామ్) ఇక్కుణమిన్ఱి యిలఙ్గియ-ఇన్ద సత్వాదిగుణఙ్గళిల్లామల్ విళఙ్గానిఱ్కిఱ, కాల చ్చుఴి యినముమ్ - కాలత్తిలుణ్డాన క్షణదివసాదికళాకిఱ శుఴికళుడైయ కూట్టముమ్, నఱ్కుణమొన్ఱుడై - ప్రాకృతసత్త్వవిలక్షణమాన ఒరు నల్లసత్వగుణత్తైయుడైత్తాన, నాకముమ్ - "పరేణ నాకమ్", "నాకం పరేణ స్థితా" ఇత్యాదికళిలే నాకశబ్దవాచ్యమాన పరమపదముమ్, నారణనుడమ్బాయ్ - నారాయణశబ్దవాచ్యనాన శ్రియఃపతిక్కు శరీరమాయ్ క్కొణ్డు, శిఱ్కుణ మఱ్ఱవై - చిత్తిన్ కుణమాన జ్ఞానరహితమానదుకళ్, (ఇవై మూన్ఱుక్కుమ్ జ్ఞాన మిల్లామైయాలే కర్తత్వ-భోక్తృత్వఙ్గ ళిల్లై - ఎన్ఱపడి) ఎన్ఱురైత్తార్ - ఎన్ఱుపదేశిత్తార్కళ్. ఇన్ద వధికారత్తిలే నామ్ శొన్న అర్థఙ్గళెల్లామ్ ఆచార్యోపదిష్టఙ్గళెన్ఱు తాత్పర్యమ్.**

## జీవుడు తరించుటకు చేయతగినవి

**25.** **ఎనదెన్బదుమ్ యానెన్బదు మిన్ఱి**
**త్తనదెన్ఱు త్తన్నైయు జ్కాణా - దునదెన్ఱు**
**మాతవత్తాన్ మాదవఱ్కే వన్పరమాయ్ మాయ్ప్పదనిల్**
**కైతవత్తాన్ కైవళరాన్ కాణ్**

ఎనదు ఎన్బదుమ్ = (ఈ వస్తువు) నాది అని తలచుట అనెడి మమకారము, యాన్ ఎన్బదుమ్ = (అచేతనమైన శరీరమును ఆత్మగా తలచి) దానినే నేను అని భావించుట అనెడి అహంకారమును, ఇన్ఱి = లేకుండ, తన్నైయుమ్ = జీవాత్మ అను తనను, తనదు ఎన్ఱు కాణాదు = తన యొక్క స్వామిగా తలపక, (అనగా - ఆత్మ స్వతంత్రమని భ్రమింపక), మాతవత్తాల్ = ఉన్నతమైన తపస్సు అనబడు శరణాగతి అనెడి ఉపాయముతో, ఉనదు ఎన్ఱు = అంతయు నీదే అని, మాదవఱ్కే = భగవానునకే, వన్ పరమాయ్ = దృఢమైన భారముగా (బాధ్యతగా) తలచి, మాయప్పదనిల్ = సంబంధమును ఛేదించుకొని, అతనియందు సమర్పించుటలో, కైతవత్తాన్ = (మనస్సు శుద్ధముగా లేని) వంచనా స్వభావమును కలవాడు, కైవళరాన్ =ఉన్నత స్థితిని పొందదు (ఉజ్జీవింపడు). (కాణ్ అనునది ఊతపదము. లేక, గమనింపుము-అని అర్థము.)

"ఈ వస్తువు నాది" అని తలచుట మమకారము అనబడును. శరీరమును ఆత్మగా భావించుట అహంకారము. తనను స్వతంత్రముగా భావన చేయుట స్వతంత్రాత్మ భ్రమ. ఈ మూడింటిని పోగొట్టుకొనవలెను. తన స్వరూపము, తనను రక్షించు బాధ్యత, ఆ రక్షణ వలన కల్గు ఫలము – అను అన్నియును భగవానునకు సంబంధించినదే – అని తలచి, వాని అన్నిటి పట్ల తనకుగల సంబంధమును సమూలముగా పోగొట్టుకొని, భగవానుని సన్నిధిలో సమర్పింపవలెను. ఇట్లు చేయువాడే తరించును. **"కైవళరాన్"** అనునది జాతీయప్రయోగము.

ఈ పాశురము, పిమ్మటగల పాశురమును తత్త్వత్రయచుళకములోని జీవాధికారములోనివి. వృత్తము వెణ్బా. శరణాగతిని **"మా తవ"** మనుట **"తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః"** అను శ్రుతినిబట్టి.

**తమిళ:– మేల్ జీవనిరూపణాధికారత్తిల్ ఆద్యంతజ్గళిల్ గాథాద్వయమ్. "దేహేంద్రియమనఃప్రాణధీభ్యోఽన్యోఽనన్యసాధనః, నిత్యో వ్యాపీ ప్రతిక్షేత్ర మాత్మా భిన్నతస్సుఖీ" ఎన్ఱాత్మసిద్ధియిలే ఆళవన్దారరుళిచ్చెయ్దపడియే దేహేంద్రియాదివిలక్షణనాయ్, స్వస్మై భాసమాననాయ్, స్వయంప్రకాశనాన తన్‌స్వరూపత్తై యఱియామల్ కేవలమహదంహకారమమకారయుక్తనాయ్ క్కొణ్డు, తనక్కు కర్తవ్యమాన వ్యాపారత్తై యఱియాతే తిరికిఱాన్‌కాణ్ బద్ధచేతననెన్గిఱార్ ముదల్‌పాట్టాలే. (ఎనది త్యాది) – ఎనదు సర్వముమ్ –మదీయమ్, ఎన్బదు ఇన్ఱి – ఇప్పడి శొల్లువదున్తవిర, యానెన్బాన్ – నానెన్ఱు శొల్లువన్ (అహంకారయుక్తనాయుమ్, మమకారయుక్తనాయుమ్ ఇరుక్కు మెన్ఱు తాత్పర్యమ్) అదన్ఱి – అదుమ్ తవిర, తనదెన్ఱు – తన్నధీన మెన్ఱు, (స్వతంత్ర మన్ఱెన్ఱపడి ఎణ్ణి – ఎన్ఱధ్యాహరిత్తు యోజనా) – తన్ తన్మైయుజ్ఞాణాదు–(తన్మై – స్వభావః) తనక్కు స్వభావమాన జ్ఞానస్వరూపత్వ–భగవచ్ఛేషత్వాదిస్వభావత్తైయు మఱియాతే ఎన్ఱపడి) మా తవత్తాల్ – న్యాసరూప మహాతపస్సాల్, మాదవర్క్కే – శరణ్యానాన శ్రియఃపతిక్కే, ఉనదెన్ఱు వన్ పరమాయ్ – అడియేనుడైయ స్వరూప–భర–ఫలజ్గళ్ దేవరీరుడైయదెన్ఱు, మాయ్ప్పదనిల్ – దృఢాధ్యవసాయత్తిల్ వంచనైయావతు, (అదినుడైయ వనుష్ఠానన్దాన్) కైవళరాన్ – అభివృద్ధియడైయాన్ – జీవన్నితి శేషః. కాణ్ – (ఇదు నాన్ శొల్లవేణ్డియదిల్లై. ప్రత్యక్షసిద్ధమ్) – పారుజ్గోళ్.**

**గాథా –** మమ కృతిసమగ్రోఽహం కుర్వన్ స్వయం ప్రభుతాదిమ
స్వవిభవపరిజ్ఞానాశక్తో మహాతపసా నరః ।



**భగవతి తవైవాహం భారో దృఢ స్త్వితి శేముషీ మపి ముషీ మపి**
**సకలయన్ శార్యాధిక్యా త్పరిభ్రమ మశ్నుతే ॥**

**త్రివిధ చేతనులు**

**26.** **పల్‌వినై వన్‌కయిÓÓ ఋన్దముÓÓÇల్‌కిన్ఱనరుమ్**
**నల్‌వినై మూట్టియ నారణనార్ పదమ్ పెÓÓవరుమ్**
**తొల్‌వినై యెన్ఱుమిల్లా చ్చోదివానవరు ఇశ్రుతి**
**శొల్ వినైయోర్‌న్దవర్ జీవరెన్ఱోద చ్చిఱన్దనమే.**

శురుది శొల్ వినై ఓర్‌న్దవర్ = వేదము పల్కు మార్గమును తెలిసిన ఆచార్యులు, పల్ వినై వన్ కయిÓÓల్ = పలు విధములైన కర్మబంధములనెడి బలమైన పాశముతో, బంధమ్ ఉÓÓ = బంధింపబడి, ఉÇల్‌కిన్ఱనరుమ్ = సంసారమునందు పరిభ్రమించుచు దు:ఖపడునట్టి బద్ధులు, నల్ వినై మూట్టియ = సదుపాయమును అనుష్ఠింపచేసిన, నారణనార్ = భగవానునియొక్క, పదమ్ = స్థానమును ( శ్రీ పాదములను) పొందిన ముక్తులును, తొల్ వినై = అనాదియను కర్మసంబంధమును, ఎన్ఱుమ్ = ఏనాడును, ఇల్లా = లేనివారగు, శోది వానవరుమ్ = ప్రకాశమునుకల నిత్యసూరులును – అను వీరు ముగ్గురు, జీవర్ ఎన్ఱు ఓద = జీవులు అని ఉపదేశింపగా, ఆ ఉపదేశమువలన, శిఱన్దనమ్ = గొప్పతనము (తెలివిని) పొందితిమి.

కర్మపాశముచే కట్టుబడి, సంసారములో పరిభ్రమించువారు బద్ధులు; ఉపాయానుష్ఠానము చేసి, మోక్షమును పొందినవారు ముక్తులు. ఏనాడును కర్మ సంబంధము లేక, భగవానునివలెనుండి ఆ స్వామిని అనుభవించువారు నిత్యులు. ఇట్లు మూడు విధములైన జీవుల విభాగమును వేదార్థమును చక్కగా గ్రహించిన ఆచార్యులు మనకు ఉపదేశించి, చూపిరి.

**తమిళ:–ఇప్పడి జీవనిరూపణాధికారత్తిల్ అరుళిచ్చెయ్ద వర్థజ్గళై సంగ్రహియానిన్ఱుకొణ్డు ఇప్పడి బద్ధముక్తనిత్యరూపేణ మూన్ఱువకైప్పట్ట వాత్మాక్కళే శ్రుతియిల్ శొన్న జీవశబ్దవాచ్యర్‌కళ్ – ఎన్గిఱార్ ముదివిలొరుపాట్టాలే. (పల్ వినై) ఇత్యాది. పల్ – బహువిధజ్గళాన. వినై – పాపకర్మజ్గళాకిఱ, వన్ కయిÓÓల్ – దృఢమాన రజ్జువాలే, పన్దమ్– బంధత్తై, ఉÓÓ–అడైన్దు, ఉÇల్‌కిన్ఱనరుమ్ – పరిభ్రమియానిన్ఱ బద్ధచేతనరుమ్, నల్ వినై మూట్టియ – నల్లకర్మత్తిలే మూట్టినవరాన, నారణనార్ –**

శ్రీమన్నారాయణనుడైయ, పదమ్ పెఱ్ఱవరుమ్ - పరమపదమ్ పెఱ్ఱ ముక్తాత్మాక్కళుమ్, తొల్ వినై ఒన్ఱు మిల్లా -(తొల్ - అనాది) అనాదియాక కర్మఙ్గళొన్ఱు మిల్లాదవర్కళాన, శోది వానవరుమ్ - జ్యోతిర్మయమాన పరమాకాశత్తిలే యిరుక్కుమ్ అనన్తగరుడాదినిత్యసూరికళుమ్, శురుది - శ్రుతియిలే, శొల్ వినై యోర్న్దవర్ - శొల్లప్పట్ట కర్మఙ్గళై యదైన్దవర్కళాన. "శెల్ వినై" యెన్ఱు పాఠమానాల్ శ్రుతియిలే శెల్లానిన్ఱ వ్యాపారమెన్ఱపడి) శీవరెన్రోద - జీవశబ్దార్థరెన్రోద, శిఱన్దనవే - శ్రైష్ఠ్యముడైయవర్కళాకవానోమ్. (ఆచార్యాళిదత్తినిన్ఱు మిప్పడి జీవస్వరూపమోదుమ్బడియాన శ్రైష్ఠ్యత్తై యుడైయవర్కళాక వానో మెన్ఱపడి) 'శిఱన్దనరే' ఎన్ఱు పాఠమానాల్ పూర్వోక్తమాన త్రివిధాత్మాక్కళే ఇప్పడి శ్రుతియిలే జీవనెన్రోదుమ్బడి శిఱన్దవర్కళెన్ఱర్థమ్.

గాథా - బహువిధకర్మపాశదృఢబంధయుతాత్మగుణా
హరిబహుమానితా నిజపదం గమితా శ్చ సదా ।
భవరహితామరా శ్చ సకలా నపి తాన్ పురుషాన్
శ్రుతిపృథగుక్తకృత్యవత ఏవ ముశంతి బుధాః ॥

### ఈశ్వరుని ఉపకారము

**27.** ఆరణఙ్గళెల్లా మడి శూడ మేనిన్ఱ
కారణమా యొన్రా ఱ్కలఙ్గాదా- నారణనే
నమ్మేల్ వినైకడియు నల్ వழியిఱ్ఱనిన్ఱు
తన్మేని తన్దరుళు న్దాన్

ఆరణఙ్గళ్ ఎల్లామ్ = వేదములు అన్నియు, అడి శూడ = తన పాదములను కీర్తింపగా, మేల్ నిన్ఱ = అందఱికంటె గొప్పవాడైయున్నవాడు, కారణమాయ్ = అన్నిటికిని కారణమైయుండి, ఒన్రాల్ కలఙ్గాదాన్ = కార్యజాతములందున్న దోషమున స్పర్శను లేనివాడును అగు, నారణనే = శ్రీమన్నారాయణుడే, నమ్మేల్ వినై కడియుమ్= మనపై మిక్కిలి వృద్ధిచెందుచున్న కర్మలను పోగొట్టగల్గిన, నల్ వழియిల్ = సదుపాయముయొక్క స్థానమున, తాన్ నిన్ఱు = తానుండి, తన్ మేని = తన దివ్యశరీరమును, తాన్ తన్దరుళుమ్ = (మనము అనుభవించుటకు) తానే అనుగ్రహించుచున్నాడు.



వేదములు అన్నియు భగవానుని పాదారవిందములనే కీర్తించుచున్నవి. **"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః"** అనికదా స్వామి వచనము. అతడు **"పరః పరాణామ్"** అని, **"న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే"** అని, **"తన్నొప్పారిల్లాప్పన్"** అనియు **"ఒత్తార్మిక్కారై ఇలైయాయ మామాయా"** అనియును చెప్పబడురీతిలో సర్వాధికుడు. అన్నిటికిని కారణమైయున్నవాడు. **"ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా....నారాయణః"** అనునట్లు కార్యజాతములందలి దోషములలో ఏదియు అతనిని అంటదు. పైపైకి వృద్ధి చెందునట్టి మన కర్మలను నశింపజేసికొనుటకై భగవానుని పాదములందు శరణాగతిని చేసినచో, మనకు అనుష్ఠించుటకు సాధ్యముకాని భక్తి యోగము మొదలగు కఠినములైన ఉపాయముల స్థానమున తానే నిలచి, మనకు మోక్షమును అనుగ్రహించుచున్నాడు.

ఈ వృత్తము వెణ్బా. 28వ పాశురమునుండి 30వ పాశురమువరకుగల నాల్గు పాశురములును తత్త్వత్రయచుళకములోనివి. మూడవపాదమును పెరియ తిరువన్దాది చివరలోగల **"ఎప్పోదుమ్ కైకழలా నేమియాన్ నమ్మేల్ వినైకడివాన్"** అను సూక్తితో పోల్చనగును.

**తమిళ:- మేల్ ఈశ్వరనిరూపణాధికారత్తిల్ ముదఱ్పాట్టు. ఇప్పడి పూర్వాధికారద్వయత్తాలే అనాత్మవర్గత్తైయుమ్, చేతనవర్గత్తైయుమ్ నిరూపిత్తు, ఇన్ద వధికారత్తిలే ఈశ్వరనుడైయ స్వరూపవిగ్రహాదికళై నిరూపిక్కక్కడవరాయ్ ప్రతిపాద్యార్థఙ్గళై సంగ్రహిక్కిఱార్ ముదఱ్పాట్టాలే. (ఆరణఙ్గళెల్లా) మిత్యాది - ఆరణఙ్గళెల్లామ్ - సకలవేదాన్తఙ్గళుమ్, అడి శూడి - తిరువడికళై శిరోభూషణ మాక్కిక్కొణ్డు, (నిఱ్క వెన్ఱధ్యాహరిత్తు యోజనై) "అడి శూడ" వెన్ఱు పాఠమానపోదు అదుకళ్ తిరువడికళై అలఙ్కరియానిఱ్క-వెన్ఱర్థమ్. సకలవేదాన్తప్రతిపాద్యమాన తిరువడికళై యుడైయవనెన్ఱర్థమ్, ఇత్తాల్ పంచప్రకారదివ్యమంగళమ్ ఉపనిషత్ప్రతిపాద్య మెన్ఱు సూచితమ్.**

**మేల్ నిన్ఱ కారణమాయ్ - అన్ద ఉపనిషత్తుక్కళిన్మేలే ప్రతిపాద్యమాన జగత్కారణముమాయ్, ఒన్రాల్ కలఙ్గాత తాన్ - ఒన్రాలుమ్ కలఙ్గాదవనాన, (కారణత్వావస్థైయిలే శరీరభూతఙ్గళాయ్ విశేషణఙ్గళాన చిదచిద్గతదోషఙ్గళొన్రుమ్ తట్టాత దవనాన వెన్ఱపడి) నారణన్ - నారాయణన్, ఎన్మేల్ వినై - ఎన్ మేల్ యిరుక్కిఱ సకలపాపఙ్గళైయుమ్, కడియుమ్ - పోక్కడిక్కుమ్బడియాన, నల్ వழியిల్ - నల్ల మార్గత్తిలే, (సకలపావనివర్తకమాయ్, ముక్తిక్కు నవీచీనవంథావాన భక్తిరూపోపాయత్తిలే-యెన్ఱపడి) తా నిన్ఱ - అశరణ్యశరణ్యనాన తానే నిన్ఱు, తన్ మేని -తన్నుడైయ తిరుమేనియై, తాన్ తన్దరుళుమ్ - తానే తన్దరుళుమ్, నా మనుభవిక్కుమ్బడి కృపై పణ్ణువనెన్ఱపడి. ఇత్తాల్ సర్వఫలప్రదత్వమ్ శొన్నపడి.**

గాథా- విశ్వశ్రుత్యంతభూషాపదకమలయుగ స్సర్వహేత్వేకహేతు
ర్దోషై స్సర్వై ర్దరిద్రో హృదయరతరమ స్స స్వయం సత్పథస్య ।
స్థానే స్థిత్వా మదంతఃకలుషపరిమృజో విగ్రహం నిత్యసిద్ధం
స్వస్యాసాధారణం ద్రా గనుభవవిషయం నః ప్రదాయాద్రియేత ॥

### మూడు తత్త్వములకు ఉపమానములు

28. కుడన్మిశై యొన్టియు జ్కూడియు నిన్ఱ కొడున్తుయరుమ్
ఉడన్మిశై త్తోన్ఱు ముయిరు ముయిర్క్కుయిరా మిఱైయుమ్
కడన్మిశై క్కణ్డ తరళత్తిరళ్వై కోత్త పొన్నూన్
మడన్మిశైవార్త్తై యదన్పొరుళెన్న వకుత్తనమే

కుడల్ మిశై = శరీరమునందు, ఒన్టిమ్ కూడియుమ్ నిన్ఱ = ఒకటియై యుండునది, కొడుమ్ తుయరుమ్ = కఠినమైన దు:ఖమును ఇచ్చునది అగు ప్రకృతి అను అచేతనము, ఉడల్ మిశై తోన్ఱుమ్ ఉయిరుమ్ = శరీరమునందుండి నడపించు జీవాత్మ అను చేతనము, ఉయిరుక్కు ఉయరామ్ = జీవాత్మకును అంతర్యామియైయున్న, ఇఱైయుమ్ = సర్వేశ్వరుడును, (క్రమముగా), కడల్ = సముద్రముగా, (కడల్) మిశై క్కణ్డ = సముద్రములోనున్న, తరళ త్తిరళ్ = ముత్యముల కూర్పుగా, అవై కోత్త పొన్ నూల్ = ఆ ముత్యములను కూర్చిన బంగారు దారముగా, (ఉన్నవి అను విషయము), మడల్ మిశై = చెవులయందు (రహస్యముగా ఆచార్యులు ఉపదేశించిన), వార్త్తై యదన్ పొరుళ్ ఎన్న = వాక్యముల అర్థము అని, వకుత్తనమ్ = (ఈ రహస్యములో మేము) విభజించి చూపితిమి.

ప్రకృతి అను అచేతనము శరీరముతో కలసియుండి, సంసారదు:ఖమును కల్గించుచున్నది. ఈ శరీరములో జీవాత్మ ప్రవేశించియుండి, దానిని నడుపుచున్నాడు. ఆ జీవునకును అంతర్యామియై సర్వేశ్వరుడున్నాడు. ఈ మూడు తత్త్వములలో ప్రకృతి సముద్రము వంటిది. జీవాత్మలు సముద్రములోని ముత్యములవంటివారు. వీనిని ధరించియున్న భగవానుడు ముత్యములను కూర్చుటకు తగిన బంగారుదారము వంటి వాడు. ఈ సారార్థమును ఆచార్యులు మాకు ఉపదేశింపగా, మేము దీనిని ఈ రహస్యములో వివరించితిమి.

ఈ పాశురార్థమునకు అనుగుణముగా భగవద్గీతలోని **"మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణి గణా ఇవ"** అను సూక్తి భావనీయము.



**తమిళ:-ఇప్పడి విస్తారమాక వీశ్వరస్వరూపనిరూపణమ్పణ్ణి ఇప్పడియే అచిదంతర్గతనాన జీవనైయుమ్, తదంతర్గతనాన వీశ్వరనైయుమ్ అఱికైక్కు ప్పిన్నుమ్ శిల దృష్టాన్తజ్గళై యరుళిచ్చెయ్యానిన్ఱుకొణ్డు అధికారత్రయత్తాలే చిదచిదీశ్వరస్వరూపజ్గళై ఇప్పడి చ్చొన్నో మెన్ఱుపసంహరిక్కిఱా రొరుపాట్టాలే. (కుడన్ మిశై) - యిత్యాది. కుడన్మిశై - శరీరాంతర్గతమాంసవిశేషత్తిన్మేల్ (కుడల్ - హృదయగతమాంసమ్, ఇదు సకలశరీరత్తుక్కుమ్ ఉపలక్షణమ్.) ఒన్టియ - అవినాభూతజ్గళాన, కూడియు నిన్ఱ - శేర్న్దుకొణ్డు మిక్కిరుక్కిఱ, కొడు న్తుయరుమ్ - అతిక్రూరమాన సకలదుఃఖజ్గళుమ్, (సకలదుఃఖహేతుతయా ప్రకృతియై దుఃఖవాచకశబ్దత్తాలే శొన్నపడి. క్షేత్రజ్ఞరుక్కు శరీరాదిరూపేణ పరిణమిత్తు అత్తాలే సకలదుఃఖహేతువాన ప్రకృతియు మెన్ఱు కరుత్తు)**

**ఉడన్ మిశై తోన్ఱు ముయరుమ్ - ఉడల్ - శరీరమ్. అన్ద శరీరత్తిన్మేలే తోన్ఱుమ్ చేతననుమ్, (శరీరాంతర్గతనాయిరుక్కచ్చెయ్దే వేఱాక త్తోన్ఱుమ్ జీవను మెన్ఱపడి) ఉయిర్క్కుయిరా మిఱైయుమ్ - అన్ద జీవవర్గత్తుక్కు మాత్మావాయిరానిన్ఱ వీశ్వరనుమ్ (ఇదుక్కు వకుత్తన మెన్గిఱత్తోడే యన్వయమ్.)**

**అచిత్సంశిష్టనాన జీవనైయు, మేతదుభయసంశ్లిష్టనాన వీశ్వరనైయుమ్ పిఱిత్తఱికైక్కు దృష్టాన్తమరుళిచ్చెయ్కిఱార్ మేల్. ఇదిన్ పొరుళ్-ఇన్ద వర్థజ్గళ్ (నామ్ శొన్న విదుకళుడైయ వర్థజ్గళ్, అచిజ్జీవేశ్వరర్కళ్ పూర్వసంశ్లిష్టజ్గళాయ్ ఉత్తరోత్తరపదార్థజ్గళుళ్ అన్తర్గతజ్గళా యిరుక్కుమెన్ఱు మర్థజ్గళెన్ఱపడి), కడల్ మిశై కణ్డవై - సముద్రత్తుక్కుమేలే కణ్డదుకళాన (సముద్రాన్తర్గతజ్గళాన వెన్ఱపడి) తాన త్తిరళ్-(తిరళ్ సమూహమ్. తాన మెన్ఱు ఇజ్గు స్థానమాయ్) ఇజ్గు ముక్తారత్నసంఘాదికళుక్కు స్థానమాన శుక్తికాదికళై చ్చొల్లుకిఱదు. సముద్రాంతర్గత శుక్తికాదిసమూహజ్గళై-యెన్ఱపడి) అవై పొఱ్ఱ పొన్ = పొఱ్ఱ వెన్గిఱదు పొఱ్ఱ వెన్ఱు కుఱికి క్కిఱక్కిఱతు, పొన్ - స్పృహణీయమాన వస్తు, అన్ద శుక్తాదికళాలే స్పృహణీయమాన ముక్తారత్నాది పోలెన్ఱధ్యాహరిత్తు యోజనా. (సముద్రవెన్బాలే అచిద్వర్గమ్, తదంతర్గతశుక్తాదికళ్పోలే జీవవర్గమ్, తదంతర్గతరత్నాదిహారమాన నురైయై చ్చొల్లవుమామ్) నూల్ మడల్ మిశై వార్త్తై - (నూల్-శాస్త్రమ్, శాస్త్రజ్గళుడైయ అవాంతర్గతశాఖాదిస్థానమ్ జీవన్, తదంతర్గతమంత్రాది స్థాన మీశ్వరన్, ఇప్పడి శొల్లుమ్బడి,) వకుత్తనమే-కాణ్బిత్తోమ్, యద్వా, ఇదిన్ పొరుళ్ - ఇన్ద తత్త్వత్రయస్వరూపజ్గళ్, నూల్ మడన్ మిశై వార్త్తై యెన్న-శాస్త్రావాన్తరమాన శాఖైకళిలే శొల్లుమ్ వార్త్తై యెన్నుమ్బడి, వకుత్తనమ్ - గోక్షీరఘృతదృష్టాంతత్తాలే ఉపనిషత్తు కాట్టిఱ్ఱెన్ఱు శొన్నోమ్.**

గాథా - శరీరే సంసృష్టా ప్రకృతి రపి దుఃఖస్య జననీ
తదంతస్థాత్మాన స్తదుపరి పరాత్మా సకలగః ।
శ్రుతా వుక్తోర్థోఽయం జలధిగతశుక్తిస్థమణివ
ద్వరార్థ శ్శాస్త్రస్థేష్వివ చ మనుష జ్ఞేయ మితి తు ॥

### ఇతరమతముల వలలో చిక్కుకొనకుండుట

**29.** తత్తువన్దన్నిల్ విరిత్తిడత్తోన్టు మిరణ్డుతనిల్
పత్తి విలక్కియ పాశణ్డర్ వీశుఋమ్ పాశముఱా
రెత్తిశైయు న్తొÇతేత్తియ కీర్త్తియ రెణ్డిశైయార్
శుత్తరురైత్త చుళక మరున్దియ తూయవరే

ఎత్తిశైయున్ = ఏ దిక్కులోనున్నవారు అయినను, తొÇదు = నమస్కరించి, ఏత్తియ = పొగడునట్టి, కీర్త్తియర్ = కీర్తిని కలవారు, ఎణ్ దిశై ఆర్ శుత్తర్ = అన్ని విధములుగా పరిపూర్ణమైన శుద్ధిని కలవారును అగు మన ఆచార్యులు, ఉరైత్త = ఉపదేశించిన (విషయములతో కూడిన), చుళకమ్ = ఈ తత్త్వత్రయచుళకమను రహస్యమును, అరున్దియ = (ఆచమించిన) మనస్సున భావించి నిలుపుకొని, అనుభవించిన, తూయవర్= పరిశుద్ధులు, తత్తువమ్ తన్నిల్ = (మూడు) తత్త్వములందు, విరిత్తిడ త్తోన్టుమ్ = వివరించి పల్కునపుడు (ముఖ్యముగా) భాసించు, ఇరణ్డుదనిల్ = (జీవుడు, ఈశ్వరుడు అను) రెండు తత్త్వములలో, పత్తి విలక్కియ = (వాని స్వరూపమును, స్వభావమును యథాతథముగా తెలియలేక ద్వేషించు) భక్తిలేని, పాశణ్డర్ = పాషండులు (నాస్తికులు), వీశుఋమ్ = ప్రయోగించు, పాశమ్ = బంధములో, ఉఱార్ = చిక్కుకొనరు.

మహాపవిత్రులగు మన పూర్వాచార్యుల మహిమను లోకములో అందఱు కొనియాడుచున్నారు. ఈ ఆచార్యులు ఉపదేశించిన విషయములనే కూర్చి, ఈ రహస్యత్రయచుళకమను రహస్య గ్రంథమును రచించితిమి. దీనిని చక్కగా తెలిసిన తెలిసినవారు చేతనుడు, ఈశ్వరుడు-అను ఈ ఇద్దఱి స్వరూపమును, స్వభావమును గ్రహింపలేక వదరునట్టి నాస్తికులగు ఇతరమతములవారు ప్రయోగించు వలలో చిక్కుకొనరు. (చుళకమను పదము ఆచమనముద్రలోనున్న జలమును తెలుపుటనుబట్టి దానికి తగినట్లు **"అరున్దియ"** అని ప్రయోగింపబడినది).



**తమిళ:-ఇప్పడిచ్చొన్న తత్వత్రయవిషయమాన విన్ద చుళకమ్ తికÇన్ద కీర్తిమాన్గళాన సదాచార్యోపదేశత్తాల్ వన్దదెన్టు కాట్టానిన్టు కొణ్డు ఇదై అభ్యసిత్తవర్కళుక్కు వేదబాహ్యాళాన పాషండికళుడైయ కుయుక్తికళాలే ఇత్తత్వవిషయత్తిలే కలక్కమ్ వారాదెన్గిఱారొరుపాట్టాలే. (ఎత్తిశైయు) మిత్యాది. (ఎత్తిశైయు న్తొÇతేత్తియ) ఎన్ద దిక్కుకళిలుమ్ ప్రణామమ్పణ్ణి స్తుతిక్కప్పడుమతాన (దిక్ఛబ్దమ్ తన్నిష్ఠజనపరమ్). కీర్త్తియరెణ్డిశైయాల్ - ఎణ్డిశై కీర్త్తియరెన్టన్వయమ్) ఎట్టుదిక్కిలుమ్ ప్రవర్త్తిరుక్కిఱ కీర్త్తియాలే, శుత్తర్-సర్వత్ర ప్రసృతజ్గళాన వాచార్యర్కళాలే, ఉరైత్త చుళకమ్ - శొల్లప్పట్ట చుళకత్తై, (ఆచార్యసకాశత్తిలే పరిప్రశ్నాదికళాలే నామ్ కేట్టపడి శొన్న విన్ద తత్త్వత్రయచుళకత్తై - ఎన్టపడి) అరున్దియ -పానమ్బణ్ణిన, తూయవరే - పరిశుద్ధరే, ఇత్తై ఆచార్యాళిడత్తిల్ ఉళ్ళపడి యఱిన్ద పరిశుద్ధాత్మకళే-ఎన్టపడి. ఇదుక్కు పాశముఱారెన్గిఱత్తిలన్వయమ్.**

**తత్తువన్దన్నిల్ - తన్ - స్వార్థే, తత్వత్తిలే, విషయసప్తమీ, విరిత్తిడ - విస్తరిక్కవే (తత్త్వత్రయమాక విపులజ్ఞాన ముణ్డాకవే - యెన్టపడి) ఇవ్విరణ్డుతన్నిల్ - తత్వత్రయత్తుక్కుళ్ళే ఇరణ్డు తత్త్వన్తన్నిలే, పత్తి విలక్కియ - భక్తియై నివర్త్తిప్పియానిన్ట, చిదచిదీశ్వరరూపమాన తత్త్వత్రయత్తిల్ శంకరాదికళ్ చిదచిత్తుక్కళైయుమ్, చార్వాదికళ్ జీవేశ్వరర్కళైయుమ్, యోగాచారాదికళ్ అచిదీశ్వరర్కళైయుమ్ అపలాపమ్ పణ్ణుకైయా లివ్విరణ్డుతన్నిల్ "పత్తి విలక్కియ" వెన్టు సామాన్యమాక చ్చొన్టదు) పాషణ్డర్వీశుఋ మ్పాశమ్ - పాశణ్డికళాలే వీశప్పడుమ్ పాశత్తై (వేదబాహ్యర్కళ్ శొల్లుమ్ కుయుక్తికళై-ఎన్టపడి) ఉఱార్ - అడైయమాట్టార్కళ్. (అవర్కళ్ శొల్లుమ్ కుయుక్తికళై ఖండిత్తు తత్త్వత్రయత్తై స్థాపిప్పర్కళెన్టపడి.)**

గాథా - దీప్తాశాష్టకకీర్తిభిః త్రిభువనస్తుత్యైః విశుద్ధాత్మభిః
ప్రోక్తం సచ్చుళకం పిబ న్నర ఇమం శుద్ధాశయో వర్ధితాత్ ।
తత్త్వజ్ఞానత ఏషు తత్వయుగళీసంత్యాగిపాషండిభిః
పాశం గాఢనివారితం కుమతిభిః ఛింద్యా ద్ద్రుతం లీలయా ॥

### శ్రియ:పతిపాదములే ఉపాయోపేయములు

**30.** వినైత్తిరణ్ మాOOియ వేదియర్ తన్ద నల్వాశకత్తాల్
అనైత్తు మఱిన్దపి నాఋమ్ పయను మెన వడైన్దోమ్
మనత్తిలిరున్దు మరున్దముదాకియ మాదవనార్
నినైత్తన్ మఱత్త లరితాయ నన్నిÇనీళ్కÇలే

వినై త్తిరళ్ మాఱ్ఱియ = (మన వద్దనున్న) పాప సమూహములను పోగొట్టిన, వేదియర్ తన్ద = ఆచార్యులు అనుగ్రహించిన, నల్ వాశకత్తాల్ = మంచి ఉపదేశమువలన, అనైత్తుమ్ అఱిన్దపిన్ = (తత్త్వములు రహస్యములు మొదలగు) అన్నిటిని తెలిసిన పిమ్మట, మనత్తిల్ ఇరున్దు = (మన) హృదయములో నిత్యవాసము చేసి, మరున్దు అముతు ఆకియ = (కర్మబంధమును పోగొట్టు) మందుగా, (అనుభవించుటకు మంచి) అమృతముగా అయినవాడగు, మాదవనార్ = శ్రీమన్నారాయణుని, నినైత్తల్ మఱత్తల్ అరితాయ = (గొప్పతనమును చూచినచో) స్మరించుటకు, (మాధుర్యమును చూచినచో) మఱచుటకును వీలుకానిది, నిఴల్ = (శరణు పొందినవాని తాపమును పోగొట్టగల చల్లని) నీడను కల్గినదగు, నల్ నీళ్ కఴలే=గొప్ప దీర్ఘములైన శ్రీపాదములే, ఆఱుమ్ పయనుమ్ ఎన = ఉపాయము, ఉపేయము అని తలచి, అడైన్దోమ్ = ఆశ్రయించితిమి. (ఏ = ఆనందము, ఆశ్చర్యమును).

భగవానుడు మన హృదయప్రదేశమున నివసించుచు, కర్మబంధమును పొగొట్టు మందుగా, ఎంత అనుభవించినను తృప్తిని కల్గింపని అమృతముగా (ఆరావముదముగా) ప్రకాశించుచున్నాడు. ఆ స్వామి శ్రీ పాదముల గొప్పతనమును చూచినచో వానిని మనసుతో తలచుటకుకూడ సాధ్యము కాదు; వాని మాధుర్యమును చూచినచో విడుచుటకు వీలుకాదు. ఈ శ్రీపాదముల నీడ సంసారతాపమును పోగొట్టగల్గినది. ఆచార్యుల ఉపదేశమువలన సారార్థములను తెలిసిన మనము ఇట్టి శ్రీ పాదములనే ఉపాయముగా, ఉపేయముగా ఆశ్రయించితిమికదా!

ఈ పాశురమే ఈ ప్రబంధములో మరల 38వ పాశురముగానున్నది. మూన్టామ్ తిరువన్దాదిలోని **"మరున్దుమ్ పొరుళుమ్ అముదముమ్"** అను సూక్తి, ముదల్ తిరువన్దాదిలోని **"నెఱివాశల్ తానేయాయ్"** అను సూక్తి ప్రకృతమున స్మరణీయములు.

**తమిళ:– ఇత్తత్త్వత్రయవివేకత్తుక్కు ముఖ్యఫలత్తై క్కాట్టానిన్ఱుకొణ్డు సకలవేదాన్తఙ్గళైయు మఱిన్ద శ్రీభాష్యకారాదికళుడైయ "స్వాధీనత్రివిధే" త్యాదివాక్యత్తాలే తత్త్వనిర్ణయమ్ పిఱన్ద పిన్బు అశరణ్యశరణ్యానాన శ్రియఃపతియినుడైయ సకలతాపహరమాన తిరువడికళే ఉపాయము ముపేయము మెన్ఱఱిన్దడైన్దోమ్ ఎన్ఱు స్వానుసంధానరూపమాక ఒరు పాట్టరుళిచ్చెయ్‌కిఱార్. (వినైత్తిరళి)త్యాది – వినైత్తిరళ్ – పాపసమూహత్తై, మాఱ్ఱియ – మాఱుమ్బడి పణ్ణినవరాన, ("సుహృద స్సాధుకృత్యామ్, ద్విషంతః పాపకృత్యామ్" ఎన్గిఱపడియే నమ్ముడైయ పాపఙ్గళై ద్విషత్తుక్కళ్‌పక్కలిలే మాఱ్ఱినవర్‌కళాన–వెన్ఱపడి)**



**వేదియర్–వేదత్తై యఱిన్దవర్. (సకలవేదాన్తార్థత్తై యఱిన్దవర్‌కళెన్ఱపడి) తన్ద – ఉపదేశత్తాలుమ్, గ్రంథరూపమాయుమ్ కొడుత్తదాన, నల్ వాశకత్తాల్ – శ్రేష్ఠమాన స్వాధీనత్రివిధేత్యాదివాచకత్తాలే. (వాచకమ్ – శబ్దమ్, తత్సమూహమాన వాక్యమాకవుమామ్) అనైత్తు మఱిన్ద పిన్ – సకలత్తైయుమ్ అఱిన్ద పిన్బు, (సకలతత్త్వస్వరూపాదికళైయు మఱిన్ద పిన్బు ఎన్ఱపడి) ఇదుక్కడైన్దోమ్ ఎన్గిఱత్తిలన్వయమ్) మనత్తిలిరున్దు –మనస్సిలే ఇరున్దు కొణ్డు, (మరున్దెన్గిఱదు "మరుత్తు" ఎన్ఱు వల్లుయిరా యిరుక్కిఱదు) ఔషధమాయుమ్, అమృతమాయుమాకానిన్ఱ, (పాపనివర్తకమాకైయాలే ఉపాయత్తైయే మరున్దెన్గిఱదు. ఉపాయమాయ్, ఫలముమాకియ వెన్ఱర్థమ్. ఇదు మాదవఱ్కుమ్, మలర్‌కఴలుక్కుమ్ విశేషణమాకలామ్) మాదవనార్–శ్రియః పతియినుడైయ, నినైత్తల్ – నినైక్కైక్కు, మఱుత్తల్ – మఱుక్కైక్కు, అరిదాకియ – అశక్యమాకానిన్ఱ (అవాఙ్మనసగోచరరాకైయాలే నినైక్కైక్కు అశక్యమ్. భోగ్యతాతిశయత్తాలే మఱుక్కైక్కశక్యమెన్ఱు కరుత్తు) నన్నిఴల్ – నల్ల నిఴలై యుడైయదాన (తాపత్రయాభితప్తరౌదుఙ్గుమ్బడి యిరుక్కైయాలే వన్దాలు మనన్యప్రయోజననాక్కై) నీళ్ కఴల్ – నీణ్డ తిరువడికళే. (త్రివిక్రమావతారత్తిలే నీణ్డదవినపడియాలే నీణ్డదెన్ఱ దిఙ్గు. అనుబంధిపర్యంతమ్ రక్షిక్కైయాలుమ్ నీణ్డదెన్ఱుమామ్) ఆఱుమ్ – ఉపాయముమ్, పయనుమ్ – ఫలముమ్, ఎన – ఎన్ఱు అఱిన్దితి శేషః, (అఱిన్దు – జ్ఞాత్వా), అడైన్దోమ్ – ఇదు సదాచార్యోపదేశత్తాల్ వన్ద తత్త్వజ్ఞానఫల మెన్ఱు కరుత్తు.**

గాథా – పాపధ్వంసపటిష్ఠవైదికగురుప్రత్తేన సాధీయసా
శబ్దేనాఖిలవేదనా న్మనసి న స్సుస్థస్య దీర్ఘౌ శుభౌ ।
సంస్మృత్య స్మరణాక్షమాతిసుఖదచ్ఛాయౌ వయం ప్రాప్నుమః
పీయూషౌషధమాధవస్య చరణౌ ప్రాప్యౌ తథా ప్రాపకౌ ॥

**రహస్యములందు చెప్పబడిన నిష్ఠను పొందుట**

**31.** **ఓదు మఱ్ఱై నాన్గదనిలోఙ్గు మొరు మూన్ఱినుళ్ళే**
**నీది నెఱి వఴువా నిఱ్కిన్ఱోమ్ – పోదమరుమ్**
**పేరాయిరము న్దిరువుమ్ పిరియాద**
**నారాయణనరుళా నామ్**

పోదమ్ అరుమ్ = (అర్థమును) తెలియుటకు అరుదైన, (లేక, నాలుక అను పుష్పమునందు అమరియున్న), పేర్ అయిరముమ్ = సహస్రనామములను, పోదు అమరుమ్ తిరువుమ్=

(తామర) పూవులో చేరియున్న లక్ష్మీదేవియు, పిరియాద = ఎడబాయని (ఎపుడును చేరియున్న), నారాయణన్ అరుళాల్ = శ్రీమన్నారాయణుని కృపచే, ఓదుమ్ = అధ్యయనము చేయబడుచున్న, మఱై = వేదములు, నాన్గు అదనిల్= నాల్గింటిలో, ఓఙ్గుమ్ = ఉన్నతమైయున్న, ఒరు మూన్ఱినుళ్ళే = అద్వితీయమైన రహస్యత్రయములో (తెలుపబడిన) నీది నెఱి = సన్మార్గముయొక్క నిష్ఠను, నామ్ వఴువా (దు) నిఱ్కిన్ఱోమ్ = మేము తప్పకుండ, దృఢముగా నిలచియుంటిమి.

**"పోదమరుమ్"** అను ప్రయోగము **"పేరాయిరముమ్"** - **"తిరువుమ్"** అను రెండిటియందును అన్వయింపనగును. సహస్రనామములు భగవానుని కీర్తిని వ్యక్తీకరించుటచే **"పేరాయిరముమ్ పిరియాద"** అని పలుకబడినది. **"పోదమ్"** అను పదము బోధమను సంస్కృతశబ్దజన్యము.

అరుదైన అర్థవిశేషములను కల్గి, మనచే అనుసంధింపబడు సహస్రనామములు మొత్తము **"యాని నామాని గౌణాని విఖ్యాతాని"** అనునట్లు భగవానుని శ్రీమన్నారాయణుని కీర్తినే పొగడుచున్నవి. ఇట్టి గొప్పతనమును కల భగవానుడు తామరపూవులో నెలకొనియందు లక్ష్మీదేవితో ఎట్టి ఎడబాటు లేక కలిసియుండి, మనలను అనుగ్రహించుచున్నాడు. ఈ స్వామి కృపచే, వేదములందు, గొప్పవైనున్న మూడు రహస్యములందు తెలుపబడిన నిష్ఠను మేము స్థిరముగా పొందితిమి.

ఇచటి వృత్తము వెణ్బా. 31, 32వ పాశురములు రెండును రహస్యత్రయ చుళకములోని తిరుమంత్రాధికారములోనివి.

**తమిళ:- మేల్ శ్రీమద్రహస్యత్రయచుళకత్తిల్ అధికారత్రయత్తిలాద్యన్తఙ్గళిలే యిరుక్కిఱ వొన్బదు పాట్టుక్కళిల్ ముదఱ్పాట్టు. ఇని రహస్యత్రయచుళక మెన్గిఱ గ్రంథత్తై యరుళిచ్చెయ్యప్పుకువర్కళాయ్క్కొణ్డు, అన్ద రహస్యత్రయార్థత్తిలే నమక్కు యోగ్యమాన నిష్ఠై యిన్ద సహస్రనామప్రతిపాద్యనాన శ్రియఃపతియినుడైయ కృపైయాలే యుణ్డాయ్ఱఱెన్ఱు స్వానుసంధానరూపమాన పడియిలే ఒరు పాట్టరుళిచ్చెయ్కిఱార్. (ఓదు మఱై) - ఇత్యాది. ఓదు మఱై నాన్గదనిల్. (ఉఱై - శబ్దమ్. ఓదుకై - అధ్యయనమ్ పణ్ణుకై) ఓదప్పడుమ్ శబ్దఙ్గళుడైయ నాలిల్, (అనాదియాక అధ్యయనమ్ పణ్ణప్పడుమ్ నాలువేదఙ్గళిలే యెన్ఱపడి) ఓఙ్గియ - ఓదప్పట్టదాన (అదుకళిలే శ్రేష్ఠ మెన్ఱు ప్రతిపాదితమాన ఎన్ఱపడి), మూన్ఱినుళ్ళిల్ - రహస్యత్రయత్తినుడైయ ఉళ్ళమాన అర్థఙ్గళిలే (అథర్వణశిఖైయిలే తిరుమన్త్రమ్, కఠశ్రుతియిలే ద్వయముమ్, తత్సమమాన గీతోపనిషత్తిలే చరమశ్లోకముమ్**



**శొల్లప్పట్టదాకైయాలే వేదఙ్గళిలోఙ్గిన మూన్ఱెన్ఱు శొన్నదు. సర్వోపనిషత్సారమాన రహస్యత్రయార్థత్తిలెన్ఱు కరుత్తు.) నీది నెఱి - (నీది-న్యాయమ్, నెఱి-మార్గమ్) ఇఙ్గు నీతియావతు తిరుమన్త్రత్తిలే శొన్న శేషిశేషభావాదికళై యఱిన్దు, తదనుగుణమాక నడక్కై. మార్గ మావతు అకించననుక్కు యోగ్యమాక ద్వయత్తిలుమ్ శొన్న ఉపాయానుష్ఠానమ్ పణ్ణుకై, వఴువామల్ - వఴువిప్పోకామల్ (ఇదుకళై విడామలెన్ఱపడి) ఇదుక్కు నిఱ్కిన్ఱోమోడే అన్వయమ్. పోదమరుమ్ పేరాయిరముమ్ - సర్వకాలానుసంధేయమాన సహస్రనామముమ్, (పోదమరుమ్ తిరువుమ్) పోదు - పుష్పమ్, అదిలమర్న్దిరుక్కిఱ పిరాట్టియుమ్ (కమలవాసినియాన - ఎన్ఱపడి) పిరియాద నారాయణనరుళ్-ఇన్ద విరణ్డుకళుమ్ విట్టు ప్పిరియాద వన్ద నారాయణనుడైయ కృపైయాలే, (ఏతన్నిష్ఠకల్యాణగుణవాచకతయా సహస్రనామముమ్, వ్యావర్తకతయా పిరాట్టియుమ్, పిరియాదపడి యిదుకళై విశేషణమాక వుడైయ నారాయణనుడైయ కృపైయాలే) నామ్ - అన్ద అర్థఙ్గళై అఱిన్ద నామ్, నిఱ్కిన్ఱోమ్ - నిల్లానిన్ఱోమ్, (ఆచార్యోపదేశత్తాల్ ఇన్ద రహస్యత్రయార్థనిష్ఠైయై యుడైయవాళాక వానో మెన్ఱపడి) ఇదిల్ భగవద్గుణానుసంధానమ్ పణ్ణుకైయాలే ఇదు మంగళాశాసనము మాయ్ఱఱు.**

గాథా - అధీతచతురాగమోజ్జ్వలతమత్రికార్థేష్వమీ
వినా చ్యుతి మిహాస్మహే విశదవేదనాచారయోః ।
సదానుకథనోచితాద్భుతసహస్రనామేన్దిరా
వినాభవకథోజ్ఝితత్రియుగభూరికారుణ్యతః ॥

ఈశ్వరుడు చేయు ఉపకారపరంపర

**32.** ఊన్ఱన్దు నిలైనిన్ఱ వుయిరు న్దన్నో-
రుయిరాకి యుళ్ళొళియోడుఱైన్ద నాదన్
తాన్ఱన్ద విణ్ణుయిరై యెనదెన్నామ
నల్లఱివు న్దన్దకలా నలము న్దన్దు
తాన్ఱన్ద నల్వఴియాఱఱుఴన్ద వెన్నై
త్తన్ఱనక్కే పరమాక త్తానే యెణ్ణి
వాన్ఱన్దు మలరడియు న్దన్దు వానోర్
వాఴ్చ్చి తర మన్నరుళాల్ వరిత్తిట్టానే

ఊన్ తన్దు = శరీరమును ఇచ్చి, నిలై నిన్ఱ = స్థిరముగానున్న (నశింపని), ఉయిరుమ్ తన్దు = జీవాత్మను ఇచ్చి, ఓర్ ఉయిర్ ఆకి = అద్వితీయమైన అంతర్యామియై, ఉళ్ ఒళియోడు = (చేతనాచేతనములందు) తన ప్రకాశమువంటి లక్ష్మితో, ఉఱైన్ద = నివసించుచున్న, నాదన్ = స్వామియగు భగవానుడు, తాన్ తన్ద = తాను అనుగ్రహించిన, ఇన్ ఉయిరై = మధురమైన జీవాత్మను, ఎనదు ఎన్నామల్ = నాది (నాకే శేషము) అని తలపకుండునట్లు, నల్ అఱివుమ్ తన్దు = గొప్ప జ్ఞానమును ఇచ్చి, అకలా నలముమ్ తన్దు=(ఎల్లప్పుడు) నిలచియుండు ఆనందమును (జ్ఞానమును) ఇచ్చి, తాన్ తన్ద = తాను (లోకమునకు చూపి) అనుగ్రహించిన, నల్ వఴియాల్ = గొప్పదైన ఉపాయమగు శరణాగతిపూర్వకముగా, తాఴ్న్ద ఎన్నై = శ్రీ పాదములందుపడిన నన్ను, తన్ తనక్కే పరమాక= కాపాడుట తన బాధ్యతగా, తానే ఎణ్ణి = తానే తలచి, వాన్ తన్దు = (రాబోవు కాలమున) పరమపదమును అనుగ్రహించి, మలర్ అడియుమ్ తన్దు = పూవువంటి తన శ్రీ పాదములను ఇచ్చి, వానోర్ వాఴ్చ్చి తర = నిత్యసూరుల ఉన్నతమైన భోగమును ఇచ్చుటకు, మన్ అరుళాల్ = దృఢమైన తన కృపతో, వరిత్తిట్టాన్ = సంకల్పించెను (వరణము చేసెను). (ఏ = ఆశ్చర్యము)

భగవానుడు జీవాత్మలకు చేయు ఉపకారము లెక్కకట్టలేనిది. మొదటగా శరీరము నిచ్చి, శాశ్వతముగా నిలచియుండు జీవాత్మను ఇచ్చి, ఆ శరీరమునందు, ఆత్మయందు లక్ష్మితో కలసి ప్రవేశించి అంతర్యామియై నిలచియున్నాడు. ఆత్మను స్వతంత్రమని తలపక, భగవానునకే శేషమను గొప్ప జ్ఞానమును, ఆనందము అనుగ్రహించుచున్నాడు. అనంతరము ప్రపత్తి అను ఉపాయమును చూపి, దానిని అనుష్ఠింపచేసి, అతని (జీవుని) బాధ్యతను తానే వహించుచున్నాడు. శరీరపాతముకాగానే శ్రీవైకుంఠమునకు చేర్చి, తన పాదములందు కైంకర్యమును చేసి, నిత్యసూరుల ఆనందముతో సరిఅయిన ఆనందమును అనుభవింపచేసి, ఉజ్జీవింపజేయ సంకల్పించినాడు. అతడు చేయు ఉపకారములు ఎంతగొప్పవో కదా!

**"ఉళ్ ఒళియోడు"** అనునపుడు **"ఒళి"** శబ్దము తేజోరూపిణియైన లక్ష్మీదేవిని నిర్దేశించును. **"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా"** అని శ్రీరామాయణ సూక్తి. **"ప్రభా"** అనునది లక్ష్మీనామములలో ఒకటి. లేక, **"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా"** ఇత్యాది శ్రుత్యర్థమును అనుసరించి ఇట్లు పల్కుచున్నారనియు చెప్పవచ్చును.
వృత్తము ఎణ్ శీర్ ఆశిరియవిరుత్తము



**తమిళ:-ఇప్పడి ప్రథమాధికారత్తిలే తిరుమన్త్రత్తుక్కు పిరిత్తు పిరిత్తు అర్థ మరుళిచ్చెయ్తు, విశిష్టమాక వర్థయోజనై పణ్ణుమ్బోదు తిరుమన్త్రమ్ ముఴక్క వాక్యత్రయమాయ్. స్వరూపోపాయ పురుషార్థఙ్గళైయుమ్ ప్రతిపాదిక్కుఅదెన్ఱు మరుళిచ్చెయ్దు సుఖబోధార్థమాక చరమయోజనైయిలే నోక్కాక పూర్వోక్తాకారఙ్గళై యెల్లామ్ సంగ్రహిక్కిఱార్ చరమగాథైయాలే. (ఊన్ తన్ది) త్యాది. ఊన్ తన్దు-శరీరత్తై క్కొడుత్తు, నిలైనిన్ఱ వుయిరు న్తన్దు - స్థిరమాక విరానిన్ఱ వాత్మావైయు జ్గొడుత్తు. (తమోభూతమాన మహాప్రళయత్తిలే అచిదవిశిష్టరాన చేతనరై కటాక్షిత్తరుళి, పరమకృపైయాలే కరణకళేబరప్రదానమ్పణ్ణి - ఎన్ఱపడి. ఇత్తాల్ అకారార్థమాన కారణత్వముమ్, రక్షకత్వముమ్, మకారార్థమాన జీవస్వరూపముమ్ శొన్నపడి).**

**ఓరుయిరుమాకి - అద్వితీయమాన వాత్మావాకి. (జీవశరీరభూతమాన వచిత్తుక్కుమ్, అవనుక్కుమ్ తాన్ ముఖ్యశరీరియాకానిన్ఱుకొణ్డు - ఎన్ఱపడి) ఉళ్ళొళియోడు - అన్ద చేతనాచేతనఙ్గళుక్కుళ్ళే తేజఃప్రాయమాన ధర్మభూతజ్ఞానత్తోడు. తనక్కుళ్ళ ఒళియోడెన్ఱుమామ్. ఒళిశబ్దమ్ తేజోవాచియాయ్, జ్ఞానత్తైయుమ్, జ్ఞానానందస్వరూపమాన విగ్రహత్తైయుమ్, స్వప్రభాభూతైయాన పిరాట్టియైయుమ్ శొల్లుమ్) ఉఱైన్ద నాదన్ - (పూర్వోక్తవిశేషఙ్గళోడే కూడిన) వసియానిన్ఱ స్వామియానవన్, (ఇత్తాల్ లుప్తచతుర్థియోడేకూడిన అకారత్తిల్ ఫలిత్త స్వామిత్వముమ్, శ్రియఃపతిత్వముమ్, సర్వశరీరత్వముమ్ శొన్నపడి) తాన్ తన్ద ఎన్ఱుయిరై - స్వకైంకర్యార్థమాక తాన్ కొడుత్త వెన్నాత్మావై, ఎనదన్నా-ఎనక్కు శేషమెన్నాద, నల్లఱివుమ్ తన్దు - ఇప్పడి యెనక్కు నల్లబుద్ధియైయుమ్ కొడుత్తు, (అఱివు - భక్తి, ఇత్తాల్ ప్రణవనిష్ఠమకారత్తోదేకూడిన నమశ్శబ్దార్థమాన స్వస్వామిత్వనివృత్తి శొన్నపడి) అకలా నలము న్తన్దు - ఒరునాళుమ్ విశ్లేషియాత వానన్దత్తైయుమ్ కొడుత్తు, (ఇత్తాల్ నమశ్శబ్దార్థమాన స్వస్వాతంత్ర్యనివృత్తియాల్ వన్ద భగవత్పారతంత్ర్యముమ్, అత్తాల్ వన్ద భాగవతశేషత్వముమాకిఱ వానన్దముమ్ శొన్నపడి) తాన్ తన్దనల్ వఴియాల్-అకించననాన వెనక్కు తాన్ కొడుత్త నల్లదాన ప్రపత్తిరూపమార్గత్తాలే, తాఴ్న్ద వెన్నై - తన్ తిరువడికళిలే వణఙ్గిన వెన్నై, తనక్కేతాన్ పరమాక - ఎనక్కు భరమానతు తన్ భరమాకుమ్బడి, తానే యెణ్ణి-తానే నమ్ముడైయ భరత్తై స్వీకరిప్పోమెన్ఱెణ్ణిక్కొణ్డు (తానే - ఎన్ఱదు ఉత్తరత్ర రక్ష్యనుడైయ స్వయత్ననిరపేక్షమాక-వెన్ఱపడి. ఇత్తాల్ నమస్సిల్ స్థూలసూక్ష్మయోజనైయినర్థమాన శరణాగతి శొన్నపడి). వాన్ తన్దు-నిత్యవిభూతియైయుమ్ తన్దు, మలరడియుమ్ తన్దు - అదిలనుభావ్యమాన కుసుమకోమలశ్రీపాదఙ్గళైయుమ్ తన్దు, వానోర్ వాఴ్చ్చి -**

**కాలానవచ్ఛిన్న కైంకర్యమ్, అత్తై తరుకైక్కాక, మన్నరుళాల్ - స్థిరైయాన కృపైయాల్, వరిత్తిట్టానే-వరణమ్ శెయ్దువిట్టానే. (వరున్ది నమ్మై యఙ్గీకరిత్తా నెన్టపడి) - ఇత్తాలయనశబ్దార్థముమ్, చతుర్థ్యర్థముమ్ శొన్నపడి).**

**గాథా - దత్వా నిత్యస్వరూపం తను మపి జగతా మేక ఆత్మాంతరస్థః**
**కించ స్వీయత్వబుద్ధిం మమకృతిరహితాం మయ్యనల్పం సుఖం చ ।**
**దాసం మాం స్వార్పితేన స్వభర ఇతి విదన్ సత్పథేనాంఘ్రిపద్మం**
**దత్వా వ్యోమస్థిరం చావృణుత కరుణయా సూరిభూతిం ప్రదాతుమ్ ॥**

**నిత్యసూరుల భోగమును పొందుట**

**33 తిరుమాలడియిణైయే తిణ్ శరణా క్కొణ్డు**
**తిరుమాలడియిణైయే శేర్వార్-ఒరుమా**
**లరుళా లరుళాద వానోర్కళ్వాళ్చ్చి**
**యరుళా నమక్కళిత్తారాయ్న్దు.**

తిరుమాల్ = శ్రియ:పతియొక్క, అడి ఇణైయే = శ్రీ పాదయుగమే, తిణ్ శరణా క్కొణ్డు= దృఢమైన ఉపాయముగా గొని, తిరుమాల్ = శ్రీమన్నారాయణుని, అడి ఇణైయే = శ్రీ పాదద్వంద్వమునే, శేర్వార్ = ఫలముగా పొందువారగు ఆచార్యులు, ఒరు మాల్= అద్వితీయుడైన, ఆశ్రితవ్యాముగ్ధుడగు సర్వేశ్వరుడు, అరుళాల్ = తన కృపతో, అరుళాద= (ఇంతవరకు) అనుగ్రహింపని, వానోర్కళ్ వాళ్చ్చి = నిత్యసూరుల ఉజ్జీవనమును, అరుళాల్ = (మన మీదగల) కరుణతో, ఆయ్న్దు = విచారించి చూచి, నమక్కు అళిత్తార్ = మనకు అనుగ్రహించిరి.

శ్రీమన్నారాయణుని శ్రీ పాదములనే ఉపాయముగా, ఫలముగా స్వీకరించిన మన ఆచార్యులు ఇంతవరకు మనకు భగవానుడు అనుగ్రహింపని మోక్షానందమును మనము పొందుటకు తగిన మార్గమును అన్వేషించి, మనకు చూపిరి. ద్వయమంత్రములోని పూర్వోత్తరఖండములలోని నారాయణశబ్దములు రెండును శ్రీమచ్ఛబ్దవిశిష్టములు కావున, ఈ పాశురము ద్వయమంత్రార్థమును పరామర్శించుచున్నది. కావున రెండు పాదములలో **"తిరుమాల్"** అని ప్రయోగింపబడినది.

33, 34, 35 వ పాశురములు రహస్యత్రయచుళకములోని ద్వయాధికారములోనివి. ఈ పాశురఛందస్సు వెణ్బా.



**తమిళ:-ఇప్పడి మూలమంత్రార్థత్తై యరుళిచ్చెయ్తు ఇని ద్వయత్తుక్కు విశదమాక వర్థ మరుళిచ్చెయ్యప్పుకుకిఱవరాయ్, అన్ద ద్వయార్థత్తై సంగ్రహియానిన్టుకొణ్డు ఇన్ద ద్వయార్థమాన వుపాయానుష్ఠానత్తాలే యదుక్కు ఫలమాన నిత్యసూరిభోగ్యమాన కైంకర్యత్తై నమక్కు భగవత్కృపావిషయరాన వాచార్యర్కళ్కృపైయాలే తన్దార్కళ్ ఎన్గిఱార్.**

**(తిరుమాలడియిణై) - ఇత్యాది. తిరుమాలడియిణైయై - శ్రియఃపతియినుడైయ చరణ ద్వయత్తై, వన్ శరణాక కొణ్డు - దృఢోపాయమాక క్కొణ్డు, (తత్రత్య ఏవకారో భక్త్యాదివ్యవచ్ఛేదకః), తిరుమాలడియిణైయే శేర్వార్ - అన్ద శ్రీకాంతనుడైయ దివ్యచరణయుగళఙ్గళైయే యడైయప్పుకుకిఱ వాచార్యర్కళ్. (అత్రత్య ఏవకారః ప్రయోజనాంతరవ్యవచ్ఛేదకః), ఒరు మాలరుళాల్ - అద్వితీయనాన స్వామియిన్ కృపైయాల్, ఉరుళాద - నశియాద, వానోర్కళ్ వాళ్చ్చి - నిత్యసూరికళ్ వాళ్చ్చియాకియ నిత్యకైంకర్యత్తై, అరుళాల్ - కృపైయాల్, ఆయ్న్దు - ఆరాయ్న్దు, (అనుబంధిత్తెన్టపడి), నమక్కు-(తిరువడికళే ఆశ్రయిత్త) నమక్కు, ఆళిత్తనర్ - కొడుత్తార్కళ్. కృపావాన్గళాన ఆచార్యర్కళ్ తాఙ్గళుముపాయానుష్ఠాన మ్పణ్ణి, అస్మదాదికళుక్కు మిదిన్ ఫలమ్ వేణు మెన్టనుసంధిత్తుక్కొణ్డు, తఙ్గళ్ తిరువడియై యాశ్రయిత్త నమక్కు మన్ద ఫలత్తై తన్దార్కళెన్టు తాత్పర్యమ్.**

**గాథా - శ్రీశాంఘ్రిపాదయుగ మేవ దృఢం హ్యుపాయం**
**స్వీకృత్య త చ్చరణ మేవ సమాప్నువంతః ।**
**ఏకస్య నాశరహితాం కృపయేశ్వరస్య**
**కార్స్న్యేన నః కరుణయా ప్రదదు ర్విభూతిమ్ ॥**

**ద్వయమంత్రములోని పది అర్థములు**

**34. శేర్క్కు న్తిరుమకళ్ శేర్త్తియిన్ మన్నుదల్ శీర్ప్పెరియో-**
**ట్కెళ్ళు ఙ్కుణఙ్కళిలక్కామ్ వడివిలిణైయడికళ్**
**పార్క్కు ఇచ్చరణతిల్పుఱ్ఱ్ఱద నన్నిలై నామ్ పెఱుమ్ పే-**
**ఱేత్కికిన్ట వెల్లైకళెల్లా క్కళైయఱ వెణ్ణినమే**

శేర్క్కుమ్ = (భగవానుని పాదములందు మనలను) చేర్చు, తిరు మకళ్ = లక్ష్మీదేవి, శేర్త్తియిన్ మన్నుదల్ = (ఆ స్వామితో) చేరియుండుటలోని స్థిరమైన సంబంధమును, శీర్ పెరియోఱ్కు = సంపద కల్గియుండుటలో గొప్పవాడగు భగవానునకు, ఏఱ్కుమ్ కుణఙ్గళ్= తగినవియగు గుణములు, ఇలక్కామ్ వడివిల్ = (ఆచార్యులు ధ్యానించుటకు)

లక్ష్యమైన దివ్యమంగళవిగ్రహములోని (ఒక భాగమగు), ఇణై అడికళ్ = రెండు శ్రీ పాదములు, పార్కుమ్ శరణ్ = (చేతనులచే ప్రధానముగా) భావింపబడు ఉపాయమగు శ్రీమన్నారాయణుడు, అదిల్ పఱ్ఱుదల్ = (ఉపాయమును) భగవానుని పట్ల మహావిశ్వాసముతో కూడిన భరన్యాసము, నమ్ నిలై = (వేఱు ఉపాయమునందు యోగ్యతలేని) మన స్థితియు, నామ్ పెఱుమ్ పేఱు = మనము పొందు ప్రధానఫలమగు శ్రీమన్నారాయణుడును, ఏఱ్కిన్ఱ = (చేతనుడు) గ్రహించుచున్న, ఎల్లైకళ్ = ఎల్లలు అను భగవద్భాగవత కైంకర్యము మొదలగునవి, ఎల్లా క్కళై అఱవు= (అహంకార-మమకారము మొదలగు) అన్ని దోషములు తొలగి పోవుటయు-అను పది అర్థములను, ఎణ్ణినమ్ = అనుసంధించితిమి.

1) **"శేర్కుమ్ తిరుమకళ్"** అనుటచే ద్వయములోని పూర్వవాక్యములో గల శ్రీ మత్పదార్థము, 2) **"శేర్త్తియిన్ మన్నుదల్"** అనుటచే మతుబర్థము, 3) **"ఏఱుమ్ కుణఙ్గళ్"** అనుటచే నారాయణ పదార్థము, 4) **"ఇణై యడికళ్"** అనుటచే చరణ శబ్దార్థము, 5) **"పార్కుమ్ శరణ్"** అనుటచే శరణశబ్దముయొక్క అర్థము, 6) **"అదిల్ పఱ్ఱుదల్"** అనుటచే ప్ర అను ఉపసర్గతో కూడిన **"పద్"** ధాతువుయొక్క అర్థము, 7) **'నమ్ నిలై'** అనుటచే క్రియలోని ఉత్తమపురుషప్రత్యయముయొక్క అర్థము, 8) **"నామ్ పెఱుమ్ పేఱు"** అనుటచే ఉత్తరవాక్యములోని **"శ్రీమన్నారాయణ"** శబ్దముయొక్క అర్థము, 9) **"ఎల్లైకళ్"** అనుటచే చతుర్థీ విభక్త్యర్థము, 10) **"కళైయఱవు"** అనుటచే నమశ్శబ్దార్థమును చెప్పబడినవి.

అందఱికిని స్వామియై, ఏ రీతిలోనైనను అనుభవించి, తృప్తిని కల్గింపని అమృతమై, లక్ష్మీదేవితో విశ్లేషములేని (ఎల్లప్పుడు కలసియుండు) శ్రీమన్నారాయణుని శ్రీ పాదములందు అన్నిచోట్ల, అన్ని కాలములయందు, అన్ని సన్నివేశములలో, అన్ని విధములైన కైంకర్యములను చేయుటకు విరోధియైయున్న కర్మలు అన్నియు తొలగి, పరిపూర్ణ కైంకర్యమును చేయగల్గుటకు వేఱు ఉపాయములను అనుష్ఠించుటలో శక్తి లేని నేను, నాయందు, నన్ను రక్షించు బాధ్యతయందు, తత్ఫలమందు కొంచెము కూడ సంబంధమును కల్గియుండనట్లు శ్రీమన్నారాయణుని శ్రీ పాదములందు అయిదు అంగములతో ప్రపత్తిని ఆచరించుచున్నాను - అని భావము. ఈ వృత్తము కట్టళైక్కలిత్తుఱై

**తమిళ్:- ఇప్పడి ఇవ్వధికారత్తి లుక్తమాన వర్థఙ్గళై యొరు పాశురత్తాలుమ్ క్రమమాక సంగ్రహిత్తు క్కాట్టుకిఱార్. (శేర్కు) మిత్యాది. శేర్కుమ్ చేతనరై-ఈశ్వరనోడు**



**శేర్ప్పిక్కుమవళాన, తిరుమకళ్ - పిరాట్టియినుడైయ, (తిరువుళ నెన్ఱు పాఠమానాల్ - (శ్రీయై యుడైయవళెన్ఱర్థమ్) శేర్త్తియిల్ - సంశ్లేషత్తిలే, మన్నుదల్ - స్థిరీభవిక్కై. (శ్రియః పతిక్కు పురుషార్థభూత శ్రీయోడుణ్డాన నిత్యసంబంధ మెన్ఱపడి. ఇదుక్కు 'ఏర్కిన్ఱ' వెన్గిఱత్తిల్ అన్వయమ్). ఇదు శ్రీమచ్ఛబ్దార్థమ్.**

**శీర్ పెరియోర్క్కు - సమస్తమంగళగుణైకతాననాయ్, సర్వస్మాత్పరరాన వీశ్వరనుక్కు, ఏఱుమ్ - ఉచితఙ్గళాన, గుణఙ్గళ్ - గుణఙ్గళ్కాట్టిలుమ్, ఇలక్కామ్ వడివిల్ - లక్ష్యమాకవాకా నిఱ్కుమ్ విగ్రహత్తిల్, (వఢివి లెన్ఱు పాఠే - ఆశ్రితప్రచ్యుతిరహితఙ్గళాన - ఎన్ఱు తిరువడిక్కు విశేషణమ్) ఇణైయడికళ్ - సంశ్లిష్టచరణఙ్గళ్, (గుణాద్యపేక్షయా చిత్తావలంబనభూతఙ్గళాన తిరువడికళ్, ఇదు నారాయణశబ్దార్థమ్)**

**పార్కుమ్ - ప్రతీక్షణీయమాన (గత్యంతరాభావా దేతదేవ శరణ మెన్ఱు పరీక్షైక నిర్ణీతమాన వెన్ఱపడి) శరణత్తిల్ - ఉపాయత్తిలే, పఱ్ఱుదల్ - అవలంబిక్కై, ఇదు శరణశబ్ద స్యోపసర్గధాత్వర్థమ్. నన్నిలై - నల్ల వవస్థై (ఆకించన్యావస్థై - యెన్ఱపడి. ఇదు ఉత్తమనిలర్థమ్.) తామ్ - సంసారికళాన నామ్, పెరు మ్పేఱు-అద్వైయప్పుకుకిఱ పురుషార్థమ్ (ఇదు ఉత్తరఖండస్థవిశేషణ నారాయణపదచతుర్థీనమశ్శబ్దఙ్గళుడైయ వర్థఙ్గళ్). ఏఱ్కిన్ఱ - ఇదు కళుక్కు ఉచితఙ్గళాన, వకైకళెల్లామ్ - ప్రకారఙ్గళెల్లామ్, ("ఎల్లై కళెల్లా" మెన్ఱు పాఠమానాల్ సీమైకళెల్లా మెన్ఱర్థమ్. ఇవ్వర్థఙ్గళుక్కుచితఙ్గళాన స్వరూపస్వభావఙ్గళై యెల్లా మెన్ఱపడి) కళై యఱ-అజ్ఞానరూపప్రతిబంధకమ్ నివర్త్తిక్కుమ్బడి, ఎణ్ణినమ్ - పరిగణిత్తోమ్. ఇఙ్గు పరిగణనోక్తియాలే అనుష్ఠాన కాలత్తిలొన్ఱుమ్ శిన్దామల్ అనుసంధిక్కవేణు మెన్ఱు వ్యంజితమ్.**

గాథా - నిత్యే యోగాబ్ధిజాయా ఉచితగుణగణే శ్రీపతే ర్దివ్యదేహే
చిత్తాలంబార్హలక్ష్యే పదకమలయుగే పాదమాత్రప్రతీక్షే ।
యోగ్యోపాయగ్రహే చ ప్రగుణకృపణతా సద్దశాయాం ఫలే చ
ప్రాప్యే సర్వాన్ ప్రకారా నమతివిహతయా చింతయామోపదోషాన్ ॥

ప్రపత్తి చేసిన పిమ్మట ఇచటి ఉజ్జీవనము

**35.** తిరుమాలడియిణై శేర్న్దు తికఢ్న్ద వడిమై పెఱ -
త్తిరునారణన్ శరణ్ తిణ్ శరణాక త్తుణిన్దడైవోర్
ఒరునాళురైక్క వుయిర్తరు మన్దిర మోదియ నామ్
వరునాళ్ పఢుదఱ్ఱు వాఢుమ్ వకైయదిల్ మన్నువమే.

తిరుమాల్ = శ్రీమన్నారాయణుని, అడి ఇణై = శ్రీ పాదములు రెండును, శేర్న్దు = చేరి, తికఢ్న్ద అడిమై పెఱు = గొప్పగా ప్రకాశించు కైంకర్యమును పొందుటకు, తిరు నారణన్ శరణ్ = శ్రీమన్నారాయణుని శ్రీపాదములే, తిణ్ శరణ్ ఆక = దృఢమైన ఉపాయముగా, తుణిన్దు = నిశ్చయించుకొని, అడైవోర్ = ఆశ్రయించు ఆచార్యులు, ఉయిర్ తరుమ్ మన్దిరమ్ = ఉజ్జీవింపజేయు ద్వయమను మంత్రమును, ఒరు నాళ్ = (మన అదృష్టము పండిన) ఒకనాడు, ఉరైక్క = ఉపదేశింపగా, ఓదియ నామ్ = (దానిని) అనుసంధించిన మనము, వరువ్ నాళ్ వఢుదు అఱ్ఱు = ఇక రాబోవు దినములలో (అహంకార–మమకారములనెడి) దోషములు లేకుండ, వాఢుమ్ వకైయదిల్ = తరించు రీతిలో, మన్నువమ్ = ఆసక్తిని కలవారమై నిలచియుండెదముగాక !

శ్రీమన్నారాయణుని శ్రీపాదములే ఉపాయముగా, ఫలముగా పొందిన మన ఆచార్యులు మనకు ద్వయమును ఉపదేశింపగా, దానివలన ఇక భవిష్యత్తులో మనము అహంకార – మమకారరహితులమై, ఉజ్జీవించు రీతిని పొందితిమి.

తిరువాయ్‌మొఢిలోని **"శరణే శరణ్ నమక్కు"** అనునపుడువలె ప్రకృత పాశురములో మొదటి శరణశబ్దము చరణ వాచకము. రెండవ శరణశబ్దము ఉపాయవాచకము. రెండును సంస్కృతశబ్దభవములే.

**తమిళ:–ఇప్పడి ద్వయత్తినుడైయ పవాంతరపదార్థజ్ఞళై యరుళిచ్చెయ్‌తు, ముడివిలరుళిచ్చెయ్‌ద విశిష్టవాక్యార్థత్తై సంగ్రహియానిన్టుకొణ్డు ఇమ్మన్త్రప్రభావత్తైయు మరుళిచ్చెయ్‌కిఱార్ (తిరుమాలిత్యాది).**

**తిరుమాలడియిణై చ్చేర్న్దు – సంసారనివృత్తిపూర్వకమాక శ్రియఃపతియిన్ తిరువడికళై యడైన్దు, తికఢ్న్దు – సంతోషియానిన్ఱ, సంతోషత్తాల్ పణ్ణప్పడువతాన –ఎన్టపడి, అడిమై – దాస్యకృత్యత్తై, పెఱు – అదైక్కైక్కాక, తిరునారణన్ – శ్రీమానాన నారాయణనుడైయ, శరణే – తిరువడికళైయే, శరణాక త్తుణిన్దు – ఉపాయమాక విశ్వసిత్తు, అడైవోర్ – ఆత్మరక్షాభర సమర్పణమ్ పణ్ణిన ఆచార్యర్‌కళ్ ఇడత్తిల్, ఒరునాళురైక్క –సకృదుచ్చారణమ్ శెయ్య, ఉయిర్‌తరుమ్ – యథావస్థితాత్మస్వరూపత్తై త్తరవల్ల, మన్దిరమ్ – మన్త్రరత్నత్తై, ఓదియ – అధ్యయనమ్ శెయ్‌ద, నామ్ – వయమ్, వరునాళ్ – వరప్పుకుకిఱ నాళ్‌కళిల్, పఢుదఱ్ఱు–స్వార్థత్వాది బుద్ధియాకిఱ దోషమఱ్ఱు, వాఢుమ్ వకైయదిల్ – వాఢుమ్ ప్రకారత్తిల్, మన్నువమే – దృఢప్రతిష్ఠాళాక వాకానిన్టోమ్. ఇత్తాల్, మన్త్రత్తుక్కు వాక్యయోజనైయుమ్, మంత్రప్రభావముమ్, ఆచార్యప్రభావముమ్ శొన్నపడి.**



**గాథా – ప్రేమ్ణాఽఽశ్రిత్య రమేశపాదయుగళం కైంకర్య మాప్తుం స్థిరం**
**ప్రాప్తేభ్యో హరిపాద మేవ శరణం విశ్వస్య మంత్రమ్ ద్వయమ్ ।**
**సత్తాహేతుసకృజ్జపం వయ మియం శ్రుత్వాఽఽనుసంధాయినో**
**దోషాపేతసుఖానుభూతివిషయే భావిన్యభూమ స్థిరాః ॥**

**మనకు ఫలమును ఇచ్చుటలో భగవానుని త్వర**

**36 మఱ్ఱొరు పఱ్ఱిన్ఱి వన్దడైన్దార్‌క్కెల్లామ్**
**కుఱ్ఱమతియాద కోవలనార్– ముఱ్ఱుమ్**
**వినై విడుత్తు విణ్ణవరోడొన్ఱ విరైకిన్ఱార్**
**నినైవుడైత్తాయ్ నీ మనమే! నిల్లు**

మనమే = ఓ మనస్సా! మఱ్ఱు ఒరు పఱ్ఱు ఇన్ఱి = వేరొక గతి లేక, వన్దు అడైన్దార్‌క్కు ఎల్లామ్ = తమను ఆశ్రయించిన వారియొక్క విషయమున, కుఱ్ఱమ్ అతియాద= (వారు చేసిన) దోషమును లెక్కింపని, కోవలనార్ = గోపాలుడగు భగవానుడు, ముఱ్ఱుమ్ వినై = (మన) సకలకర్మములను, విడుత్తు = పోగొట్టి, విణ్ణవరోడు ఒన్ఱ= నిత్యసూరులతో (మనలకు) ఒకటిగా చేర్చుటకు, విరైకిన్ఱార్ = తొందరపడుచున్నాడు, నీ = నీవు, నినైవు ఉడైత్తాయ్ – (ఈ విషయములు) తలచియున్నవాడవై, నిల్ = ఎట్టి భయమును లేక యుండుము.

ఓ మనసా! వేరు గతి లేక ఆశ్రయించినవారు ఎట్టి దోషమును చేసియున్నను, దానిని భగవానుడు గణింపడు. ఇట్టి స్వామి ఇపుడు మన కర్మలను అన్నిటిని సమూలముగా నశింపచేసి, నిత్యసూరుల గోష్ఠిలో మనలను చేర్చుటకు త్వరపడుచున్నాడు. దీనిని నీవు భావించి ఇక బాధను మఱచి యుండుము.

పాశురము చివరలోని 'ఉ' కారము శారియైచ్చొల్ **"గోపాల"** శబ్దమే **"కోవలన్"** అయినది. ఈ పాశురమునుండి 39 వ పాశురమువరకుగల నాల్గు పాశురములు రహస్యత్రయచుళకములోని – చరమ శ్లోకాధికారములోనివి. ఇచటి ఛందస్సు వెణ్బా. ఈ ప్రబంధములో ఇది ఒక్కటి మాత్రమే ఆత్మోపదేశప్రక్రియలో అనుగ్రహింపబడినది.
**తమిళ:–ఇని చరమశ్లోకార్థత్తై సంగ్రహియానిన్టుకొణ్డు తమ్ముడైయ తిరువుళ్లత్తై క్కుఱిత్తు సర్వసులభనాన కణ్ణనరుళిచ్చెయ్‌ద విన్ద రహస్యార్థత్తై నీ మఱవాదేకొళ్–ఎన్గిఱార్. (మఱ్ఱొ) రిత్యాది. మఱ్ఱోర్ – వేఱొరు, పఱ్ఱు నిన్ఱ– అవలంబనమన్ఱిక్కే,**

**అడైన్దార్క్కెల్లామ్ – అవన్ తిరువడికళే సత్యోపాయమెన్ఱు అడైన్ద పేరుకళుక్కెల్లామ్, కుఱై మఱియాద–అన్ద శరణాగతరుదైయ పూర్ణాధికారత్వ–అల్పాధికారత్వాది దోషఙ్గళై యఱియాదవరాన, కోవలనార్ – (జ్ఞానశూన్యమాన పశుక్కళుక్కుమ్, తత్ప్రాయరాన గోపాలర్క్కుమ్ కృపై పణ్ణుమవనాయ్, సర్వసులభనుమాన) కృష్ణన్, ముఱైయుమ్ వినైవిడుత్తు, విణ్ణరోడొన్ఱ – నిత్యసూరికళోడే ఏకీభవిక్కుమ్పడియాక పణ్ణ, శరణాగతరై – ఇతి శేషః. విరైకిన్ఱార్ – త్వరియానిన్ఱార్. మనమే – నెఞ్జమే, నీ (భగవద్విషయత్తిలుమ్, తదనుభవాదిరూపమాన పురుషార్థత్తిలుమ్ త్వరైయుదైయ నీ) నినైవుదైత్తాయ్ నిల్లు – ఇన్ద వర్థత్తై నినైవిలే యుదైయవనాయ్ క్కొణ్డిరు. ఇవ్వర్థమ్ నెఞ్జిల్ పట్టాల్ అదిన్ ఫలమ్ తరువానో, తరమాట్టానో – ఎన్ఱు సందేహప్పడవేణ్డా – ఎన్ఱు కరుత్తు.**

**గాథా** – అన్యం వినాఽఽ శ్రయ ముపేత్య సమాశ్రయత్సు
సర్వేషు దోష మవిచార్య న గోపనాథః ।
కుర్వ న్నఘౌఘశమనం సహ సూరిబృందైః
స్సంయోజనాయ యతతే సుఖ మాస్స్వ చిత్త ॥

**చింతలేని స్థితిని పొందుట**

**37.** ఎల్లా త్తరుమము మెన్నై ఇకழ்న్దిద త్తానికழ்
దెల్లాన్తనదెన వెల్లా ముకన్దరుద న్దపిరాన్
మల్లార్ మదక్కళిఱొత్త వినైత్తిరళ్ మాయ్ప్పనెన్ఱ
శొల్లా వినైయొరుకా ల్శోకియాత్తుణి వుఱ్ఱనమే

ఎల్లా త్తరుమముమ్= (భక్తియోగము మున్నగు) అన్ని ఉపాయములును, ఎన్నై ఇకழ்న్దిద= ( ఆ ఉపాయములను అనుష్ఠింప శక్తిలేని) నన్ను అసహ్యించుకొని చేయివిడిచినను, తాన్ = తాను, (ఈశ్వరుడగు తాను), ఇకழ்దు = (నన్ను ఈసడించుకొని) గెంటివేయకుండ, ఎల్లామ్ = (ఆ ఉపాయముల స్థానమున నిలచి అవి ఇచ్చు ఫలములను ఇవ్వవలసిన బాధ్యత) అంతయు, తనదు ఎన = తనది అని (తలచి), ఉకన్దు = ఆనందించి, ఎల్లామ్ = అన్ని ఫలములను, అరుళ్ తన్ద పిరాన్ = (నాకు) అనుగ్రహించిన భగవానుని, మల్ ఆర్ = బలము నిండిన, మద క్కళిఱు ఒత్త= మదగజమువంటి, వినై తిరళ్ = పాప కూటములను, మాయ్ప్పన్ = నశింపచేయుదును, ఎన్ఱ శొల్లాల్ = అను (చరమశ్లోక) వాక్యముచే, ఇని ఒరు కాల్= ఇక ఏనాడును, శోకియా త్తుణివు = దు:ఖింప నవసరములేని విధముగ ధైర్యమును, ఉఱ్ఱనమ్ = పొందితిమి.



భక్తియోగాది అన్యోపాయములను ఆచరింప శక్తిలేని నన్ను ఆ ఉపాయములు చేయివిడచినవి. నేను చేసిన ప్రపత్తికి సంతోషించిన సర్వేశ్వరుడు తానే ఆయా ఉపాయముల స్థానమున నిలచి, ఫలము నిచ్చుటకు సిద్ధపడెను. ఈ స్వామి చరమశ్లోకములో అన్ని పాపములను నశింపచేయుదునని పల్కిన దానిని గుర్తించి, ఇక ఏ సమయమునకు బాధపడకుండునట్టి ధైర్యమును పొందితిమి.

**"తరుమమ్, ముకమ్, మద"** శబ్దములు సంస్కృతజన్యములు. వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

**తమిళ:–ఇన్ద అధికారత్తిలే చరమశ్లోకత్తుక్కు విస్తారమాక పదశః అర్థ మరుళిచ్చెయ్దు, సుఖబోధార్థమాక వన్ద చరమశ్లోకాంతర్గతమాన పన్నిరణ్డుపదఙ్గళుదైయ వర్థఙ్గళై క్రమమాక స్వానుసంధానురూపమాన వొరుపాట్టాలే ముడివిలే సంగ్రహిక్కిఱార్. (ఎల్లామ్ తరుమ) మిత్యాది. – ఎల్లామ్ తరుమమ్ – సకలధర్మఙ్గళుమ్, ఎన్నై – అదిల్ అధికార మిల్లాద ఎన్నై, ఇకழ்న్దిద – విశ్లేషియానిఱ్క, తానికழ்దే – ప్రధానధర్మమాన తాన్ ఎన్నై విడాతే, ఎల్లామ్ తనదెన – నా నసుష్ఠిక్కవేణ్డియ వన్ద ధర్మఙ్గళెల్లామ్ తనదాక వెణ్ణిక్కొణ్డు అన్ద – భక్త్యుపాయకార్యమాన ఫల మెల్లామ్, ఉవన్దు – సంతుష్య, తన్ద పిరాన్ – కొడుత్తు ఉపకరిక్కుమవనాన కృష్ణనుదైయ (ఇదుక్కు "ఎన్ఱ శొల్లా" లెన్ఱత్తిల్ అన్వయమ్) కల్లార్ – కల్లుకళాలే పూర్ణమాన, మద క్కళిఱు – మదగజత్తుక్కు, ఒక్క – సదృశఙ్గళాన, వినై త్తిరళ్ – పాపసమూహఙ్గళై, మాయ్ప్పన్ – పోక్కడిప్పేన్, ఎన్ఱు శొల్లాల్ – ఇప్పడి శొన్న వార్త్తైయాలే, ఇని యొరుక్కాల్ – ఇతః పర మొరుకాలత్తిలేయుమ్, శోకియా – శోకియాదదాన, తుణివు–దృఢాధ్యవసాయత్తై, ఉఱ్ఱనమ్ – అడైన్దోమ్.**

**శ్రియ:పతి శ్రీ పాదములే ఉపాయోపేయములు**

**38.** వినైత్తిరళ్ మాఱ్ఱియ వేదియర్ తన్దరుళ్ వాశకత్తాల్
అనైత్తు మఱన్దపినాలుమ్ పయను మెన వడైన్దోమ్
మనత్తిలిరున్దు మరున్దముదాకియ మాదవనార్
నినైత్తన్ మఱుత్త లరితాకి నిన్ఱన నీళ్కழ்లే.

ఈ పాశురము, 30వ పాశురము రెండును ఇంచుమించుగా ఒకటియే. దీని వ్యాఖ్యానమును 30 వ శ్లోక వ్యాఖ్యలో చూచుకొనతగును. **"తన్దరుళ్ వాశకమ్"** అనగా కరుణతో చేసిన ఉపదేశము. **"నిన్ఱన వాకియ నీళ్ కழ்ల్ "** అని అన్వయము. వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

**తమిళ:- ఇన్ద పాశురమే తత్వత్రయచుళకత్తిల్ వ్యాఖ్యాతమ్. అదిల్ "తన్దరుళ్ వాశకత్తా లెన్ఱిఝ్గు చరమశ్లోకముమ్, తద్వివరణముమ్ అపేక్షితమ్.**

భగవానుని కరుణాప్రవాహము

39 ఎట్టిలాఱిరణ్డి లొన్ఱి లెఝ్గు మాఱియమ్బువార్
విట్ట వాఱు పఱ్ఱుమాఱు వీడు కణ్డు మేవువార్
శిట్టరాన తేశుయర్న్ద దేశికర్క్కుయర్న్దు మేల్
ఎట్టు మూన్ఱు మూడఱుత్త దెన్దై మాలిరక్కమే

ఎన్దై మాల్ ఇరక్కమ్ = మన ఆశ్రితవ్యాముగ్ధుడగు స్వామియొక్క కరుణ, ఎట్టిల్ = ఎనిమిది అక్షరములనుకల తిరుమంత్రమునందు, ఆఱు ఇరణ్డిల్ = ఆఱుపదములుగా, రెండు భాగములుగానున్న ద్వయములో, ఒన్ఱిల్ = ఒక శ్లోకమైయున్న చరమ శ్లోకమునందు, ఎఝ్గుమ్ ఆఱు ఇయమ్బువార్ = (వీనిలో) అంతట ఉపాయమే (చెప్పబడినదని) ఉపదేశించువారును, విట్ట ఆఱు = (మనకు సాధ్యము కాదని మనచే) విడువబడిన (భక్తియోగము మొదలగు) ఉపాయములను, పఱ్ఱుమ్ ఆఱు= స్వీకరించు ఉపాయమైన ప్రపత్తిని, వీడు కణ్డు = (దాని ఫలమైన) మోక్షమును బాగుగా తెలిసికొని, మేవువార్ = అందు ఆసక్తిని కలవారును, శిట్టరాన = జ్ఞానము, వైరాగ్యము, అనుష్ఠానము మొదలగువానిని కల్గినవారును, తేశు ఉయర్న్ద = తేజస్సును నిండినవారును అగు, దేశికర్క్కు = ఆచార్యుల కొఱకు, ఉయర్న్దు = ఉన్నతమై వృద్ధి చెంది, మేల్ ఎట్టు మూన్ఱుమ్ = పిమ్మటనున్న ఇరువదినాల్గుతత్త్వములై మాఱునట్టి ప్రకృతియొక్క సంబంధమును, ఊడఱుత్తదు = (మనకు) లేకుండ చేసినది.

మన పూర్వాచార్యులు రహస్యములు మూడింటిలో ఉపాయమే ముఖ్యముగా చెప్పబడినదని ఉపదేశించిరి. వారు మనచే చేయసాధ్యముకాదని విడువబడిన భక్తియోగమును, మనము స్వీకరించు ప్రపత్తిని, దాని ఫలమగు మోక్షమును బాగుగా తెలిసినవారు. జ్ఞానానుష్ఠాన వైరాగ్యములు - మొదలగు వానిచే గొప్పతనమును పొంది వెలుగు ఇట్టి ఆచార్యుల కరుణను మనము పొందుటచే భగవానుని కరుణయు మనపై మిక్కిలి వృద్ధి చెంది, సంసారబంధమును సమూలముగా నాశనము చేసినది.

**"ఎన్దై మాల్ ఇరక్కమ్..... నమ్ దేశికర్క్కు ఉయర్న్దు మేల్ ఎట్టు మూన్ఱుమ్ ఊడఱుత్తతు"** అని అన్వయము. **"శిట్టర్, తేశు"** అనునవి **"శిష్ఠ, తేజ"** శ్శబ్దభవములు.



ఛందస్సు ఎఴుశీర్ చ్చందవిరుత్తము. (ఏడు మాత్రాగణములనుకల వృత్తము) విలక్షణమైన నడకనుకల ఇది **"తిరుచ్చందవిరుత్త"** ప్రబంధములోని వృత్తమువంటిది.

**తమిళ:- ఇప్పడి అధికారత్రయత్తాలే రహస్యత్రయఝ్గళుక్కు విశదమాక వరుళిచ్చెయ్దు ఇన్ద రహస్యత్రయఝ్గళుక్కు ముఖ్యతమార్థఝ్గళాన స్వాధికారానురూపోపాయనిష్ఠాదికళిలే పూర్ణజ్ఞాన శక్త్యాదికళైయుడైయరాన అస్మదాచార్యర్కళుక్కు, నామ్ దాసకరాక వానపిన్బు అవర్కళుడైయ ప్రభావత్తాలే నమక్కు సంసారనివృత్త్యాదికళ్ పిఱక్కుమ్బడి ఈశ్వరన్ కృపైపణ్ణినానెన్ఱు సదాచార్యకటాక్షత్తాలే రహస్యార్థమ్ పెఱ్ఱదుక్కు ఫలత్తై క్కాట్టుకిఱార్ (ఎట్టి) విత్యాది. ఎట్టిల్ తిరువష్టాక్షరత్తిల్, ఆఱిరణ్డిల్ - "షట్పదోఽయం ద్విఖండః" ఎన్గిఱపడియే ఆఱు పదమాయ్, ఇరణ్డు ఖణ్డమాన ద్వయత్తిల్, ఒన్ఱిల్ - అద్వితీయమాన ఒరు చరమశ్లోకత్తిల్, ఎఝ్గుమ్ - ఆహత్య విఝ్గ మూన్ఱు రహస్యత్తిలేయుమ్, (ఇన్ద రహస్యఝ్గళై ప్రతిపాదియానిన్ఱ మఱ్ఱ విడఝ్గళిలేయు మెన్ఱుమామ్) ఆఱు - ఉపాయత్తై (అకించనాధికారమాన ప్రపత్తియై-యెన్ఱపడి) ఇయమ్బువార్ - శొల్లానిఱ్కుమవర్కళాన, (ఇదు దేశికర్క్కు విశేషణమ్) ఎట్ట వాఱు - స్వాధికారాననురూపత్వేన త్యక్తఝ్గళాన ఉపాయాన్తరఝ్గళైయుమ్, పఱ్ఱుమాఱు - తఝ్గళుక్కు ఫలసాధనత్వేన స్వీకృతమాన ప్రపత్తిరూపోపాయత్తైయుమ్, వీడు-మోక్షత్తైయుమ్, కణ్డు - నిపుణమాన మతియాల్ ఆలోచిత్తు, మేవువార్ - ఆదరిక్కుమవర్కళాన, శిట్టరాన - శిష్టర్కళాన, తేశుయర్న్దు - తేజస్సాల్ ఉన్నతర్కళాన, తేశికర్క్కు - ఆచార్యర్కళుక్కు, ఉరిన్దు - యోగ్యనాయ్, (శేషభూతనా యెన్ఱపడి) మేల్ - ఇదఱ్కు మేల్, ఎన్దై మాలిరక్కమ్ - ఎనక్కు స్వామియాన వీశ్వరనుడైయ కృపైయానదు, ఎట్టు మూన్ఱుమ్ - ఇరుపత్తునాలు తత్త్వమాకియ ప్రకృతియిన్, ఊడఱుత్తదు - సంబంధత్తైయుమ్ ఛేదిత్తదు. నమ్ముడైయ సర్వానిష్టఝ్గళామ్ పోకుమ్బడి భగవత్సంకల్పముణ్డాయ్ఱ్ఱెన్ఱపడి.**

గాథా - యోగ్యం సాధన మష్టకే మనువరే షట్కే ద్విషట్కే తథా
భూతేఽన్యత్ర చ హానసంగ్రహవతో ధర్మా న్విముక్తిం తథా ।
సంవిద్యాదరిణో హి యే గురువరా స్తద్దాస్యలాభేన న
చ్ఛింద్యా త్త్ర్యష్టకసంగమం కరుణయా స్వామీ శ్రితప్రీతిమాన్ ॥

అమృతరంజనీ వ్యాఖ్య సంపూర్ణము.

వేదాంతదేశికుల శ్రీచరణములే శరణము



శ్రీమతే రామానుజాయ నమః

# అధికారసంగ్రహము - సవ్యాఖ్యానము

## ఉపోద్ఘాతము

మన సంప్రదాయమునందు కాలక్షేపములో ప్రధానగ్రంథమై వెల్లునది రహస్యత్రయసారము. ఇది 32 అధికారములను కల్గినది. మణిప్రవాళ శైలిలో అనుగ్రహింపబడినది. ఈ అధికారముల అర్థమును సంగ్రహించి ఈ ప్రబంధమున తెలుపబడుటచే దీనికీ పేరు వచ్చినదని పెద్దలందురు.

శ్రీ దేశికుల ఇందు పదిమంది ఆఴ్వార్లను, మధురకవులను, ఎనిమిది మంది ఆచార్యులను కీర్తించి, ఆచార్యభక్తియొక్క ఆవశ్యకతను తెలిపి, ప్రత్యేకముగా శ్రీరామానుజులు, ఆళవన్దార్, నాథముని - అను ఆచార్యులు మన సిద్ధాంతమునకు చేసిన ఉపకారమునుగూర్చి పల్కి, పిమ్మట ఒక్కొక్క అధికారములోని అర్థమును సంగ్రహించి అన్దాదిప్రక్రియలో రచించిన పాశురములద్వారా తెలియజేసిరి. తరువాత **శ్రీరంగము-తిరుమల-పెరుమాళ్ కోయిల్** - అను మూడు దివ్యక్షేత్రములను ఒక్కొక్క పాశురములో కీర్తించి, దివ్యప్రబంధములను అనుగ్రహించిన ఆఴ్వార్లలో మొదటివారగు ముదలాఴ్వార్లు చూపిన దీపము గొని, ఈ ప్రబంధము అనుగ్రహింపబడినదిగా తలచి, ఆ ముగ్గురిని విశేషించి పొగడి, భక్తులచే విడుచుటకు వీలుకాని శ్రీరంగనాథుని శ్రీపాదముల గొప్పతనమును ఒక పాశురములో స్తుతించి, ఈ ప్రబంధమునకు అధికారులెవ్వరో తెలుపు ఒక పాశురమును రచించి, చివరగా ఆచార్యుల ఉపకారమును అనుసంధించుచు ప్రబంధమును ముగించిరి.

---ooo---

### దివ్యప్రబంధములవలన అపూర్వార్థములను గ్రహించుట

**1.** పొయ్కైముని పూదత్తార్ పేయాఴ్వార్ తణ్
పొరునల్ వరుఙ్కురుకేశన్ విట్టుశిత్త
న్తుయ్య కులశేకర నమ్పాణనాద
న్తొణ్డరడిప్పొడి మఴిశైవన్ద శోది



వైయమెలా మఱైవిళఙ్గ వాళ్వేలేన్దు
మఙ్గైయర్కోనెన్ఱివర్కళ్ మకిఴ్న్దు పాడుమ్
శెయ్య తమిఴ్మాలై కణాన్దెళియ వోది
త్తెళియాద మఱైనిలఙ్గ డెళికిన్తోమే.

పొయ్కై ముని = పొయ్కై ఆఴ్వార్లు, పూదత్తార్ = పూదత్తాఴ్వార్లు, పేయాఴ్వార్, =పేయాఴ్వార్లు, తణ్ పొరు నల్ వరుమ్ = చల్లని తామ్రపర్ణీనదీతీరమున అవతరించిన, కురుకేశన్ = కురుకాపురికి నాథులగు నమ్మాఴ్వార్లు, విట్టుశిత్తన్ = పెరియాఴ్వార్లు, తుయ్య కులశేకరన్= (భాగవతుల విషయమున) పరిశుద్ధ (మైన మనస్సును కల) కులశేఖరాఴ్వార్లు, నమ్ పాణనాదన్ = మన తిరుప్పాణాఴ్వార్లు, తొణ్డరడిప్పొడి = తొణ్డరడిప్పొడి యాఴ్వార్లు, మఴిశై వన్ద శోది = తిరుమఴిశై అను దివ్యదేశములో అవతరించిన తేజోరూపులగు తిరుమఴిశైయాఴ్వార్లు, వైయమ్ ఎల్లామ్ మఱై విళఙ్గ = లోకమునందు అంతట వేదాంతార్థములు ప్రకాశించునట్లు, వాళ్ వేల్ ఏన్దుమ్ = ఖడ్గమును, వేలాయుధమును దాల్చిన (భగవానునిద్ద మంత్రోపదేశమును పొందిన), మఙ్గైయర్కోన్ = తిరుమఙ్గై యాఴ్వార్లు, ఎన్ఱు ఇవర్ కళ్ = అను ఈ ఆఴ్వార్లు, మకిఴ్న్దు పాడుమ్ = (భగవదనుభవముచే) ఆనందించి పాడిన, శెయ్య తమిఴ్ = ఋజువైన అర్థమునుకల ద్రావిడదివ్య ప్రబంధములను, నామ్ తెళియ ఓది = మనము (అర్థముతో) స్పష్టముగా అధ్యయనముచేసి, తెఱియాద మఱై నిలఙ్గళ్ = చక్కగా తెలియకుండనున్న వేదభాగములను, తెళికిన్తోమ్ = బాగుగా తెలిసికొంటిమి.

పొయ్కైయాఴ్వార్లు, పూదత్తాఴ్వార్లు పేయాఴ్వార్లు, నమ్మాఴ్వార్లు, పెరియాఴ్వార్లు, కులశేఖరాఴ్వార్లు, తిరుప్పాణాఴ్వార్లు, తొణ్డరడిప్పొడియాఴ్వార్లు, తిరుమఴిశైయాఴ్వార్లు, తిరుమఙ్గైయాఴ్వారు-అను పదిమంది భగవానుని పూర్ణముగా దర్శించి, ఆనందించి, ఆ అనుభవపరీవాహరూపముగా అనుగ్రహించిన దివ్యప్రబంధములను మేము అర్థముతోపాటు గురుముఖముగా అధ్యయనము చేసి, ఇంతవరకు తెలియని వేదభాగముల అర్థముల నన్నిటిని బాగుగా తెలిసికొంటిమి.

**"తణ్ పొరునల్ "** అనుచు చల్లని తామ్రపర్ణినిగూర్చి పల్కుటచే, నమ్మాఴ్వార్ల మనస్సు అందఱను ఉజ్జీవింపవలెనను చల్లని భావమును కల్గియుండుట తెలుపబడినది.

**"తుయ్య కులశేకరన్"** అనుటద్వారా **"ఆరజ్మెద"** అను తనియన్ పాశురములో తెలుపబడినట్లు భాగవతులపట్ల వీరికిగల అభినివేశమును పోగొట్టవలెనని వీరి మంత్రులు తలచి, భగవద్భక్తులు రత్నాలహారమును అపహరించిరని పల్కినపుడును, ఆ భక్తులకొఱకు తాము పామున్న కుండలో చేతిని పెట్టి ప్రమాణము చేసిన మనః పరిశుద్ధిని కల్గివారనుట తెలుపబడినది.

**"నమ్ పాణనాదన్"** అనునది తిరుప్పాణాళ్వార్లకు మునివాహనులను పేరు వచ్చునట్లు, తమకు వేదాంతాచార్యులను పేరు వెల్గునట్లును శ్రీరంగనాథుడు అనుగ్రహించిన రీతిని సూచించును.

**"మళిశై వన్ద శోది"** అను ప్రయోగము పెరుమ్‌పులియూరులోని యోగసభకు తిరుమళిశైయాళ్వార్లు వేంచేసినపుడు అచటనున్న బ్రాహ్మణులు వీరి తేజస్సును చూచి భయపడి, పిమ్మట ఉచ్చరింపవలసిన వేదమంత్రములను మఱచిన వృత్తాంతము స్మరింపచేయును. **"వైయ మెల్లామ్......మజ్జైయర్‌కోన్"** అనుటచే ఈ ఆళ్వార్లు ఖడ్గము, వేలాయుధమును దాల్చి భగవానుని పీతాంబర-ఆభరణాదులను అపహరింపబోగా, ఆ సమయములో స్వామి ఉపదేశించిన అష్టాక్షరీమంత్రమువలన వీరు జ్ఞానప్రకాశమును పొంది. సకలలోకములందు వేదార్థములను ప్రకాశింపచేయు ప్రబంధములను అనుగ్రహించుట తెలుపబడినది.

మధురకవులు ఆచార్యభక్తికి మార్గదర్శకులగుటచే వీరు పాడిన కణ్ణినుణ్ శిఱుత్తాంబు పాశురములలోని పది సారార్థములను జోడించి ప్రత్యేకముగా వారి విషయముగా ఒక పాశురమును రచించుచున్నారు.

**ఉత్తమూర్ స్వామి వ్యాఖ్య-**

**"బ్రహ్మవిదాప్నోతి పరమ్", "పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్", "పతిం విశ్వస్యాత్మేశ్వరమ్"** ఇత్యాది వేదవాక్యములలో భగవానుడొక్కడే ప్రాప్యమని, ప్రాపకమనియు, శేషి అనియును చెప్పబడినను శ్రీరామాయణము, శ్రీవిష్ణుపురాణము, పాంచరాత్రము, మిగిలిన ప్రమాణములను వేదసూక్తులతో సమన్వయపఱచి లక్ష్మీవిశిష్టుడైన నారాయణుడే ప్రాప్యము, ప్రాపకమును-అను సిద్ధాంతము పరిగ్రాహ్యము అనుటయును, తన్మూలముగా అర్థోపదేశమును చేయువారే అజ్ఞానమును పోగొట్టగల ఆచార్యులనుటయును సుస్పష్టము. ఆ వాక్యములకు ఆ రీతిలోనే అర్థమును



గ్రహింపవలయుననుటయును చిరకాలముగా సంప్రదాయానుగతముగా వచించినదే. ఇందులకు వీటిని అన్నిటిని సుస్పష్టముగా తెలుపు ద్రావిడవేదమే సాక్షి. వాటి మూలమున లక్ష్మీవిశిష్టుడైన నారాయణుడే ప్రాప్యము, ప్రాపకమనుట సులభముగా తెలియవచ్చును. అందుచే గురుపరంపరాసారమను ఈ ప్రబంధమును మణిప్రవాళశైలిలో రచింప నెంచి, ఆ ద్రావిడవేదసూక్తులనుకూడ ప్రమాణములుగా చూపుదుము. కనుక మన పూర్వాచార్యుల ఉపదేశమునకు ఆధారముగా ఆళ్వార్లను పరాశరాదిమహర్షులకంటె ఆదరింపవలసియున్నది. మన ఆచార్యపరంపరలో ప్రపన్నజనకూటస్థులుగా ప్రసిద్ధులైన నమ్మాళ్వార్లు నాథమునులకు తమ తిరువాయ్‌మొళి మొదలగు గ్రంథములద్వారా ఈ జ్ఞానమును కల్గించుటచే ఈ దివ్యప్రబంధములు, ఈ ఆళ్వార్లును ఇచట మిక్కిలి ఆదరింపబడుట యుక్తము-అని తెలుపుటకొఱకై **"పొయ్‌కై"** ఇత్యాది పాశురము రచింపబడినది. ఈ రీతిలో ప్రకృతపాశురమునకు ఇచట సంగతి ఉన్నది. గురుపరంపరాసారములో గురుపరంపరనుగూర్చియేకదా తెలుపవలెను. అందుచే ఇచట పరాశర వ్యాసాదులప్రసక్తి లేనట్లే, మిగిలిన ఆళ్వార్లనుకూడ విడువలసియున్నను, ఆళ్వార్లను మాత్రము నిర్దేశించుట ఎందులకు! అని అడుగనక్కఱలేదు. వేదములవలె మహర్షి ప్రణీతములగు గ్రంథములును ప్రమాణములనుట సర్వసమ్మతము. దివ్యప్రబంధములు ప్రమాణములుగా మఱి వేఱు ఏ సిద్ధాంతమునందు గ్రహింపబడకపోవుటచే వానిని గ్రహించుట యుక్తమని తెలుపుట ఇచట ప్రథమకర్తవ్యమైనది. తేట అయిన జ్ఞానమును అనుగ్రహించువారు గురువులు అయినపుడు, జ్ఞానోపాయములలో తమిళము ముఖ్యమైనపుడు ఇది తగునుకదా! మఱియు, అనంతరపాశురములో గురుపరంపరాసారమునకు ముఖ్యవిషయమైన ఆచార్యసంబంధమునకు మధురకవులను మార్గదర్శకులుగా తెలుపబోవుచున్నారు. అది ప్రకృతమున చెప్పుట ఆవశ్యకము. దివ్యప్రబంధములకు గల గొప్పతనమును ముందుగానే తెలియజేసినచో, దానిని చెవియొగ్గి విని, అంగీకరింతురని, అందులకు శేషముగా కూడ ఈ పాశురము రచింపబడినది. ఇందువలనకూడ ఇచట ఈ పాశురము రచింపబడినది. ఈ కారణముచేకూడ ఇచట గురుపరంపరాసారములోనికి ఇది చేరును. ఉపోద్ఘాతాధికారములో మాత్రమే చేర్చవలెనను నియమము లేదు. కావున **"గురుభ్యశ్చ తద్గురుభ్య శ్చ..."** అను శ్లోకమునకు పిమ్మట, అనంతరపాశురమునకు ముందుగా ఇది కూర్చబడుట యుక్తము. ఇచటి ఆళ్వార్ల క్రమము వారి అవతారక్రమానుసారము కాదు. ఛందఃసౌకర్యానుసారమే.

**(పొయ్‌కైముని)** సరస్సులో అవతరించుటచే **"సరోముని", "పొయ్‌కై ఆళ్వార్"** అనియే వ్యవహారము.

**(పూదత్తాళ్వార్)–"పూతమ్"** అనునది తిరునామమగుటచే పూతత్తార్ అనబడినది. భూతశబ్దమునకు సత్తను పొందినవారు, బ్రహ్మజ్ఞానము నిండినవారను అర్థ మిచట సంగతము. సామాన్యముగా భూతశబ్దము దేహముతో కూడుకొనియున్న ఆత్మను తెల్పును. **''కడల్వణ్ణన్ పూతఙ్గళ్ మణ్‌మేల్''** అను ప్రయోగమునుబట్టి నిత్యసూరుల విషయమునందును ఈ శబ్దప్రయోగమున్నది. భగవానునితో పూర్వము ఉన్నవారను అర్థమునుకూడ చెప్పవచ్చును. భగవానునికూడ **"తస్యైతస్య మహతో భూతస్య"** అనుచు భూతపదముచే ఉపనిషత్తు నిర్దేశించుచున్నది. ఇట్టి భూతములలో వీరు ఎవరు? అని ప్రశ్నించుటనుబట్టి **''పూదత్తు ఆర్''** అను ప్రశ్నయే **''పూదత్తార్''** అను తిరునామమైనదనియును కొందఱు చెప్పుదురు. **"ఆళ్వాన్"** అను ప్రసిద్ధి అన్యత్ర కలదు కావున **"ఆళ్వార్"** అను బహువచననిర్దేశము చేయబడినది. **(పేయాళ్వార్) "మహాన్"** –అని సంస్కృతమున పేరు. **''పేయ్''** అను పదమునకు పెద్ద–అని అర్థము. **"భూతసరోవేతాళాన్"** అనుచు వేతాళశబ్దముతో శ్రీదేశికులు వీరిని నిర్దేశించుటవలన **"పేయ్"** అను పదము **"పేయ్"** వంటివారను అర్థము నిచ్చుననియు అందురు. **"తిరుక్కణ్డేన్ పొన్‌మేని కణ్డేన్"** అనుచు దర్శించగానే నాట్యము చేసినవారు కావున వీరికీ తిరునామము ఏర్పడినది. **'పూదత్తాళ్వార్"** అను ప్రసిద్ధికి తగునట్లు **"ఆళ్వార్"** అను పదమును పిమ్మట అంతట అన్వయింపనగును. అన్ని ప్రబంధములను నాథమునులకు ఉపదేశించినవారు, సాక్షాత్తు పూర్వాచార్యులను అగు నమ్మాళ్వార్లయందు, వారు అవతరించిన దేశముయొక్క వైభవమునందు ఆసక్తులై ఇక పల్కుచున్నారు.

**(తణ్ పొరునల్ వరుమ్ కురుకేశన్) "తణ్"**–చల్లని **"పొరునల్"** అని, **"పొరునై"** అని తామ్రవర్ణీనది పిలువబడును అచట, **''వరుమ్''** అవతరించిన, **"కురుకేశన్"**–తిరుక్కురుకై అని పిలువబడు. కురుకాపురికి నాథుడు–అని భావము. లేక, **"పొరునల్"** తామ్రపర్ణీనది, **"వరుమ్"** ప్రవహించు అగు కురుకానగరికి స్వామి అగు నమ్మాళ్వార్లు అనియు చెప్పవచ్చును. ఈ ఆళ్వార్లు ప్రపన్నజనసంతానకూటస్థులనెడి మహిమను భావించియే శ్రీభాగవతములో భగవద్భక్తులు అవతరింపబోవు ప్రదేశములనుగూర్చి పల్కునపుడు **"తామ్రపర్ణీ నదీ యత్ర"** అనుచు తామ్రపర్ణీనది ముందుగా నిర్దేశింపబడినది. ఇచట తామ్రపర్ణి స్వచ్ఛమైన, చల్లని తీర్థమును కల్గినదని చెప్పుటచే ఆళ్వార్ల మహిమ సూచింపబడినది.



**(విట్టుశిత్తన్)**–పెరియాళ్వార్లు. చిత్తమునందు అంతట విష్ణువునే కలవారు. వేఱొక విషయమును దేనిని భావింపనివారు. ఆణ్డాళ్ విషయములో వీరికిగల ప్రేమకూడ ఆమె తన కుమార్తె అని కాదు. అయోనిజగా జన్మించి, భగవానునివద్ద ప్రేమాతిశయమును కల కన్యక కావుననే.

**(తుయ్య కులశేకరన్)**–పరిశుద్ధులైన కులశేఖరులు. **"ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే"** అనునట్లు ప్రతిదినము శ్రీరంగయాత్రకు సన్నాహమును చేయుచు, నిత్యకర్మానుష్ఠాన భగవద్భాగవతారాధనలకే అవకాశము చాలకుండపోవుటచే రంగయాత్రను చేయలేకపోయిరి. ఆ ఆచార, ఆరాధనాదుల మూలముగా వీరికి ఏర్పడిన మనశ్శుద్ధిని **"తుయ్య"** అను పదము తెల్పుచున్నది. లేక, **"ఆరమ్ కెడ పరనన్బర్ కొళ్ళారెన్ఱు కుడప్పామ్బిల్ కైయిట్టవన్"** అను రీతిలో శ్రీవైష్ణవుల గోష్ఠిని దరిచేర్చుచున్నారను అసూయవలన వీరి ఆరాధ్యమూర్తియొక్క ఒక అమూల్యహారమును దాచివేసిన వీరి మంత్రులు శ్రీవైష్ణవులే అపహరించిరని పల్కినపుడు, తాము ఆకలిగొన్న పామున్న కుండలో చేయిపెట్టి "శ్రీవైష్ణవులు మంత్రులు పల్కిన రీతిలో కాకుండ మంచివారైనచో ఆకలితో ఉన్న ఈ పాము నన్ను కఱువదుగాక" అనుచు మిక్కిలి ధైర్యముతో ప్రతిజ్ఞ చేసిరి. ఆ పిమ్మట మంత్రులు చేసిన అపరాధమును పరమకృపతో క్షమించిన వారు. ఇంతటి పరిశుద్ధిని ఉద్దేశించియే ఈ విశేషణము ప్రయుక్తము. **"కులశేకరన్"**–చేరకులములో జన్మించి, చేర–చోళ–పాండ్యదేశ ప్రభువులను అందఱిని తమ అధీనములో నుంచుకొనినవారగుటచే క్షత్రియకులమునకు శిరోభూషణమైనవారు. **"ఎఙ్గళ్ కులశేకరన్ ఎన్ఱే కూఱు"** అనునట్లు భాగవతకులమున గొప్పగా వెలుగుటచేకూడ కులశేఖరులు.

**(నమ్ పాణనాదన్)**–ఒక్కచోటనే ప్రయోగించినను, **"నమ్"** అను పదమును ఆళ్వార్ల అందఱివిషయమున అన్వయింపనగును. వ్యాసపరాశరాదులనువలెకాకుండ ఆళ్వార్లఈ సంప్రదాయమునకే చేరినవారనుట దీనిచే సూచింపబడినది. అన్యత్ర అన్వయింపకుండ ఈ పదమును ఇచటనే అన్వయించుటలోకూడ ఒక విశేషము కలదు. తిరుప్పాణాళ్వార్లు అంతిమజాతిలో పెరిగినవారగుటచే ఆలయమునకు, బ్రాహ్మణులకును సమీపములో వర్తింపకుండ, దూరములోనే ఉండి శ్రీరంగనాథుని కీర్తించుచు ఆవలివైపు నివసించుచుండగా, శ్రీరంగనాథుడు వీరిని ఆలయమునకు వచ్చునట్లు నియమించెను. అప్పటికిని ఆళ్వార్లు రాకుండ దూరముగా తొలగిపోయిరి. లోకసారంగమహామునిని అపుడు భగవానుడు ఆజ్ఞాపింపగా, వారు బలాత్కరముగా తమ భుజములపైకి

ఎక్కించుకొని ఆలయము లోపలకు ఆఴ్వార్లను తీసికొని వచ్చిరి, అపుడు తిరుప్పాణ్ అమలనాదిపిరాన్ ప్రబంధమును అనుగ్రహించిరి. కావున ఈ **"నమ్"** అనునది భగవద్రామానుజులు దర్శనములోనున్న మనవలె వర్ణాశ్రమధర్మమును రక్షించుటలో శ్రద్ధను, పట్టుదలను కలవారని తెలుపుచున్నది. లేక, జాతినిబట్టి అపచారపడకుండ, అధికమైన ప్రతిపత్తిని భాగవతులవిషయమున చూపవలెననుటను **"నమ్"** అను పదము తెలుపుచున్నది. అంతియేకాక, **"నమ్"** అనునది దేశికులను ఉద్దేశించియే అనవచ్చును. ఈ ఆఴ్వార్లకు మునివాహనుడను పేరు శ్రీరంగనాథుడు ఇవ్వలేకపోయినను ఆపేరు వారికి వచ్చునంతగా అభిమానించినది నిశ్చయము. అంతటి అభిమానమును తమపట్ల కల్గి ఉండి, తనను సేవించునట్లు, తమ విరోధులను జయింపగల్గునట్లు, తన విషయముగా సూక్తులను అనుగ్రహించునట్లు కృపజేసి, **"వేదాంతాచార్యులను"** తిరునామమును వీరికి ఇచ్చెను. ఆఴ్వార్లలో ఈ ఆఴ్వార్లు, ఆచార్యులలో వీరును శ్రీరంగనాథుని అభిమానమునకు పాత్రమైనవారగుటచే **"నమ్"** అని అనబడినది. **"పాణన్"** అనెడి **"నమ్ నాదన్"** అనియును అన్వయింపవచ్చును. **"పాణనాదన్"** పాణకులములోనివారికి నాథులు-పాణనాథులు. **"ఆది మఱై"** అను పాశురములో **"నమ్ పాణన్"** అనునట్లు మనకు ఇష్టమైన వారగుటచే **"నమ్ పాణనాదన్"** అనియును చెప్పవచ్చును. **పాణన్** అనునది వాద్యవిశేషము. అ విధముగా భాగవతులకు దాసులై నున్నవారిని ఇకపై తెల్పుచున్నారు. **(తొణ్డరడిప్పొడి)-"భక్తాంఘ్రిరేణుః"**-అను సంస్కృత తిరునామమునకును ఇదియే అర్థము. అందఱును తమకంటే మహానుభావులు అను తమ భావము తెలియునట్లు ఈ తిరునామము వీరికి ఇష్టమైనది. భగవద్భక్తులు కానివారిపై ఏవగింపు కలవారుకూడ.

**(మఴిశై వన్ద శోది)- "తిరుమఴిశై"** అను దివ్యదేశము ప్రస్తుత చెన్నైనగరమునకు సమీపములో నున్నది. అచట అవతరించిన జ్యోతి-అని భావము. వీరిని సుదర్శనాంశసంభవులని అందురు. పెరుమ్పులియార్లోని యాగసదస్సులో వీరికి అగ్రపూజను చేయుటను కొందఱు సహింపలేనపుడు వారికి తెలియునట్లు పరంజ్యోతియై ప్రకాశించిరను ఐతిహ్యము ఇచట గుర్తింపతగినది. రాజసూయయాగములో ధర్మపుత్రుడు చేసిన అగ్రపూజను స్వీకరించిన పరంజ్యోతి అగు శ్రీకృష్ణునకుకూడ శిశుపాలాదులకు తన మహిమను తెలుపుటకు ఈ రీతిలో ప్రత్యక్షము కావలయునని తోచలేదు. కావున ఆ శ్రీకృష్ణునికంటె వీరు గొప్పవారు-అని భావము. వీరికి భక్తిసారులని వేఱొక తిరునామము. మహాయోగి కావున అన్ని మతములను పరిశీలించిన విస్తృతజ్ఞానమును



కలవారగుటచేకూడ అజ్ఞానాంధకారమును పోగొట్టు జ్యోతిస్స్వరూపులు. నారాయణపారమ్యముతోనే ప్రబంధమును ప్రారంభించినవారు. అమూల్యమైన అర్థవిశేషమగు శరీరాత్మ భావమును వ్యక్తీకరించినవారు.

**(వైయ మెల్లామ్ మఱై విళఙ్గియ మఙ్గైయర్కోన్)-** తిరుమఙ్గై అను నగరములో జన్మించి, అచటనున్నవారికి అందఱికి స్వామియై వెలిగిన వీరు ఖడ్గమును, ఈటెను గైకొనిన క్షణమునుండి వీరులై, చోళరాజుకు సహాయకులయ్యిరి. పిమ్మట కుముదవల్లి అను అప్సరసకన్యకను వివాహమాడినపుడు శ్రీవైష్ణవారాధనకొఱకు ద్రవ్యములను సేకరించుటకై ఈ ఖడ్గము, ఈటెయే వీరికి సాధనములైనవి. అందుచే శ్రీవైష్ణవమతప్రచారమును, శ్రీవైష్ణవుల అనుగ్రహముచే అంతట వేదార్థములు ప్రకాశించుటకు అనుకూల్యమును ఏర్పడి, కలి నశించుటచే పరకాలకవి అయ్యిరి. బ్రాహ్మణరూపములో పెండ్లికొడుకు అలంకారమున ఊరేగింపుగా వచ్చిన భగవానునివద్ద గల సంపద అంతయు కొల్లగొట్టి, చివరకు ఆ బరువును తాము మోయలేకపోవుటను, స్వామి చేతివేలి ఉంగరమును విడదీయుటకు వీలు కాకపోవుటను చూచి, ఆఴ్వార్లు "ఓ బ్రాహ్మణా! ఏమి మంత్రమును నాపై ప్రయోగించితివి?" అని ప్రశ్నించుచు ఆ ఉంగరమును పళ్ళతో కొఱికి తీయవలెనని ప్రయత్నించినపుడు సర్వరసస్వరూపి అగు సర్వేశ్వరుని తిరుమేని సంబంధము కల్గి, ఆశ్చర్యచకితులై నిలువగా, భగవానుడును" ఇపుడు వీరు మంత్రోపదేశమును పొందుటకు అర్హులు'' అని తలచి, మంత్రోపదేశమును అనుగ్రహించెను. తన హితము కొఱకు సమిత్పాణియై ఆచార్యునివద్ద అణకువతో నిలచుట శిష్యాధికారము. ఇతరులను భయపెట్టుటకై కత్తిని, బల్లెమును దాల్చి నిలచుట వీరికి ఉపదేశమును పొందుటకు తగిన అధికారమైనది. కత్తి, బల్లెమును ప్రతివాదులను జయించుటకు సాధనములైన ప్రమాణము, తర్కము వంటివైనవి. శ్రీవైష్ణవులకు అన్నదానముతోపాటు విద్యాదానమును చేయుటకు దారి ఏర్పడినది. అర్చామూర్తుల వైభవము వీరి వలన మిక్కిలి ప్రకాశించినది. వీరు పలు కోవెలలను పరిష్కరించిరి. తిరుపతి, బదరి మొదలగు ఉత్తరభారతదివ్యదేశములలోని అర్చామూర్తులను కీర్తించి, "పరత్వసౌలభ్యమునుకల ఈ పరమపురుషుడే వేదప్రతిపాద్యుడు. వేదమువలన గ్రహించినదియు భగవద్దాస్యమువలె భాగవతదాస్యమును" అని స్థాపించుటచే ఈ ఆఴ్వార్లవలన వేదములు వెలుగొందినంతగా నమ్మాఴ్వార్లతోపాటు మిగిలిన ఆఴ్వార్లవలన ప్రకాశించలేదని అనవచ్చును. అంతియేకాక, నమ్మాఴ్వార్లు అనుగ్రహించిన వేదము భూమి అంతట వ్యాపించుటకును వీరే కారణభూతులయ్యిరి.

**(ఎణ్ణివర్కళ్)** అనుటకు "అను వీరు" అను అర్థము సర్వసమ్మతము. లేక **"ఎణ్ణు"** అనుటను ప్రత్యేకముగా విడదీసి.." అను రీతిలో తిరునామములను పల్కి" అని వివరింపవచ్చును. అపుడు ఇది **"ఓది"** అను పదముతో అన్వయించును. వీరు ఆనందముతో పాడు ద్రావిడ పాశురమాలికలకు ముందుగా వీరి తిరునామములను అనుసంధించుచు ఈ రీతిలో **"గురుభ్యో నమః"** అనిన పిమ్మట వీరి పాశురములను అనుసంధించి, వాని అర్థములను గ్రహింపవలెనని భావము. వేదములలో గుప్తముగానున్న అర్థములను తెలుపుటకై తదుపబృంహణములగు ఇతిహాసపురాణములు అవతరించినవి. అవి, తమిళవేదములును ప్రాప్యమగు బ్రహ్మము మొదలుగా గల అర్థపంచకమును తెలుపుచున్నవి. ఇతిహాసపురాణములు భగవానునియొక్క, భక్తులయొక్క చరిత్రలు తెలుపునవియే కాని, సాక్షాత్తు భగవదనుభవపరీవాహరూపములు కావు. **"మకిழ்న్దు పాడల్"** అను విశేషణము ద్రవిడ ప్రబంధవిషయముననే అన్వర్థము. **"శోకః శ్లోకత్వ మాగతః"** అనునట్లు శ్రీరామాయణము అవతరించినది శోకరసమువలననే. ఇంతగా వ్రాసిన వాల్మీకిమహర్షి చిత్రకూటములోనున్న శ్రీరాముని సేవించినపుడు ఆ స్వామి మహిమను తెలుపుచు ఒక సర్గ అయినను గొప్ప ఆనందముతో కీర్తించి పల్కెనా? వ్యాసుడును భారతములో భీష్మాదులు శ్రీకృష్ణుని దర్శించి ఆనందముతో పల్కిన రీతిలో తాను శ్రీకృష్ణునిపట్ల అభినివేశమును పొందినట్లు నేరుగా పొగడలేదుకదా! పలు పిట్టకథలలోనున్న వేత్వేరు ప్రసంగములలోని భగవానుని అనుభవము మధ్యమధ్యలో అవరోధింపబడి చెదఱిపోయినది. ఇంతియేకాక, సామాన్యజనులుకూడ తమ జన్మమొదలు నేర్చుకొని, వ్యవహరించు ద్రావిడభాషలో ఈ పాశురములు రచింపబడుట మఱియొక అదృష్టము.

**(తమిழ்మాలైకళ్ శెయ్య)**– ఋజువుగా, నేరుగా అర్థమును ప్రతిపాదించునవియై, సరళములైయున్నవి, చెవుల కింపైన, తీయని పల్కులు అగు తమిళప్రబంధములను అభ్యసించి కూడ లోకులు తడబడుచుచున్నారు అయ్యో! అందుచే వానిని **"తెళియ"** స్పష్టముగా తెలియునట్లు అభ్యసింపవలెను. సంప్రదాయసిద్ధముగా అభ్యసించిననే ఈ స్పష్టత ఏర్పడును. సంస్కృతములో ఆచార్యముఖముగా గ్రహించుటకంటె ఇచట తెలియుట సులభతరము. ఈ సూక్తులు పరిమితములు, సరళములును. ఎక్కువ సందేహములు కల్గుటకు తావు లేనివి.

**(మఱైయిల్ తెళియాద నిలఙ్గళ్)** వేదములలో అర్థము కాని భాగములు అన్నియు. వీని మూలమున తెలిసికొనుట ప్రత్యక్షసిద్ధము. దీనిని కాదనుటకు వీలులేదు. తమిళ భాషను



తెలియనివారు సంస్కృతములో బహుప్రయాసతో కొండఱు పెద్దలమూలమున వాస్తవమును తెలియవలెను. మంచికాలము కావున మనకు ఈ సులభమార్గము ఏర్పడినందులకు మనము ఆనందించి వీరికి నమస్కరించుట యుక్తము. వేదములలో లోకమున కంతటికిని కారణమైన పరబ్రహ్మము ఒకటి కలదు అని తెలిసినను ఆ బ్రహ్మము యొక్క మూర్తి, దానిని ఆరాధించు తీరు, దానిని పొందుటకు ఎవరు యోగ్యులు? ఏమి ఉపాయము? దానిని అనుష్ఠించు రీతి ఏది? మొదలగు విషయములు భగవద్గీతవలన తెలియునంతకూడ వేదములవలన స్పష్టపడుటలేదు. దివ్యప్రబంధములనుండి స్పష్టపడునంతగా గీతవలన తెలియుటలేదని అనవచ్చును. ఇక, ఆழ்వార్లు అన్నచో **"అవర్ తాన్దామ్ అఱిన్ద వారేఱ్ఱి...తొழுవర్ ఉలకళన్ద మూర్త్తియురువే ముదల్"**(14), **"ముదలావార్ మూవరే అమ్మూవరుళ్ళుమ్ ముదలావాన్ మూరినీర్వణ్ణన్, ముదలాయ నల్లానరుళల్లాల్ నామనీర్ వైయకత్తు పల్లారరుళుమ్ పழுదు" (15), "తిరుమకళుమ్ మణ్మకళుమ్ ఆయ్మకళుమ్ శేర్న్దాల్ తిరుమకట్కే తీర్న్దవాఱెన్కొల్? తిరుమకళ్మేల్ పాలోదమ్ శిన్ద పడైనాకణై క్కిడన్ద మాలోదవణ్ణర్ మనమ్" (42) "పణిన్దేన్ పనిమలరాళ్... అఙ్గమ్ వలక్కొణ్డానడి" (4) "పొన్నாழிపాడెన్తరుళ్ నీర్మై తన్దవరుళ్" (58), "తిరుక్కణ్డేన్ పొన్మేని కణ్డేన్" (1), "శార్వు నమక్కెన్ఱుమ్........తేనమరుమ్ పూమేల్ తిరు" (100), "కుఱైకొణ్డు నాన్ముకన్ కుణ్డికైనీర్ పెయ్దు మఱైకొణ్డ మన్దిరత్తాల్ వాழ்త్తి, కఱైకొణ్డ కణ్డత్తాన్ శెన్నివేమేలేఱక్కழுవినాన్ అణ్డత్తాన్ శేవడియై యాఙ్గు" (9) "ఉణర్న్దుణర్న్దుణరిలుమ్ ఇఱైనిలై యుణర్వరిదుయిర్కాళ్", "నన్ఱైన నారణన్ నాన్ముకన్ అరనెన్ను మివరై ఒన్ఱనుమ్ మనత్తు వైత్తుళ్ళినుమ్ ఇరు పశై యఱుత్తు"**, కొడువినైయుడనే **మాళుమ్ ఓర్ కుఱై విల్లై", "మననక మలమఱ క్కழுవి నాళుమ్ నన్దిరువుడైయడికళ్ తమ్ నలఙ్కழల్ వణఙ్గి", "అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్మఙ్గై యుఱైమార్బా....పుకలొన్ఱిల్లా వడియేన్ ఉన్నడిక్కీழ் అమర్న్దు పుకున్దేనే", "శన్మశన్మాన్తరఙ్కాత్తు అడియార్కళై క్కొణ్డుపోయ్ తన్మై పెఱుత్తి త్తన్ తాళిణైక్కీழ் క్కొళ్ళుమప్పన్", "వేఱిమాఱాద పూమేలిరుప్పాళ్ వినై తీర్క్కుమే"** అను మొదలగు పాశురములను అనుగ్రహించుటచే శ్రీమన్నారాణుడే ఉపాయము–ఉపేయమును, శరణాగతి సాధ్యోపాయము, **"ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని వழுవిలా వడిమై శెయ్యవేణ్డుమ్"** అను రీతిలో నిరంతరసకలవిధ సర్వదేశోచిత కైంకర్యమే పరమపురుషార్థము–ఇత్యాది విషయములన్నియు స్పష్టపడుటచే వీనిని తెలిసినవారికి వేదార్థములు ఏ ప్రయాసలేకుండ మనస్సులో స్వచ్ఛముగా స్థిరముగా నిలచునని భావము.

ఈ ఆఴ్వార్ల అవతారకాలవిషయములో మాసము, నక్షత్రము అను రెండే శ్రీదేశికులవంటి పూర్వాచార్యులు నిర్దేశించిరి. ఏ యుగములో, ఏ సంవత్సరములో వీరి అవతారము –ఇత్యాదులు తెలుపబడలేదు. అందుచే తద్విషయమున విచార మనావశ్యకమని తెలియుచున్నది.

**మధురవులు చూపిన సన్మార్గము**

**2. ఇన్బత్తి లిఱైఞ్జదలి లిశైయుమ్ పేఱ్ఱిల్**
**ఇకఴాద పల్లుఱవి విరాక మాఱ్ఱిల్**
**తన్బఱ్ఱిల్ వినై విలక్కిఱ్ఱకవోక్కత్తిల్**
**తత్తువత్తై యుణర్త్తుదలిఱ్ఱన్మై యాక్కిల్**
**అన్బర్క్కే యవతరిక్కు మాయ నిఱ్క**
**వఱు మఱైకడమిఴ్శెయ్దాన్దాకొణ్డు**
**తున్బఱ్ఱ మదురకవి తోన్ఱక్కాట్టుమ్**
**తొల్వఴియే నల్వఴికళ్ తుణివార్కట్కే**

అన్బర్క్కే = భాగవతులను అనుగ్రహించుటకొఱకే, అవతరిక్కుమ్ = ఈ కర్మ భూమిలో అవతరించు, ఆయన్ = గోపాలుడు అగు, శ్రీకృష్ణుడు, నిఱ్క = సులభుడై యుండగా (అతనిని అనాదరించి), ఇన్బత్తిల్ = ఆనందరూపమైన, అనుభవమునందును, ఇఱైఞ్జుదలిల్ = శరణము పొందు విషయమునందును, ఇశైయుమ్ పేఱ్ఱిల్ = మనము అంగీకరించు పురుషార్థమైయుండుటయందును, ఇకఴాద పల్ ఉఱవిల్ = అడ్డుపెట్టని పలు విధములైన సంబంధములందును, ఇరాకమ్ మాఱ్ఱిల్ = అప్రాప్తవిషయములందుగల ఆశను పోగొట్టు విషయమునందును, తన్ పఱ్ఱిల్ = తన విషయమైన ఆశ్రయణమును కల్గించుటయందును, వినై విలక్కిల్= పాపములను (కర్మలను) నశింపచేయుటయందు, తకవు ఓక్కత్తిల్ = కరుణయొక్క అభివృద్ధియందును, తత్తువత్తై ఉణర్త్తుదలిల్ = తత్త్వజ్ఞానమును కల్గించుటయందు, తన్మై ఆక్కిల్ = తన స్వరూపమును అనుగ్రహించుటయందు, అఱు మఱైకళ్ తమిఴ్ శెయ్దార్ = అరుదైన వేదములను తమిళభాషలో (ప్రబంధముగా) అనుగ్రహించిన నమ్మాఴ్వార్ల, తాళే కొణ్డు = శ్రీ పాదములనే (శరణముగా) ఆశ్రయించి, తున్బు అఱ్ఱ = దుఃఖమును తీర్చిన, మదురకవి = మధురకవులు, తోన్ఱ క్కాట్టుమ్ = లోకమున అందఱు తెలియునట్లు వ్యక్తము జేసిన, తొల్ వఴియే = (ఆచార్యులను ఆశ్రయించుట అను) అనాదియైన మార్గమే, తుణివార్కట్కు



= (అల్ప విషయములను ఏవగించుకొను) నిశ్చయ జ్ఞానమును కలవారికి, నల్ వఴికళ్ = గొప్ప మార్గములగును.

భగవానునకు, జీవునకును మధ్య పది విధములైన సంబంధములున్నవి. అవి ఏవి అనగా – 1) ఆనందరూపమైన భగవానుని అనుభవము, 2) అతనిని శరణముగా ఆశ్రయించుట, 3) అతనినే తన స్వరూపమునకు తగిన ఫలముగా పొందుట, 4) అతనితో పలు విధములైన సంబంధమును కల్గియుండుట, 5) తగని విషయములందున్న ఆశ అతనిచే పోగొట్టబడుట, 6) అతని విషయమున ఆశను కల్గియుండుట, 7) పాపములు పోగొట్టబడుట, 8) అతని కరుణకు లక్ష్యమైయుండుట, 9) అతనిచే జ్ఞానము పొందింపబడుట, 10) అతనితో సారూప్యమును పొందుట – అనునవి. మధురకవులు తాము జీవించు సమయమున శ్రీ కృష్ణుడు ఈ లోకములో జీవించియున్నను అతనియందు అభినివేశము లేక, ఆఴ్వార్లనే ఆశ్రయించి, ఈ పది విధములైన సంబంధములను ఆఴ్వార్ల విషయముననే కల్గినవారై, **"కణ్ణినుణ్ శిఱుత్తాంబు"** అను ప్రబంధమును అనుగ్రహించిరి. ఇట్లు మధురకవులు చూపిన ఆచార్య సమాశ్రయణ రూపమార్గమే అల్పసుఖములను ఏవగించుకొను ధైర్యమునుకల ఆస్తికులకు గొప్పదైన ఉపాయము.

శ్రీ మధురకవులు ఆఴ్వార్ల పాదసన్నిధికి చేరునపుడు శ్రీకృష్ణుడు ఈ భూమండలముననే యుండెను. దీనిని తెలిసినను మధురకవులు భగవానుని ఆశ్రయింపక, ఆఴ్వార్లనే గొప్ప ఉపాయముగా ఆశ్రయించుటచే **"ఆయన్ నిఱ్క"** అని చెప్పబడినది. భగవద్రామానుజులకు పిమ్మట సంప్రదాయము కించిత్తు భేదించుటచే వారికి ముందు అందఱికి సమానమైయున్న ఆచార్యపరంపరను పిమ్మటి పాశురముతో అనుసంధించుచున్నారు. ప్రకృత వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము.

**ఉత్తమూర్:–** మన గురుపరంలో కూటస్థులుగా కీర్తింపబడువారు నమ్మాఴ్వార్లు. వీరు ఆఴ్వార్లను అందఱిని తమకు అవయవభూతులుగా కల్గినవారు. కావున వారిని అనుసంధించునపుడు మిగిలిన ఆఴ్వార్ల అనుసంధానముకూడ అంతర్భవించుననుటను తెలుపుటకై ముందు పాశురము రచింపబడినది. పెరియాఴ్వార్లను నిర్దేశించినపుడు గోదాదేవిని, నమ్మాఴ్వార్లను కీర్తించునపుడు మధురకవులను చెప్పినట్లే భావింపవలెను. ఆఴ్వార్లలో ఆచార్యనిష్ఠులైన వీరిరువురును అంతర్భవించిరి–అను భావనతో శబ్దతః వారు నిర్దేశింపబడలేదు. ఆచార్యపురస్కారము ఆవశ్యకమనుట ఆణ్డాళ్ పాశురమువలనకూడ వ్యక్తము. **"విల్లిపుదువై విట్టుశిత్తర్తఙ్గళ్ తేవరై వల్ల పరిశు**

**వరువిప్పరేల్ అదు కాణ్డుమే!"** (103) అని పల్కిరికదా! ఇంతకంటె సుస్పష్టముగా శ్రీమధురకవుల పాశురమును ప్రమాణముగా చూపుచున్నారు. దీనిచే పూర్వము తెల్పిన రీతిలో ఆళ్వార్ల శ్రీసూక్తులు మనకు పలు అంశములను తెలియుటకు సాధనములగుచుండుటయేకాక ఆచార్యసంబంధముకొఱకే అవతరించిన ఒక ప్రబంధమున్నదని తెలిపినట్లయినది. **"శెయ్య తమిళ్మాలైకళాల్ తెళివాక"** అను రీతిలో ఋజువైన తమిళపాశురమాలికలద్వారా సుస్పష్టముగా ఆళ్వార్లు అన్ని అర్థములను వివరించుటచే ఆచార్యాశ్రయణము లేకుండగనే అనాయాసముగా బుద్ధిమంతులందఱిచే తెలియునగుటచే ఎందులకు ఆచార్యసంబంధము? అను ప్రశ్నకు సమాధానరూపముగాకూడా ఈ పాశురమున్నది. శ్రీసూక్తులద్వారా తెలుపు ఆళ్వార్లే భగవానుని సంబంధమును విడచి ఆచార్యసంబంధమును ముఖ్యముగా గ్రహించుటచే వారి దృష్టిలోకూడ అది ఆవశ్యకమని తెలిసినది. ఆ ఆచార్యసంబంధమునుకూడ పలు రీతులలో ఆచార్యుని భగవానునివలె గ్రహించుటచేనని తాత్పర్యము. **"యథాదేవే తథా గురౌ దేవ మివాచార్య ముపాసీత"** అను సూక్తి దేవునివలె ఆచార్యుని భక్తితో ఉపాసింపవలెననుచున్నది. భగవానునకు, ఆచార్యునకును పలు రీతులలో సామ్యమున్నది. **"అజ్ఞానధ్వాంతరోధాత్"** అను న్యాసవింసతి శ్లోకము మొదలగువానిని ఇచట అనుసంధింపనగును. ఇచట మధురకవియాళ్వార్లు ఒక విధముగా పది రీతులలో సామ్యమును చూపిన రీతిని దేశికులు తెలుపుచున్నారు. భగవత్సంబంధమును పొందుటకుముందు ఆచార్యసంబంధమును పొందవలెననుట మధురకవియాళ్వార్ల అనుష్ఠానమువలన స్పష్టపడుననుటనుకూడ సూచించుచున్నారు–**"ఇన్బత్తిల్"** అను ఈ పాశురముద్వారా.

పదకొండుపాశురములనుకల కణ్ణినుణ్శిఱుత్తామ్బులో మొదటి పది పాశురములలో పది విధములైన సంబంధములు తమకు, ఆచార్యునకు మధ్య కలదనుటను తెలుపుచున్నారు. జీవునకు భగవానుని విషయమునగల అంశములను మొదట అయిదు పాశురములలో, జీవుని విషయములో భగవానుని కృత్యములను తరువాతి అయిదు పాశురములలో–ఈ పది సంబంధములను భగవానుని వద్దకాక, ఆచార్యునివద్దనే మధురకవులు గ్రహించిరి.

**(ఇన్బమ్)** ఇచటకూడ సుఖపడుట. **(ఇఱైఞ్జుదల్)**– సాధనముగా గ్రహించుట. **(ఇశైయుమ్ పేఱు)**–ఇష్టమైన పురుషార్థము. **(ఇకళ్వాద పల్ ఉఱవు)** నశింపజేయుటకు వీలుకాని



పలువిధములైన సంబంధములు. **(ఇరాకమ్ మాఱుదల్)** అన్యవిషయములలో సంగమును విడచి, తగిన విషయములో గ్రహించుట. ఇవి జీవునకు–అనగా శిష్యునకు ఆవశ్యకములు. ఇక, భగవానుడును, ఆచార్యుడును చేయునవి ఏవి అనగా, **(తన్ పఱ్ఱి)** తానుగానే జీవుని ప్రేమతో చేరుట. **(వినై విలక్కు)** పాపములను పోగొట్టుట, **(తకవోక్కమ్)** దయాప్రవాహము, **(తత్తువత్తై యుణర్త్తువదు)** జ్ఞానోత్పాదనము, **(తన్మైయాక్కై)** తనకు సమానునిగా చేయుట–అను ఈ అయిదును. ఇట్లు ఈ పది అంశములను పొందించుటకు యోగ్యులగు. **(అన్బర్క్కే)** భక్తులను అనుగ్రహించుటకు, **(అవతరిక్కుమ్ ఆయన్)** అవతరించు గోపాలుడు.

**(నిఱ్క)** అతడు తొలగిపోలేదు. అతని సంబంధములే ఇవి. వీనిని గ్రహించుటకు అతడు సిద్ధమైయున్నాడు. కాదనుటకు వీలుకాదు. అట్లున్నను అతనివద్ద వానిని గ్రహింపకుండ నమ్మాళ్వార్ల విషయములోనే మధురకవులు గ్రహించిరి. నమ్మాళ్వార్లు ఈ సంబంధములను అన్నిటిని గోపాలుని విషయములో గ్రహింపగా, వీరు ఆళ్వార్లపట్ల గ్రహించిరి. ఏ విధముగా అనినచో **1. "పలపల కణ్డుణ్డు కేట్టుఱ్ఱు మోన్దిన్బమ్ పలపలవే ఞానముమ్ పామ్బణై మేలాఱ్కేయో"** అని నమ్మాళ్వార్లు అనిరి (2–5–6). **"తెన్ కురుకూర్ నమ్బి యెన్ఱక్కాల్ అణ్ణిక్కుమ్ అముదూఱుమ్ ఎన్నావుక్కే"** అనిరి మధురకవులు. ఇది **"ఇన్బమ్"**. 2. ఆళ్వార్లు ఆశ్రయించినది శ్రీవేంకటేశ్వరుని. **"తిరువేఙ్గడత్తానే పుకలొన్రిల్లా వడియేన్ ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుకున్దేనే"** అని అనిరి. మధురకవులు **"మేవినేన్ అవన్ పొన్నడి మెయ్మ్మైయే"** అనిరి. 3. ఇక **"ఇశైయుమ్ పేఱు" –ఒళివిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని వళువిలా వడిమై శెయ్య వేణ్డుమ్"** అని నమ్మాళ్వార్లు అనుగ్రహింపగా, మధురకవులు **"కురుకూర్నమ్బిక్కాళ్ ఉరియనాయ్"** అని పల్కిరి.

**4. "ఉఱవు"– "నమ్మక్కళుమ్ మేలాత్తాయ్ తన్దైయుమ్ అవరే యినియావారే"** (5–1–8) అని నమ్మాళ్వార్లు నుడువగా, **"అన్నైయాయ్ అత్తనాయ్ ఎన్నైయాణ్డిడుమ్ తన్మైయాన్"** అని మధురకవులనిరి. 5. **ఇరాకమ్ మాఱుదల్–"మున్న మాయఙ్గళెల్లామ్ ముళువేరఱిన్దు....ఎన్నై ఉన్ శిన్నముమ్ తిరుమూర్త్తియుమ్"** అని నమ్మాళ్వార్లు పలుకగా, **"నమ్బినేన్ మడవారైయుమ్ మున్నెల్లామ్ నమ్బికన్నునాయ్"** అని మధురకవులు పల్కిరి. **6. తన్పఱ్ఱి–ఎన్నై త్తన్నాక్కి ఎన్నాల్ తన్నై ఇన్దతమిళ్ పాడియ వీశనై"** అని నమ్మాళ్వార్లు కృపజేయగా, **"తన్ పుకళేత్త వరుళినాన్"** అనుచు మధురకవులనిరి 7. **"వినైవిలక్కు"– "శెయ్యార్వినైకళ్ తీర్మరున్దే" "వేరిమాఱాద పూమేలిరుప్పాళ్ వినై తీర్క్కుమే"** అని

నమ్మాళ్వార్లు సాయించగా, **"పణ్డై వల్ వినై పాఱ్ఱి యరుళినాన్"** అని మధురకవులు అనుగ్రహించిరి. **8. "తకవు"– "అళియాన్ అరుళ్తరువానమైకిన్ఱాన్"** అని నమ్మాళ్వార్లు భగవత్కృపను గూర్చి పలుకగా, మధురకవులు **"ఆయిర మిన్దమిళ్ పాడినాన్ అరుళ్కణ్డీర్ ఇవ్వులకినిల్ మిక్కదే"** అనిరి. 9. **"తత్తువ ముణర్త్తల్" –"మయర్వఱ మదినల మరుళినన్ యవనవన్"** అని నమ్మాళ్వార్లు అనగా, **"వేదత్తినుట్పొరుళ్ నిఱ్క ప్పాడి"** అని మధురకవులనిరి. **10. "తన్మైయాక్కుదల్"–"తన్మై పెఱుత్తి మేవుమ్ తన్మై యాక్కినాన్"** అని నమ్మాళ్వార్లు కృపజేయుగా, మధురకవులు **''తిరుత్తి ప్పణి కొళ్వాన్......కురుకూర్నమ్బి"** అని నుడివిరి.

**''ఆయన్ నిఱ్క''** అనునది **''తాళే కొణ్డు''** అనుచోట అన్వయించును. గోపాలుడున్నను అతని శ్రీపాదములను విడచి, ఆళ్వార్ల శ్రీపాదములనే ఆశ్రయించిరి–అని అర్థము. అయినచో, దేవతాంతరమువలె తలచి గోపాలుని విడచిరని అర్థము కాదు. అందుకొఱకే **"నిఱ్క"** అనుటకు **"నిఱ్క"–"నిఱ్పిక్కాక"** ఆ స్థిరమైన ఆచార్యసంబంధము పోదు. వానిని పొందుట ఆచార్యసంబంధమునకు పిమ్మటనే–అని భావము. **"నిఱ్క"** అనుటను **"తమిళ్ శెయ్దాన్"** అనుచోటకూడ అన్వయింపవచ్చును. ఆళ్వార్లు వేదములను ద్రావిడభాషలో చేయుటచేతనే గోపాలునకు ఆ పది సంబంధములును నిలచినవి. గోపాలుడు స్థిరముగానుండవలెననియే కదా వీరు ద్రావిడమున రచించిరి. ముందు నిలువలేకపోవుట ఎందులకనగా ఆ వేదముల అర్థము అరుదైనవి అగుటచే వాని అర్థములను గ్రహించుటకు వీలుకాకపోయెను. కావున, సులభమైన సంస్కృతమగు గీతలోను పాడిన కృష్ణునిచేకూడ అవి నిలువలేదు అని అర్థము. **"మాయన్ పెరుమాన్"** అని అనకుండ **"ఆయన్"** అనుటచే మధురకవులు అవతరించిన కాలమున ఉత్తరమధురలో గోపాలుడు ఉండెనని, అయినను ఉత్తరదేశయాత్రకై వెడలిన మధురకవులు ముందుగా వెడలి, అతని శ్రీపాదములను ఆశ్రయించుటకు ఇష్టపడక, తిరిగి వచ్చిరి అని ఇచట స్ఫురించును. దీనివలన ఆళ్వార్ల కాలమును తెలిసికొనుటకు వీలయినది. ఇక **"నిఱ్క ప్పాడి ఎన్నెఞ్జుళ్ తిరుత్తినాన్"** అనునపుడువలె **"వృణీమహే చ తత్రాద్యౌ"** అనుటకు శేషము. ఆచార్య సంబంధమనుట తోచునట్లు **"అన్బర్క్కే అవతరిక్కుమ్ ఆయన్ నిఱ్క"** అనుటకు – మనస్సులో నిలుచునట్లు తమిళవేదమును అనుగ్రహించివారగు ఆళ్వార్ల–అని భావము.

**(తమిళ్ శెయ్దాన్ తాళే కొణ్డు తున్బఱ్ఱ)**– ఆచార్యమూలమున ఉపదేశము పొందునంతవరకు దుఃఖము కొనసాగినది. శత్రుఘ్నుడు భాగవతుడగు భరతుని



ఆశ్రయించి అనఘుడైనట్లే, కృష్ణుని విడచి ఆళ్వార్లను ఆశ్రయించుటచే మధురకవులు అనఘులయ్యిరి–అనియును భావము. ఈ భావమున **''తున్బ''** అనగా అఘము–పాపము. **(ఇప్పడి తోన్ఱ)**–అందఱు తెలియునట్లు, **(మదురకవి తోన్ఱ కాట్టుమ్)** మధురకవులచే చూపబడిన. **(తొల్ వళియే)** శ్రుతిస్మృతిసమ్మతమై, ప్రాచీనమైన ఆచార్యసంబంధమను మార్గముననే, **(తుణివార్కట్కు)** శాస్త్రవిశ్వాసమును కలవారికి. **(నల్ వళికళ్)**– గొప్ప మోక్షమార్గములు. **"తొల్ వళి"** అగు ఆచార్యసంబంధము కారణము. దాని ఫలము భక్తి, ప్రపత్తి అను ఉపాయప్రాప్తి. "అన్నమే, ప్రాణమే" అనునపుడువలె ఇచట కారణకార్యములను ఒకటి చేసి చెప్పిరి–అని భావము. అట్లే, **"అవ్వళియే వన్దాన్"** అనునపుడువలె **"తొల్ వళియే"**–అనగా ప్రాచీనమార్గములోనే, **"నల్వళి"** – నూతనమార్గమును అగును అనియును అర్థము చెప్పవచ్చును. పూర్వము తెల్పిన అర్థమును గొని, **"తొల్వళియే నల్వళికళ్"**–ఆచార్యసంబంధము నొక్కదానిని కల్గి ఉన్నచో చాలును, ఆ పైనగల మార్గములేమియు ఇతడు అనుసరింపనక్కఱ లేదు, అన్నియు ఆచార్యనిష్ఠవలన సిద్ధించును–అను అర్థము **"సిద్ధి ర్భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్"** అనెడి శ్లోకప్రమాణము చూపి, సారప్రకాశికలో వ్యాఖ్యానింపబడినది. **"ఇన్బత్తిల్"** అను ఈ పాశురమునకు మేము **"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"** ప్రబంధవ్యాఖ్యలో (ప్రబంధరక్షలో) తెలిపిన వివరమును, ముండకోపనిషత్తు మొదలగు మూలప్రమాణములతో గ్రహింపవలెను.

## ఆచార్యపరంపరానుసంధానము

**3.** **ఎన్నుయిర్ తన్దళిత్తవరై చ్చరణమ్ పుక్క**
**యానడైవే యవర్కురుక్కణిరై వణఙ్గి**
**పిన్నరుళా ల్పెరుమ్బూదూర్వన్ద వళ్లల్**
**పెరియనమ్బి యాళవన్దార్ మణక్కాల్నమ్బి**
**నన్నెఱియై యవర్క్కురైత్త వుయ్యక్కొణ్డార్**
**నాదముని శడకోపన్ శేనైనాదన్**
**ఇన్నముదత్తిరుమకళెన్ఱివరై మున్నిట్టు**
**ఎమ్బెరుమాన్ ఱిరువడికళడైకిన్ఱేనే**

ఎన్ ఉయిర్ తన్దు = నా జీవాత్మను (భగవానునకు శేషమను జ్ఞానమును) అనుగ్రహించి, సత్తను కల్గినదానినిగాచేసి, అళిత్తవరై = ఉజ్జీవింపచేసిన ఆచార్యులను, యాన్ శరణమ్ పుక్కు = దాసుడనగునేను శరణుపొంది, అవర్ కురుక్కళ్ నిరై = వారి ఆచార్యుల

పరంపరను, అడైవే వణఙ్గి = క్రమముగా నమస్కరించి, పిన్ = పిమ్మట, అరుళాల్= (లోకము ఉజ్జీవింపవలెనను) కరుణతో, పెరుమ్బూదూర్ వన్ద వళ్ళల్ = శ్రీ పెరుమ్బూదూరులో అవతరించినవారు (లోకమునకు భగవానుని చూపినవారగుటచే) గొప్ప ఉదారులగు శ్రీభాష్యకారులు, పెరియనమ్బి = పెరియనమ్బి అను మహాపూర్ణులు, ఆళవన్దార్ = భగవద్యామునులు, మణక్కాల్‌నమ్బి = శ్రీరామ మిశ్రులు, అవర్క్కు = ఆ మణక్కాల్ నమ్బికి, నల్ నెఱియై ఉరైత్త = గొప్ప ఉపాయమగు ప్రపత్తిని ఉపదేశించిన, ఉయ్యక్కొణ్డార్ = శ్రీ పుండరీకాక్షులు, నాదముని = శ్రీమన్నాథమునులు, శడకోపన్ = శఠకోపులు, శేనైనాదన్ = శ్రీ విష్వక్సేనులు, ఇన్ అముద త్తిరు మకళ్ = తీయని అమృతమువంటి లక్ష్మియు, ఎన్ఱు ఇవరై = అను ఈ ఆచార్యులను, ముందుగా = నమస్కరించి, ఎమ్బెరుమాన్ తిరువడికళ్ = భగవానుని శ్రీ పాదములను, అడైకిన్ఱేన్ = ఆశ్రయించుచున్నాను.

నాకు సదుపదేశములను చేసి, నా ఆత్మను పరమపురుషునకు శేషమని చూపిన నా ఆచార్యులను, వారికి ఆచార్యులు, వారికి ఆచార్యులు – అను పరంపరలో శ్రీ భాష్యకారులవరకుగల ఆచార్యుల పరంపరను కొలిచి, పిమ్మట భగవద్రామానుజులు, పెరియనమ్బి, ఆళవన్దార్, మణక్కాల్‌నమ్బి, ఉయ్యక్కొణ్డార్, నాథముని, నమ్మాళ్వార్, విష్వక్సేనులు, లక్ష్మీదేవి – అను వీరిని పురస్కరించుకొని అందఱికిని పరమాచార్యుడగు శ్రీమన్నారాయణుని శ్రీపాదములను శరణుపొందుచున్నాను.

ఇట్లు ఒక గోష్ఠిగా ఆచార్యులను అందఱిని సేవించి, ఈ ఆచార్యపరంపరలో ఉపకారాతిశయముచే మిక్కిలి ప్రధానులైయున్న భగవద్రామానుజులు, ఆళవన్దార్, నాథమునులు – అను ముగ్గురను ఒక్కొక్క పాశురములో ప్రత్యేకముగా కీర్తించుచున్నారు. **ఉత్తమూర్:–** ఇది మనము అనుసంధింపవలసిన గురుపరంపర. ఈ క్రమములో అనుసంధింపవలసియున్నది–అని రెండును స్పష్టముగా ఈ పాశురములో తెలుపుచున్నారు. భగవద్రామానుజులకు పిమ్మట అవతరించిన ఆచార్యుల విస్తృతి వలదనుచు మనము క్రిందికి విడువకుండ పోయినను అనుసంధించువారు ప్రత్యేక ప్రత్యేకముగా వీరిని అనుసంధింపవలెను అని మొదటిపాదముతోను, నమ్మాళ్వార్లకు ముందుగానున్న ముగ్గురి క్రమమును చివరిపాదముతోను స్పష్టము చేయుచున్నారు.

**(యాన్)** నేను, **(ఎన్ ఉయిర్ తన్దు)** నా ఆత్మకు ఉపదేశించి, జీవాత్మస్వరూపముతోపాటు పరమాత్మ స్వరూపమును ఉపదేశించి, **(అళిత్తవరై)**– రక్షించినవారిని. నాకు సత్తను కల్గించిన సాక్షాదాచార్యుని, **(శరణమ్ పుక్కు)** శరణముగా ఆశ్రయించి, **"పుక్కు యాన్"** అను శబ్దసన్నిధిచేత **"యవ్వరిల్ ఇయ్యామ్"** అను సూత్రమును బట్టి యకారముండుటచే ఉకారము ఇకారమైనది. **(అవల్ కురుక్కళ్ నిరై)** –వారియొక్క సాక్షాత్‌పరంపరాచార్యపంక్తిని, **(అడైవే)** క్రమముగా ప్రత్యేకముగా నిర్దేశించిన, ఉత్తరోత్తరము గల ఆచార్యులలో, **(అరుళాల్)** కృపతో, **(పెరుమ్బూదూర్ వన్ద)** శ్రీపెరుమ్బూదూరులో అవతరించిన, **(వళ్ళల్)** దర్శనప్రవర్తకులై, పరమోదారులగు భగవద్రామానుజులు. ఇకమీద ప్రారంభమగు నామములకు. **"ఎన్ఱివరై"** అను దానితో అన్వయము. **(పెరియనమ్బి)** మహాపూర్ణులు, **(ఆళవన్దార్)** –శ్రీయామునమునులు, **(మణక్కాల్ నమ్బి)**– శ్రీరామమిశ్రులు, **(నల్ నెఱియై)** వేదాంతోక్తమైన సన్మార్గమున, **(అవర్క్కు ఉరైత్త)**–మణక్కాల్‌నమ్బికి ఉపదేశించిన, **(ఉయ్యక్కొణ్డార్)** శ్రీపుండరీకాక్షులు, **(నాదముని)** శ్రీనాథమునులు, **(శడకోపన్)** నమ్మాళ్వార్లు, **(శేనైనాదన్)** –విష్వక్సేనులు, **(ఇన్ అముదమ్)** భగవానునకే భోగ్యమైయుండుటచే అమృతముకంటె తీయని అమృతమగు, **(తిరుమకళ్)**–లక్ష్మీదేవి, **(ఎన్ఱివరై)** అను తిరునామమునుకల ఈ ఆచార్యులను, **(మున్నిట్టు)**– మొదటగా అనుసంధించి, నమస్కరించి, భగవానుని శ్రీపాదములను, **(అడైకిన్ఱేన్)** మంత్రాద్యనుసంధానార్థము ఆశ్రయించుచున్నాను. **"ఆచార్యాణా మసా వసా విత్యాభగవతః"** అను విధివాక్యములోను, ఉపనిషత్తులలో పలు గురుపరంపరల అనుసంధానము కన్పించు సందర్భములలో, **"అస్మద్దేశిక మస్మదీయ"** అను మొదలగు పలు సూక్తులలోను పైన గల ఆచార్యులను వీడి తన ఆచార్యుని ముందుగా అనుసంధింపవలెనని తెలుపబడినది. వీరే తనకు అజ్ఞానమును సాక్షాత్తుగా పోగొట్టుటచేతను, వీరిని ఆశ్రయించుటచేతనే తమకు గురుపరంపరలో స్థానము కల్గినది–అని తెలుపుటకొఱకు **"ఎన్నుయిర్ తన్దళిత్తవరై"** అనుచు నుడివిరి. తన ఆచార్యులకును, భగవద్రామానుజులను మధ్యనున్న ప్రాచార్యులను, ఆచార్యులకును, భగవద్రామానుజులకును మధ్య అనుసంధింపవలెననుటను **"అడైవే"** ఇత్యాదిగా తెలుపుచున్నారు. **"పిన్"** అనుటచే పూర్వము ఈ అధికారములో శ్రీరామానుజులవరకు గల గురుపరంపరను పల్కి నిలుపుటచే అధ్యయనాది కాలములలో శ్రీరామానుజులను మొదలుకొని అనుసంధించినచో చాలునని తలపరాదు అని తెలుపబడినట్లయినది. తరువాత గల **"నన్నెఱియై అవర్క్కురైత్త"** అను ప్రయోగమును ఒక్కొక్క ఆచార్యులకును సాధ్యమైనంతవరకు అన్వయించుట సరసము. **(నమ్బి)**– పూర్ణులు. **(పెరియనమ్బి)** ఆళవన్దార్‌ను ఆశ్రయించిన అందరు నమ్బిపదవాచ్యులే. వాదములో గెలిచినపుడు

**“ఆళవన్దార్”** (రక్షింప వచ్చిరి) అని రాణి పలుకగా, అర్ధరాజ్యమును పొందినవారగుటచే **“ఆళవన్దార్”** అని పిలువబడిరి. **“మణక్కాల్”** లో అవతరించుటచే మణక్కాల్ నమ్బి. **ఉయ్యక్కొణ్డార్**–ఆచారపత్నిని పుట్టింటికి తీసికొనిపోయినపుడు అచట పెట్టిన పర్యుషితాన్నమునుకూడ భోగ్యముగా స్వీకరించుటచే **ఉయ్యక్కొణ్డార్** అని ఆచార్యులచే ప్రశంసింపబడుటచే వీరికీ తిరునామము కల్గినది. **(నాదముని)** రంగనాథులను తిరునామమును విడచి **“నాథ”** అని మాత్రమే అనుట అర్థపుష్టికొఱకు. **(శడకోపన్)** ఈ నామమునకు అవతరించినపుడు శఠవాయువును గెలిచినవారు–అను అర్థమును చెప్పుదురు. పూర్వాచార్యగ్రంథములలో శఠులను కోపించి, వారిని జయించినవారను అర్థమే తెలుపబడినది. **(ఇన్ అముదమ్)**–జీవులను భగవానుడు ఉపేక్షించునపుడు తాను రక్షింప సమకట్టి, పురుషకారమును చేయునపుడును, భగవానునకు పరమభోగ్యముగా అమృతమువలెనుండి, అతని సత్తకు హేతువైయుండుటయేగాక, మన గురుపరంపరలోకూడ నిలచి, దానికి గొప్పతనమును కల్గించినది ఈమె–అని భావము. **(మున్నిట్టు)** అనునంతవరకు ఈ పరంపరకు అసాధారణులగు ఆచార్యులను అనుసంధించి, సర్వపరంపరాచార్యుడు మనకుకూడ పరమాచార్యుడని తెలుపుటకై **“ఎమ్బెరుమాన్”** అని అనబడినది. **“అస్మద్దేశిక”** మనెడి శ్లోకములో ఈ ఆచార్యుల సంస్కృతనామములను గమనింపవచ్చును.

**భగవద్రామానుజుల సూక్తుల వైభవము**

4. **ఆరణనూల్వఴిచ్చెవ్వై యఴిత్తిడు మైదుకర్క్కోర్**
**వారణమా యవర్ వాదక్కదలికణ్ మాయ్త్తపిరాన్**
**ఏరణి కీర్త్తి యిరామానుశముని యిన్నురైశేర్**
**శీరణి శిన్దైయినో ఞ్జిన్దియో మిని త్తీవినైయే**

ఆరణ నూల్ వఴి = వేదశాస్త్రరూపమైన మార్గముయొక్క, శెవ్వై = ఋజుత్వమును, అఴిత్తిడుమ్ = పాడుచేయునట్టి, ఐదుకర్క్కు = హేతువాదమును చేయువారికి, ఓర్ వారణమ్ ఆయ్ = సాటిలేని గజమై వచ్చి (**“ఇరామానుశమదవేఴమ్”** అని భగవద్రామానుజులు మదగజముగా కీర్తింపబడిరి కదా), అవర్ వాద క్కదలికళ్ = వారి వాదములనెడి అరటి చెట్లను, మాయ్త్తపిరాన్ = ధ్వంసముచేసిన ఉపకారకుడు, ఏర్ అణి కీర్త్తి = (లోకమునకే) తగిన అలంకారమైయున్న కీర్తిని కలవారగు, ఇరామానుశముని = శ్రీ భాష్యకారుల, ఇన్ ఉరై శేర్ = తీయని సూక్తులలో ఆసక్తిని కల,



శీర్ అణి శిన్దైయినోమ్ = గొప్పతనమునుకల మనస్సును కలవారమైతిమి, ఇని = ఇకపై, తీ వినై = మన క్రూరకర్మలనుగూర్చి, శిన్దియోమ్ = చింతింపము.

వేదార్థములకు తమ మనస్సుకు తోచిన రీతిలో అర్థములను కల్పించి, వాని ఋజుత్వమును పాడుచేయు హేతువాదుల వాదములనెడి అరటిచెట్లను శ్రీరామానుజులు తమ సూక్తులతో కూల్చి వేసిరి. అట్టి రామానుజుల తీయని సూక్తులయందు అభినివేశమునుకల మనము ఇక మన క్రూరములగు పూర్వకర్మలనుగూర్చి ఆలోచింపనవసరములేదు.

పాశురములోని **“ఐదుకర్కళ్”** అను ప్రయోగమునకు – ఏ విషయమును గూర్చి పల్కినను– వేదము మొదలగువానిని ప్రమాణములుగా అంగీకరింపక, కేవలము హేతువాదమును చేయువారని అర్థము.

**ఉత్తమూర్:–** ఈ గురుపరంపరావైలక్షణ్యమునకు ముఖ్యకారణభూతులగు ముగ్గురు మునుల విషయమున విశేషానుసంధానము ఇక మూడు పాశురములలో చేయబడుచున్నది. స్వాచార్యులకు దగ్గరగానున్నవారగుటచే పూర్వము ఆదరించిన క్రమమును అనుసరించి, భగవద్రామానుజుల విషయమున మొదటి పాశురము. లేక, వారిలో **“నాథోపజ్ఞం ప్రవృత్తం బహుభి రుపచితం యామునేయప్రబంధైః”** అనునట్లు గీతాశారీరకాది దర్శనగ్రంథములకు విశదముగా వ్యాఖ్యానమును అనుగ్రహించి, దర్శనప్రవర్తకులుగా నుండుటచే మొదట భగవద్రామానుజులవారి విషయమున మొదటి పాశురము, వారికి శిష్యుల మూలమున, గ్రంథముల మూలమున, గీతాదులకు విశదవ్యాఖ్యానమును అనుగ్రహించుటకు తగిన రీతిలో సిద్ధాంతప్రమేయనిష్కర్షమును చేసిన ఆళవన్దార్ విషయమున తరువాతి పాశురము ఆ తరువాత, అందులకు మూలముగా స్వయముగా పరమతనిరసనమును చేసి, నమ్మాఴ్వార్ల మూలమున సిద్ధాంతనిషర్షను చేసి, అవిచ్ఛిన్నసంప్రదాయమునకు మూలమైన నాథమునివిషయమున తదనంతరపాశురమును రచింపబడినది.

**(ఆరణ నూల్)**– ఆరణ్యకమను వేదాంతవిషయమైన శారీరకశాస్త్రము. **(అదన్ వఴి)** మార్గమున, **(శెవ్వై)** ఋజువైన, సరసమైన రీతిని, **(అఴిత్తిడుమ్)** కుతర్కములతో పాడు చేసి వేఱు అర్థములను ఆరోపించు, **(ఐతువర్క్కు)** హేతువాదులకు, కుదృష్టులకును, **(ఓర్ వారణమాయ్)** సాటిలేని గజమై, **(అవర్ వాదమ్ కదళికళ్)** వారి వాదములనెడి అరటిచెట్లను, **(మాయ్త్త)** కూలదోసిన, **(పిరాన్)** మహోపకారకులు, **(ఏర్ అణి)**

లోకమునకు తగిన అలంకారమైన, **(కీర్త్తి)** కీర్తిని కలవారైన, **(ఇరామానుశముని)** శ్రీభాష్యకారులు అను యతీంద్రుల, **(ఇన్ ఉరై)** తీయని శ్రీసూక్తులలో, **(శేర్)** నిమగ్నులగుట, **(శీర్ అణి)** వానిలో అనుగ్రహింపబడిన విశేషార్థములను, (లేక) **"శీరణి శిన్దై"** వాని అధ్యయనమువలన ఏర్పడిన శమదమాదులను అలంకారముగా గల మనస్సును కలవారము అయితిమి. **(ఇని)**-ఇకపై, **(తీ విన్నై)** వేఱు శాస్త్రాభ్యాసములను, కామ్యనిషిద్ధకర్మలను, **(శిన్దియోమ్)** చేయదలచము. **(శిన్దయినోమ్)** అను పాఠమున **"నిర్విష్టం యతిసార్వభౌమవచసా మావృత్తిభి ర్యౌవనమ్"** అను సూక్తి స్మరణార్థము.

గొప్ప గొప్ప వృక్షములను సైతము కూలగొట్టు మదపుటేనుగునకు అరటితోటను ధ్వంసము చేయుటలో ఏమి శ్రమ? అరటిచెట్లు సహజముగా ఒక దాని ప్రక్కన వేఱొకటి పెరుగును. అవి దట్టముగానుండుటచే ఒకదాని అభివృద్ధికి వేఱొకటి అవరోధముగానుండును. అట్లే, శంకరాదిమతములలోని గ్రంథములు వందలాదిగా నున్నను ఒక దానికి వేఱొకటి విరుద్ధముగా నున్నవి అని తెలుపుటకై **"వాదక్కదళికళ్"** అని ప్రయోగింపబడినది.

**భగవద్యాములుల మహోపకారము**

**5. నీళవన్దిన్దు విదివకైయా నినైవొన్ఱియ నా**
**మీళ వన్దిన్నుమ్ వినైయుడమ్బొన్ఱి విÇున్దుÇలాదు**
**ఆళవన్దారెన వెన్ఱరుడన్దు విళఙ్గియ శీర్**
**ఆళవన్దారడియో మ్పడియోమిని యల్వÇక్కే**

నీళ వన్దు = అనాదిగా (ఈ సంసారములో) వచ్చి జన్మించి, ఇన్ఱు = ఈ జన్మలో, విది వకైయాల్ = ఏదో ఒక భాగ్యవిశేషముచే, నినైవు ఒన్ఱియ నామ్ = (మంచి విషయములను గూర్చిన) తలపును పొందిన మనము, మీళ వన్దు = తిరిగి (ఈ కర్మభూమిలో) జన్మించి, ఇన్నుమ్ = ఇంకను, వినై ఉడమ్బు = కర్మశరీరమున, ఒన్ఱి= చేరి, విÇున్దు ఉÇలాదు = (నరకాదులలో) పడి దుఃఖమును పొందకుండునట్లు (చేయుటకు నిశ్చయించుకొని) ఆళవన్దార్ ఎన = మనలను రక్షించుటకు వచ్చిరి అని పల్కునట్లు, వెన్ఱు = (ప్రతివాదులను) జయించి, అరుళ్ తన్దు = (మనపై) కరుణను చూపి, విళఙ్గియ శీర్ = ప్రకాశించు గుణములను కలవారైన, ఆళవన్దార్ అడియోమ్ = ఆళవన్దారుకు మనము దాసులము అయితిమి, ఇని = ఇక, అల్ వÇక్కు= తగని మతములను సంప్రదాయములను బోధించు అపశాస్త్రములందు, పడియోమ్= ఆసక్తిని కలవారము కాము.



చిరకాలముగా ఈ కర్మభూమిలో మనము పరిభ్రమించుచు, దు:ఖపడుచున్నాము. ఈ జన్మలోని భాగ్యవిశేషమువలన ఆత్మదేహముకంటె వేఱయినది అను మొదలగు సారార్థములను తెలిసిన మనలను తిరిగి ఈ లోకములో జన్మింపకుండ జేయు కరుణతో రక్షించుటకు వచ్చిరి – అని కీర్తించునట్లున్న ఆళవన్దారులకు మనము దాసులమైతిమి. ఇక తగని విషయములను బోధించు ఇతరమతములకు చెందిన గ్రంథములందు అభినివేశమును పొందము.

ముందు పాశురము, ఈ పాశురమును కట్టళైక్కలిత్తుఱై ఛందస్సుకు చెందినవి.

**ఉత్తమూర్:– (నీళ)** కాలము దీర్ఘమగుటచే, అనాదిగా, **(వన్దు)** మృగాదిజన్మలను ఎత్తి సంసారములోనుండి, **(విది వకైయాలే)** ఒక విధమైన కృతివిశేషముచే, **(ఇన్ఱు)** ఈ జన్మలో మనుష్యశరీరమును ఎత్తుటచే, **(నినైవు)** కృత్యాకృత్యవివేకమునకగు పూర్వవాసనను, **(ఒన్ఱియ నామ్)** కలిగియున్నవారమగు మనము, **(మీళ వన్దు)** తిరిగి సంసారములో ప్రవేశించి, **(ఇన్నుమ్)** దీనికి పిమ్మటకూడ, **(వినై ఉడమ్బు ఒన్ఱిల్)** కర్మమూలమైన ఒక శరీరములో, **(విÇున్దు ఉÇలాదు)** ప్రవేశించి, అవస్థపడకుండునట్లు. దీనికి **"అడియోమ్"** అనుదానితో అన్వయము. **(ఆళ)** కాపాడుటకు, **(వన్దార్)** సభకు వేంచేసిరి, **(ఎన)** అనునట్లు, **(వెన్ఱు)**–మతాంతరులను జయించి, **(అరుళ్ తన్దు)** రాజదంపతుల పట్ల, పరిజనములపట్ల, శ్రీవైష్ణవసమాజముపట్ల కృపను జూపి, **(విళఙ్గియ)** గ్రంథముల మూలమున, ప్రవచనముల మాలమున అంతట ప్రకాశించిన కళ్యాణగుణములనుకల, **(ఆళవన్దార్)** భగవద్యామునమునులకు, **(అడియోమ్)** దాసులమైతిమి, **(ఇని)** దీనికి పిమ్మట, **(అల్ వÇక్కు)** అపార్థములను చెప్పు శాస్త్రములను **(పడియోమ్)** అభ్యసింపము. లేక, **(అల్ వÇక్కు)** అక్రమకార్యములలో, **(పడియోమ్)** ప్రవేశింపము–అనియును అర్థము.

**నాథమునులను కొలుచు భాగ్యము**

**6. కాళమ్ వలమ్బురియన్న నఱ్కాదలడియవర్క్కు**
**త్తాళమ్ వÇఙ్గి త్తమిÇ్మఱై యిన్నిశైతన్ద వళ్ళల్**
**మూళు న్దవనెఱి మూట్టియ నాదముని కÇలే**
**నాళుమ్ తొÇుదెÇువోమ్ నమక్కార్ నికర్ నానిలత్తే**

కాళమ్ వలమ్బురి అన్న = కాహళమను వాద్యమును, దక్షిణావర్తశంఖమును పోలియున్న వారు, నల్ కాదల్ = గొప్ప గురుభక్తిని కలవారును అగు, అడియవర్క్కు= (కీÇై

అకత్తాఴ్వాన్, మేలై అకత్తాఴ్వాన్–అను ఇద్దరు) శిష్యులకు, తాళమ్ వఴ్జ్గి = తాళవిద్య అను గంధర్వవేదమును బోధించి అనుగ్రహించి, తమిఴ్ మఱై = తమిళవేదమగు దివ్యప్రబంధముయొక్క, ఇన్ ఇశై తన్ద వళ్ళల్ =మధురమైన దేవగానమును ఉపదేశించిన మహోపకారకులు, మూళుమ్ = ముముక్షువులచే తీవ్రముగా అభ్యసింపబడు, తవ నెఱి = యోగమార్గమును, మూట్టియ = ప్రచారము చేసినవారగు, నాదముని = శ్రీమన్నాథమునుల, కఴలే = శ్రీ పాదములనే, నాళుమ్ = ఎల్లప్పుడు, తొఴుదు ఎఴువోమ్ = నమస్కరించి ఉజ్జీవింతుము. (ఇట్లు చేయుటవలన), నానిలత్తు= భూమిలో, నమక్కు = మనకు, నికర్ ఆర్ = సాటియైనవారెవ్వరు? (లేరని భావము)

శ్రీమన్నాథమునులు తమపట్ల అంతులేని భక్తినికల **కీఴై అకత్తాన్, మేలై అకత్తాన్** అను ఇద్దరు మేనల్లుళ్ళకు తాళవిద్య అనబడు గంధర్వ వేదమును, దానిని ప్రయోగించి దివ్యప్రబంధమును గానముచేయు విధమును ఉపదేశించి, యోగమార్గమును ఈ లోకమునకు ఉపదేశించి, చూపిరి. ఇట్టి మహిమనుకల ఆ మహనీయుల శ్రీ పాదములే నిత్యము సేవించి, ఉజ్జీవించెదము. ఈ భాగ్యమును పొందిన మనకు ఈ లోకమున సాటియైనవారు కలరా?

**'కాళమ్'** అను శబ్దము కాహళశబ్ద భవము. వాద్యవిశేషమును తెలుపును. **"కాళజ్గల్ వలమ్బురి"** అను తిరువాయ్మొఴిప్రయోగమును స్మరింపనగును. **"నమక్కార్ నికర్ నానిలత్తే"** అను ప్రయోగము **"ఎనక్కినియార్ నికర్ నీళిలత్తే"** అను శఠకోపసూరి ప్రయోగమును తలపించును.

**ఉత్తమూర్:–(కాళమ్)** కాహళమనబడు తిరుచ్చిన్నము, **(వలమ్బురి)** గొప్ప దక్షిణావర్తశంఖము, **(అన్న)** ఈ రెండింటికిని సమానులై, శుద్ధమైన, శ్రేష్ఠమైన స్వరమును కలవారై, **(నణ్కాదల్)** గొప్ప భక్తిని, శ్రద్ధనుకల, **(అడియవర్క్కు)**–తమను ఆశ్రయించిన దాసులగు, **కీఴ్ అకత్తాఴ్వాన్, మేల్ అకత్తు ఆఴ్వాన్** అనువారికి, **(తాళమ్ వఴ్జ్గి)** తాళగీత శాస్త్రములో అభ్యాసమును కలిగించి, **(తమిఴ్ మఱై)** నమ్మాఴ్వార్లవలన తాము పొందిన నాలాయిరదివ్యప్రబంధమను ద్రావిడవేదమును, **(ఇన్ ఇశై)** భోగ్యములైన రాగములతో, **(తన్దు)** ఉపదేశించిన, **(వళ్ళల్)** న్యాయతత్త్వయోగరహస్యములను అనుగ్రహించి మతస్థాపనను చేసినవారును, **(మూళుమ్)** అందఱును ప్రవేశింపతగిన, **(తవమ్ నెఱి)** గొప్ప తపస్సు అగు ప్రపత్తిమార్గమున, **(మూట్చియ)** అందఱిని నిమగ్నులగునట్లు చేయువారగు, **(నాదముని)** శ్రీభగవన్నాథమునులయొక్క, **(కఴలే)**



శ్రీపాదములనే, **(నాళుమ్)** ప్రతిదినమును, **(తొఴుదు)** నమస్కరించి, **(ఎఴువోమ్)** ఉజ్జీవింతుము.(లేక) ఉజ్జీవించు మనకు, **(నాల్ నిలత్తే)** నాల్గు విధములైన ప్రదేశమునుకల, పలువురు జనులతో నిండిన భూమిలో, **(ఆర్ నికర్)** సమానులు ఎవరు? ఈ ఉభయవేదాంతసత్సంప్రదాయమునకు సరి అయిన వేఱు సన్మార్గము ఈ భూమిలో లేదని భావము. నాల్గు విధములైన ప్రదేశము లేవి? అనగా **మరుదమ్, నెయ్దల్, కుఱిఞ్జి, ముల్లై**–అనునవి. **"పాలై"** అను వేఱొక ప్రదేశమున్నను అది జనావాసయోగ్యము కాదు. కావున విడువబడినది. **మరుదమ్**–సస్యసమృద్ధినికల ప్రదేశము, **నెయ్దల్** –సముద్రము, తత్తీరప్రాంతములు, **కుఱిఞ్జి**–కొండ చఱియలు, తత్సమీపదేశములు, **ముల్లై** –అడవి, తత్పరిసరములును.

**రహస్యముల అర్థముల తెలియు భాగ్యము**

**7.** **ఆళుమడైక్కల మెన్ఱెమై యమ్బుయత్తాళ్కణవ**
**న్తాళిణైశేర్న్దెమక్కు మ్మవై తన్ద తకవుడైయార్**
**మూళు మిరుట్కళ్ విళ ముయన్ఱోదియ మూన్ఱిలుళ్ళ**
**నాళుముకక్క విఙ్గే నమక్కోర్ విది వాయ్క్కిన్ఱదే**

ఎమై అడైక్కలమ్ (ఆక) ఆళుమ్ ఎన్ఱు = "మమ్ములను రక్షింపవలసిన వస్తువుగా గొని రక్షించును" అని (తలచి నిశ్చయించుకొని), అమ్బుయత్తాళ్ కణవన్ = పద్మనివాసినియగు లక్ష్మీదేవికి వల్లభుడైన భగవానుని, తాళ్ ఇణై శేర్న్దు = శ్రీ పాదములను రెండిటిని ఉపాయముగా గ్రహించి, ఎమక్కుమ్ అవై తన్ద = మాకును ఆ శ్రీపాదములనే (ఉపాయముగా చూపి) అనుగ్రహించిన, తకవు ఉడైయార్ = కృపనుకల ఆచార్యులు, మూళుమ్ ఇరుట్కళ్ విళ ముయన్ఱు = (మనపట్ల) వృద్ధిచెందుచున్న (అజ్ఞానమును) చీకటి నశింపవలెనని ప్రయత్నించి, ఓదియ మూన్ఱిన్= ఉపదేశించిన మూడు రహస్యములందలి, ఉళ్ళమ్ = తాత్పర్యమును, ఇఙ్గే నాళుమ్ ఉకక్క = ఈ లోకములో ఎల్లప్పుడు అనుసంధించి ఆనందించునట్లు, నమక్కు ఓర్ విది = మనకు భాగ్యవిశేషము, వాయ్క్కిన్ఱదే = లభించుచున్నదికదా!

7వ, 8వ పాశురములు ఉపోద్ఘాతాధికారములోనివి. **"విది వాయ్క్కిన్ఱదు"** అను ప్రయోగము తిరువాయ్మొఴిలోని ఇట్టి ప్రయోగమును తలపించుచున్నది. **"అమ్బుజ"** మను సంస్కృత పదమే **'అమ్బుయమ్'** గా మారినది. జకారము య కారముగా మాఱుట **"అజన్–అయన్"** ఇత్యాదులలో గమనింపవచ్చును.

అస్మదాచార్యులు "శ్రీమన్నారాయణుని శ్రీ పాదములను శరణుపొందినచో ఆ స్వామి మన బాధ్యతను తాను వహించి, రక్షించును" అని నిశ్చయించుకొని, అతని పాదములనే ఆశ్రయించి, వానినే మనకును గొప్ప ఉపాయముగా చూపిరి. మఱియు దినదినప్రవర్ధమానమగు మన అజ్ఞానమను చీకటిని పాఱదోలవలెనని మనపట్ల దయగలవారై, మనకు రహస్యత్రయమును, దాని అర్థమును ఉపదేశించిరి. ఆ అర్థమును మనము ఈ లోకముననున్న సమయమున అనవరతము అనుసంధించి, ఆనందింపగల్గితిమి. ఏమి మన భాగ్యవిశేషము!

**ఉత్తమూర్:-** ఉపదేశమును చేయుటకుముందే ఆచార్యవందనమును ఆచరించి, ఉపదేశప్రారంభమును మిక్కిలి శ్రద్ధతో శిష్యునిపట్ల ఆనందముతో చేయుచున్నారు. **''ఆళుమ్''** అని ప్రారంభమగు ఈ పాశురము రహస్యత్రయసారమను ప్రకృతప్రబంధమునకు అంతటికిని మూలమైనది. మొదటి అధికారముయొక్క అర్థము తరువాత ప్రస్తావింపబడును. శాస్త్రార్థమును అనుష్ఠానపర్యంతమును చేయుచు, ఆచార్యులు మనకు ఉపదేశించిన అర్థమును మనము నిత్యము అనుసంధింపగల్గుట గొప్ప-భాగ్యము-అని ఇందలి భావము.

**(ఎమ్మై)** తమ పాదములను ఆశ్రయించిన మనలను, **(అడైక్కలమ్)** రక్ష్యవస్తువుగా, **(ఆళుమ్)** కాపాడును, **(ఎన్ఱు)** అని నిశ్చయించుకొని-అనియును అర్థము చెప్పవచ్చును **(అమ్బుయత్తాళ్‌కణవన్)** శ్రియఃపతియొక్క, **(తాళిణై)** ఒక దానితో వేఱొకటి తులతూగునట్టి శ్రీపాదములను, **(శేర్‌న్దు)** తాము ఉపాయముగా వరించి, **(ఎమక్కుమ్)** శిష్యులమగు మనకు, **(అవై)** ఆ శ్రీపాదములను, **(తన్ద)** ఉపాయముగా ఉపదేశించిన, **(తకవుడైయోర్)** కృపను కల ఆచార్యులు, **(మూళుమ్ ఇరుళ్‌కళ్)** వేగముగా ఏ విషయములోనైనను, వ్యాపింపతగిన అజ్ఞానాంధకారములు, **(విళ)** నశించునట్లు, **(ముయన్ఱు)** ప్రయాసపడి, **(ఓదియ)** మాకు ఉపదేశించిన, **(మూన్ఱిన్ ఉళ్ళమ్)** రహస్యత్రయముల తాత్పర్యమును, **(నాళుమ్)** ఎల్లప్పుడు, **(ఉకక్క)** అనుభవించి, ఆనందించుటకు, **(ఓర్ విది)** సాటిలేని భాగ్యము, **(నమక్కు)** ఈ గురుపరంపరాసంబంధము పొందిన మనకు, **(వాయ్‌క్కిన్ఱదు)** తానుగానే వచ్చి చేరుచున్నది. ఈ గ్రంథములో శరణాగతిమంత్రార్థముతో మోక్షము కల్గుననుటను విస్తృతముగా తెలుపబోవుచున్నారు. "ఇది అనుష్ఠానమునకు రానిదియై, వినుటకు ఆనందకరమైన మాటయే అగును. అట్లయినచో తుల్యప్రమాణమున అంజలినమస్కారాదులుకూడ సాధనములు కావచ్చునుకదా!" అని ఆక్షేపించువారికి



సమాధానము ఈ పూర్వార్ధము. ఇది అనుష్ఠానమునకు వీలుకాని ఉపదేశము మాత్రము కాదు. అనుష్ఠానముకూడ లోకవంచనకొఱకు కానేకాదు. ప్రపత్తిశాస్త్రార్థములో ఆచార్యులకుగల స్పష్టత, వారికి మనపట్లగల కరుణయే ఉపదేశమును చేయుటకు హేతువులని తాత్పర్యము. **"శేర్‌న్దు"** అనునంతవరకు ప్రకృత గ్రంథార్థమై, ద్వయార్థమైన మహావిశ్వాసపూర్వకశరణాగతి అనుసంధింపబడినది. **"ఎమక్కుమ్ అవై తన్ద తకవు"** అనుటచే అర్థోపదేశము చేయబడినదనవచ్చును. ఆచార్యనిష్ఠను కల్గియుండుటను చెప్పబడినదనవచ్చును. అర్థోపదేశము మూడవపాదమునుండి స్ఫుటమగును. తాత్కాలికోపదేశము మాత్రమేకాక శాశ్వతమగు గ్రంథము అవతరించుటచే ఎల్లప్పుడు విడువకుండ అనుసంధింపవచ్చునను భావముతో **"నాళుమ్ ఉకక్క"** అని ప్రయోగింబడినది. **"ఓర్ విది"** -వివేకమును కల్గి ఉండదగిన మనుష్యజన్మకుకూడ బాహ్యకుదృష్టిమతములతో కలతపడకుండుటకు అదృష్టమునువలెనే, ప్రపత్తి శాస్త్రార్థములో స్పష్టతను, నిష్ఠను పొందుటకు విలక్షణమైన భాగ్యమునుకూడ కల్గియుండవలెనని తాత్పర్యము.

**ఆచార్యకటాక్షము కల్గినచో గర్భవాసదుఃఖ ముండదు**

**8. తిరువుడన్ వన్ద శెఴుమణి పోఱ్ఱిరుమాలితయ**
**మరువిడమెన్న మలరడి శూడుమ్ వకై పెఱునామ్**
**కరువుడన్ వన్ద కడువినైయాఱ్ఱిల్ విఴున్దొఴుకా**
**దరువుడ నైన్దఱివారరుళ్ శెయ్య వమైన్దనరే**

తిరువుడన్ వన్ద = పిరాట్టితో పాటు (సముద్రమునుండి) అవతరించిన, శెఴు మణి పోల్ = గొప్ప కౌస్తుభమణివలె, తిరుమాల్ ఇదయమ్ = భగవానుని వక్షఃస్థలము, మరువు ఇడమ్ ఎన్న = నివసించు స్థలము అని చెప్పునట్లు (ఉన్నవారును), మలర్ అడి= తామరపూవువంటి ఆ స్వామి పాదములను, శూడుమ్ వకై = కిరీటములో ధరించు స్వభావమునే, పెఱుమ్ నామ్ = పొందుటకు సంబంధమును కల్గినవారగు మేము, కరువుడన్ వన్ద = గర్భముతో వచ్చిన, కడు వినై ఆఱ్ఱిల్ = క్రూర కర్మ అనెడి ప్రవాహములో, విఴున్దు ఒఴుకాదు = పడి (దరికానలేక, ఆ ప్రవాహదిశలోనే) కొట్టుకొని పోకుండునట్లు, అరువుడన్ ఐన్దు అఱివార్ = సూక్ష్మార్థములతో అర్థపంచకమును తెలిసిన మన ఆచార్యులు, అరుళ్ శెయ్య = కృపను చేయుటకు, అమైన్దనర్ = సిద్ధముగానున్నారు.

సముద్రములో అవతరించిన లక్ష్మీదేవి భగవానుని వక్షఃస్థలము తన వాసస్థానముగా చేసికొన్నది. అట్లే, ఆమెతో ప్రభవించిన కౌస్తుభరత్నముకూడ స్వామిచే

వక్షఃస్థలమున అలంకరించుకొనబడినది. ఇట్టి కౌస్తుభరత్నమును శరీరముగాకల నిత్యసూరిని తమకు అభిమానదేవతగాకల జీవులమగు మనము అతని శ్రీ పాదములందు నిత్యకైంకర్యమును చేయు సంబంధమును కలవారము. అయినను, కర్మప్రవాహములో చిక్కుకొని దానిని పొందలేకున్నాము. సూక్ష్మార్థములను, అర్థపంచకమును తెలిసిన మన ఆచార్యులు మన పట్ల దయను చూపి, అవశ్యకములగు అర్థములను ఉపదేశించి, ఉజ్జీవింపజేయ ప్రయత్నించిరి. ఇక చింత ఎందులకు?

ఈ పాశురమునుండి అన్వాదిప్రక్రియ ప్రారంభమగుచున్నది. **"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తు శ్చ ప్రత్యగాత్మనః, ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తివిరోధి చ"** అని చెప్పబడు స్వస్వరూప, పరస్వరూప, ఉపాయస్వరూప, ఫలస్వరూప, విరోధిస్వరూపములే అర్థపంచకము. **"ఆత్మాన మస్య జగతో నిర్లేప మగుణాలయమ్, బిభర్తి కౌస్తుభమణిస్వరూపం భగవాన్ హరిః"** అను విష్ణుపురాణసూక్తి స్మరణీయము.

**ఉత్తమూర్:-** పూర్వము **"జ్ఞాతవ్యఙ్గళ్"** అని, **"ప్రతితంత్రసారోద్ధారేణ"**అనియును గల పల్కులతో అర్థపంచకము, సూక్ష్మమైన శరీరాత్మభావసంబంధము-అను ఆఱు విషయములు ప్రస్తావింపబడుట తెలియునట్లు వానిని కలుపుచు ఈ అధికారార్థము చివరలో వానిని ఈ పాశురమునందు సంగ్రహించుచున్నారు. ఈ అధికారములో **"తాన్ వాழ்కిఱ వాழ்వై"** అనునంతవరకు ప్రాప్యమగు బ్రహ్మస్వరూపము, **"స్వామికైంకర్యత్తుక్కు"** అనుటచే ప్రాప్తిస్వరూపము, **"అనాదిమయయా"** అనుటచే ప్రాప్తివిరోధియును, **"జ్ఞానానందమయ స్త్వాత్మా"** ఇత్యాదిగా ప్రాప్త అగు జీవాత్మస్వరూపము, **"తదుపాయ"** అనునపుడు ఉపాయమును, **"స్వరూప-స్వభావ- సంబంధఙ్గళ్"** అనునపుడు శరీరాత్మభావము మొదలగునవియును సూచింపబడుచున్నవి.

**(తిరువుడన్)** పాలకడలిలో అవతరించిన లక్ష్మీదేవితో, **(వన్ద)** భగవానునివద్దకు తానే చేరిన, **(శెழு మణిపోల్)** గొప్పతనమునుకల కౌస్తుభరత్నమునకువలె, **(నమక్కుమ్ తిరుమాల్)** మనకు శ్రియఃపతియొక్క, **(ఇదయమ్)** హృదయము, **(మరువు ఇడమ్)** ప్రేమతో నివసించు చోటు, **(ఎన్న)** అనబడుచుండగా, **(మలర్ అడి)** తామరలవంటి శ్రీపాదములను, **(కూడుమ్ వకై)** శిరసావహించు ప్రకారమును, **(పెఱుమ్)** పొందినట్టి, **(నామ్)** సంసారులమగు మనము, **(కరువుడన్)** వన్ద గర్భమునుండి వచ్చు, (అనాదిగా వచ్చు- అని భావము) **(కడు)** కఠినమైన, **(వినై)** కర్మలనెడి, **(ఆற்றில்)** ప్రవాహములో,



**(విழுన్దు)** తీరమునకు సమీపము కాని చోట మునిగి, **(ఒழுకాతు)** సంసారములోనే నశింపకుండునట్లు, **(నమక్కు అరుళ్ శెయ్య)** దయను పొందుటకు, **(అరు ఉడన్)** సూక్ష్మార్థమైన శరీరాత్మభావసంబంధముతోపాటు **(ఐన్దు)** అర్థపంచకమును, **(అఱివార్)** తెలిసిన దేశికులు, **(అమైన్దనర్)** కలరు. ఇక వారి ఉపదేశమును పొందినవారమైతిమి. మనకేమి కొఱత? అని భావము. దేశికుల మూలమున సూక్ష్మార్థములను, అర్థపంచకమును తెలియకపోయినచో సంసారప్రవాహములో మునిగి నశింపవలసియుండెడిదనియు తాత్పర్యము.

**"ఇదయమ్ మరువిడ మెన్న"** అను ప్రయోగముయొక్క తాత్పర్యము ఏమనగా -లక్ష్మీదేవితో పాటు క్షీరాబ్ధిలో అవతరించి, తన వద్దకుచేరిన కౌస్తుభరత్నమును స్వామి ఆమె అభిమానమును పొందిన తన హృదయమున ధరించినట్లే, ఆమె అభిమానమునకు పాత్రమైన మనలనుకూడ తన హృదయములో గ్రహించుటకు భగవానుడు సంసిద్ధుడుగానుండగా, మనము ఉజ్జీవింపతగిన ఆ చోటును విడచి, కైంకర్యమునందలి ఆశచే ఆ స్వామి శ్రీపాదముల చెంత మనలను చేర్చుకొంటిమి. **"తిరుమార్బు"** అనెడి హృదయము నివసించు చోటుగా. అది లక్ష్మీదేవికి, కౌస్తుభమునకే అగుగాక. శ్రియః పతియొక్క (హృదయమనుటకు అర్థమగు) మనస్సే మనకు నివసించు చోటు అగుట చాలును. అది నివసించు చోటుగా నుండుటచేతనే పాదపద్మములను శిరసా ధరించు రీతి మనకు సిద్ధించును.

**సారమును మాత్రమే గ్రహించుట**

**9.** **అమైయా వివై యేను మాశైయినా లఱు మూన్లులకిల్**
**శుమైయాన కల్వికళ్ శూழ்వన్దాలు నొక్కై యివై యె-**
**న్లిమైయా విమైయవరేత్తియ వెట్టిరణ్డెణ్ణియ నమ్**
**శమయాశిరియర్ శదిర్క్కు న్తనినిలై తన్దనరే**

ఇవై అమైయా = ఇపుడు మనము అభ్యసించిన విద్యలు చాలవు, (ఇంకను అభ్యసింపవలెను) ఎనుమ్ ఆశైయినాల్ = అను ఆశచే, ఉలకిల్ శుమైయాన = లోకమున వ్యర్థములై, భారములైన, అఱు మూన్లు కల్వికళ్ = పదునెనిమిది (విద్యాస్థానములు అనెడి) విద్యలు, శూழ் వన్దాలుమ్ = మొత్తము చదువబడినను, ఇవై తొకై ఎన్లు = ఇన్ని విద్యలును కేవలము లెక్కకు మాత్రమే అని (నిశ్చయించి), ఇమైయా ఇమైయవర్ ఏత్తియ = జ్ఞానసంకోచములేని నిత్యసూరులచే కొనియాడబడుచున్న, ఎట్టు ఇరణ్డు = ఎనిమిది

అక్షరములనుకల అష్టాక్షరి, ద్వయము, చరమశ్లోకము–అను రహస్యత్రయమును, ఎణ్ణియ = అనుసంధించిన, నమ్ శమయ ఆశిరియర్ = మన సిద్ధాంతప్రవర్తకులగు ఆచార్యులు, శదిర్క్కుమ్ తని నిలై = (సారమునే గ్రహించు) గొప్పదైన, సాటిలేని స్థితిని, తన్దనర్ = (మనకు) అనుగ్రహించిరి.

"ఎంత అభ్యసించినను చాలదు, ఇంకను అభ్యసింపవలెను" అను ఆశ వృద్ధి చెంది, పదునెనిమిది విద్యాస్థానములను మొత్తము అభ్యసించినను అవి అన్నియు నిరర్థకములు, భారములును అని లెక్కింప తగినట్లుండునే కాని, ఉజ్జీవించుటకు తగినవి కాదు" అని మన పూర్వాచార్యులు నిశ్చయించి, జ్ఞానసంకోచములేని నిత్యసూరులు సైతము పొగడు మహిమనుకల రహస్యత్రయములే ఉజ్జీవించుటకు మిక్కిలి సారమైన సాధనములగుటను గమనించి, వానిని తామును అనుసంధించుటయే కాక, మనకును వాటి సారమును అర్థమగునట్లు, తగినట్లు ఉపదేశించిరి.

**"సా విద్యా యా విముక్తయే"**, **"విద్యాఽన్యా శిల్పనైపుణమ్"** ఇత్యాదిసూక్తుల అర్థ మిచట భావనీయము. ఈ పాశురము సారనిష్ఠాధికారములోనిది. సంస్కృతసమయశబ్దమే శమయమైనది.

**ఉత్తమూర్:–** అధికప్రయాససాధ్యములైన విద్యలను, శాస్త్రములను విడచి అనాయాసములు, ప్రాప్యమును పొందించు మంత్రములలో మాత్రము మనకు నిష్ఠ కలుగునట్లు ఆచార్యులు అనుగ్రహించిరనుట ఇందలి సారాంశము.

**(ఉలకిల్)** లోకములోనున్న, **(ఆఱు మూన్ఱు)** పదునెనిమిది అగు, **(శుమైయాన)** మరింత మరింతగా వ్యాఖ్యానములచే భారమగునట్టి, **(కల్విశళ్)**విద్యలు–అనగా వేదాది విద్యాస్థానములు, **(అమైయా)**వీనిని అభ్యసించినంత మాత్రమున చాలదు, **(ఎన్ను మాశైయినాల్)** అను ఆశ ఇతనికి మరింతగా ఉండుటచే, ఆదరముతో, **(శూழ் వన్దాలుమ్)** ఇతనిని అభిమానించి, తామే చుట్టుకొనుటకు అవి వచ్చి చేరినను, **(ఇవై తొకై)** ఇవి అన్నియు లెక్క కొఱకే తప్ప, ఫలమునకు పనికిరావు, పదునెనిమిది విద్యాస్థానములకేకాక అన్నిటిని తెలిసినవారికిని అవి లెక్కకొఱకే తప్ప, భారమగుట తప్ప, వాని వాస్తవార్థమును తెలియనివారికి ఆ విద్యలు భారమగుటలో ఏమి సందేహము? **(ఎన్ఱు)** అని నిశ్చయించుకొని, **(ఇమైయా)** రెప్పపాటును లేనివారు, అజ్ఞానము లేశమైనను లేనివారును అగు, **(ఇమైయవర్)** నిత్యసూరులచే **(ఏత్తియ)** స్తుతింపబడిన, **(ఎట్టు)** అష్టాక్షరిని, **(ఇరణ్డు)** మిగిలిన రెండు అగు ద్వయమును, చరమశ్లోకమును, **(ఎణ్ణియా)** తలచి పరిశీలించిన



మన పూర్వాచార్యులు, **(శదిర్క్కుమ్)** చాతుర్యముతో కూడిన, **(తని నిలై)** సాటిలేని స్థితిని, **(తన్దవర్)** మనకు అనుగ్రహించిరి.

పదునెనిమిది విద్యాస్థానము లేవి? అనగా నాల్గు వేదములు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు,జ్యోతిషము, నిరుక్తము, కల్పము–అను ఆఱు వేదాంగములు, మీమాంసా, న్యాయవిస్తరము, పురాణము, ధర్మశాస్త్రము, ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వ వేదము అర్థశాస్త్రము–అను ఎనిమిది కలసి మొత్తము ఈ పదునెనిమిది. మన ఆచార్యులు వీనిని అన్నిటి కంటె తాము అభ్యసించున్న, అష్టాక్షరి, ద్వయము, చరమశ్లోకములే ముఖ్యమని తలచి, మనలనుకూడ గమనించి, "నీకు విశేషమైన శ్రద్ధ ఉన్నది. కావున దానిని చూచి, అన్ని విద్యాస్థానములును దయచూపి నిన్ను ఆశ్రయించియుండునట్లు స్వాధీనమైనను, నీ జ్ఞానమనుది వానిని ఆశ్రయించుటచే, అవి నీవద్ద చేరియున్నను, విద్య అధికము అనుటను చూపుటకొఱకై ఆ సంఖ్యతప్ప, నీకు మోక్షఫలమునకు వానివలన కల్గు ప్రయోజనమేమియు లేదుసుమా! ఎనిమిది, రెండు (అష్టాక్షరి, ద్వయ, చరమశ్లోకములు) తలచిన చాలును. రెండుతో ఎనిమిదిని చేర్చుట కష్టమైనచో, ఎనిమిదితో రెండును చేర్చుము. తత్త్వజ్ఞానమునకు పిమ్మట ఉపాయానుష్ఠానమున ప్రవేశించుట సహజము. అధికముగా అభ్యసించి, పిమ్మట జ్ఞానయోగ భక్తియోగములలోకంటె ప్రపత్తియందు ప్రవేశించుటయే చాతుర్యము" అని ఉపదేశించిరి. నిత్యసూరులు కీర్తించు విష్వక్సేనులు, నమ్మాழ்వార్లును గురుపరంపరలోనుండి, అన్నిటిని కాదని, అష్టాక్షరిని **(ఎట్టు)**, ద్వయ, చరమశ్లోకములను **(ఇరణ్డుమ్)** ఉపదేశించిరికదా! **"శమయాశిరియర్" – "శమయమ్"**–సమయము–అనగా సిద్ధాంతము. **"శమైయమ్"** అను శబ్దము కూడ ఈ అర్థములో సాధువే. **"శమైయా శిరియర్"** అనియును ఇచట పఠింతురు. **"శమైయ ఆశిరియర్"** అని కాని, **"శమై ఆశిరియర్"** అని కాని విడదీయవచ్చును. **"శమైక్కుమ్ ఆశిరియర్"** (పాకమును చేయు ఆచార్యులు) అనుచు దీనిని వివరించుటద్వారా ఈ పదము కూటస్థులైన మడప్పళ్ళి ఆచ్చాన్‌ను **"యతిరాజమహానస"** అనునట్లు సూచించు చున్నదనవచ్చును. **"శమైత్తల్"** అనుటకు సంస్కరించుట అను అర్థముకూడ కలదు.

**చేతనాచేతనములు ఈశ్వరునకు శరీరములు**

**10.** **నిలైతన్ద దారకనాయ్ నియమిక్కు మిఱైవనుమాయ్**
**ఇలతొన్ఱైనావకై యెల్లా న్తనదెను మెన్ఱైయుమాయ్**
**త్తులై యొన్ఱిలై యెన నిన్ఱ తుழாయ్ ముడియానుడమ్బాయ్**
**విలై యిన్ఱి నామడియో మెనుమ్ వేదియర్ మెయ్ప్పొరుళే**

వేదియర్ = వేదాంతమును తెలిసిన పెద్దలు, మెయ్ ప్పొరుళ్ = సత్యమైన సిద్ధాంతము, నిలై తన్ద దారకనాయ్ = (సకలవస్తువులకును) స్వరూపమును, ఉజ్జీవనమును అనుగ్రహించి, ధరించువాడై, నియమిక్కుమ్ = వానిని నియమించు, ఇఱైవనుమాయ్= ఈశ్వరుడై, ఇలదు (ఇదు) ఒన్ఱు ఎనా వకై = తనకు శేషము కాని వస్తువు ఒకటి ఇది అని చెప్పవీలులేనట్లు, ఎల్లామ్ = అన్నియు, తనదు ఎనుమ్ = తనకు శేషమని చెప్పునట్లు, ఎన్దైయుమాయ్ = స్వామియై, తులై ఒన్ఱు ఇవై ఎన నిన్ఱ = (వీనికి) సమమైన వస్తువు వేఱొకటి లేదు అని పల్కునట్లు ఉన్నవాడు, తుழాయ్ ముడియాన్= తులసీమాలచే అలంకరింపబడిన కిరీటమును కలవాడును అగు భగవానునకు, ఉడమ్బాయ్ = శరీరమై, విలై ఇన్ఱి = నిర్హేతుకముగా, నామ్ అడియోమ్ ఎనుమ్ = మనము (జీవులమగు మనము) దాసులము అని తెలుపుదురు.

ఇందు విశిష్టాద్వైతసిద్ధాంతమున ప్రధానప్రతితంత్రార్థముగా చెప్పబడు శరీరశరీరిభావము తెలుపబడుచున్నది.

అన్నిటిని ధరించువాడై, నియామకుడై, అన్నిటియొక్క ప్రయోజనమును పొందువాడై, సాటిలేనివాడై వెలుగు సర్వేశ్వరునకు శరీరమగు మనము, ఏ కారణములేకనే నిత్యము దాసులము - అని వేదాంతములను చక్కగా గ్రహించినవారు పల్కుదురు.

సర్వేశ్వరుడు సకలవస్తువులకును స్వరూపమును, జీవనమును ఇచ్చి ధరించుచున్నాడు. దీనికి ధారకత్వమనిపేరు. తన సంకల్పముతో సకల వస్తువులకు స్వరూపమును, జీవనమును ఇచ్చి, కార్యములలో అవి ప్రవర్తించునట్లు చేయుచున్నాడు. దీనికి నియంతృత్వమని పేరు. మఱియు ఆ స్వామి, తన ప్రయోజనమునే చేతనాచేతనములు తమ ప్రయోజనముగా తలచునట్లు చేసి, దానిచే గొప్పతనమును పొందుచున్నాడు. దీనికి శేషిత్వమనిపేరు ధారకత్వ-నియంతృత్వ- శేషిత్వములను ఈ మూడు సంబంధములు తన వద్ద ఉన్నపుడే వేఱొకటిని తనకు శరీరముగా కల్గియుండ వీలగును. సకల వస్తువులు భగవానునియందు స్థిరముగా నుండుటచే అతడు ఆ సకలవస్తువులను శరీరముగా కల్గియున్నాడు. అచేతనములు, చేతనులమగు మనమును ఆ స్వామికి శరీరమైయున్నాము. అతనికిని, మనకును మధ్యగల శరీరాత్మభావమను ఈ సంబంధమే మన సిద్ధాంతములోని ప్రధానప్రతితంత్రార్థము.



**ప్రధానప్రతితంత్రార్థము :-**

వేఱు ఏ సిద్ధాంతమునందును అంగీకరింపబడని, మన శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమునకేగల ముఖ్యమైన అంశమిది. ఈశ్వరునకు, చేతనాచేతనములకు మధ్య గల ఈ శరీరాత్మభావమును ఇతరమతములవారు ఎవ్వరు అంగీకరింపలేదు. కావున అది ప్రధానప్రతితంత్రార్థమైనది.

**"ధారక, తులా"** అను సంస్కృత శబ్దములనుండి **"దారక, తులై"** పదములు పుట్టినవి. ఈ పాశురము ప్రధానప్రతితంత్రాధికారములోనిది.

**ఉత్తమూర్-** ఈ మూడవ అధికారములో తెలుపబడిన ఆధేయత్వాది నియమములను, వానిచే ఏర్పడిన శరీరాత్మభావనయును వేదప్రతిపాద్యార్థములనుచు ఈ పాశురములో దేశికులు సంగ్రహించుచున్నారు. **(దారకనాయ్ ఇఱైవనుమాయ్ ఎన్దైయుమాయ్)** అను మూడింటికిని **"నిన్ఱ"** అను పదముతో అన్వయము. **"నిన్ఱ"** అనునది **"తుழాయ్ ముడియాన్"** అను పదమునకు విశేషణము. **(నిలై తన్ద దారకనాయ్)** ఆధేయత్వమును అనుగ్రహించు ఆధారమై, **(నియమిక్కుమ్ ఇఱైవనుమాయ్)** నియమనమనెడి కార్యమునకు కారణమైన నియంతయై, **(ఒన్ఱు ఇలదు ఎనావకై)** ఈ వస్తువు అతనికి శేషము కాదు అనుటకు వీలు లేనట్లు, **(ఎల్లామ్ తనదు)**అంతయు అతనికి, **(నాకు)** శేషమే, **(ఎనుమ్)** అను, **(ఎన్దైయుమాయ్)** సర్వస్వామియై. ఈ కారణములచే, **(తులై ఒన్ఱుమ్ ఇలై)** ఇతనికి సమానము ఏదియు లేదు, **(ఎన నిన్ఱ)** అనునట్లున్న, **(తుழాయ్ ముడియాన్)** తులసిని కిరీటములో అలంకరించుకొనిన శ్రియపతికి, **(ఉడమ్బాయ్)** మనము శరీరమై. **(విలై యిన్ఱి యడియోమ్)** కూలికొఱకు కాకుండ సహజముగానే దాసులమైతిమి, **(ఎన్ఱు)** అనునది, **(వేదియర్)** వేదమును తెలిసినవారు, **(మేవియ)** వేదమువలన తెలిసిన, **(మెయ్ ప్పొరుళ్)** సత్యమైన అర్థము.

''ఇలదొన్ఱు ఎనా వకై ఎల్లామ్ తనదు'' అని అనుటచే లక్ష్మీదేవికి చేతనాచేతనములపట్ల ధారకత్వ, నియంతృత్వ, శేషిత్వములున్నను, ఈశ్వరునిపట్ల అవి లేవు. కావున ఈమె **"ఏకోనసర్వశేషి"** అగుచున్నది, ఇతడు అనూన సర్వశేషి-అగుచున్నాడని తెలుపబడినది. అందుచేత స్వామి **"తులై ఒన్ఱు ఇలై ఎన్న నిన్ఱాన్"** అనునట్లున్నాడు. **"తుழాయ్ ముడియాన్"** అనుటచే-తులసిని అలంకరించుకొనిన అతని తిరుమేని అతనికి ఎట్లు శరీరమో, అట్లే అంతయు అతనికి భోగ్యమైన శరీరము-అని వీనికి సామ్యము స్ఫురింపజేయబడినది.

## అర్థపంచకము

**11.** **పొరుళొన్టెన నిన్ట పూమకణాదనవనడి శేర్న్దు**
**అరుళొన్టుమన్బ నవనన్గొళుపాయ మమైన్ద పయన్**
**మరుళొన్టియ వినై వల్‌విలజ్గెన్టి వై యైన్దఱివోర్**
**ఇరుళొన్టిలా వకై యెమ్మన న్దేఱ వియమ్బినరే**

పొరుళ్ ఒన్టు = పురుషార్థము (ఫలము) ఒక్కటియే, ఎన నిన్ట = అని చెప్పునట్లున్నవాడు, పూ మకళ్ నాదన్ = శ్రియః పతి అగు భగవానుడు, అవన్ అడి శేర్న్దు = అతని శ్రీ పాదములను శరణాగతి చేసి, అరుళ్ ఒన్టుమ్ అన్బన్ = (అతని) కృపను ఒక్కటినే ఆశ్రయింప తగిన జీవుడు, అవన్ కొళ్ = ఆ జీవుడు పరిగ్రహించు, ఉపాయమ్ = ఉపాయము, అమైన్ద పయన్ = (ఆ జీవస్వరూపమునకు) తగిన ఫలము, మరుళ్ ఒన్టియ = అజ్ఞానముతో చేరిన, వినై = కర్మమనెడి, వల్ విలజ్గు ఒన్టు = బలమైన సంకెళ్ళు అను, ఇవై ఐన్దు = ఈ అర్థపంచకమును, అఱివార్ = తెలిసిన ఆచార్యులు, ఇరుళ్ ఒన్టు ఇలా వకై = అజ్ఞానమేమియు లేని విధమున, ఎమ్ మనమ్ తేఱ =మా మనస్సు తేటపడునట్లు, ఇయమ్బినర్ = ఉపదేశించిరి.

1) పరమపురుషార్థమైయున్న శ్రీమన్నారాయణుడు, 2) ఆ స్వామి శ్రీ పాదములందు నిత్యకైంకర్యమును చేయు సంబంధమును కల జీవుడు, 3) ఆ జీవుడు తనకు తగినదిగా పరిగ్రహించిన భక్తి-ప్రపత్తులలో ఒకటియగు ఉపాయము, 4) తన స్వరూపమునకు తగిన మోక్షానందమను ఫలము, 5) దానికి విరోధియైయుండు కర్మమను సంకెళ్ళు-అను ఈ అయిదు (అర్థపంచకము) తెలిసిన మన ఆచార్యులు మన అజ్ఞానము పోవునట్లు మనకు అర్థపంచకజ్ఞానమును ఉపదేశించిరి.

ఈ పాశురము అర్థపంచకాధికారములోనిది. **"అరుళొన్టుమ్ అన్బన్"** అను ప్రయోగములోని స్వారస్యము గమనింపతగినది. **"కృపయా కేవల మాత్మసాత్కురు"** ఇత్యాదులు భావ్యములు. భక్తి జ్ఞానవిశేషమే కావున జ్ఞానస్వరూపుడగు జీవుని భక్తిని కలవానినిగా నిర్దేశించుట గమనింపతగినది.

**ఉత్తమూర్:- (పొరుళ్)** ప్రాప్యవస్తువు, **(ఒన్టు ఎన)** అస్థిరములగు ఇతరవస్తువువలెకాక, అద్వితీయువై, వేఱొకటి లేదనునట్లు ఉభయవిభూతివిశిష్ట ఏకతత్వమై, **(నిన్ట)**-ప్రమాణములలో స్పష్టముగా వెలుగుచున్న, **(పూమకళ్ నాదన్)** శ్రియఃపతి, **(అవన్ అడి)** అతని శ్రీపాదములను **(శేర్న్దు)** పొంది, **(అరుళ్ ఒన్టుమ్)** అతని కృపకే లక్ష్య భూతుడై, ప్రాప్త అనబడునట్టి, **(అన్బన్)**భక్తినికల జీవుడు, **(అవన్ కొళ్ ఉపాయమ్)** ఆ జీవునిచే స్వీకరింపబడు ఉపాయము, **(అమైన్ద పయన్)** దానికి తగిన ఫలమగు బ్రహ్మప్రాప్తి, **(మరుళ్ ఒన్టియ)** అజ్ఞానముతో కూడియున్న, **(వినై)** కర్మలనెడి, **(వల్ విలజ్గు)** దృఢమైన శృంఖములగు ప్రాప్తివిరోధి, **(ఎన్టివై ఐన్దు)-"పూమకళ్ నాదన్, అన్బన్, ఉపాయమ్, పయన్, విలజ్గు"** అను ఈ అయిదింటికిని, **"ఎన్టు"** అనుదానితో అన్వయము. ఈ అర్థపంచకమును తెలిసి ఆచార్యులు, **(ఇరుళ్ ఒన్టు)** ఈ అయిదు విషయములలో ఒక్కొక్కటిని తెలియకపోవుట అనెడి అనేకవిధములగు అజ్ఞానములలో ఒకటి కూడ, **(ఇలా వకై)** లేనట్లు, అన్నియు పోవునట్లు, **(ఎన్ మనమ్ తేఱ)** నా మనస్సు తేటపడి, నిశ్చయ జ్ఞానమును పొందున్లు, **(ఇయమ్బినర్)** ఉపదేశించిరి.



## తత్త్వత్రయచింతనము

**12** **తేఱ వియమ్బినర్ శిత్తు మశిత్తు మిఱైయు మెన**
**వేఱు పడుమ్ వియన్టత్తువ మూన్టుమ్ వినైయుడమ్బిల్**
**కూఱుపడు క్కొడుమోకము న్దానిఱైయాజ్గుఱిప్పు**
**మాఱ నినైత్తరుళాన్ మఱైనూఱన్ద వాదియరే**

మఱై నూల్ తన్ద = వేదాంత శాస్త్రమును ఉపదేశించిన, ఆదియర్ = పూర్వులు (పూర్వాచార్యులు), వినై ఉడమ్బిల్ = కర్మలవలన కల్గిన ఈ శరీరములో, కూఱు పడుమ్ = భాగమును పొంది, వృద్ధి చెందు, కొడు మోకముమ్ = కఠినమైన (కటువైన) శరీరాత్మ భ్రమయును, తాన్ ఇఱైయామ్ కుఱిప్పుమ్ = స్వతంత్రాత్మభ్రమయు, మాఱ నినైత్తు = (మనకు) తొలగవలయునని మనస్సున తలచి, శిత్తుమ్ అశిత్తుమ్ ఇఱైయుమ్ ఎన = చేతనము, అచేతనము, ఈశ్వరుడు అని, వేఱుపడుమ్ = వేఱుగానున్న, వియన్ తత్తువమ్ మూన్టుమ్ = ఆశ్చర్యకరమైన తత్త్వములు మూడింటిని, అరుళాల్ = మనపైనున్న కృపతో, తేఱ ఇయమ్బినర్ = (మన మనస్సు) తేటపడునట్లు ఉపదేశించిరి.

వేదాంతశాస్త్రమును ఉపదేశించిన ఆళవన్దార్, భగవద్రామానుజులు మొదలగు పూర్వాచార్యులు చేతనులమగు మనకు శరీరాత్మభ్రమ, స్వతంత్రాత్మభ్రమయు తొలగి మనము ఉజ్జీవింపవలెనని మనస్సున తలచి, ఒక్కొక్కటి వేర్వేరు స్వభావములను పొంది, విచిత్రమైయుండు చేతనము,అచేతనము, ఈశ్వరుడు-అను మూడు తత్త్వములను వివేకించి, శ్రీ భాష్యము, సిద్ధిత్రయము మొదలగు గ్రంథములో విశదీకరించిరి.

శరీరాత్మభ్రమ అనగా – అచేతనమైన శరీరమును ఆత్మగా తలచుట.

స్వతంత్రాత్మభ్రమ అనగా– జీవాత్మను భగవానునకు శేషమని భావింపక, స్వతంత్రమైనదని తలచుట. మొదటిది విపరీతజ్ఞానముకాగా, రెండవది అన్యథాజ్ఞానము. ఈ రెండును తగని జ్ఞానములే. ఈ పాశురము తత్త్వత్రయ చింతనాధికారములోనిది.

**ఉత్తమూర్:–**ఈ అధికారారంభమున **"ప్రకృత్యాత్మభ్రాంతిః"** ఇత్యాదిశ్లోకములో అనుగ్రహించిన అర్థమును ఈ పాశురములో సంగ్రహముగా పల్కుచున్నారు.

**(అరుళాల్)**–దయతో, **(మత్తై నూల్)–"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా"** ఇత్యాది శ్రుతిరూప శాస్త్రమును, **(తన్ద ఆదియర్)** ఉపదేశించిన పూర్వాచార్యులు, **(వినై ఉడమ్బిల్)** కర్మమూలమున సంభవించిన దేహములో, **(కూఱుపడుమ్)** భాగమును పొందిన, ఎల్లప్పుడు అనుభవించుచున్న, **(కొడు మోహముమ్)** క్రూరమైన దేహాత్మభ్రాంతియు. **(తాన్ ఇఱై ఆమ్)** తానే ఈశ్వరుడనెడి, **(కుఱిప్పుమ్)** తలపును, స్వస్వాతంత్ర్యభ్రమను, **(మాఱ నినైత్తు)** తమకు తొలగవలెనని మనస్సున తలచి, **(శిత్తుమ్ అశిత్తుమ్)**జీవుడు, అచేతనమును, **(ఇఱై ఆమ్)**ఈశ్వరుడును, **(ఎన)** అని **(వేఱుపడుమ్)** ఒక దానికంటే వేఱొకటి విలక్షణమైన, **(వియన్ తత్త్వమ్)** విలక్షణమైన, ఆశ్చర్యకరమైన తత్త్వములు, **(మూన్ఱుమ్)** మూడును, **(తేఱ ఇయమ్బినర్)** తెలియునట్లు ఉపదేశించిరి. ఈ మూడు తత్త్వములును స్ఫుటముగా తెలిసినగాని స్వస్వాతంత్ర్యభ్రమ, దేహాత్మభ్రాంతియు తొలగవు–అను విషయమును శ్రుతిప్రమాణమూలమున ఉపదేశించిరి.

## భగవానుడే పరదేవత

13. వాదియర్ మన్ను న్దరుక్కచ్చెరుక్కిన్ మత్తై కులైయ
చ్చాదుశనఙ్గ ళడఙ్గ నడుఙ్గ త్తనిత్తనియే
యాది యెనావకై యారణదేశికర్ శాఱ్ఱినర్ నమ్
పోదమరు న్దిరుమాదుడనిన్ఱ పురాణనైయే

వాదియర్ = విపరీతవాదములను చేయువారు, మన్నుమ్ తరుక్క చ్చెరుక్కిన్ = స్థిరమైన తర్కమునుచేయు గర్వముతో, మత్తై కులైయ = వేదము భీతిల్లునట్లు, శాదు శనఙ్గళ్ = సాధుజనులగు పెద్దలు, అడఙ్గ = అందరు, నడుఙ్గ = భయపడునట్లు, తని త్తనియే ఆది ఎనా వకై = తమ తమకు తోచిన రీతిలో (బ్రహ్మ, ఇంద్రుడు మొదలగువారిని) జగత్కారణము అని చెప్పకుండునట్లు, ఆరణ దేశికర్ = వేదాంత శాస్త్రముయొక్క



ఆచార్యులు, పోదు అమరుమ్ = తామరపూవులో నివసించు, తిరుమాదుడన్ = లక్ష్మీదేవితోపాటు, నిన్ఱ = నిలచిన, నమ్ పురాణనైయే = పురాణపురుషుడగు భగవానునే, శాఱ్ఱినర్ = (జగత్కారణమని) స్థాపించిరి.

దుర్వాదములను చేయువారు తమ తమ తర్కములవలన కల్గిన జ్ఞానముతో విఱ్ఱవీగినవారై వేదములు భీతిల్లునట్లు, సత్పురుషులు అందఱు భయపడునట్లును బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు దేవతలలో ఒక్కొక్కరిని తమతమ అభిప్రాయానుసారము పరదేవతగా, జగత్కారణముగా ప్రలపించిరి. వేదాంతసారమును గ్రహించిన మన ఆచార్యులు ఆ అర్థరహితవాదములను ఖండించి, సప్రమాణముగా శ్రీమన్నారాయణుడే జగత్కారణమని స్థాపించిరి.

తర్కశబ్దమే **"తరుక్కు"** అయినది. **"పురాణన్"** అనునపుడు **"పురాఽపి నవమ్"** అను వ్యుత్పత్తిని, **"యః పూర్వాయ వేధసే"** అని, **"జ్యేష్ఠః"** అనియు గల ప్రమాణములను స్మరింపనగును. ఈ పాశురము పరదేవతాపారమార్థ్యాధికారములోనిది.

**ఉత్తమూర్:–** "ఈ అధికారములో "మేము నిష్కర్షించినది అంతయును మహాపురుష నిర్ణయమును చేసిన భగవద్యామునులు, భగవద్రామానుజులు, నడాదూరమ్మాళ్ మొదలగు ఆచార్యుల గ్రంథములకు వివరణమే" ననుచు తెలుపు పాశుర మిది.

**(వాదియర్)** వాదించు ఇతరులు, **(మన్నుమ్)** తమవద్ద నిలిచియున్న, **(తరుక్కమ్ శెరుక్కిన్)** తమ తర్కములనెడి గర్వముతో, **(మత్తై కులైయ)** వేదములన్నియు **"బిభేత్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రతరే దితి"** అని భయపడునట్లు, **(సాదుజనఙ్గళ్)** వాదసామర్థ్యములేక, దృఢమైన తత్త్వజ్ఞానమునుకల సత్పురుషులు, **(అడఙ్గ)** మొత్తము, **(నడుఙ్గ)**– భయపడునట్లును, **(తనిత్తనియే)** వారి వారి ఇష్టప్రకారము బ్రహ్మరుద్రాదులలో ఒక్కొక్కరే, **(ఆది ఎనా వకై)** లోకమునకు కారణము అని అనకుండు రీతిలో, (ఆయా మతవాదులు ఆయా దేవతలను ఆది అని అందురు), **(ఆరణమ్ దేశికర్)** ఆరణ్యక మనబడు వేదాంతమునకు ఆచార్యులైనవారు, **(పోదు అమరుమ్)**– పుష్పములో నిత్యవాసము చేయుచున్న, **(తిరుమాదుడన్)** లక్ష్మీతోకూడ, **(మాదు–**యౌవనమును కల స్త్రీ) **(నిన్ఱ)** ఎవ్వరును తిరస్కరించుటకు వీలులేనట్లు చక్కగా తెలియబడు ప్రసిద్ధుడైన అనాదిపురుషుడే, **"నమ్"** అనుటకు ప్రసిద్ధమైన అను అర్థమును కూడ చెప్పుదురు. **(శాఱ్ఱినర్)** లోకమంతయు తెలియునట్లు ఘోషించి, స్థాపించిరి.

## మోక్షమును ఆశించుట

**14. నిన్ఱ పురాణ నడియిణై యేన్దు నెడుమ్ పయనుమ్**
**పొన్ఱుదలే నిలై యెన్ఱిడ పొఙ్గుమ్ పవక్కడలు**
**నన్ఱిదు తీయదిదెన్ఱు నవిన్ఱవర్ నల్లరుళాల్**
**వెన్ఱు పులన్‌కళై వీడినై వేణ్డుమ్ పెరుమ్బయనే**

నిన్ఱ పురాణన్ = (లక్ష్మీదేవితో కలసి) నిలచియున్న పురాణ పురుషుడైన భగవానుని, అడి ఇణై ఏన్దుమ్ = శ్రీ పాదములు రెండిటిని మోసి, కైంకర్యమును చేయుట అను, నెడుమ్ పయనుమ్ = గొప్ప (మోక్ష) పురుషార్థమును, పొన్ఱుదలే నిలై ఎన్ఱిడ = నశించిపోవుటయే స్వభావమనదగిన, పొఙ్గుమ్ పవమ్ కడలుమ్ = (పైపైకి) వృద్ధి చెందుచున్న సంసారమను సముద్రమును, ఇదు నన్ఱు = ఈ మోక్షము గొప్పది, ఇదు తీయదు = ఈ (సంసారము) చెడ్డది, ఎన్ఱు నవిన్ఱవర్ = అని ఉపదేశించిన ఆచార్యుల, నల్ అరుళాల్ = గొప్ప కృపతో, పులన్‌కళై వెన్ఱు = ఇంద్రియములను జయించి, పెరుమ్ పయన్ = గొప్ప ఫలమగు, వీడినై వేణ్డుమ్ = మోక్షమునే (చేతనుడు) అపేక్షించును.

లక్ష్మీదేవిని ఏనాడును ఎడబాయక, కలసియున్న పురాణపురుషుడగు భగవానుని శ్రీ పాదములను తలపై అలంకారముగా దాల్చి, కైంకర్యమును చేయుట అను మహాపురుషార్థమే మోక్షమనబడును. ఇది ఏనాడును నశింపక, ఎల్లప్పుడును నిలచియుండును. మఱియు, ఎల్లప్పుడు అభివృద్ధిచెందు సంసారసముద్రము నశించుటయే స్వభావముగా గల ఫలమును కల్గినది. ఈ రెండిటిని ఆచార్యులు గమనించి చూచి, మోక్షానందమే చేతనునకు తగినదని, రెండవది అగు సంసారము చేతనునకు తగనిదని ఉపదేశించిరి. ఇతరులను ఉజ్జీవింపచేయుటయే ఫలముగాకల వారి కృపతో తత్త్వజ్ఞానము పొందిన చేతనుడు తన ఇంద్రియములను అల్పవిషయములనుండి నివర్తింపచేసి, మోక్షమును పొంద ప్రయత్నించును.

ఇది ముముక్షుత్వాధికారములోనిది. **"పురాణమ్"** అనుటకు **"పురా అపి నవః"** అను వ్యుత్పత్తినిబట్టి నిత్యనూతనమైన శోభను కలవాడని అర్థము. **"అప్పోదైక్కప్పోదు ఎన్నారావముదమే"** అని కీర్తింపబడు భగవానునియందు ఈ నామము సర్వదా సార్థకము. **"భవ"** శబ్దమే **"పవ"** ముగా మాఱినది.



**ఉత్తమూర్:-** ముముక్షుపదార్థమును ఈ పాశురముతో వివరించుచున్నారు. ఇచట **''వేణ్డుమ్''** అనునది సమాపకక్రియారూపము. **''చేతనన్''** అను కర్తను అధ్యాహరించుకొనవలెను. **"వీట్టినై"** అనునది కర్మ. **(వీట్టినై) "వీడు"** అనగా మోక్షము. మోక్షమును అని అర్థము. పూర్వపాశురము **"తిరుమాదుడన్ నిన్ఱ పురాణనైయే"** అని పూర్తి అగుటచే, ఇచట **"నిన్ఱ"** అనుటకు **"తిరుమాదుడన్ నిన్ఱ"** అను అర్థము చెప్పకుండగనే స్ఫురించును. లేక, **(నిన్ఱ)** ఏనాటికిని నశింపకుండ నిలచియున్న-అని అర్థము. అందుచే ఇతనియొక్క ప్రాప్తి అను మోక్షము నిత్యమని ఏర్పడినది. ఇట్లు నిలచినవాడగు, **(పురాణన్)** అనాదియైన పురుషునియొక్క, **(అడి ఇణై)** ఒక దానితో వేఱొకటి పోలియున్న శ్రీపాదములను, **(ఏన్దుమ్)** శిరసా ధరించుట అనెడి (కైంకర్యమును చేయుట అనెడి), **(నెడుమ్ పయనుమ్)** ఉత్తరకాలమంతయు, దీర్ఘమైన పరమ పురుషార్థమును, **(పొన్ఱుదలే నిలై)** నశించుయటయే దీనికి స్థిరమైన స్వభావము, **(ఎన్ఱిడ)** అనబడునపుడు, **(పొఙ్గుమ్)** మరింతగా వృద్ధి అగునట్టి, **(పవమ్ కడలుమ్)** సంసారసముద్రమును, **(ఇదు నన్ఱు)** పూర్వము తెలుపబడిన మోక్షపురుషార్థమే మంచిది, **(ఇదు తీయదు)** సంసారసముద్రము చెడ్డది, **(ఎన్ఱు నవిన్ఱవర్)** అని ఉపదేశించిన ఆచార్యుల, **(నల్లరుళాల్)** అవ్యాజముగా వచ్చిన కృపచే చేతనుడు, **(పులన్‌కళై వెన్ఱు)** వేఱు పురుషార్థములో ప్రవేశింపకుండునట్లు ఇంద్రియములను జయించి, **(పెరుమ్ పయన్)** మహాపురుషార్థమగు, **(వీట్టినై)** మోక్షమునే, **(వేణ్డుమ్)** కోఱును. పై శ్లోకములోవలె ఇచటకూడ కైవల్యము చెడ్డది అని చెప్పబడినది. **''పవక్కడల్''** అను పదముతో కైవల్యమునుకూడ గ్రహింపవచ్చును. కైవల్యము ప్రకృతిమండలాంతర్గతమే అగుటచేతను, కైవల్యానుభవము ముగిసిన పిమ్మట తిరిగి సంసారమండలమున ప్రవేశింపవలసియుండుటచేతను, అతనినికూడ (కేవలునికూడ) గ్రహించునట్లు ఈ సముద్రము పొంగుచున్నదని భావము. **"నల్లరుళాల్"**-కృపకు మంచి తనమేమనగా దరి చేరినవారు క్షుద్రపురుషార్థములలో పరిభ్రమించుట సహింపలేక, తనకు తానే వెలువడుట. **"వెన్ఱు పులన్‌కళై"** అనునపుడు **"పులన్"** అనగా మనస్సును గ్రహించుటచే ఆత్మానుభవమనెడి ఆకర్షకములో చిక్కుపడకుండుటకై మోక్షములో దృఢాధ్యవసాయమును కల్గి, మనస్సును జయింపవలెనని సూచింపబడినది.

## మోక్షోపాయాధికారుల వర్గీకరణము

**15. వేణ్డుమ్ పెరుమ్ పయన్ వీడెన్ఱఱిన్దు విదివకైయాల్**
**నీణ్డుమ్ కుఱుకియు నిఱ్కు నిలైకళుక్కేఱ్కు మన్బర్**
**మూణ్డొన్ఱిన్ మూలవినై మాఱ్ఱుదలిన్ ముకున్దనడి**
**పూణ్డన్ఱి మఱ్ఱోర్ పుకలొన్ఱిలై యెన నిన్ఱనరే**

వేణ్డుమ్ పెరుమ్ పయన్ = మనము అపేక్షింపదగిన గొప్ప ఫలము, వీడు ఎన్ఱు అఱిన్దు = మోక్షము అని తెలిసి, నీణ్డుమ్ కుఱుకియుమ్ నిఱ్కుమ్ = చిరకాలము అనుష్ఠింపవలసినదిగా, క్షణకాలము అనుష్ఠింపవలసినదిగానుండు, నిలైకళుక్కు= (భక్తి-ప్రపత్తి అను) ఉపాయములకు, విది వకైయాల్ ఏఱ్కుమ్ అన్బర్ = పుణ్యమునందలి తారతమ్యముచే అధికారులైన భాగవతులు, ఒన్ఱిల్ మూణ్డు = (రెండిటిలో) ఒక ఉపాయమును ప్రయత్నించి, మూల వినై మాఱ్ఱుదలిల్ = (సంసారమునకు) కారణమైన కర్మములను పోగొట్టుకొనుటలో, ముకున్దన్ అడి పూణ్డు అన్ఱి = భగవానుని శ్రీ పాదములందు ప్రపత్తిని చేయుటతప్ప, మఱ్ఱు ఓర్ పుకల్ = వేఱొక గొప్ప ఉపాయము, ఒన్ఱు ఇలై ఎన = ఒకటి లేదు అనునట్లు, నిన్ఱనర్ = ఉన్నారు.

భక్తులలోని సుకృతతారతమ్యమునకు తగినట్లు కొందఱు భక్తియోగమును, కొందఱు ప్రపత్తిని తమకు తగిన ఉపాయముగా గ్రహింతురు. భక్తియోగమును అనుష్ఠించువారికి ప్రపత్తిని మోక్షముకొఱకు అనుష్ఠింపనక్కఱలేకపోయినను, ఉపాయమును అనుష్ఠించుటకు అంతవరకు విరోధియైయున్న కర్మలు నశించుటకొఱకు అయినను ప్రపత్తిని తప్పక అనుష్ఠించి తీరవలెను. ఈ పాశురము అధికారివిభాగాధికారములోనిది. **"ముక్తిం దదాతి"** అను వ్యుత్పత్తినికల ముకుందనామము యొక్క ప్రయోగ మిచట గమనింపతగినది. **"విది"** అను శబ్దము సంస్కృతభవము. ఇది అదృష్టమను అర్థము నిచ్చుననుటను **"భాగ్యం స్త్రీ నియతి ర్విధిః"** అను నిఘంటువాక్యము తెలుపును.

**ఉత్తమూర్:-** రహస్యత్రయసారమను గ్రంథము ముముక్షువు ప్రపత్తిని అవశ్యము తెలిసికొనవలయునని రచింపబడినది. భక్త్యుపాయనిష్ఠునకును, లఘూపాయములగు ఆచార్యనిష్ఠ, శ్రీవైష్ణవసంశ్రయణము, విషయవాసము మొదలగు వానియందు ప్రవేశించినవానికి ఈ ప్రపత్తి అక్కఱలేదుకదా! అను శంకను పోగొట్టుటకు ఇచట సద్వారకప్రపత్తినిష్ఠుడు, అద్వారకప్రపత్తినిష్ఠుడు -అని రెండు విధములుగా విభజించి, ముముక్షువులకు అందఱికిని ప్రపత్తి ఆవశ్యకము అనుటను పూర్వము స్థిరీకరించి, దానిని ఇందు సంగ్రహముగా పల్కుచున్నారు.

**(వేణ్డుమ్)-** మనము అపేక్షింపవలసిన, **(పెరుమ్ పయన్)-** గొప్ప ఫలము, **(వీడు)** మోక్షమే, **(ఎన్ఱ అఱిన్దు)** అని తెలిసికొని, **(విది వకైయాల్)** తనకుకల సుకృతముయొక్క విశ్లేషమునకు తగినరీతిలో, **(నీణ్డుమ్)** దీర్ఘకాల సాధ్యముగను, **(కుఱుకియుమ్)** స్వల్పకాలసాధ్యముగను, **(నిఱ్కుమ్)** వ్యవస్థితమైన, **(నిలైకళుక్కు)** ఉపాయములకు, **(ఏఱ్కుమ్)** అర్హులైయున్న కొందరు జ్ఞానశక్త్యాదులుండుటచే గురూపాయమునకు



యోగ్యతను కలవారగుదురు, మఱికొందఱు వానిని లేనివారగుటచే లఘూపాయమునకే అర్హులు -అను రీతిలోనున్నవారగు, **(అన్బర్)** మోక్షములో ప్రాప్యుడైన భగవానునిపట్ల భక్తిని కలవారు. **(ఒన్ఱిల్)** రెండు విధములైన ఉపాయములలో దేనియందైన తగిన ఉపాయములో, **(మూణ్డు)** ప్రవర్తించి, **(మూలవినై మాఱ్ఱుదలిల్)** సంసారకారణమైన కర్మలను నశింపజేయుటకు, **(మఱ్ఱోర్ పుకల్)** వేఱొక గతి, **(ముకున్దన్ అడి)** మోక్షప్రదుడగు ముకుందుని శ్రీపాదములే, **(పూణ్డు అన్ఱి)** ఆశ్రయించిన పిమ్మట కాని, **(ఒన్ఱిలై)** ఏమియు లేదు, **(ఎన నిన్ఱనర్)** తెలిసికొనియున్నవారు. మోక్షమే పరమపురుషార్థమని తెలిసి, అందులకు రెండు విధములైన ఉపాయములను చూచినపుడు పూర్వజన్మసుకృతమునకు అనుగుణమై, ఎవరికి దేనియందు యోగ్యతయో, దానినుండి దానిమూలమున మూలమగు కర్మలను పోగొట్టవచ్చునని తెలిసి, దేనిలో ప్రవేశించినను అతని శ్రీపాదములలో శరణాగతి తప్ప వేఱు గతి లేదు అనెడి నిశ్చయమునకు వచ్చిరని భావము. ఇచట ఉత్తరార్ధములో భక్తిప్రపత్తులనెడి రెండు దారులలో భక్తిలో గాని, ప్రపత్తిలోగాని ప్రవర్తించి, కర్మలను నశింపజేసికొనవలెను. అందులకు భగవచ్ఛరణాగతి తప్ప వేఱు గతిలేదని అర్థమును చెప్పుట తగునా? భక్తిలో ప్రవేశించి, అనాదికర్మలను తొలగించుకొనుటకు ప్రపత్తి అవసరమన్నచో, తగును. ప్రపత్తిలో ప్రవేశించి, కర్మలను పోగొట్టుకొనుటకు ప్రపత్తి కావలయును అని పల్కుట సరిగా లేదే! రెండు ప్రపత్తులను చెప్పునట్లున్న ఇట్లు చెప్పవచ్చునన్నచో, భక్తికిని ప్రపత్తి ఆవశ్యకము అనుటలోనే దీనికి దృష్టి-అని భావము. లేక, భక్తిప్రపత్తులను నేరుగా తెలుపకుండ గురూపాయము, లఘూపాయము అని రెండు విధములుగా నిర్దేశించి, పలు గురూపాయములగు భక్తిమార్గములను, ప్రపత్తి, ఉక్తి, ఆచార్యనిష్ఠ, క్షేత్రవాసము, నామసంకీర్తనము మొదలగు లఘూపాయములను ఆపాతతః వాక్యములనుండి గ్రహించి, ఏదైన ఒకదానియందు ప్రవేశింపవలెనని తలచినవారు, ఎవరు ఏ ఉపాయములో ప్రవేశించినను ఉక్తిక్షేత్రవాసాదులలో ప్రవేశించినను. ప్రపత్తితప్ప వేఱొక గతి లేదు. అనగా-ప్రపత్తిలేకుండ భక్తిని సాధింప వీలుకాదు. ఉక్తి ఆచార్యనిష్ఠలోను ప్రపత్తియే. క్షేత్రవాసాదులకును సద్వారకమో, అద్వారకమో ప్రపత్తి ఆవశ్యకమే అని ఈ అధికారములో పల్కిన రీతిని తెలిపిరని భావము. **"ఓర్, ఒన్ఱు"** అను రెండు పదములు ఎందులకు? అన్నచో **"ఓర్ పుకల్"**-సాటిలేని శరణము. **"భక్త్యా పరమయా వాపి"** అనెడి వచనము నిషేధించుటచే **"ఒన్ఱిలై"** ఏమియు లేదు అనునది దాని అర్థము. ఇందుచే క్షేత్రవాసాదులు పరంపరయా కారణమనుట ఇచట సాధింపబడినది.

**భక్తి-ప్రపత్తులు మోక్షోపాయములు**

**16.** **నిన్ఱ నిలైక్కుఱు నిఱ్కుమ్ కరుమము నేర్మదియా**
**నన్ఱెవ నాడియ ఞానము నల్కు ముట్కణ్ణుడైయా**
**రొన్ఱియ పత్తియు మొన్ఱు మిలా విరైవార్క్కరుళా**
**లన్ఱు పయన్తరుమాఱు మఱిన్దవ రన్దణరే**

నిన్ఱ నిలైక్కు ఉఱు నిఱ్కుమ్ = స్థిరమైన (ఉపాయములో) ప్రయత్నించుటకు తగినట్లున్న, కరుమమ్ = కర్మయోగమును, నేర్ మదియాల్ = సూక్ష్మమైన బుద్ధితో, నన్ఱు ఎన నాడియ = (ఆత్మను దర్శించుటకు) తగినది అని అనుష్ఠింపబడునట్టి, ఞానముమ్ = జ్ఞానయోగమును, నల్కుమ్ ఉళ్ కణ్ ఉడైయార్ ఒన్ఱియ = (జీవుని స్వరూపమును భగవానునకు శేషముగానే కన్పించుటచే సుఖరూపమైయుండి) అభిలషింపబడు (ఆత్మసాక్షాత్కారమను) జ్ఞాననేత్రమును పొందినవారు స్వీకరించిన, భక్తియుమ్ = భక్తి యోగమునుకూడ, ఒన్ఱుమ్ ఇలా విరైవార్క్కు = (ఈ కర్మయోగము మొదలగు వానియందు) దేనియందును శక్తిలేనివారై (మోక్షమును పొందుటకు మాత్రము) ప్రయత్నించువారికి, అన్ఱు = వారు అభిలషింపనపుడు, అరుళాల్ పయన్ తరుమ్ ఆఱుమ్ = భగవత్కృపకు మూలమై, ఫలమును ఇవ్వగల్గిన ఉపాయమగు ప్రపత్తిని, అఱిన్దవర్ అన్దణర్ = (వాని వాని స్వరూపమును స్ఫుటముగా) తెలిసినవారు (వేదమును గ్రహించిన) బ్రాహ్మణులు.

మనస్సును వశపఱచుకొనుటకు సాధనమై, భక్తియోగమునందు ప్రవేశించుటకు మిక్కిలి ఆవశ్యకమైన సాధనమై వెల్గు కర్మయోగము, ఆత్మసాక్షాత్కారమునకు సాధనమైయున్న జ్ఞానయోగము, ఆత్మసాక్షాత్కారమును పొందిన పిమ్మట స్వీకరింపవలసిన భక్తియోగమును - అను వీనిలో దేనియందును శక్తి లేనివారై, మోక్షమును పొందుటకు మాత్రము ప్రయత్నించువారికి అపుడే ఫలమునిచ్చు ఉపాయమగు ప్రపత్తిని సాధనముగా చక్కగా గ్రహించినవారు వేదమును తెలిసిన బ్రాహ్మణులు.

కర్మయోగము అనగా - ఫలసంగము లేక చేయబడు కామ్యకర్మలతో, నిత్యకర్మలతోకూడ నియమముతో అనుష్ఠింపబడునదియై, స్వీకరింపబడిన ఒక విశేష కర్మము. ఇది భగవదారాధనము, తపస్సు, దానము, యాగము-మొదలగు పలు ప్రకారములను కల్గియున్నది. ఇది అనుష్ఠించుటకు సులభమైనది.

జ్ఞానయోగమనగా - భగవానునకు శరీరమైన తన (జీవుని) స్వరూపమును ఎల్లప్పుడు చింతించుచుండుట.



భక్తియోగమనగా - భగవానుని ఎడబాయకుండ ఈ శరీరము పతనమగు వరకు ధ్యానమును చేయుచుండుట. ఈ భక్తియోగము మోక్షమునకు సాక్షాదుపాయము.

ప్రపత్తియోగము అనగా - భగవానుని శరణుపొందుట, భక్తి యోగము, చేయుటకు కఠినమగుటచే, దానినికూడ అనుష్ఠింపలేక, ప్రపత్తిని అనుష్ఠించువారికి భగవానుడు ఆ భక్తియోగస్థానములో, తానే ఉపాయమై నిలచి, అవి ఇచ్చు ఫలమును ఉపాసకుడు కోఱినపుడు తాను ఇచ్చుచున్నాడు.

ఈ పాశురము ఉపాయవిభాగాధికారములోనిది.

**ఉత్తమూర్:-**ఉపాయవిభాగాధికారమున ఇంతవరకు చెప్పినది ఏమనగా ఈశ్వరుడొక్కడే ఉపాయము. వివేకముకలవానికి కర్మయోగాదులు ఉపాయములు కావు, అనుష్ఠింపతగినవి కావు-అని అనుట తప్పు. సాధ్యోపాయము లేనపుడు సిద్ధోపాయమునకు ఉపాయత్వమే సిద్ధించదు. అందుచే సాధ్యోపాయము, సిద్ధోపాయము-అను విభాగమును అంగీకరింపవలెను. అయినను, కర్మయోగ -జ్ఞానయోగములవలె ప్రపత్తియును అప్రధానమై, భక్తియోగ మొక్కటే ఉపాయమనునది లేదు. అట్లే, అకించనునకు ప్రపత్తియును ఉపాయము. కావున సాక్షాత్ సాధ్యోపాయములు, కర్మయోగ జ్ఞానయోగములు రెండు మోక్షమునకు పరంపరయా ఉపాయములు అనెడి విభాగరీతి ఇంతవరకు తెలుపబడినది. ఈ అంశములను ప్రస్తుత పాశురములో సంగ్రహించుచు పల్కుచున్నారు.

**(నిన్ఱ నిలైక్కు)**-ముముక్షువై, ఉపాయానుష్ఠానమును చేయవలెనను నిర్ణయముతోనున్న తన మొదటి స్థితికి, **(ఉఱు)** సంబంధించి, **(నిఱ్కుమ్)** ఉన్న, **(కరుమముమ్)** కర్మయోగమును. **"ఉమ్"** అను ప్రత్యయమునకు సర్వత్ర **"అఱిన్దవర్"** అను పదముతో అన్వయము. **(నేర్ మదియాల్)** కర్మయోగానుష్ఠానముతో స్థిరమైయున్న, సూక్ష్మమగు భక్తిని పొందుటచే, **(నన్ఱు ఎన)** ఇక తనకు జ్ఞానయోగమే మంచిది అగునని, **(నాడియ)** గ్రహించిన, **(ఞానముమ్)** జ్ఞానయోగము, **(నల్కుమ్)** అధికారమునకు తగినట్లు ఆ రెండు యోగములచే కోరబడిన, **(ఉళ్ కణ్)** లోపలనున్న జీవాత్మవిషయమైన సాక్షాత్కారమును, **(ఉడైయార్)** పొందినవారు, **(ఒన్ఱియ)** ఆ ఆత్మసాక్షాత్కారము పూర్ణపురుషార్థము కాదని తెలిసి, పరమాత్మకు చెందిన, **(పత్తియుమ్)** భక్తియోగమును, **(ఒన్ఱుమ్ ఇలా)** పూర్వము తెల్పిన ఉపాయములకు అనర్హులై, అకించనులగు, **(విరైవార్క్కు)** మోక్షఫలమును మిక్కిలి త్వరలో పొందవలెనను అపేక్షను కలవారికి, **(అరుళాల్)** ఉపాయమును ఎదురుచూడకుండ, కరుణచేతనే, **(అన్ఱు)** ఇతడు అపేక్షించు కాలములోనే,

**(పయన్ తరుమ్ ఆఱుమ్)** భగవానుడు మోక్షము నిచ్చుచున్న రీతిని, (ప్రపత్తిని అని భావము) **(అఱిన్దవర్)** తెలిసినవారు "కర్మయోగజ్ఞానయోగములు ఆంతరనేత్రముకొఱకు, భక్తి–ప్రపత్తులు మోక్షముకొఱకు" అని వివేకమును పొందినవారు, **(అన్దణర్)** బ్రహ్మవేత్తలగుదురు.

**ప్రపత్తిని అనుష్ఠింపదగిన అధికారి**

**17.** **అన్దణ రన్దియ రెల్లైయి నిన్ఱ వనైత్తులకు**
**నొన్దవరే ముతలాక నుడఙ్గి యనన్నియరాయ్**
**వన్దడైయుమ్ వకై వన్దకవేన్ది వరున్దియ న**
**మ్మన్దమిలాదియై యన్బరఱిన్దఱివిత్తనరే**

వన్ తకవు ఏన్ది = బలమైన కృపను గొని, వరున్దియ = చేతనులను ఉజ్జీవింపచేయుటకు శ్రమపడినవాడు, నమ్ అన్దమ్ ఇల్ ఆదియై = నాశనము లేనివాడు, జగత్కారణమగు మన భగవానుని, అన్దణర్ = బ్రాహ్మణులనుండి, అన్దియర్ = ఛండాలురవరకు గల, ఎల్లైయిల్ నిన్ఱ = ఈ ఎల్లలో అణగియున్న, అనైత్తు ఉలకుమ్ = సర్వలోకములును, నొన్దవరే ముదలాక = (సంసార తాపముచే) ఆర్తిని పొందినవారే (ముఖ్యమైన) అధికారులై, నుడఙ్గి = (వేరు ఉపాయమును అనుష్ఠింపశక్యము కాకపోవుటచే) మిక్కిలి శ్రమను పొంది, అనన్నియరాయ్ వన్దు = వేరు ఫలమును, వేఱు రక్షకుడు లేనివారై వచ్చి, అడైయుమ్ వకై = శరణు పొందు రీతిని, అన్బర్ అఱివిత్తనర్ = (మనపట్ల) కరుణనుకల ఆచార్యులు తెలిపిరి.

సర్వేశ్వరుడు నాశములేనివాడు, జగత్కారణభూతుడును. అతనికి మనపైకల కరుణ మనమెన్ని అపరాధములు చేసినను కొఱతపడదు. మనవద్ద సత్కర్మలవలన ఏర్పడిన పుణ్యము మొదలగు అల్పవ్యాజములనే ఆధారముగా గొని అతడు మనలను ఉజ్జీవింపజేయుటకు దారి వెదకును. ఇట్టి స్వామి శ్రీపాదములలో బ్రాహ్మణులనుండి అంతిమవర్ణమువారివరకుగల సకలజాతులకు చెందినవారును ప్రపత్తిని అనుష్ఠింపవచ్చును. దీనికి జాత్యాదినియమములు లేవు. సంసారతాపముతో బాధపడి, వేఱు ఉపాయమును, వేఱు ఫలమును, వేఱు దైవములను అన్వేషింపనివారు ఎవరైనను ఈ ప్రపత్తికిని అధికారులగుదురు. ఈ విషయములను తెలిసి ఆచార్యులు మనకు ఉపదేశించిరి.

**ఉత్తమూర్:**–అకించనులకే ప్రపత్తిలో అధికారము కలదనుటను తెలిపి, మఱల ఇది సర్వాధికారమనినచో విరోధము రాదా? అని శంకింపనక్కఱ లేదు. సర్వపదమనునది



భక్తియోగమునకువలె దీనికి త్రైవర్ణకులే అధికారులను నియమము లేదు. ఇది సర్వాధికారమే–అను ఈ విషయమును ప్రకృతపాశురములో తెలుపుచున్నారు.

**(నొన్దవరే ముదలాక)** అను పదముతో ప్రారంభింపనగును. ఆ పిమ్మట **"మేలే వకై"** అను పదమును తదనంతరపదములోనే అన్వయించి, **"ఆది"**అనుటను **"అఱివిత్తనర్"** అను క్రియకు కర్మగా చేయవచ్చును. కాని, ఈ అధికారమునకు ముఖ్యమైన సర్వాధికారత్వమును పాశురములో గ్రహించుట. యుక్తము. కావున **"ఆదియై అఱివిత్తనర్"** అని అన్వయింపకుండ **"వకై అఱివిత్తనర్"** అని అన్వయింపవలెను. కావున అన్వయక్రమమేమనగా –

**(నొన్దవరే ముదలాక)** భక్తివిషయములో జ్ఞానాదులు లేకపోవుటచే బాధపడడినవారే ప్రధాన అధికారులైయుండుటచే, **(అన్దణర్)** బ్రాహ్మణులు, **(అన్దియర్)** సంకరజాతివరకు నున్నవారు అను, **(ఎల్లైయిల్)** అను ఈ రెండు ఎల్లల మధ్యలో, **(నిన్ఱ)** ఉన్న, **(అనైత్తు ఉలకుమ్)** అన్నిజాతులకు చెందినవారు, **(నుడఙ్గి)**కృశులై, అనన్యులై, **(వన్దు)** వేఱు ఉపాయోపేయములు లేనివారై వచ్చి, **(వల్ తకవు)** ఉపాయమును ఎదురుచూడకుండ ఫలమును ఇవ్వగల గొప్ప దయను, **(ఏన్ది)** పొంది, **(వరున్దియ)**–అందులకొఱకు జీవులు చేరునట్లు ప్రయాసపడువాడు, **(అన్దమ్ ఇల్)** త్రివిధపరిచ్ఛేదరహితుడును అగు, **(నమ్ ఆదియై)** జగత్కారణమైన మన నారాయణుని, **(అడైయుమ్ వకై)** శరణాగతిని చేయు రీతిని, **(అఱిన్దు)** నిర్ణయించి, **(అన్బర్)** శిష్యులపట్ల ప్రేమను కల ఆచార్యులు, **(అఱివిత్తనర్)** –ఉపదేశించిరి. భగవానుడు నిరపేక్షరక్షకుడు అగుటచే, కృపాశీలి అగుటచే ఏ జాతివారైనను "మనము ఆకించనులముకదా! మన మెట్లు మోక్షమును పొందగలము?" అని బాధపడినపుడు, అతనిని ఆశ్రయింపవచ్చును అనుచు సర్వాధికారత్వమును మనకు తెలిపిరి. భక్తికి అధికార మనగా 1. భక్తివిషయజ్ఞానము, 2. దానిని అనుష్ఠించు శక్తి, 3. అందులకవసరమగు జాత్యాదులను కల్గియుండుట, 4. ఆలసించి ప్రాప్తియొక్క అవసాన కాలములోనైనను మోక్షమును పొందవలెనను ఆశ–అని నాల్గు విధములు. ఈ నాల్గింటిలో ఏ ఒక్కటి లేకున్నను అధికారము లేకుండపోవును. ఈ అధికారము లేకుండుట అనెడి అధికారములు ఒకటి లేకుండుటవలన, రెండు లేకుండుటవలన, మూడు లేకుండుటవలన, నాల్గు లేకుండుట వలన ఏర్పడవచ్చును. వానిని లెక్కించినచో ఒక్కొక్కటి లేకుండుటచే నాల్గు అగును. రెండు రెండు లేకుండుటచే ఆఱు అగును. మూడు మూడు లేకుండుటచే నాల్గు అగును.

అన్నియు లేకుండుటవలన నాల్గు అగును. ఇట్లు మొత్తము పదునైదు విధములుగా ఈ అధికారముండును. ఇచట ప్రారబ్ధావసానములో మోక్షము పొందవలెనను ఆశ లేకపోవుట అనుటకు ప్రాప్తకాలములోనే మోక్షమును పొందవలయుననెడి ఆశ అనుటయందే పూర్ణత.

**18. అతివిత్తన రన్బరైయమ్ పత్తైయు ముపాయ మిల్లా**
**త్తుఅవిత్తునియిన్ఱి యామ్ పరనై వరిక్కుమ్ వకై**
**యుఅవిత్తనై యిన్ఱి యొత్తారెన నిన్ఱ వుమ్బరై నామ్**
**పిఅవిత్తుయర్ శెకుప్పీరెన్ఱిరక్కుమ్ పిழ్ఱైయఅవే**

ఉఅవు ఇత్తనై ఇన్ఱి = (మనతో) సంబంధమును కొంచెముకూడ లేకుండ, ఒత్తార్ ఎన నిన్ఱ = (మనకు) సమానులు అని పల్కునట్లున్న, అన్బరై = (బ్రహ్మ, రుద్రుడు మొదలగు) దేవతలను, పిఅవి త్తుయర్ శెకుప్పీర్ = "(మా) సంసార దుఃఖమును పోగొట్టుదురుగాక", ఎన్ఱు నామ్ ఇరక్కుమ్– అని మనము యాచించుట అను, పిழ్ఱై అఅ = దోషము లేకుండునట్లు, ఐయమ్ పత్తైయుమ్ =(మనచే అనుష్ఠింపవీలగునా? అను) సందేహమును ప్రకటింపరానిదైన, ఉపాయమ్ ఇల్లా = (భక్తియోగము మొదలగు) ఉపాయములను అనుష్ఠింపలేకపోవుట అనెడి, తుఅవి త్తునియిల్ = దారిద్ర్యముచే ఏర్పడిన దుర్దశలో, తుణై ఆమ్ పరనై = సహాయముగానుండు సర్వేశ్వరుని, వరిక్కుమ్ వకై = శరణు పొందు ప్రకారమును, అన్బర్ అతివిత్తనర్ = మనపట్ల ప్రేమగల ఆచార్యులు ఉపదేశించిరి.

**"నమ్ అన్దమిలాదియై అడైయుమ్ వకై అన్బర్ అతివిత్తనర్"** అని అన్వయము. సంస్కృత **''అనన్య''** శబ్దమే **''అనన్నియ''** అయినది. ఈ పాశురము పరికరవిభాగాధికారములోనిది.

భక్తియోగము మొదలగు ఉపాయములు అనుష్ఠింప సాధ్యమగునో? కాదో? అను సందేహమును కల్గించును. వానిలో శక్తిలేక ఫలమును పొందుటకు మాత్రము మిక్కిలి ఆతురతను కల్గియుండు మనకు భగవానుని మహిమను తెలిసి భయపడి వెనుకకు తగ్గకుండ, అతని సౌలభ్యమును దర్శించి సమీపించి, తగిన అంగములతో కూడిన ప్రపత్తిని అనుష్ఠించు రీతిని మన ఆచార్యులు ఉపదేశించిరి. వారు ఇట్లు అనుగ్రహింపకపోయినచో, మనస్సున తేటపడని మనకు బ్రహ్మరుద్రాది దేవతలవద్దకు పోయి, సంసారదుఃఖమును పోగొట్టుడని ప్రార్థింప వలసిన స్థితి ఏర్పడియుండును. మనకట్టి స్థితి ఏర్పడకుండ మనలను ఆచార్యులు రక్షించిరి.



**ఉత్తమూర్:–** విశ్వాసమహత్త్వసిద్ధికొఱకు పురుషకారవిశేషాదులనువలె, అయిదు అంగములను ఆచార్యకటాక్షముతో తెలిసినవారికి దేవతాంతరమూలముగా పొందుటకు వీలుకాని మోక్షముతో పాటు అన్నియు త్వరగా సిద్ధించునని తెలుపుటకు ఈ పాశురము రచింపబడినది.

**(ఉఅవు)–** స్వామిత్వాది సంబంధము, **(ఇత్తనై అన్ఱి)** కొంచెముకూడ లేకుండ, **(ఒత్తార్ ఎన)** మనకు సమమై కర్మవశ్యులే అనునట్లు, **(నిన్ఱ)** శాస్త్రమూలముగా నిశ్చయింపబడిన, **(ఉమ్బరై)** దేవతాంతరములను, **(ఎజ్గళ్ పిఅవి త్తుయర్)** మా సంసార దుఃఖమును, **(శెకుప్పీర్)** పోగొట్టుడు, **(ఎన్ఱు నామ్ ఇరక్కుమ్)** అనునట్లు మేము యాచించుచున్న, **(పిழ్ఱై)** దోషము, **(అఅ)** తొలగునట్లు, **(అన్బర్)** వాత్సల్యమును కల ఆచార్యులు, **(ఐయమ్ పత్తైయామ్)** సందేహమును ఘోషించుచున్న, కనబడునబడునపుడే.. "నన్ను అనుష్ఠించుటకు మీరు ప్రయత్నింపవలదు. మీరు పూర్తి చేయుట సందేహమే" అని మనలను చూచి పల్కుచున్నట్లున్న, **(వఱుమైయినాల్)** దారిద్ర్యముచే ఏర్పడిన, **(తునియిల్)** దుఃఖములో, (దుష్కరమైన ఉపాసనను విడచి, అకించనులమై మేము బాధపడునపుడు–అని భావము.) **(తుణైయామ్)** ఉపాయస్థానములో నిలచి రక్షించువాడై, సులభుడైన, **(పరనై)** సర్వశక్తుడగు పరమాత్మను, **(వరిక్కుమ్ వకై)** మనము ప్రార్థించు ప్రకారమును, **(అతివిత్తనర్)** ఉపదేశించిరి.

ఆచార్యమూలముగా కర్మయోగాది స్వరూపములనుగూర్చి అడిగినపుడు మనకు అది చేయవీలుకాదని నిశ్చయించి, ఫలమున ఆశ విడువకుండనుండు మనలను చూచి, వాత్సల్యముతో ఆ ఆచార్యులే ''పరుడైయుండు ఆ స్వామియే అకించనులకు సహాయభూతుడు. అతనిని ఈ అయిదు అంగములతోకూడిన భరన్యాసమును చేసి ఆశ్రయింపుడు.." అని ఉపదేశించిరి. ఈ ప్రపత్తిని వీరు ఉపదేశింపకపోయినచో, వేఱు గతిలేకుండ చాలా కాలమునకు పిమ్మటకూడ భక్తియోగము సిద్ధింపవలెనని అందులోనే ప్రయత్నించి దానికి పరంపరాకారణమైన నిష్కామకర్మయోగమునందు దిగినపుడు, అపుడు అడ్డుకొనుటకు దేవతాంతరములుకూడుట నిశ్చయము. అపుడు వారిని చూచి "నాకు సంసార దుఃఖమును తీర్చుటకు మీరు సహాయకులుగా కావలయును. నన్ను మీకు దాసునిగా చేసికొనునప్పుడు. ఆ ఫలమును ఇచ్చుటకు మీకు శక్తి ఉన్నచో మీరే ఇచ్చెదరుగాక." అను రీతిలో వేడుకొనుచు ఈ సంసారములో పరిభ్రమించుటయే సంభవించును. మనకు ఆ దోషము లేకుండ తీరినది. ఉపదేశమును చేయు ఆచార్యులు

అయిదు అంగములను ఉపదేశింపకుండ భరన్యాసమును మాత్రము ఉపదేశించినచో, అఱ కొఱ అగు అనుష్ఠానమువలన ఆ మహాఫలము సిద్ధించుటకు అవకాశము లేదు. కావున (ప్రపత్తిలోకూడ నమ్మిక నశించి) తిరిగి దేవతాంతరముల పాదములలో పడుటయే సంభవించును అని భావము. దీనికి అనుగుణముగా ఈ పాశురములో అధికారార్థమైన ప్రపత్తి అంగములు అయిదు అనుటను ఒక విధముగా స్పష్టముగా సూచించు రీతిలో **"ఐయుమ్ పఱైయుమ్"** అనుచోట **"ఐ, అమ్"** అని విభజించి, **"పఱైయుమ్"** అనుటను **"వకై"** అనుటకు విశేషణముగా అన్వయించి, **"ఐ"** అయిదు, సంఖ్యను కల, **"అమ్"**-అందమైన, **"పఱైయుమ్"** శాస్త్రములలో ఘోషించినరీతిలో, **"వకై"** -ఉపాయములు లేకుండుటచే దుఃఖించు సమయమున సహాయముగానున్న పరుని ఆశ్రయించుట అను) అంగములను, **"అఱివిత్తనర్"** తెలిపిరి-అను అర్థమును గ్రహింపవచ్చును. **"ఐన్దు వకైకళ్"** అనుటచే పురుషకారవిశేషాదులు అయిదునుకూడ ఈ అధికారములో సూచింపబడినవి అని తెలుపబడినది. **"తుఱవి త్తునియిల్"** అనునపుడు **"తుఱవి"** అని పదమును విభజించునట్లు **"తుఱవు ఇ తునియిల్"** అని విభజించి, **"తుఱవు"** దారిద్ర్యము, అనెడి **"ఇ"** ఈ అనుభవసిద్ధమైన దుఃఖములో-అని వ్యాఖ్యానింపవచ్చును. **"తుఱవి"** అను పదము **"తుఱైవు"** (దారిద్ర్యము)ను కలవాడు అను అర్థముననే ప్రసిద్ధము.

### ప్రపత్తిస్వరూపవివరణము

**19.** **అఱవే పర మెన్ఱడైక్కలమ్ వైత్తన రన్ఱు నమ్మై**
**ప్పెఱవే కరుది ప్పెరున్దకవుళ్ళ పిరానడిక్కీఴ్**
**ఉఱవేయివనుయిర్ కాక్కిన్ఱ వోరుయిరుణ్మైయై నీ**
**మఱవే లెన నమ్మఱైముడి శూడియ మన్నవరే**

మఱై ముడి శూడియ = వేదాంతమను సామ్రాజ్యమునందు అభిషిక్తులైయున్న, నమ్ మన్నవర్ = ప్రభువులగు మన ఆచార్యులు, ఉఱవు ఏయ్ ఇవన్ ఉయిర్ కాక్కిన్ఱ = (తన) సంబంధమును కల్గియున్న చేతనుని స్వరూపమును కాపాడువాడు, ఓర్ ఉయిర్= (లోకమున కంతటికిని) ఒకే అంతర్యామియై యున్నవాడును అగు భగవానునియొక్క, ఉణ్మైయై నీ మఱవేల్ ఎన = స్వభావమును నీవు మఱువకుము-అని (శిక్షించి), అన్ఱు నమ్మై పెఱవే కరుది = అనాదిగా మనలను పొందుటకే ఆసక్తిని కలవాడైయుండి, పెరుమ్ తకవు ఉళ్ళ = అంతులేని కృపను కలవాడైన, పిరాన్ అడిక్కీఴ్ = భగవానుని శ్రీ



పాదములక్రింద, పరమ్ అఱవే అన్ఱు = (చేతనుని) భారము తీరవలెనని (తలచి), అడైక్కలమ్ వైత్తనర్ = రక్షింపబడవలసిన వస్తువుగా సమర్పించిరి.

ఈ పాశురము సాంగప్రధానాధికారములోనిది. సంస్కృతములోని **"భర"** శబ్దమే పరమైనది.

భగవానుడు మనకు, అతనికి మధ్యగల నిత్యమైన సంబంధమువలననే మనలను రక్షించు బాధ్యతను కల్గియున్నాడు. అనాదికాలముగా మనలను పొందదలచి మనపై కరుణను కురిపించుచున్నాడు. ఇట్టి సర్వేశ్వరుని శ్రీ పాదములందు రక్షింపబడవలసిన వస్తువుగా వేదాంతముయొక్క అంతమును (నిర్ణయమును) గమనించిన మన ఆచార్యులు మనలను సమర్పించిరి.

**"మఱైముడి శూడియ"** - అనగా వేదాంతముయొక్క తాత్పర్యమును నిశ్చయించు సామర్థ్యమును పొందియుండుట. ఇది విశిష్టమైన అలంకారిక ప్రయోగము.

**"మన్నవర్ పిరాన్ అడిక్కీఴ్.... అడైక్కలమ్ వైత్తనర్"** - అని అన్వయము.

**ఉత్తమూర్:-** ఈ ప్రపత్తివిషయమున ఆచార్యనిష్ఠయందు ఆదరమును స్ఫురించునట్లు ప్రకృత పాశురమును అనుగ్రహించుచున్నారు. **"వైత్తనర్"** అను సమాపకక్రియకు **"మన్నవర్"** అనునది కర్తృపదము.

**(మఱై)** వేదములలోని వేదాంతనిర్వాహములో, **(ముడి శూడియ)** అభిషేకింపబడిన, **(నమ్ మన్నవర్)** ప్రభువులగు మన ఆచార్యులు, **(ఉఱవే)** శేషశేషిభావమనెడి సంబంధముతో, **(ఇవన్ ఉయిర్)** ఆచార్యసంబంధమును పొందునట్లు. జన్మను పొందినవాని ఆత్మస్వరూపమును. **(కాక్కిన్ఱ)** రక్షించువాడగు, **(ఓర్ ఉయిర్)** సాటిలేని పరమాత్మయొక్క, **(ఉణ్మైయై)** తత్త్వసిద్ధిని, **(నీ మఱవేల్)** నీవు మఱువరాదు, **(ఎన)** అని ఒక్కొక్క శిష్యునకును ఉపదేశించి, శిక్షించిన పిదప, **(అన్ఱు)** అనాదికాలముగా, **(నమ్మై పెఱవే)** అకించనులమగు మనలనుకూడ పొందవలెనని, **(కరుది)** భావించి, **(పెరు తకవు)** గొప్ప దయను, **(ఉళ్ళ)** పొందియున్న, **(పిరాన్)** ఉపకారకుని, **(అడిక్కీఴ్)** శ్రీపాదముల క్రింద, **(అఱవే)** భరము తీరు రీతిలో, **(భర మెన్ఱు)** ఈ చేతనుడు నీకు భరమగుచున్నాడు అని విజ్ఞాపించి, **(అడైక్కలమ్)** రక్ష్యవస్తువుగా, **(వైత్తనర్)**సమర్పించిరి. తమ శిష్యులగు జీవాత్మల రక్షణభరము తమ శిష్యులకును, తమకునులేకుండునట్లు

భగవానుని సన్నిధిలో **"తవ సేవకో౽హమ్"** అని విజ్ఞాపించి, వాని శ్రీపాదములక్రింద చేర్చిరి. దానికి ముందు ఒక్కొక్కశిష్యునకును "ముఖ్యోపాయానుష్ఠానశక్తి లేకున్నను, సంబంధమును ప్రధానముగా చేసికొని, అకించనునికూడ రక్షింపవలెనని అనాదికాలముగా గొప్ప కృపతో ప్రతీక్షించుచున్న మహోపకారకుడతడు-అనెడి నిజమును మఱచి, ఏదైన ఒక ఉపాయములో ప్రవర్తింపకుము" అని ప్రత్యేకప్రత్యేకముగా ఉపదేశించిరి. ఇది అంతయు ఆచార్యులు వేదార్థనిష్కర్షము చేయుటలో అగ్రేసరులైయుండి, సంసారములో తపించు మనలను రక్షించుటకు కంకణమును కట్టుకొని, మహాకారుణికులైయుండుటచేతనే -అని చెప్పబడినట్లయినది.

**"అఱవే భర"** మనునపుడు **"భరమ్ అఱ"** అని రక్షాభరము తీరునట్లు-అని అందఱును వ్యాఖ్యానించిరి. సారదీపికలో మాత్రము, **"అఱ"** -తొలగునట్లు, **"భర మెన్ఱు"** ఈ రక్షాభరము నీదే అని విజ్ఞాపించి-అని వివరింపబడినది. ఈ అన్వయమున **"ఎన్ఱు"** అను పదము నిరర్థకము కాదు. **"అఱ"** అనునపుడుకూడ **"భర"** మనెడి కర్త తానుగా సిద్ధము. ఇక, "భరము తీరునట్లు, **(అడైక్కల మెన్ఱు)** రక్ష్యవస్తువని విజ్ఞాపించి, మనలను శ్రీపాదములచెంత చేర్చిరి అనియును వ్యాఖ్యానింపవచ్చును. **"అన్ఱు"** అనుటకు అనాదికాలముగా అను అర్థము తెలుపబడినది. నాల్గవపాదములో **"మఱవేల్ ఎన"** -**"మఱవేల్ ఎన్న"** - నీవు మఱువవద్దు అని ఉపదేశించుటకు, **"మన్నవర్"** -ఆచార్యులయ్యిరి అనియు అన్వయింపవచ్చును. ఇచట **"భరమ్ అఱ"** అనుటచే నిర్భరత్వము, ఏకారార్థముచే నిస్సంశయత్వము, **"పెరున్దక వుఱ౦ పిరాన్ అడిక్కీ౾"** అనుటచే దృప్తమనస్కులైయుండుటయును సూచింపబడినదని తిరుక్కుడన్దైస్వామి అనుగ్రహించిరి.

ప్రపత్తి చేసిన అనంతరము నిర్భయముగా నుండుట

**20.** **మన్నవర్ విణ్ణవర్ వానోరిఱైయొన్ఱుమ్ వాన్ కరుత్తోర్**
**అన్నవర్ వేళ్వి యనైత్తు ముడిత్తన రన్బుడైయార్**
**క్కెన్న వర న్దర వెన్ఱ నమ్మత్తిగిరిత్తిరుమాన్**
**మున్నమ్ వరున్ది యడైక్కలమ్ కొణ్డనమ్ ముక్కియరే**

అన్బు ఉడైయార్క్కు = (తన పట్ల) భక్తిని కలవారికి, ఎన్న వరమ్ తర ఎన్ఱ = వారిని చేరినవారికికూడ మోక్షమును ఇచ్చిన పిమ్మటకూడ ఇంకను ఏ వరమును ఇచ్చెదను?



అను ఆలోచనను కల, నమ్ అత్తిగిరి త్తిరుమాల్ = మన హస్తిగిరిలో వేంచేసియున్న శ్రియఃపతి, మున్నమ్ వరున్ది = ముందుగానే ప్రయత్నించి, అడైక్కలమ్ కొణ్డ = రక్షింపబడవలసిన వస్తువుగా అంగీకరించిన, నమ్ ముక్కియర్ = మనకు ముఖ్యులైన ప్రపన్నులు, మన్నవర్ = (మనకు) ప్రభువులుగా, విణ్ణవర్ = నిత్యసూరులుగా, వానోర్ ఇఱై ఒన్ఱుమ్ వాన్ కరుత్తోర్ = నిత్యసూరులకు నాయకుడగు భగవానుడు వేంచేసియున్న పరమపదమునందే మనస్సును కలవారుగను, అన్నవర్ = పరమహంసలుగా లేక, హంసవలె సారమును గ్రహించువారుగను, వేళ్వి అనైత్తుమ్ ముడిత్తనర్= సకలయాగములను పూర్తి చేసినవారుగను అగుదురు.

తన భక్తులకు (వారికి చెందిన వారికిని) మోక్షమువరకుగల ఫలమును ఇచ్చుచున్నను తృప్తి పొందక, ఇంకను ఏమి వరమును ఇవ్వగలను అని ఆలోచించు మన వరదరాజస్వామి శ్రీ పాదములందు శరణాగతి చేసిన ప్రపన్నులు మనకు ప్రభువులుగా, నిత్యసూరులుగా, పరమ పదమునందే అభిప్రాయమును కలవారిగా పరమహంసలుగా, హంసవలె సారమును గ్రహించువారిగా **"విదుః కృష్ణం బ్రాహ్మణా స్తత్త్వతో యేతేషాం రాజన్ సర్వయజ్ఞాః సమాప్తాః"**, **"శెయ్దవేళ్వియర్"** అనునట్లు సకలయాగములను పూర్తి చేసినవారుగా అగుదురు.

ఈ పాశురము కృతకృత్యాధికారములోనిది **"హస్తిగిరి, ముఖ్య"** శబ్దములే **"అత్తిగిరి, ముక్కియ"** గా మాఱినవి. **"అన్బుడైయవర్క్కు ఎన్న వరమ్ తర ఎన్ఱ"** అను ప్రయోగమునకు అనుగుణముగా **"ఎన్ అడియార్క్కు ఎన్ శెయ్‌వన్ ? ఎన్నే ఇరుత్తి నీ"** ఇత్యాది దివ్యసూరిసూక్త్యర్థములు, **"ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా కస్మైచి దంజలిభరం వహతే వితీర్య, తస్మై న కించి దుచితం కృత మిత్యథాంబ త్వం లజ్జసే"** ఇత్యాది పూర్వాచార్యసూక్తులును భావ్యములు.

**ఉత్తమూర్:–** ఇందు కృతకృత్యులగు ప్రపన్నులను పలు రీతులలో కీర్తించి పల్కుచున్నారు.

**(అన్బు ఉడైయార్క్కు)** తనవద్ద భక్తిని కలవారికి, **(తర)** తాను ఇచ్చునట్లు, **(వరమ్)** వారు అపేక్షించుచున్న వరము, **(ఎన్న)** ఏది అగును? **(ఎన్ఱుమ్)** అని చింతించుచున్న, వరదుడను తిరునామమును పొందిన, **(నమ్)** మన కులదైవమైన, **(అత్తికిరి తిరుమాల్)** హస్తగిరిలో వేంచేసియుండు శ్రియఃపతిచే, **(మున్నమ్ వరున్ది)** ప్రపన్నులు తనను ఆశ్రయించుటకుముందే, అనాదికాలముగానే, ఎపుడు వారు చ్చెదరా! అని బాధపడుచు, **(అడైక్కలమ్ కొణ్డ)** స్వామిచే తనకు రక్ష్యవస్తువుగా భరముగా, సంతోషించి గ్రహింపబడిన, **(నమ్ ముక్కియర్)** మనకు స్వాములై, ముముక్షువులలో

ముఖ్యులగు ప్రపన్నులు, **(మన్నవర్)** మా ప్రభువులగుదురు. ప్రజలందఱిచేత గౌరవింపబడువారగుదురు. **(విణ్ణవర్)** అట్టి గౌరవనీయులచేతను ఆరాధింపబడు దేవతలును అగుదురు. **(వానోర్)** పరమపదములో నుండు నిత్యసూరులకు, **(ఇఱై)** స్వామియగు పరవాసుదేవుడు, **(ఎన్ఱుమ్)** ఎల్లప్పుడు, విడువకుండ చేరియున్న, **(వాన్)** పరమపదములో, **(కరుత్తోర్)** మనస్సునుకల పరమైకాంతులు అగుదురు. లేక, **(వానోరిఱై ఒన్ఱుమ్)** ఎల్లప్పుడును విడువకుండ విషయమైయున్న, **(వాన్)** గొప్ప, తైలధారవలె అవిచ్ఛిన్నమైన **(కరుత్తు)** ధ్యానము. దానినికల భక్తులు అగుదురు-అనియును భావము. **(అన్నవర్) "అన్నమ్"** అనగా హంస. దానివలె సారాసారములను వివేకింపగల శక్తిని పొందిన పరమహంసలగుదురు. **"అన్నవర్"** అనుటకు ఆ స్వభావమును కలవారు అను అర్థము ప్రసిద్ధము. అపుడు **"వాన్ కరుత్తోర్"** అనునది భగవదభిమానపాత్రులగు స్వర్గవాసులైన సనకాదులను తెలిపి, వారితో సమానులైన విరక్తులగు భిక్షుకులు అనియును చెప్పవచ్చును. **(వేళ్వి అనైత్తుమ్)** అనగా యాగములను చేసి ముగించినవారు, భిక్షుకులకును ఆశ్రయమైన, శ్రేష్ఠులైన గృహస్థులు. ప్రపన్నులను **"అనుష్ఠితక్రతుశ్శతః"-"శెయ్ద వేళ్వియన్"** అని పొగడిరి. అదేరీతిలో వారిని **"మన్నవర్, విణ్ణవర్"** అని స్తుతింపవచ్చును. **"వానోర్"** అనుటచే నిత్యసూరులకు సమానులని అర్థము. **"ఇఱై"** ఇత్యాదిచే సనకాదులకు సములని తెలుపబడినది. విరక్తి కొంత తక్కువగా నున్నను లోక-పుత్ర-విత్తాదులనువిడచిన భిక్షకులకు సములుగను చెప్పవచ్చును. నిజమును **"సత్కర్మనిరతా శ్శుద్ధాః సాంఖ్యయోగవిద స్తథా, నార్హంతి శరణస్థస్య కలాం కోటితమా మపి"** అనునట్టు భక్తులకంటెను గొప్పగా పొగడియుండుటచే, వీరే ముఖ్యులని గ్రహింపవలెనని భావము. **"ఎన్న వరమ్ తర"** అనునపుడు **"తర వరమ్ ఎన్న"** అని మార్చుకొనవలెను. **"ఎన్ఱు"** అని **"ఎన్ఱ"** అనియును పాఠములు. **"ఎన్నుమ్"** అనియును ఉండవచ్చును.

**ప్రపన్నునియందు గొప్ప అభిజ్ఞానములను గుర్తించుట**

**21.** **ముక్కియ మన్దిరమ్ కాట్టియ మూన్ఱి నిలైయుడైయార్**
**తక్కవై యన్ఱి త్తకాదవై యొన్ఱు న్దమక్కిశైయార్**
**ఇక్కరు మఙ్గళెమక్కుళ వెన్ఱు మిలక్కణత్తాన్**
**మిక్క వుణర్త్తియర్ మేదిని మేవియ విణ్ణవరే**

ముక్కియ మన్దిరమ్ కాట్టియ = ముఖ్యమైన మంత్రమగు తిరుమంత్రముచే వ్యక్తీకరింపబడిన, మూన్ఱిల్ నిలై ఉడైయార్ = (స్వరూపము, ఉపాయము,



పురుషార్థము-అను) మూడింటియందు నిష్ఠను కల్గినవారు, తక్కవై అన్ఱి = (తమకు) ఉచితమైన మంచి కర్మలను తప్ప, తకాదవై ఒన్ఱుమ్ = తగని కర్మలలో దేనిని, తమక్కు ఇశైయార్= తమకు (చేయ తగినవిగా) అంగీకరింపరు, ఇక్కరుమఙ్గళ్ = (స్వనిష్ఠకు చిహ్నమైన) ఈ కార్యములు, ఎమక్కు ఉళ ఎన్ఱుమ్ = మాకు కలవు అనెడి, ఇలక్కణత్తాల్ = చిహ్నముతో, మిక్క ఉణర్త్తియర్ = గొప్ప నిశ్చయజ్ఞానమును కలవారగు ఆ అధికారులు, మేదిని మేవియ = భూమియందు అవతరించిన, విణ్ణవరే = నిత్యసూరులే అగుదురు.

ఈ పాశురము స్వనిష్ఠాభిజ్ఞానాధికారములోనిది. **"మంత్ర, కర్మ, లక్షణ"** శబ్దములు **"మన్దిరమ్ కరుమమ్, ఇలక్కణమ్"**గా మాఱినవి.

అష్టాక్షరిలో చెప్పబడిన స్వరూపోపాయపురుషార్థములందు నిష్ఠలు అను మూడు నిష్ఠలను కలవారు తమకు ఉచితమైన నిత్య-నైమిత్తికకర్మలను తప్ప, తగని కర్మలను చేయప్రయత్నింపరు. తమ నిష్ఠయొక్క గుర్తులను తమయందు నిశ్చయముగా దర్శించిన ప్రపన్నులు భూమిలోనున్న నిత్యసూరులుగా కొనియాడబడుదురు.

రహస్యార్థములను తెలిసి, ప్రపత్తిని అనుష్ఠించినవానికి పలు కృత్యములు చేయవలసియుండును. ఇవి ప్రపన్నుని నిష్ఠకు చిహ్నములు. నిష్ఠ అనగా - స్వరూప- ఉపాయ- పురుషార్థములు - అను వీనినిగూర్చి నిశ్చయమైన జ్ఞానము. తమయందు కన్పించుచున్న పలు విశేష కార్యములనుబట్టి తన వద్ద ఆయానిష్ఠలు ఉన్నట్లు తెలిసి, ఆనందింపవచ్చును.

**స్వరూపనిష్ఠయొక్క గుర్తులు :-**

1) ఇతరులు తనను అవమానించినచో అది తన ఆత్మస్వరూపమునకు విరుద్ధము కాదని తలచి, విచారింపకుండుట. 2) తనను అవమానించి, తన పాపమును గ్రహించు ఇతరులపట్ల దయను కల్గియుండుట, 3) తాను భావింపవలసిన తన దోషములను ఎత్తి చూపి, గుర్తుకు తెచ్చినందులకు వారిపట్ల కృతజ్ఞతను తెలుపుట, 4) ఇతరులు భగవానునిచే ప్రేరేపింపబడియే తనను అవమానించిరని తలచి వారిపట్ల మనస్సున వ్యతిరేకముగా ప్రవర్తింపకుండుట, 5) తన దోషములను ఇతరులు ప్రకటించుటచే తన పాపము నశించుచున్నదని ఆనందించుట - మొదలగునవి.

**ఉపాయనిష్ఠయొక్క గుర్తులు :-**

1) సర్వేశ్వరుడే గతి అని తలచుట, 2) మరణము సంభవించినను (మృత్యుదేవత వచ్చినను) అతనిని అతిథిగా తలచి, సంతోషించుట,3) భగవానుడు రక్షకుడుగా నుండునను ధైర్యముతో మనస్సున తేటపడుట, 4) భరన్యాసము చేసిన పిమ్మట ఫలముకొఱకు పిమ్మట ఏ ప్రయత్నము చేయకుండుట, 5) అనిష్టమును నశింపచేసి, ఇష్టమును ఇచ్చుట భగవానుని కర్తవ్యము అని తలచుట-మొదలగునవి.
ఇందలి రెండవ చిహ్నమునకు అనుగుణముగా **"కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియ మివాతిథిమ్"** అను ప్రసిద్ధప్రమాణము స్మరణీయము.

**3) పురుషార్థనిష్ఠయొక్క చిహ్నములు :-**

1) శరీరపోషణయందు అందోళనలేక, అన్నియు భగవత్సంకల్పముచే నడచుచున్నదని తలచి, శాస్త్రములచే నిషేధింపబడని భోగములు తన ప్రయత్నము లేక తామే వచ్చినచో తన కర్మము నశించుచున్నదని తలచి, వానిని అడ్డుపెట్టకుండ అనుభవించుట, 2) సుఖము కల్గినచో సంతోషము, కష్టము కల్గినచో విచారమును లేక, మహాఫలమైన భగవత్కైంకర్యమునందు తహతహను కల్గియుండుట, 3) భగవదనుభవమును పొందుటకు మిక్కిలి త్వరపడుట - మొదలగునవి.

**ఉత్తమూర్:-** స్వనిష్ఠాభిజ్ఞానాధికారమనబడు ఈ అధికారముయొక్క అర్థమును సంగ్రహముగా తెలుపు పాశురము ఇది.

**(ముక్కియ)** ముఖ్యమంత్రములలో ముఖ్యమైన, **(మన్దిరమ్)** మూలమంత్రముచే లేక, మంత్రములచే, **(కాట్టియ)** తెలుపబడిన, **(ముక్కియమ్ మూన్ఱిల్)** ముఖ్యములగు తత్త్వ-హిత-పురుషార్థములలో, **(నిలైయుడైయార్)** నిష్ఠను కలవారు, **(తక్కవైయన్ఱి)** తనకు తగిన అనుభవకైంకర్యములు లేకుండ, **(తకాదవై)** తనకు తగని దుఃఖరాగద్వేషకోపాదులను, **(ఒన్ఱుమ్)** కొంచెముకూడ, **(ఇశైయార్)** కోఱనివారై, **(ఇకరుమఙ్గళ్)** పరిభవించువారివద్ద సానుభూతి, ఉపకారస్మృతి మొదలగు పూర్వోక్తకార్యములు, **(ఎమక్కు ఉళ)** మాకు ఉన్నవి, **(ఎన్నుమ్ ఇలక్కణత్తాల్)** అని తెలియునట్టి గుర్తులచే, **(మిక్క ఉణర్త్తియర్)** భాగవతాపచారాదినివృత్తిని, భగవత్కైంకర్యప్రవృత్తులలో మిక్కిలి జాగరూకతను కలవారై, **(మేదిని)** భూమిని, **(మేవియ)** ప్రీతితో చేరియున్న, **(విణ్ణవర్)** నిత్యసూరులే అగుదురు.



ఈ నిష్ఠను కైంకర్యమును చేయుటకు కట్టిన పరివట్టము (పరివేష్ఠనము)వలె భావింపవలెను. అనగా, నిష్ఠను కలవాడే కైంకర్యమునకు అధికారి-అని భావము.

**ప్రపత్తికి పిమ్మట ఇచట ప్రపన్నుడు చేయు కైంకర్యము**

**22. విణ్ణవర్ వేణ్డి విలక్కిన్ఱి మేవు మడిమై యెల్లా**
**మణ్ణులకత్తిన్ మకిÇన్దడైకిన్ఱనర్ వణ్డువరై**
**క్కణ్ణ నడైక్కల జ్కొళ్ల క్కడన్కళ్ కÇత్తియ నమ్**
**పణ్ణమరు న్దమిÇవేద మఱిన్ద బగవర్కళే.**

వణ్ తువరై కణ్ణన్ = అందమైన ద్వారకానగరమునందు నివసించు శ్రీకృష్ణుడు, అడైక్కలమ్ కొళ్ళ = రక్షింపదగిన వస్తువుగా స్వీకరించగా, కడన్కళ్ కÇత్తియ= (దేవ-ముని-పితృదేవతల) ఋణములను తీర్చినవారు, పణ్ అమరుమ్ నమ్ తమిÇ వేదమ్ అఱిన్ద = రాగముతోనిండిన, మన ద్రావిడ వేదమగు దివ్యప్రబంధమును తెలిసినవారును అగు, బకవర్కళ్ = భాగవతులు, విణ్ణవర్ వేణ్డి = నిత్యసూరులు ప్రార్థించి, విలక్కు ఒన్ఱి = అడ్డము లేక, మేవుమ్ అడిమై ఎల్లామ్ = ప్రేమతో చేయుచున్న కైంకర్యములు అన్నిటిని, మణ్ ఉలకత్తిల్ = ఈ భూలోకములో, మకిÇన్దు అడైకిన్ఱనర్ = సంతోషించి, అనుష్ఠింపగల్గుచున్నారు.

ఈ పాశురము ఉత్తరకృత్యాధికారములోనిది. **"ద్వారకా"** అను పదము **'తువరై'** అయినది.

భగవానుడు ప్రపన్నుల రక్షణబాధ్యతను స్వీకరించిన పిమ్మట దేవ ఋణము మొదలగు ఋణత్రయము తీఱిపోవును. ఇట్టి గొప్పతనమును కల్గి, ద్రావిడవేదమగు దివ్యప్రబంధమును అభ్యసించి, దాని అర్థమును గ్రహించిన భాగవతోత్తములు, శ్రీ వైకుంఠములో నిత్యసూరులు ప్రార్థించి, పొందతగిన కైంకర్యములను మొత్తము ఈ భూలోకములోనే పొందుచున్నారు.

భూమిలో జన్మించు ప్రతిమనుష్యుడు దేవ-ఋషి-పితృఋణములతోనే జన్మించును. **"ఋణాని త్రీణ్యపాకృత్య"** అనునట్లు ఋణములను తీర్చుకొనుట అతని విధి. **"బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః"** అనునట్లు దేవఋణము యజ్ఞయాగాదులతో, ఋషి ఋణము వేదాధ్యయనముతో, పితృ ఋణము సత్సంతానముతో తీరును. కాని, భరన్యాసమును చేసినవారి ఈ ఋణత్రయము వెంటనే

తీఱిపోవును. తిరువాయ్‌మొఴిలోని **"వేమ్ కడజ్గళ్"** ఇత్యాది పాశురభావ మిచట భావ్యము.

**ఉత్తమూర్:-** పరమపదములో నిత్యసూరులకునువలె ప్రపన్నులకు ఇచటగల వ్యాపారములన్నియు (నిత్యనైమిత్తికముతో పాటు) స్వయంప్రయోజన కైంకర్యముకొఱకేయగును. పూర్వము తెల్పిన రీతిలో ద్రావిడవేదములలో అది వ్యక్తము. కావున నిత్యనైమిత్తికములను చేయకుండ పోయినచో ప్రత్యవాయము కల్గినను, ఆ దృష్టిలో స్వయంప్రయోజనముగా కైంకర్యము అనెడి బుద్ధితో చేయుటయే తగునను ఈ పాశురములో సంగ్రహించుచున్నారు. **(వణ్ తువరై)** విలక్షణమైన ద్వారకను తన స్థానముగా చేసికొనిన, **(కణ్ణన్)** శ్రీకృష్ణునిచే, **(అడైక్కలమ్ కొళ్ళ)** రక్ష్యవస్తువుగా స్వీకరింపబడుటచే, **(కడజ్గళ్ కఴిత్తియ)** దేవాది ఋణములను తీర్చినవారు, **(నమ్)** మనయొక్క, **(పణ్ అమరుమ్)** రాగములను పొందికగా కల, **(తమిఴ్ వేదమ్)** ఆఴ్వార్ల శ్రీసూక్తులను, **(అఱిన్ద)** తెలిసినవారును అగు, **(బకవర్‌కళ్)** భాగవతులు, **(విణ్ణవర్)** పరమపదవాసులు, **(వేణ్డి)** అపేక్షించి, **(విలక్కు ఇన్ఱి)** అడ్డులేకుండ, **(మేవుమ్)** ప్రీతితో చేయు, **(అడిమై ఎల్లామ్)** అన్నివిధములైన కైంకర్యములను, **(మణ్ణులకత్తిల్)** ఈ ప్రకృతిమండలములో, **(మకిఴ్న్దు)** సుహృత్ సమారాధనమను ప్రీతితో, **(అడైకిన్ఱనర్)** చేసినవారగుదురు. **"మకిఴ్న్దు అడైకిన్ఱనర్"** అని అనుటచే ప్రత్యవాయము కల్గునని భయపడి చేయుచున్నారనునది లేదు. ముక్తులు చేయు కైంకర్యమునకు సమముగా చేయుచున్నారని భావము.

**భాగవతకైంకర్యమే సీమాభూమి**

**23.** **వేద మఱిన్ద బకవర్ వియక్క విళజ్గియ శీర్**
**నాదన్ వకుత్త వకైపెఱు నా మవనల్లడియార్ -**
**క్కాదరమిక్క వడిమై యిశైన్దఴియా మఱైనూల్**
**నీది నిఱుత్త నిలై కులైయావకై నిన్ఱనమే**

వేదమ్ అఱిన్ద = వేదాంతమును తెలిసిన, బకవర్ వియక్క = భక్తులు ఆశ్చర్యపడునట్లు, విళజ్గియ శీర్ = ప్రకాశించుచున్న కల్యాణగుణములనుకల, నాదన్ వకుత్త వకై = భగవానుడు నియమించిన (భక్తులకు ధ్యానమను) ప్రకారమును, పెఱుమ్ నామ్= పొందిన మనము, అవన్ నల్ అడియార్‌క్కు = ఆ భగవానుని గొప్ప దాసులకు, ఆదరమ్ మిక్క = ప్రీతి అతిశయించిన, అడిమై ఇశైన్దు = కైంకర్యము స్వీకరించి, అఴియా మఱై నూల్



= నశింపని వేదమను శాస్త్రముచే, నీది నిఱుత్త = (పద్ధతి ప్రకారము) నీతితో వ్యవస్థీకరింపబడిన, నిలై = అనుష్ఠానము, కులైయా వకై నిన్ఱనమ్= నశింపని రీతిలో ప్రవర్తించితిమి.

ఈ పాశురము పురుషార్థకాష్ఠాధికారములోనిది. వేదాంతార్థమును బాగుగా తెలిసిన భక్తులు భగవానుని కల్యాణగుణములను స్మరించి, స్మరించి ఆశ్చర్యమును పొందుదురు. ఆ స్వామియొక్క దాసులమగు మనము భగవానుని దాసులగు మహాత్ములకు ప్రేమతో కైంకర్యమును చేయుటకు ప్రయత్నించి, శాస్త్రము విధించిన రీతిలో నడచుకొంటిమి.

**ఉత్తమూర్:-** ఇది అధికారార్థసంగ్రహపాశురము. భాగవతులను విశేషించి ఆరాధింపవలెననుటచే ఏ జాతిలోనైనను భాగవతులకు కన్యాదానాదులును చేయవచ్చును; ఎవరి అన్నమునైనను భుజింపవచ్చును; పిత్రాదులు, పుత్రాదులును అగు భాగవతులకు ప్రణామాదులును చేయవచ్చును-ఇత్యాదిగా నున్నవి అన్నియు శాస్త్రమర్యాదను మీఱి నడువకుండ భాగవతశేషత్వాదుల మహిమను రక్షింపవలెననుటను ఈ పాశురములో సంగ్రహించుచున్నారు. **(వేద మఱిన్ద)** వేదములను అభ్యసించి, వాని అర్థమును స్ఫుటముగా తెలిసిన, **(బకవర్)** భాగవతులను **(వియక్క)** అనుభవించి, ఆశ్చర్యపడునట్లు **(విళజ్గియ శీర్)** ప్రకాశించు కల్యాణగుణములనుకల, **(నాదన్)** భగవానునిచే, **(వకుత్త)** **''మద్భక్తభక్తభక్తా శ్చ పూజనీయాః''** ఇత్యాదులచే తెలుపబడిన, **(వకై)** భాగవతశేషత్వప్రకారమును, **(పెఱుమ్ నామ్)** పొందిన ఆస్తికులమగు మనము,**(అవన్ నల్ అడియార్‌క్కు)** ఆప్తులైన అతని దాసులకు, **(ఆదరమ్ మిక్క)** స్వరూపకృతముగను, గుణకృతముగను అగు భగవద్దాస్యముకంటెను అధిక ఆదరమునకు విషయమైన, **(అడిమై ఇశైన్దు)** కైంకర్యమును చేయదలచి. అపుడును **(అఴియా మఱై)** నిత్యమైన వేదమునకు సంబంధించిన, **(నూల్)** ధర్మశాస్త్రములచేతను, **(నీతి)** మీమాంసచేతను, **(నిఱుత్త)** స్థాపింపబడిన, **(నిలై)** వర్ణాశ్రమధర్మ క్రమము, **(కులైయా వకై)** చెడకుండునట్లు, **(నిన్ఱనమ్)** దాస్యమున నిలచితిమి.

**ప్రపన్నులు శాస్త్రములను అతిక్రమింపకుండుట**

**24.** **నిన్ఱన మన్బుడై వానోర్‌నిలైయి నిలమళన్దాన్**
**నన్ఱిదు తీయదిదెన్ఱు నడత్తియ నాన్మఱైయా -**
**లిన్ఱు నమక్కిరవాదలి నిమ్మదియి న్నిలవే**
**యన్ఱి యడిక్కడి యారిరుడీర్‌క్క వడి యుళదే**

నిలమ్ అళన్దాన్ = (త్రివిక్రమావతారమునందు) భూమిని కొలిచిన స్వామి, ఇదు నన్రు = ఇది చేయతగినది, ఇదు తీయదు = ఇది చేయతగనిది, ఎన్రు నడత్తియ = అని మార్గమును చూపిన, నాన్ మఱైయాల్ = నాల్గు వేదములచే (చూపబడిన మార్గముతో), అన్బుడై వానోర్ నిలైయిల్ = (అంతులేని) భక్తినికల నిత్యసూరులు (చేయు కైంకర్యమువంటి) కైంకర్యమునందు, నిన్రనమ్ = నిలచి, దానిని ఆచరింపగల్గితిమి, ఇన్రు = ఈ సంసారదశ, నమక్కు ఇరవు ఆదలిన్ = మనకు (ప్రకృతిసంబంధమను చీకటిని కల్గించు) రాత్రి అగుటచే, అడిక్కడి ఆర్ ఇరుళ్ తీర్క్క = మిక్కిలి (వృద్ధిచెంది) పూర్ణముగానున్న (అజ్ఞానమను) చీకటిని పోగొట్టుటకు, ఇమ్మదియిన్ నిలైవే అన్రి = ఈ (వేదమను) చంద్రుని ప్రకాశమను స్మృతి తప్ప, అది ఉళదే = ఉపాయము వేఱొకటి కలదా !

ఇది శాస్త్రీయనియమనాధికారములోనిది. ఈ సంసారమను రాత్రిలో మనకు మిక్కిలి వృద్ధి చెందు అజ్ఞానమను చీకటిని పోగొట్టుటకు వేదమను చంద్రునియొక్క వెన్నెలవలెనున్న స్మృతి మొదలగు ప్రమాణములు తప్ప వేఱు సాధనము ఏమియు లేదు. అందుచే దేవతలకంటె అధికుడైయున్న భగవానుడు వేదమను మూలమునుగొని శాస్త్రములలో ఇది మంచి– ఇది చెడు అని వివరించి, దారి చూపుచున్నాడు. ఆ శాస్త్రములలో చెప్పబడిన రీతిని విడువక, భగవత్కైంకర్యమును అనుష్ఠించు నిత్యసూరుల వంటివారమైతిమి.

**ఉత్తమూర్:–** శాస్త్రము చేతిదీప మనిరి. దానినే చంద్రుడనుచున్నారు.

**(అన్బు ఉడై)** భగవానునిపట్ల ప్రీతినికల, **(వానోర్)** నిత్యసూరులయొక్క, **(నిలైయిల్)** వారివలె కైంకర్యమునే చేయుటలో, **(నిలమ్ అళన్దాన్)** భూమిని కొలిచిన త్రివిక్రమునిచే, **(నన్రు ఇదు తీయదు ఇదు ఎన్రు)** ఇది చెడ్డది, ఇది మంచిది అని, **(నడత్తియ)** స్ఫుటమగునట్లు ప్రవచింపబడిన, **(నాల్ మఱైయాల్)** నాల్గు వేదములచే, **(నిన్రనమ్)** ఏర్పడిన **"సాధు అసాధు"** నిశ్చయము అనెడి జ్ఞానముచే కైంకర్యమును చేయువారమైతిమి–అని అర్థము. నిత్యసూరులవలెనే వేదముల అపేక్ష లేకుండగనే చేయకూడదా? అనినచో, అందులకు ఇకపై తెలుపుచున్నారు. పగటికాలములోనున్నవారికి సూర్యకాంతి ఉండుటచే ఈ చంద్రుని వెన్నెల అవసరము లేదు. **(ఇన్రు)** ఇపుడు ఈ సంసారదశలో, **(నమక్కు)** సంసారులమగు మనకు, **(ఇరవు ఆదలిన్)** రాత్రి అగుటచే సూర్యప్రకాశమునకు అవకాశము లేదు. కావున ఈ చంద్రుని వెన్నెల, **(ఏ అన్రి)** ఈ వేదమనెడి చంద్రుని కాంతికాకుండ, లేక, ఈ వేదమూలమున "ఇది మంచి, ఇది



చెడు" అను జ్ఞానమనెడి, మధురముగు వ్యాపించుచున్న, **(ఇరుళ్)** అజ్ఞానమను చీకటిని, **(తీర్క్క)** పోగొట్టుటకు, **(అది ఉళదే)** కారణము ఏదయిన ఉన్నదా? లేదని భావము. స్వబుద్ధి కాని, శాస్త్రమూలముకానట్టి పరోపదేశము కాని, తర్కములు కాని సాధువగు కైంకర్యమునుగూర్చి తెలుపలేవు. వేఱుగతిలో కొన్ని విషయములు సరిగా తెలిసినను, ఆ జ్ఞానము దీపమూలము, నక్షత్రమూలమగు వెలుతురుతో సమానము. ఆ కాంతి అత్యల్పమగుటచే మాటి మాటికి చీకటి వ్యాపించుచునే ఉండును. మనము రాత్రిలో ఉంటిమి. కావున దీనితోనే చీకటిని పోగొట్టుకొనవలయును. లోకమును కొల్చినవాని విశాలమైన భూమిలోనున్నవారికి చేతిదీపము చాలదు. అందుచే సర్వవ్యాపి అయిన నాల్గువేదములనెడి చంద్రుని వెలుగే కావలయును. ఎల్లప్పుడు పగలుగానున్న పరమపదములోవలె విశదతమజ్ఞానము లేకున్నను వేదమూలకుడగు చంద్రుడు, చంద్రుని వెన్నెలవలె ఇంచుమించుగా విశదముగా తెలుపును. దీనికంటె విశదముగా తెలియుట కిచట దారిలేదు. ఇది సంసారుల స్థితి. కావున రాత్రి అని భావము. **"నిలవు"**–అనగా స్మృతి అనియు చెప్పుదురు. అపుడును పరిశీలనకాలమున ఏర్పడిన వేదార్థజ్ఞానముతో అనుష్ఠానకాలములో కల్గిన స్మరణమే స్మృతి అనబడుచున్నదనియు చెప్పవచ్చును. పాశురములో **"నాన్ మఱైయాల్"** అనునపుడు వేదములేకాక, మిగిలిన జ్ఞానసాధనములగు స్మృతి –సదాచారములు ఉపలక్షింపబడుచున్నవి. **"ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదాశ్చ"** అనికదా సూక్తి. ఈ అంశమును దేశికులు **"శ్రుతి స్మృతి స్సదాచారః"** అను అనంతరశ్లోకములో తెలిపిరికూడ.

**ప్రపన్నునకు ఏ పాపము అంటదు**

**25.** **ఉళదాన వల్వినైక్కుళ్ళమ్ వెరువి యులకళన్ద**
**వళర్తామరైయిణై వన్శరణాక వరిత్తవర్ తా**
**ఙ్గళై తానెన వెఱ్ఱు ఙ్గన్మన్తుఱప్పర్ తుఱన్దిడిలు**
**మిళైదా నిలైశెక వెఙ్గళ్ పిరానరుట్టేఱ్ఱమే**

ఉళదాన = తమ పట్లగల, వల్ వినైక్కు = బలమైన పాపమునకు, ఉళ్ళమ్ వెరువి = మనస్సు భయపడి, ఉలకు అళన్ద = లోకమును త్రివిక్రమావతార సమయమున కొలిచిన, వళర్ తామరై ఇణై = వృద్ధిచెందిన తామరవంటివి అగు రెండు శ్రీ పాదములను, వన్ శరణాక వరిత్తవర్తామ్ = దృఢమైన ఉపాయముగా ఆశ్రయించిన ప్రపన్నులు, కళైతాన్ ఎన ఎఱ్ఱమ్ = (భగవదనుభవమను పైరుకు) కలుపు (ఆటంకము) అనునట్లు వృద్ధిచెందుచున్న, కన్మమ్ = పాపమను దుష్కర్మలను, తుఱప్పర్ = చేయకుండ

విడచిపెట్టువారు, తుఱన్దిడిలుమ్ = అట్లు విడచినను, ఇళై తామ్ నిలై శెక = అధమమైన (వివేకములేని) స్థితి పోవునట్లు, ఎజ్గళ్ పిరాన్ = మా స్వామియగు భగవానునియొక్క, అరుళ్ తేన్ = కృప అనెడి తేనె, ఎఴుమ్ = వృద్ధిచెందును (భగవానుడు అనుగ్రహించునని తాత్పర్యము)

తనవద్దగల పాపములకు భయపడి, భగవానుని శ్రీ పాదములందు ప్రపత్తిని చేయు చేతనుడు ఇచటనున్న కాలములో భగవత్కైంకర్యము మొదలగు ఫలములకు ఆటంకములుగానుండు పాపములను బుద్ధిపూర్వకముగా ఏనాడును చేయడు. అట్లు పాపము చేయుటకు కారణమైన అవివేకము ఒకవేళ అతని వద్దనున్నచో ఆ పాపమునకు కారణమగు పాపముకూడ నశింపవలెని తలచి, పాపమునే చేసినచో, ఇక గతి లేకుండ పోవును.

ప్రపత్తికిముందు చేసిన పాపములన్నియు ప్రపత్తి ప్రభావమువలన నశించును. **"ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ"** అనునట్లు ప్రపత్తికి పిమ్మట కాలదేశాదులను పురస్కరించుకొని ఆపదలో తెలిసి చేసిన పాపములు, తెలియక చేసిన పాపములును ప్రపన్నులకు అంటవు. ప్రపత్తికి అనంతరము ఆపద కలుగకున్నను తెలిసి చేసిన పాపములు పిమ్మట చేయు ప్రాయశ్చిత్తముతో నశించును. అవి నశించు రీతి ఏమి అనగా – పాపమును చేసినందులకు బాధపడి పశ్చాత్తాపమును పొందుటచే నాల్గవ భాగము, పిమ్మట పాపములు చేయకుండుటచే నాల్గవభాగము, ప్రాయశ్చిత్తము చేయుటకు ప్రయత్నించుటచే నాల్గవభాగము, ప్రాయశ్చిత్తమును చేసి ముగించుటచే నాల్గవభాగము, – ఇట్లు పాపములన్నియు తీఱిపోవును. ప్రాయశ్చిత్తములలో గొప్ప ప్రాయశ్చిత్తమేమనగా – తిరిగి పాపములను చేయకుండుట. దీనికే ప్రాయశ్చిత్తప్రపత్తి అని పేరు. ప్రాయశ్చిత్తమును చేయని మూఢులు ఈ లోకములో కొన్ని దండనలను అనుభవింతురు. కావున అన్ని రీతులలో ప్రపన్నునకు నరకముగాని, మరుజన్మముగాని లేదు. ఈ పాశురము అపరాధ పరిహారాధికారములోనిది. **"లోక, కర్మ"** శబ్దములు **"ఉలకు, కన్మమ్"** అని మాఱినవి. **"కళై"** అను ప్రయోగస్వారస్యమునుబట్టి భగవదనుభవమును పైరుగా భావింపనగును. **"కళైవాయ్ తున్బమ్"** అను నమ్మాఴ్వార్ల సూక్తి స్మరణీయము.

**ఉత్తమూర్:–** అధికారార్థసంగ్రహపాశుర మిది. ఈ పాశురమునకు – సంచితకర్మనాశముకొఱకు ప్రపత్తిని చేయువాడు ఆనుకూల్యసంకల్పాదులను కలవాడగుటచే బుద్ధిపూర్వకములగు పాపములను ఆచరింపడు. అట్లు చేసినచో దానికి అవివేకము



కారణము. భగవానుడు కృపతో దానినికూడ పోగొట్టవచ్చునని వివరించుటయును కలదు. లేక, పాపారంభకపాపమునకు భయపడి పాదములలో చేరి, ప్రపత్తిని చేయువాడు బుద్ధిపూర్వకపాపములను చేయడు. దానికి కారణమైన, అవివేకరూపమైన బాల్యావస్థ భగవానుని కృపచే పోయినదే అనియును భావము చెప్పవచ్చును. సంగ్రహముగా ఈ పాశురభావ మిది.

**(ఉలకు అళన్ద)** త్రివిక్రముడైనపుడు లోకములను కొలుచుటకు, **(వళర్)** పెరిగిన, **(తామరై ఇణై)** శ్రీపాదకమలద్వంద్వమును, **(ఉళదాన)** తన వద్ద స్థిరముగానున్న, **(వల్ వినైక్కు)** బలిష్ఠములైన పాపములకు, **(ఉళ్ళమ్ వెఱువి)** మనస్సులో భయపడి, **(వల్ శరణ్ ఆక)** దృఢమైన ఉపాయమగునట్లు, **(వరిత్తమ్)** ప్రార్థించినవారు, (శరణాగతిని చేసివారు), **(తామ్)** తాముగానే, **(కళై తాన్ ఎన)** భగవదనుభవకైంకర్యములనెడి పైరు వృద్ధి అగుటకు అడ్డుగానున్న కలుపు అనునట్లు, **(ఎఴుమ్)** వృద్ధి చెందిన, **(కన్మమ్)** కర్మలను, **(తుఱప్పర్)** తొలగించుకొందురు. మోక్షముకొఱకుమాత్రము ప్రపత్తిని చేసినవారు అనుకూల్యాది సంకల్పములను చేసియుండుటచే ఇచట జీవించు కాలమున భగవత్కైంకర్యవిరోధి అనెడి కారణముచే తాముగా భక్తిపూర్వపాపమును చేయరు. అట్లు చేసినను ప్రాయశ్చిత్తమును చేసి, దానిని తీర్చుకొందురు. ప్రారంభమున బుద్ధిపూర్వకపాపారంభకపాపమునకును పరిహారముగా ప్రపత్తిని చేయువారు ఎంతమాత్రమును ఆ పాపమును చేయరని భావము. **(తుఱన్దిడిలుమ్)** ఈ పదమునకు **"తేన్ ఎఴుమ్"** అను పదములో అన్వయము. ఈరెండు తెగలవారును ఈ పాపములను విడుచుటలోను, **(ఎజ్గళ్ పిరాన్)** ప్రపన్నునకు సంచితకర్మనాశములోవలె ఈ పాపమును పోగొట్టుటలోను ఉపకారకుడగు భగవానుని, **(అరుళ్ తేన్)**–భోగ్యమైన కృప, **(ఇళైదు ఆమ్ నిలై)** లేతది అయిన, **(నిలై)** బాల్యావస్థ –అవివేకమని భావము. **(శెక)** నశించునట్లు తఱిమికొట్టినవానికి తిరిగి అందు ప్రవృత్తికి కారణమగు అవివేకము నశించునంత పర్యంతము కర్మలను చేసి, ప్రాయశ్చిత్తమును చేయకుండ నిశ్చయముతోనున్నవారికిని శిక్షను ఇచ్చి, తన్మూలమున అవివేకమున నశించుపర్యంతము, **(ఎఴుమ్)** వృద్ధిచెందు, అకించనులవద్ద దయను జూపు స్వామి ప్రపత్తికి మోక్షము అనుగ్రహించుటలోవలె పిమ్మట పాపమును చేయకుండుటకును, చేసినవారు తామే ప్రాయశ్చిత్తముకొఱకు ప్రయత్నింపనివారు లఘుశిక్షతో అవివేకము నశించియుండుటకును ప్రేమతో కారణమగుచున్నాడు. ఇదియే అతని దయకు తేనెకువలె భోగ్యత. ఇట్లు పాశురమును వివరించుటచే తర్వాత శ్లోకములోని అర్థమంతయు. ఇచట అణగియున్నదనుట తెలిసినది.

ఆ శ్లోకము ఏమనగా **"ప్రారబ్ధేతరపూర్వపాప మఖిలం ప్రామాదికం చోత్తరమ్, న్యాసేన క్షపయన్....** ఇత్యాది.

**భగవద్భక్తులు నివసించునదియే వాసమునకు తగినది**

**26 తేనార్ కమల త్తిరుమకళాద న్దికళ్న్దుఱైయుమ్**
**వానాడుకన్దవర్ వైయత్తిరుప్పిడమ్ వన్దరుమ**
**క్కానారిమయము గ్గజ్గైయు క్కావిరియు క్కడలు**
**నానా నగరము నాకము క్కూడియ నన్నిలమే**

తేన్ ఆర్ కమల త్తిరుమకళ్ నాదన్ = తేనెనిండిన పద్మములో నివసించు లక్ష్మీదేవికి ప్రభువగు భగవానుడు, తికళ్న్దు ఉఱైయుమ్ = ప్రకాశించుచు నిత్యవాసమును చేయుచున్న, వాన్ నాడు = పరమపదమును, ఉకన్దవర్ = పొందగోరి ప్రపత్తిని చేసినవారు, వైయత్తు ఇరుప్పిడమ్ = ఈ లోకములో నివసించు చోటు (ఏదియో అదియే), వన్ తరుమక్కాన్ ఆర్ ఇయముమ్ = తీవ్రమైన తపస్సును చేయు చోటు అగు వనములతో కూడిన హిమవత్పర్వతము, కజ్గైయుమ్ = గంగానదీ తీరము, కావిరియుమ్ = కావేరీ నదీతీరము, కడలుమ్ = సముద్రములోనున్న శ్వేతద్వీపము, నానా నగరముమ్ = మిగిలిన పలు క్షేత్రములును, నాకముమ్ = పరమపదమును, కూడియ నల్ నిలమ్ = (అను వీనిని అన్నిటిని) కూడిన గొప్ప స్థలము.

ఇది స్థానవిశేషాధికారములోని పాశురము. **హిమవత్, గంగా, కావేరీ** పదములు మాఱి **"ఇమైయుమ్, గజ్గై, కావిరి"** అయినవి. **"నానా, నాకనగర"** పదములు సంస్కృత శబ్దములు. **"కడలుమ్"** అనునది అందలి ఏకదేశమైన శ్వేతద్వీపమును లక్షించును. అదియేకదా సముద్రములోనున్న దివ్యక్షేత్రము. **"పరేణ నాకమ్"** అని, **"నాకస్య పృష్ఠే"** అని నాకశబ్దముచే పరమపదము నిర్దేశింపబడుచున్నది.

వేఱు ఫలమును దేనిని అన్వేషింపక, మోక్షమునే కోఱి, ప్రపత్తిని అనుష్ఠించిన పరమైకాంతులు నివసించు చోటు హిమవత్పర్వములోని దివ్యదేశము, గంగానదీ తీరము, కావేరీ తీరము, సముద్ర తీరముననున్న శ్వేతద్వీపము, అయోధ్య మొదలగు పుణ్య స్థలములు. శ్రీ వైకుంఠము మొదలగునవి అన్నియు కూడిన గొప్ప పుణ్యక్షేత్రము. భక్తులు నిండిన భగవానుని దివ్యదేశమును పొందలేక పోయినచో, ఆ భక్తులు నివసించు క్షేత్రమే ప్రపన్నుకు నివాసయోగ్యమైనది అని తాత్పర్యము.

**ఉత్తమూర్:–** ఇట్లు శ్రీరంగము, తిరుమల, కంచి–అను మూడు దివ్యదేశములనుగూర్చి పల్కినది మిగిలిన దివ్యదేశములకును ఉపలక్షణము. పెద్దదివ్యదేశములగుటచే ఇవి



భాగవతాధిష్ఠానమును పొందినవి. అది లేనిచో, భాగవతమాత్రాధిష్ఠానమును కలచోటే గొప్పది అని అనుచున్నారు. ఇందులకొఱకు అనుగ్రహింపబడిన ఈ పాశురమే ఈ అధికారముఖ్యార్థ సంగ్రాహకమును అగును. **"భాగవత"** అనుటచే **"వాసుదేవః సర్వమ్"** అనుట్లు భగవానునే ప్రాప్యముగా గ్రహించిన పరమైకాంతులే గ్రహింపబడిరి. ఇట్టి పరమైకాంతి కొన్ని సమయములలో గొప్ప క్షేత్రములలోకూడ లేకుండపోవచ్చును. **(తేన్ ఆర్)** మకరందము నిండిన, **(కమలమ్)** తామరపూవులో నివసించు, **(తిరుమకళ్)** లక్ష్మీదేవికి, **(నాదన్)** ప్రియుడగు పరవాసుదేవుడు, **(తికళ్న్దు ఉఱైయుమ్)** సర్వోత్కృష్టుడుగా వెల్గుచు నివసించు, **(వాన్ నాడు)** పరమపదమనెడి పైలోకమును, **(ఉకన్దవర్)** పరమప్రాప్యముగా అపేక్షించునట్టి పరమైకాంతులు, **(వైయత్తు)** భూమిలో, **(ఇరుప్పిడమ్)** నివసించుచోటు అగు, **(తరుమమ్)** నివృత్తిధర్మములకు తగిన, **(కాన్ ఆర్)** అరణ్యములు నిండిన, **(ఇమైయమ్ ఉమ్)** హిమవత్పర్వతమును, **(గజ్గైయుమ్)** గంగానదీ తీరమును, **(కావిరియుమ్)** కావేరీతీరమును, **(కడలుమ్)** శ్వేతద్వీపము, **(నానానగరమ్ ఉమ్)** అయోధ్యామధురాదినగరములును, **(నాకముమ్)** శ్రీవైకుంఠమును, **(కూడియ)** ఒకటిగా చేరిన, **(నల్ నిలమ్)** శ్రేష్ఠమైన దేశమగును.ఆయా భగవద్దేశములు మిగిలిన దివ్యదేశములు కావు. భాగవతక్షేత్రము సర్వక్షేత్రసమానమగుటచే ఇదియే గొప్పది. కాశి మొదలగు ముక్తిక్షేత్రములు ఏడు ప్రసిద్ధములుగా నున్నను ఉత్తరదేశములు మ్లేచ్ఛులచే ఎక్కువగా ఆక్రమింపబడుటచే నిత్యవాసమునకు అనర్హములు. కావున దక్షిణదిశలో ముఖ్యములగు మూడు స్థానములనుగూర్చి పల్కి, వానిలో కంచి ఆ ఏడు క్షేత్రములలో చేరినదై, ఇప్పటికిని తగినదియైయుండుటచే దానినిగూర్చి చివరగా పల్కిరి

**ప్రపన్నుని మరణమునకు దేశకాలాది నియమము లేదు**

**27. నన్నిలమా మదు నఱ్పకలా మదు నన్నిమిత్త**
**మెన్నలుమా మదు మాదానుమా మక్కడియవర్క్కు**
**మిన్నిలైమేని విడుమ్ పయణత్తు విలక్కిలతోర్**
**నన్నిలైయా నదు నాడి వళిక్కు నదై పెఱవే**

నల్ నిలై ఆమ్ = (పరమపదమునకు తీసికొని పోయి చేర్చుటచే) మంచి స్వభావమును కల్గిన, ఓర్ = అద్వితీయమైన, నదు నాడి వళిక్కు = (అన్ని నాడులను) నడుమనగల బ్రహ్మనాడిద్వారా, నదై పెఱ = సంచారమును పొందుటకు, మిన్ నిలై మేని = మెఱవువలె

నశించు స్వభావమునుకల శరీరమును, విడుమ్ పయణత్తు = విడచిపోవు ప్రయాణమునందు, అడియవర్క్కు = ప్రపన్ననకు, అజ్గు = దేశము, కాలము, నిమిత్తము – అను వీనిలో, విలక్కు ఇలదు = ఇది తగదను నియమము లేదు. యాదానుమ్ ఆమ్ = ఏది అయినను తగును, అదు = ప్రపన్నులు ప్రయాణము చేయు ఆ దేశమే, నల్ నిలమ్ ఆమ్ = గొప్ప దేశమగును, అదు = పయనించు ఆ కాలమే, నల్ పకల్ ఆమ్ = గొప్ప పగటి కాలమగును, అదు = ప్రయాణము చేయు ఆ నిమిత్తమే, నల్ నిమిత్తమ్ ఎన్నలుమ్ ఆమ్ = గొప్ప నిమిత్తము అని చెప్పబడును.

ఇది నిర్యాణాధికారములోనిది. **"మిన్ నిలైమేని"** అను ప్రయోగమునకు అనుగుణముగా తిరువాయ్మొళిలోని **"మిన్నిన్నిలైయిల మన్నుయిరాక్కైకళ్"** అను సూక్తి స్మరణీయము. **"ప్రయాణ"** శబ్దమే **"పయణ"**మైనది. నిమిత్తమనగా శకునము. ప్రయాణము చేయునపుడు మంచి శకునమును చూచి పోవుట కదా ఆచారము. **'నడు నాడి'** అనునది నాడులలో మధ్యలోనున్న బ్రహ్మనాడిని తెలుపును.

ప్రపన్నుడగు జీవుడు బ్రహ్మనాడి అను ప్రత్యేకమైన నాడి మార్గమున పోవుటకై ఈ శరీరమును విడచిపోవునపుడు క్షేత్రము, కాలము, నిమిత్తము – అను ఇవి మంచివి కావలయునను నిర్బంధము లేదు. అవి ఎట్టివి అయినను గొప్పవే.

జీవుని హృదయమునుండి ముఖ్యముగా 101 నాడులు వ్యాపించియుండును. వానిలో నూఱు నాడులద్వారా పయనించువారు మిగిలిన లోకములకు పోవుదురు. ప్రపన్నుడు ఆనాడుల మధ్యలోగల ఒక ప్రత్యేకమైన బ్రహ్మనాడి ద్వారా, అర్చిరాది మార్గమున పయనించును. ఈ ప్రత్యేకమైన నాడికే బ్రహ్మనాడి అని, సుషుమ్నానాడి అని, మూర్ధన్యనాడి అనియు పేర్లు కలవు. ఇది హృదయము మధ్యలోనుండునట.

**ఉత్తమూర్:–** దేశకాలనిమిత్తములగు గుణదోషములు ప్రపన్నుని విషయములో కార్యకరములు కావు. బ్రహ్మనాడిప్రవేశవే–అను అధికారార్థమును ఇందు సంగ్రహించుచున్నారు. **(అడియవర్క్కు)** దాస్యమును చేయబోవు ముముక్షువులకు, **(విలక్కు ఇలదు)–** దేశకాలనిమిత్తములచే అడ్డగింపబడని. ఇది నాడికి విశేషణము. ముముక్షువులందఱికిని సామాన్యమగుటచే ఎవరికిని అడ్డగింపబడని–అనియును భావము. దీనివలన ప్రపన్నులకును ఇదియే దారి అని తెలుపబడినది. కైవల్యవసుపదప్రాప్త్యాదులను పొంది, పిమ్మట ముక్తి అనెడి క్రమముక్తిలోకూడ అడ్డగింపబడనిది ఇది. ఇట్లున్నను భీష్ముడు ఉత్తరాయణకాలము కొఱకు ఎదురుచూచుట ఎందులకనగా, తాను స్వచ్ఛందమరణమును కలవాడు అగుటనుబట్టి. పితృలోకవాసి యగు తండ్రి, వచ్చి చాచిన చేతిలో పెట్టకుండ భూమిలో పిండమునుంచిన భీష్ముని చూచి మిక్కిలి సంతోషముతో "నీకు మరణము నీవు తలచుటకు ముందుగా రాదు" అని అనుగ్రహించెనని హరివంశములో కలదు. ఇట్టి **(ఓర్)** సాటి లేని, **(నల్ నిలై ఆమ్)** చక్కని స్థితి అగు, **(నడు నాడి)** మధ్యమ నాడి అయిన సుషుమ్నానాడితో సంబంధమునుకల, **(వళిక్కు)** అర్చిరాదిమార్గము కొఱకు అగు, **(నడై పెఱ)** సంచారమును చేయుటకు, **(మిన్ నిలై)** మెఱపుయొక్క స్వభావమునుకల, క్షణికమైన, **(మేని)** శరీరమును, **(విడుమ్ పయణత్తు)** విడుచుటద్వారా బయటకువచ్చుటకు సంబంధించిన, **(అజ్గు)** దేశకాలనిమిత్తములలో, **(యాదానుమ్ ఆమ్)** ఏది అగునో, **(అదు)**–ఆ దేశము, **(నన్ నిలమ్ ఆమ్)** శుభమే కలుగుటవలన మంచి దేశము, **(అదు)** ఆ నిమిత్తమే. (దుర్మరణమే) **(నల్ నిమిత్తమ్ ఎన్నల్ ఉమ్ ఆమ్)** చక్కని నిమిత్తమని చెప్పబడునది అగును. దీనికిమాత్రము **"ఎన్నల్"** అను పదమును చేర్చుట ఎందులకు? అనినచో, కాలదేశములు స్మృతిసూత్రాదులలో ప్రసిద్ధములైయుండుటచే, వానిని ఒప్పుకొని దుర్మరణాదులను మంచి నిమిత్తములుగా అంగీకరింపనివారికి దానిని స్థిరముగా తెలుపుటకొఱకు. **"యదు చైవాస్మై శమ్యం కుర్వంతి యదు చ న"** అని మోక్షమునకు పోవువానికి ఉత్తరక్రియలు. చేయబడకపోయినను ప్రేతత్వాదులులేవని తెలియునట్లు దుర్మరణమూలమున పిశాచత్వాదులును లేవని తెలియుచున్నదని భావము. **"పయణత్తు" పయణమ్**–ప్రమాణము. ఇంతకు ముందు "సూర్యకరావలంబియై బయలుదేరునట్లు" అని సూర్యకిరణమును గ్రహించుట (పట్టుకొనుట) మొదటి **"పుఱప్పాడు"** అని పల్కిరి. అనంతరాధికారములోకూడ **"బ్రహ్మనాడి"** యగు ప్రధానద్వారముద్వారా వెలువడి.' అనుచు ప్రధాన ద్వారమును దాటిన పిమ్మట **"పుఱప్పాడు"** అనిరి. ఇట్లు ఒకచోట పోవువానికి గృహముయొక్క ప్రధానద్వారము దాటిన పిమ్మటనే ప్రయాణమువలెనే, సూక్ష్మదేహమును కలవాడు శరీరకుహరముయొక్క ప్రధాన ద్వారమగు బ్రహ్మనాడి అగ్రమును దాటిన పిమ్మటనే ప్రయాణ ప్రారంభమని తెలియుచున్నది. ఈ అధికారములోని శ్లోకములో చెప్పిన ఉత్క్రాంతిక్రమము సంసారికికూడ సామాన్యమగుటచే ముముక్షువునకు అసాధారణము కాదు. దుష్టకాలదేశకాలనిమిత్తములు అడ్డు కాకుండుటయును, బ్రహ్మనాడిద్వారా బయటకు వచ్చుటయును ఇతనికి అసాధారణములు. అందుచే వీనినిమాత్రము పాశురములో తెల్పిరి. ఇందులకొఱకు భగవానుడు హార్దుడై, రక్షించుచున్నాడని అతని వాత్సల్యమును ఈ పాశురానంతరముగల **"దహరకుహరే"** అను శ్లోకములో తెలిపిరి.

### అర్చిరాదిమార్గము

**28.** **నడై పెఱ వజ్గి పక లొళి నాళుత్తరాయణ మాణ్డు**
**ఇడైవఱు కాఱ్ఱిరవి యిరవిన్పతి మిన్ వరుణన్**
**కుడైయుడై వానవర్కోన్ పిరశాపతి యెన్ఱివరాల్**
**ఇడై యిడై పోకజ్గళెయ్ది యెఴిల్పద మేఱువరే**

(ఇట్లు మోక్షమునకు పోవు జీవులు శరీరమునుండి బయటకు వచ్చి, సూక్ష్మశరీరముతో)నడై పెఱ = ప్రయాణము చేయగా, (అపుడు), అజ్గి = అగ్ని, పకల్ = దినదేవత, ఒళి నాళ్ = శుక్ల పక్షదేవత, ఉత్తరాయణమ్ = ఉత్తరాయణ దేవత, ఆణ్డు = వర్ష దేవతను, ఇడైవఱు కాఱ్ఱు = (వర్షమునకు, సూర్యునకును) నడుమ వచ్చు వాయుదేవత, ఇరవి = సూర్యుడు, ఇరవిన్ పతి = రాత్రికి నాథుడగు చంద్రుడు, మిన్ = విద్యుద్దేవత, వరుణన్ = వరుణదేవత, కుడై యుడై వానవర్కోన్ = (తన ప్రభుత్వమును చాటి చెప్పు) ఛత్రమును దాల్చు దేవతలకు ప్రభువగు ఇంద్రుడు, పిరశాపతి = ప్రజాపతి, ఎన్ఱు ఇవరాల్ = అను వీరిచే (దేవతలచే) దారి చూపబడి, పోవునపుడు, ఇడై ఇడై = మధ్యమధ్యలో, పోకజ్గళ్ ఎయ్ది = భోగములను పొంది, ఎఴిల్ పదమ్ = ప్రకాశించు పరమపదమును, ఏఱువర్ = పొందుదురు.

మోక్షమును పొందు చేతనుడు ఈ శరీరమును వీడి బయటకు వచ్చి సూక్ష్మశరీరముతో అర్చిరాది మార్గమున వెడలునపుడు అగ్నిదేవత, దినదేవత, శుక్లపక్షదేవత, ఉత్తరాయణదేవత, వర్షదేవత, వాయుదేవత, సూర్యుడు, చంద్రుడు, విద్యుద్దేవత, వరుణదేవత, ఇంద్రుడు, ప్రజాపతి– అను ఆతివాహికులు అతనికి దారి చూపి, ఉపచారములు చేయగా, కర్మఫలముగా కాక, ఇతడు అనుష్ఠించు ఉపాయము మహిమవలన లభించు భోగములను పొంది, చివరగా శ్రీ వైకుంఠమును చేరును.

అగ్ని మొదలు ప్రజాపతి వరకుగలవారే ఆతివాహికులు అనబడుదురని ఈ పాశురము వలన ఏర్పడుచున్నది. ఈ విధముగా పయనించు మార్గమునకు అర్చిరాది మార్గమని పేరు. అక్షరములు అధికమై గణము చెడును. కావున **"వానవర్కోమాన్"** అను పాఠము ఆదరణీయముకాదు. ఇది గతివిశేషాధికారములోనిది. **"అగ్ని, రాత్రి, ప్రజాపతి"**, అను పదములు **"అజ్గి, ఇరవు, పిరశాపతి"** అని అయినవి. ఈ పాశురార్థమునకు అనుగుణముగా **''ముక్తోర్చిర్దినపూర్వపక్ష షడుదజ్ మాసాబ్దవాతాంశుమత్ ద్యౌవిద్యుద్వరుణేంద్రధాతృమహితః సీమాంతసింధ్వాప్లుతః, శ్రీవైకుంఠ ముపేత్య"** ఇత్యాది ప్రాతఃస్మరణీయసూక్తి స్మరణీయము.



**ఉత్తమూర్:–**ఇది అధికారార్థసంగ్రహపాశురము. **(నడై పెఱ)** బ్రహ్మనాడి అనెడి ముఖద్వారము నుండి వెలువడి, గమనమును పొందిన పిమ్మట, **(అజ్గి)** అగ్ని, **(పకల్)** అహస్సు, **(ఒళి నాళ్)** శుక్లపక్షము, దానికి పిమ్మట, **(ఉత్తరాయణమ్)** ఉత్తరాయణము, పిమ్మట, **(ఆణ్డు)** సంవత్సరము, **(ఇడై వరుమ్)** **"సంవత్సరాత్ ఆదిత్యమ్"** అని సంవత్సరమునకు పిమ్మట సూర్యుని చేరవలసి ఉన్నను **"మాసేభ్యో దేవలోకమ్ దేవలోకా దాదిత్యమ్"** అనెడి వాక్యమును అనుసరించి సంవత్సర ఆదిత్యులకు మధ్యలో వచ్చి చేరిన, **(కాఱ్ఱు)** వాయువు, **(ఇరవి)** రవి, సూర్యుడు, **(ఇరవియిన్ పతి)** రాత్రికి పతి అయిన చంద్రుడు, **(మిన్)** విద్యుత్తు, వైద్యుతపురుషుడు, **(వరుణన్)** వరుణుడు, పిమ్మట, **(కుడై ఉడై వానవర్కోమాన్)** త్రైలోక్యమునకు ఏకచ్ఛత్రాధిపతి అయిన దేవేంద్రుడు, ఇతడు ద్వారపాలకుడగు ఇంద్రుడు కాడనుటకు ఈ విశేషము ప్రయోగింపబడినది, **(ప్రజాపతి)** బ్రహ్మ అను వీరిద్వారా, **(ఇడై యిడై)** నడుమ నడుమ ఒక్కొక్క ఆతివాహికునివద్ద, **(పోకజ్గళ్)** వారు సమర్పించు ఉపహారములను, **(ఎయ్ది)** పొంది, **(ఎఴిల్ పదమ్)** ఉజ్జ్వలమైన పరమపదమును, **(ఏఱువర్)** చేరుదురు.

### మోక్షమున పరిపూర్ణబ్రహ్మానుభవమును పొందుట

**29.** **ఏఱి యెఴిల్పద మెల్లా వుయిర్క్కు మిద ముకక్కు**
**నాఱు తుఴాయ్ముడి నాదనై నణ్ణి యడిమైయి నమ్**
**కూఱు కవర్న్ద కురుక్కళ్ కుఴాజ్గళ్ కురైకఴఱ్కీఴ్**
**మాఱుదలిన్ఱి మకిఴ్న్దెఴుమ్ పోకత్తు మన్నువమే**

ఎఴిల్ పదమ్ ఏఱి = (మనము) అందముగా ప్రకాశించు పరమపదమును అధిరోహించి, ఎల్లా ఉయిర్క్కుమ్ = సకలజీవుల విషయములందును, ఇదమ్ ఉకక్కుమ్= (వారు అనుష్ఠించు చిన్న) ఉపాయమును చూచి మనస్సున సంతోషపడువాడు, నాఱు తుఴాయ్ ముడి = పరిమళించు తులసీమాలను కిరీటమునందు అలంకరించుకొనినవాడగు నాదనై = సర్వేశ్వరుని, నణ్ణి = సమీపించి, అడిమైయిల్ నమ్ కూఱు కవర్న్ద = (ఆస్వామి) కైంకర్యమున మనకు గల భాగమును (మనము పొందవలెనని) ఆశపడిన, కురుక్కళ్ కుఴాజ్గళ్ = ఆచార్యవర్గముయొక్క, కురై కఴల్ కీఴ్ = మువ్వల సవ్వడినికల శ్రీ పాదములచెంత, మాఱుదల్ ఇన్ఱి= ఎట్టి మార్పును లేక, ఎఴుమ్ పోకత్తు = వృద్ధిచెందు భోగములో (భగవదనుభవములో) మకిఴ్న్దు మన్నువమ్ = ఆనందించి, నిలచియుండెదము.

సర్వేశ్వరుడు జీవులు అనుష్ఠించు లఘూపాయముతో మిక్కిలి సంతోషించి, వారికి ఫలము నిచ్చుటకు ముందుకు వచ్చుచున్నాడు. ఆ స్వామి శ్రీ పాదములందు మన ఆచార్యులు నిత్యకైంకర్యమును చేయుచున్నారు. వారు మనకు ఆ సేవ లభింపవలెనని తలచిరి. అందులకు అనుగుణముగానే మనము శ్రీ వైకుంఠనాథుని ఆశ్రయించి, మన ఆచార్యుల పాదసన్నిధిలో ఒదిగియుండి, భగవదనుభవములో ఎట్టి విచ్ఛేదములేక పొంది, అందే ఆసక్తిని కలియుందము.

ఇది పరిపూర్ణబ్రహ్మానుభవాధికారములోనిది. **"హిత"** శబ్దమే **"ఇతమ్"** అయినది.

**ఉత్తమూర్:–** ఈ అధికారములో తెలిపిన కైంకర్యపర్యంతపరిపూర్ణబ్రహ్మానుభవము, దానికి పొందుటకు కారణమైన ఆచార్యపరంపరయొక్క శ్రీపాదముల చెంతనుండి పొందబడుచున్నదనుచు **"అత్ర పరత్ర చాపి నిత్యం యదీయచరణౌ శరణమ్ మదీయమ్"** అని శ్రీయామునులు అనుగ్రహించిన రీతిలో పల్కుచున్నారు.

**(ఎఴిల్ పదమ్)** అందమైనదియై, ఉజ్జ్వలమైన పరమపదమును, **(ఏఱి)** అర్చిరాదిమార్గమున పయనించి, దీనికి **"నణ్ణి"** అనుచోట అన్వయము. **(ఎల్లా ఉయిర్క్కుమ్)** జీవులందఱికిని, **(ఇదమ్ ఉవక్కుమ్)** హితమనగా ఉపాయము. అది సిద్ధింపవలెనని ఆశపడు, **(నాఱు తుఴాయ్ ముడి)** సువాసన నిండిన తులసిని కిరీటములో అలంకరించుకొనిన, **(నాదనై)** శేషియగు స్వామిని, **(నణ్ణి)** సమీపించి. ఇంతవరకు గతివిశేషాధికారవిషయము తెలుపబడినది. **(అడిమైయిల్)** కైంకర్యములో, **(నమ్ కూఱు)** మనము పొందవలసిన భాగమును, **(కవర్న్దు)** ఆశించి. సారదీపికా వ్యాఖ్యలో **(కవర్న్ద)** అను పాఠము గ్రహింపబడినది. అపుడు అది **"కురుక్కళ్"** అను పదమునకు విశేషణము. కైంకర్యములో మన భాగమును మనము పరమపదములో పొందవలయునని ఆశపడిన ఆచార్యులని భావము. పరమపదసోపానములో దివ్యదేశప్రాప్తి పర్వములో **"అఴకోలక్కత్తిన్ నడువే శెన్ఱు....సర్వవిధకైంకర్యమనోరథాధిరూఢనాయ్ క్కొణ్డు కిట్టచ్చెన్ఱు పర్యంకపరిసరత్తిలే మున్బు తఙ్గళైక్కొణ్డు ఎమ్బెరుమాన్ నడత్తిన కృషి ఫలిత్తదెన్ఱు పూర్ణమనోరథనాన పూర్వాచార్యర్కళై క్కొణ్డు....దివ్యపర్యఙ్కత్తై యణుకి"** అనుచు అనుగ్రహించిన క్రమమునకు తగినట్లు ఇచట అర్థమును గ్రహింపవలెను. **(కురుక్కళ్ కుఴాఙ్గళ్)** ఆచార్య గోష్ఠిలో, **(కుఱై కఴల్ కీఴ్)** విజయధ్వనితోకూడి ఆభరణములను అలంకరించుకొనిన శ్రీపాదములు క్రిందనుండి, వారిని సేవించి–అని భావము. **(మాఱుదల్ ఇన్ఱి)** మాఱకుండునట్లు, **(పెరుమ్ పోకత్తు)** అంతకు అంతకు వృద్ధిని చెందు అనుభవములో, **(మకిఴ్న్దు)** ఆనందముతో, **(మన్నువమ్)** నిలచియుందుము.



**శ్రీమన్నారాయణుడే సిద్ధోపాయము**

**30 మన్నుమనైత్తుఉఱవాయ్ మరుళ్ మాఱ్ఱరుళాఴియుమాయ్**
**తన్నినైవా లనైత్తు న్దరిత్తోఙ్గు న్దనియిఱైయా**
**యిన్నముదత్తముదా లిరఙ్గు న్దిరునారణనే**
**మన్నియ వన్శరణ్ మఱ్ఱోర్ పఱ్ఱిన్ఱి వరిప్పవర్క్కే**

మన్ను అనైత్తు ఉఱవాయ్ = దృఢమైన, సకలవిధబంధువై, మరుళ్ మాఱ్ఱు = అజ్ఞానమును పోగొట్టగల, అరుళ్ ఆఴియుమ్ ఆయ్ = కరుణాసముద్రమై, తన్ నినైవాల్ = తన సంకల్పముతో, అనైత్తుమ్ దరిత్తు = సకలపదార్థములను ధరించి (రక్షించి) ఓఙ్గుమ్ తని ఇఱైయాయ్ = ఉన్నతుడైన, అద్వితీయుడగు స్వామియైన, ఇన్ అముదత్తు అముదాల్ = తీయని అమృతమున పుట్టిన అమృతమైయున్న లక్ష్మీదేవి పురుషకారముతో (మధ్యలోనుండి ప్రీతితో పలుకుటచే), ఇరఙ్గుమ్ = కృపను చూపు, తిరునారణనే = లక్ష్మీసహితుడైన నారాయణుడే, మఱ్ఱు ఓర్ పఱ్ఱు ఇన్ఱి = వేఱొక (భక్తియోగము మొదలగు) ఉపాయములు లేక, వరిప్పవర్క్కు = శరణు పొందువారికి, మన్నియ = (పూర్వమే) స్థిరముగా నున్న, వన్ శరణ్ = దృఢమైన సిద్ధోపాయము అగును.

ఈ పాశురము సిద్ధోపాయశోధనాధికారములోనిది. **"మాతా పితా భ్రాతా శరణం సుహృద్గతిః నారాయణః"** అని సౌబాలికీ ప్రమాణమును **"శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయుమ్ అవరే"** ఇత్యాది దివ్యసూరి వచనములనుబట్టి శ్రీమన్నారాయణుడు సకలవిధబంధువు. అతడు మన అజ్ఞానమును పోగొట్టగల కరుణాసముద్రుడు. తన సంకల్పముతో అన్ని పదార్థములను ధరించి, సాటిలేని మేటిగా ఉన్నాడు. లక్ష్మీదేవి మనకు పురుషకారమును చేసి, ప్రీతితో పలుకగా, మనపట్ల మఱల ఇంకను కరుణను పొందినవాడు స్వామి. ఇట్టి శ్రీమన్నారాయణుడే వేఱు ఉపాయమును అనుష్ఠించుటకు శక్తి లేక, ప్రపత్తిని అనుష్ఠించినవారికి మిగిలిన ఉపాయముల స్థానములో తాను నిలచి, ఫలము నిచ్చు సిద్ధోపాయమగుచున్నాడు.

సిద్ధోపాయమనగా మనచే అనుష్ఠింపబడవలసిన అవసరము లేకుండ, ముందుగానే ఉన్న ఉపాయము – ఈ ఉపాయము భగవానుడే. సాధ్యోపాయమనగా – మనచే చేయబడు ఉపాయము. ఇది భక్తి– ప్రపత్తిరూపమై యుండును.

**ఉత్తమూర్:– (మన్నుమ్)** మిగిలిన మాతాపిత్రాదులవలెకాకుండ, స్థిరముగా నిలచియుండు, **(అనైత్తు ఉఱవు ఆయ్) "మాతా పితా భ్రాతా నివాసః"** అని చెప్పబడిన సర్వవిధబంధువై,

**(మరుళ్)** అజ్ఞానమును, **(మాఱ్ఱియ)** నశింపజేయు, **(అరుళ్)** కృపకు, **(ఆళియుమాయ్)** సముద్రమై, **(తన్ నినైవాల్)** తన సంకల్పముతో, **(అనైత్తుమ్)** అంతటిని, **(దరిత్తు)** ఆధేయముగా చేసికొని, **(ఓఙ్గుమ్)** ఉన్నతమైన, **(తని)** సాటిలేని, **(ఇఱైయుమాయ్)** స్వామియై, **(అముదత్తు)** అమృతసముద్రములో పుట్టిన, **(ఇన్ అముదాల్)** తీయని అమృతమగు లక్ష్మీదేవిచే, లేక, **(ఇన్ అముదత్తు)** భోగ్యమగు అమృతమైన లక్ష్మీదేవియొక్క **(అముదాల్)** అమృతమువంటి వాక్కుచే, **(ఇరఙ్గుమ్)** దయను కలవాడైన, **(తిరు)** పిమ్మట శ్రీమంతుడైన, **(నారాయణనే)** నారాయణుడే, **(మఱ్ఱు ఓర్)** వేఱొక, **(పఱ్ఱు ఇన్ఱి)** ఉపాయము లేకుండ, **(వరిప్పవర్క్కు)** **"త్వమేవోపాయభూతో భవ"** అని ప్రార్థించువారికి, **(మన్నియ)** సిద్ధమైన, **(వల్)** దృఢమైన, **(శరణమ్)** శరణమగుచున్నాడు. లక్ష్మీదేవియొక్క అమృతవాక్కులచే దయను కలవాడైనపుడే వరించువాడగును. అపుడు సర్వవిధబంధుత్వాదిగుణములు ఉపాయత్వమునకు ఉపయోగపడుచున్నది. ఉపయోగప్రకారమును అందులకు తగినట్లు గ్రహింపవలెను. బంధుత్వము, కారుణ్యము, పరత్వము, స్వాతంత్ర్యము-ఇత్యాదులచే సిద్ధోపాయమగు సర్వేశ్వరుడు అనుగ్రహించినపుడు ఫలము, మనము ఒకరిని పురుషకారముగా చేసికొనుట, వరించుటయును వ్యర్థము-అనునది ఇచట నిరాకరింపబడినది.

### భక్తి - ప్రపత్తులు సాధ్యోపాయములు

31. **వరిక్కిన్ఱనన్ పరన్ యావరై యెన్ఱు మఱైయదనిల్**
**విరిక్కిన్ఱదు ఙ్గుఱి యొన్ఱాల్ వినైయరై యాదలి నామ్**
**ఉరైక్కిన్ఱనన్నెఱి యోరుమ్ పడికళిలోర్ న్దులకమ్**
**తరిక్కిన్ఱ తారకనార్ తకవాఱ్ఱరిక్కిన్ఱనమే**

పరన్ = పరమపురుషుడు, యావరై = ఎవరిని, వరిక్కిన్ఱనన్ = వరించుచున్నాడో, (వారిచేతనే పరమపురుషుడు పొందబడుచున్నాడు) అని, మఱైయదనిల్ = వేదమునందు, విరిక్కిన్ఱదుమ్ = వివరింపబడుచున్న (భగవానుడు చేతనుని వరించుట అను) కృత్యమును, వినైయరై = కర్మవశ్యులను, కుఱి ఒన్ఱాల్ = ఒక ఉపాయమువలననే, ఆదలిన్ = అందుచే, నామ్ = మనము, ఉరైక్కిన్ఱ నల్ నెఱి = (శాస్త్రములందు) చెప్పబడుచున్న (భక్తి-ప్రపత్తి అను) గొప్ప ఉపాయములను, ఓరుమ్ పడికళిల్ = పరిశీలింపవలసిన ప్రకారములను, ఓర్న్దు = తెలిసి, ఉలకమ్ తరిక్కిన్ఱ = లోకములను దాల్చి నిలుచువాడు, తారకనార్ = (సంసారమునుండి మనలను) దాటించువాడును అగు భగవానుని, తకవాల్ = కృపవలన, తరిక్కిన్ఱనమ్ = ఉజ్జీవించుచున్నాము.



చేతనుడు భక్తి-ప్రపత్తులలో ఒక ఉపాయమును అనుష్ఠించిన పిదపనే సర్వేశ్వరుడు అతనిని అంగీకరించి ఫలమును ఇచ్చును - అని ఉపనిషత్తు తెలుపుచున్నది. అందుచే ఆ ఉపాయములు భగవానునకు మనపట్లగల మనః క్లేశమును పోగొట్టి మనకు మోక్షమును ఇచ్చుటకు హేతువగు కృపను కల్గించుటకు మాత్రము సహాయపడుచున్నవి అని, అతడే ప్రధానమైన సిద్ధోపాయమని గ్రహించి, మన శక్తికి తగిన ఉపాయమును అనుష్ఠించి, భగవానునివలన ఉజ్జీవించితిమి.

**"య మేవైష వృణుతే తేన లభ్యః"** అను ఉపనిషద్వాక్యము ఒకటి కలదు. "పరమపురుషుడు ఏ జీవుని వరించుచున్నాడో, ఆ జీవునిచేతనే పరమ పురుషుడు పొందబడుచున్నాడు" అనునది దీని భావము. ఇందుచే కర్మవశ్యుడగు చేతనుని భగవానుడు ఉద్ధరించుటకు కారణము చేతనుడు అనుష్ఠించు ఉపాయమే - అని సిద్ధించుచున్నది. లేనిచో సర్వముక్తి ప్రసంగము - అనగా అందఱికిని ముక్తిని ఇవ్వవలసిన స్థితి ఏర్పడును. పై ఉపనిషద్వాక్యములో **'యమ్'** (ఎవనిని) అనుచు అధికారినిర్దేశము చేయబడుటచే పరమపురుషుడు వరించుటకు కారణమైన ఒక విశేషగుణము ఆ చేతనునివద్ద ఉండవలెనని ఏర్పడుచున్నది కదా! ఆ గుణము భక్తి - ప్రపత్తులలో ఒకటిని అనుష్ఠించుటయే - అని కొందరు వివరించిరి. ఈ వ్యాఖ్య అంత యుక్తి యుక్తముగా తోచదు. **"ప్రేక్ష్యే కంచిత్ కదాచన", "అదువుమ్ అవనదు ఇన్నరుళే", "క్షాంతి స్తవాకస్మికీ"** అను మొదలగు పరశ్శతములైన ఆళ్వార్ల, పూర్వాచార్యుల సూక్తులను బట్టి, **"ప్రజాపతి త్వం వేద, ప్రజాపతి స్త్వాం వేద యం ప్రజాపతి ర్వేద స పుణ్యో భవతి"** ఇత్యాది శ్రుతిసూక్తులనుబట్టి భగవానుని కృప నిర్హేతుకమని, నిరవధికమని చెప్పవలసియున్నది. లేనిచో, భగవత్కృపకు న్యూనతా దోషము సంప్రాప్తించును. అందువలన **"ప్రజాపతిమ్"** ఇత్యాదిగా పూర్వోదాహృత శ్రుతివలె శ్రుతికూడ భగవానుని నిర్హేతుక కృపను కీర్తించుచున్నదని చెప్పుటయే యుక్తము. ఇక కర్మజ్ఞానాద్యుపాయానుష్ఠానము కాని, ప్రపత్తిని ఆచరించుటకాని అధికారి విశేషణమనియే చెప్పవలెను తప్ప, అవి సాక్షాదుపాయములు కావు. సాక్షాదుపాయము భగవత్కృపయే. ప్రస్తుతపాశురములోని **"తారకనార్ తకవాల్ తరిక్కిన్ఱనమ్"** అను సూక్తి దీనిని దృఢపఱచుచున్నది అనుటయే మేలు.

ఈ పాశురము సిద్ధోపాయశోధనాధికారములోనిది. **'తకవు'** అను పదము కరుణను సూచించుననుటకు" **"తకవు శెయదిలై"** ఇత్యాది దివ్యసూరి ప్రయోగములు ఉదాహరణములు.

**ఉత్తమూర్:-** విధింపబడిన ఉపాయములను అన్నిటిని వేదములలోనే నిషేధించుటచే, సాధ్యోపాయవిషయములైన స్మృతిపురాణపాంచరాత్రాదులు విశ్వసింపతగినవి కావు-అనెడి శంకను పరిహరించుచు ఈ సంగ్రహపాశురము రచింపబడినది. **"యమేవైష వృణుతే తేన లభ్యః"** **(యమ్)** (ఈ భగవానుడు) ఎవరిని, **(వృణుతే)** తనవద్దకు వచ్చునట్లు తానే వరించునో, అని పల్కి, **(మత్తైయదనిల్)** ఉపనిషత్తులోనే, **(విరిక్కిన్నదుమ్)** శ్రవణ-మనన-ధ్యానములగు ఉపాయములను నిషేధించి, అతడే ఉపాయమని తెలియునట్లు వివరించి పల్కినది, **(కుఱి ఎన్నాల్)** ఒక సాధ్యోపాయమనెడి ఉపాయముతో, **(వినైయరై ఆదలిల్)** కర్మికులగు జీవులను ఉద్దేశించి చెప్పినది. కావున, (ప్రత్యేకవాక్యముగా విభజింపకుండ **"వినైయరై యాదలిన్"** అనుచు ఒకే వాక్యముగాకూడ చేయవచ్చును) **(నామ్)** కర్మలను చేయు మనము, **(ఉరైక్కిన్న)** శాస్త్రము విధించిన, **(నల్ నెఱి)** భక్తి, ప్రపత్తి అనెడి శ్రేష్ఠములగు ఉపాయములను, **(ఒరుమ్ పడికళిల్)** విచారింపబడతగిన ప్రకారములలో ఒక్కటిని విడువకుండ, **(ఓర్న్దు)** విచారించి, (అనుష్ఠించి), **(ఉలకమ్ తరిక్కిన్న)** లోకములకు ఆధారమైన, **(తారకనార్)** ఉత్తారకుడగు భగవానుని, **(తకవాల్)** కృపచే, **(తరిక్కిన్నమ్)** ప్రాణములను నిలుపుకొన్నవారమైతిమి (ఉజ్జీవించితిమి).

**ప్రపన్నుని గొప్పతనమునకు శాస్త్రము తెల్పిన సీమాభూమి**

**32.** **తకవాOOరిక్కిన్న తన్నడియార్కళై త్తన్నిఱత్తిన్**
**మికవాదరమ్ శెయు మెయ్యరుళ్ విత్తకన్ మెయ్యురైయిన్**
**అకవాయఱిన్దవ రారణనీది నెఱికులైతల్**
**ఉకవారెన వెజ్గళ్దేశిక రుణ్మై యురైత్తనరే**

తకవాల్ తరిక్కిన్న = (తన) కరుణచే నిలచియున్న, అడియార్కళై = తన దాసులగు ప్రపన్నులను, తన్ తిఱత్తిల్ = తన స్వభావమును అనుగ్రహించి, తనవలె చేయుటకు, మిక ఆదరమ్ శెయుమ్ = మిక్కిలి ఆసక్తిని కలవాడు, మెయ్ అరుళ్ = నిష్ఫలముకాని కృపను కలవాడు, విత్తకన్ = ఆశ్చర్యకరములగు లీలలను చేయువాడును అగు భగవానుని, మెయ్ ఉరైయిన్ = సత్యమైన సూక్తి అను చరమశ్లోకమునందలి, అకవాయ్ అఱిన్దవర్ = తాత్పర్యమును తెలిసిన (వ్యాసమహర్షి మొదలగు) వారు, ఆరణ నీతి నెఱి కులైతల్ = వేదాంతములందు తెలుపబడిన న్యాయమార్గము పాడగుటను, ఉకవార్ ఎన = అంగీకరింపరు అని, ఉణ్మై = నిజమగు అర్థమును, ఎజ్గళ్ దేశికర్ = మా ఆచార్యులు, ఉరైత్తనర్ = (మాకు) ఉపదేశించిరి.



భగవానుడు తన కృపతో తనను శరణు వేడిన ప్రపన్నులకు తనతో సమానమైన గుణములను అనుగ్రహించి, వారిని ముక్తులను చేయుటకు మిక్కిలి ఆతురతను కల్గియున్నాడు. ఇట్లు కరుణను కురిపించు ఆ స్వామి కృష్ణుడై అవతరించి, ఉపదేశించిన చరమశ్లోకముయొక్క తాత్పర్యమును చక్కగా తెలిసిన వ్యాసుడు మొదలగు మహర్షులు ప్రపన్నుల మహిమను శాస్త్రములకు విరుద్ధమైన రీతిలో అవధిని మీఱి, అంగీకరింపరు. ఈ తత్త్వార్థమును మన ఆచార్యులు ఉపదేశించిరి. **"నిరంజనః పరమం సామ్య ముపైతి"** అను శ్రుతివాక్యము, **"తమ్మైయేయొక్క అరుళ్శెయ్వర్"** అను సహస్రగీతి సూక్తి ఇత్యాదులు భగవానుడు ప్రపన్నులకు తనతో సామ్యమును అనుగ్రహించుననుటకు ప్రమాణములు.

ఈ పాశురము ప్రభావవ్యవస్థాధికారములోనిది.

**ఉత్తమూర్:-** ప్రపన్నులు శాస్త్రమును మీఱరాదనుట పూర్వాచార్యోపదిష్టమనుచున్నారు -ఈ పాశురములో.

**(తకవాల్ తరిక్కిన్న)** కరుణతో, భక్త్యుపాయమును అనుష్ఠింపలేకపోవుటచే ప్రపత్తిని చేసి, భగవత్కృపతోనే ఆత్మధారణను పొందిన, **(తన్ అడియార్కళై)** ప్రపన్నులగు తన దాసులను, **(తన్ తిఱత్తిల్)** తన ధర్మములో. తన సాధర్మ్యమును పొందించుటకు, **(మిక)** మిక్కిలి, **(ఆదరమ్ శెయ్యుమ్)** ఆదరించుచున్న, **(మెయ్ అరుళ్)** అడ్డుకొనుటకు వీలుకాని కృపను కల, **(విత్తకన్)** ఆశ్చర్యచేష్టితుని, **(మెయ్ ఉరైయిన్)** సత్యమైన చరమశ్లోకరూపశ్రీసూక్తుల, **(అకవాయ్)** ఆంతర్యమును, (అర్థమును), **(అఱిన్దవర్)** తెలిసిన మహానుభావులగు వ్యాసాదులు, **(ఆరణమ్ నీది)** వేదాంతశాస్త్రముయొక్క, **(నెఱి)** మార్గమునకు, **(కులైతల్)** కీడును, **(ఉకవార్)** సమ్మతింపరు, **(ఎన)** అని, **(ఎజ్గళ్ దేశికర్)** మా ఆచార్యపరంపరలో నున్నవారు, **(ఉణ్మై)** వాస్తవార్థమును, **(ఉరైత్తనర్)** ఉపదేశించిరి. ప్రపన్నులును శాస్త్రోక్తవిధినిషేధములకు కట్టుబడియుండవలెనని భావము.

**ప్రపన్నుని మహిమ అవధిలేనిది**

**33.** **ఉణ్మై యురైక్కు మఱైకళిలోజ్గియ వుత్తమనార్**
**వణ్మై యళప్పరితాతలిన్ వన్దు కÇల్ పణివార్**
**తణ్మై కిడక్క త్తరమళవెన్న వియప్పిలదామ్**
**ఉణ్మై యురైత్తన రోరన్తవిర వుయర్న్దనరే**

ఉణ్మై ఉరైక్కుమ్ మఱైకళిల్ = సత్యమును పల్కు వేదములలో, ఓఙ్గియ ఉత్తమనార్= (గొప్పగా కీర్తింపబడిన) ఉన్నతుడైన భగవానుని, వణ్మై అళప్ప అరిదు = గొప్పతనమును ఇంతటిది అని లెక్కించుట అసాధ్యము, ఆదలిన్ = కావున, వన్దు కఢల్ పణివార్= వచ్చి, (ఆ స్వామి) చరణములను ఆశ్రయించినవారికి, తణ్మై కిడక్క = (జాతి మొదలగు వానిచే) నైచ్యము ఉన్నను, తరమ్ ఆళవు = (వారి) గొప్పతనము లెక్క పెట్టతగినది, ఎన్ఱ ఇయప్పు = అనుమాట, ఇలదు ఆమ్ ఉణ్మై = లేదు అను నిజమును, ఉయర్న్దనర్ = గొప్పవారగు మన ఆచార్యులు, ఓరమ్ తవిర = పక్షపాతము లేకుండ, ఉరైత్తనర్ = ఉపదేశించిరి.

నిజమునే పల్కు స్వభావమునకల వేదాంతములు **"పరాఽస్య శక్తిః"** అని, **"యతో వాచో నివర్తంతే"** అని ఇత్యాదిగా భగవానుని గొప్పతనము అవధిలేనిదని పొగడుచున్నవి. ఈ భగవానుని పాదములనే శరణముగా పొందిన ప్రపన్నులు జాతి, మతము మొదలగు వానియందు తక్కువవారైనను, వారికి ప్రధాన ఫలమగు మోక్షమునందును, భగవానుని అభిమానమునందును లోటు లేదు, కావున వారి గొప్పతనము ఇంతటిదని చెప్పుటకు వీలుకానిది. ఈ తత్త్వార్థమును మన ఆచార్యులు పక్షపాతములేక, ఉపదేశించిరి.

ఈ పాశురము ప్రభావరక్షాధికారములోనిది.

**ఉత్తమూర్:-** భగవత్సంబంధవిశేషమూలకప్రభావమనెడి అధికారముయొక్క సంగ్రహపాశుర మిది.

**(ఉణ్మై ఉరైక్కుమ్)** సత్యమునే పల్కుచున్న, **(మఱైకళిల్)** వేదములలో, **(ఓఙ్గియ)** అన్నిటికంటె ఉన్నతముగా వెలుగు, **(ఉత్తమనార్)** పురుషోత్తముని, **(వణ్మై)** వైలక్షణ్యముయొక్క ప్రభావము, **(అళప్పు అరిదు)** కొలువ వీలుకానిది, **(ఆదలిన్)** అందువలన, **(వన్దు)** దేవతాంతరములను విడచి, వచ్చి, **(కఢల్ పణివార్)** స్వామి శ్రీపాదములను ఆశ్రయించినవారికి, **(తణ్మై కిడన్దిడ)** జాత్యాదులలో నైచ్యమున్నను, **(తరమ్)** గొప్పతనము, **(అళవు ఎన్ఱ ఇయప్పు ఇలదు ఆమ్)** పరిచ్ఛేదమనెడి మాటను కల్గినది కాదు అనెడి, **(ఉణ్మై)** తత్త్వార్థమును, **(ఉరైత్తనర్)** పల్కిన ఆచార్యులు, **(ఓరమ్ తవిర)** జాత్యాదిపక్షపాతము లేకుండ, **(ఉయర్న్దనర్)** గొప్పతనమును కలవారగుదురు. కొన్ని అంశములలో నైచ్యమున్నను ఉత్కృష్టప్రభావమును కల భగవానుని మాత్రమే



ఆశ్రయించుటచేత పరమైకాంతిప్రభావము వాచామగోచరమని భావము. **"తర మళ వెన్ఱ"** అనునపుడు **"తా మళ వెన్న"** అను పాఠమును గ్రహించువారును కలరు. **"ఇయప్పు"** అని కాకుండ **"వియప్పు"** అని కొందఱు విడదీసిరి. **"తామ్"** అనుటకు పూర్వము పల్కిన **"ఉత్తమనార్"** అను అర్థమును గ్రహించి, **"ఉత్తమనార్"** అగు భగవానుని పాదములను ఆశ్రయించువారైన వీరికి, **(అళవు)** సమానులని అన్నచో ఇందు ఆశ్చర్యము లేదు. వీరికి తనకంటె గొప్పతనమును అతడు అంగీకరించెనుకదా-అని కొందఱు అందురు. **"ఉరైత్తనర్"** అనునది సమాపకక్రియయై, **"ఉయర్న్దనర్"** అనునది కర్తగా కూడ కావచ్చును. **"ఉయర్న్దనర్"** అనుటకు ఆచార్యులని అర్థము. ఈ పాశురము సర్వముముక్షువిషయము. **"కఢల్ పణివార్"** అనుటకు స్వతంత్రప్రపత్తి చేసివారను అర్థమును చెప్పినచో వారి విషయమే అగును.

**తిరుమంత్రార్థము**

**34.** **ఉయర్న్దనన్ కావల నల్లార్క్కురిమై తుఱన్దుయిరాయ్**
**మయర్న్దమై తీర్న్దు మఱ్ఱోర్ వఴి యిన్ఱి యడైక్కలమాయ్**
**ప్పయన్దవ నారణన్ పాదఙ్గళ్ శేర్న్దు పఴ వడియార్**
**నయన్ద కుఱ్ఱే వలెల్లా నాదు నన్మను వోదినమే**

ఉయర్న్దనన్ = (అందఱికంటే) ఉన్నతుడైయున్నవాడు, కావలన్ = రక్షకుడును అగు భగవానుని (తప్ప), అల్లార్క్కు ఉరిమై తుఱన్దు = మిగిలినవారికి దాసులగుటను విడచి, ఉయిరాయ్ = (అచేతనముకంటె విలక్షణమైన) జీవుడై, మయర్న్దమై తీర్న్దు=అజ్ఞానము తీరి, మఱ్ఱు ఓర్ వఴి ఇన్ఱి = వేఱొక ఉపాయము లేకుండ, అడైక్కలమాయ్ = రక్షింపబడవలసిన వస్తువై, పయన్దవన్ నారణన్ = (లోకమును) సృష్టించిన నారాయణునియొక్క, పాదఙ్గళ్ శేర్న్దు = శ్రీ పాదములను ఉపాయముగా గ్రహించి, పఴ అడియార్ నయన్ద = అనాదిగా దాసులగు నిత్యసూరులు అభిలషించిన, కుఱ్ఱేవల్ ఎల్లామ్ నాడుమ్ = కైంకర్యములను అన్నిటిని (ప్రార్థించుటను) తెలుపు, నల్ మను = గొప్పమంత్రమగు అష్టాక్షరిని, ఓదినమ్ = (అర్థముతో ఉపదేశమును పొంది) అనుసంధించితిమి.

భగవానుడు సకలజగత్తుకును కారణమై, అందఱికంటె అధికుడైయున్నాడు, అందఱికిని రక్షకుడై యున్నాడు. అచేతనములకంటె విలక్షణమైయున్న జీవరాశి అగు

మనము ఆ స్వామికే శేషమై యున్నాము. అహంకార – మమకారములను వీడిన మనము వేఱొక ఉపాయమును అనుష్ఠింపక, లోకములను సృష్టించిన శ్రీమన్నారాయణుని శ్రీ పాదములనే ఉపాయముగా ఆశ్రయించి, మన రక్షణ భారమును అతనివద్ద సమర్పించి, శ్రీ వైకుంఠములో నిత్యసూరులు పరమప్రీతితో చేయు కైంకర్యమును అనుగ్రహింపుమని ప్రార్థించుచున్నాము. ఈ అర్థములను తెలుపు తిరుమంత్రమును ఆచార్యుల సన్నిధిలో అధ్యయనము చేసితిమి.

ఈ పాశురము మూలమంత్రాధికారములోనిది.

**ఉత్తమూర్:–**అష్టాక్షరీమంత్రసారమును అంతటిని సంగ్రహించుచు ఈ అధికారముద్వారా మంత్రార్థమును తెలిపితిమి–అనుచు ప్రస్తుతపాశురమును అనుగ్రహించుచున్నారు. **"ఉయర్న్దనన్ కావలన్"** అని, **"ఉయర్న్ద నఙ్గావలన్"** అనియును పాఠములు. ఇది అకారార్థము. పైన ఉకారార్థము. **"ఉయిరాయ్"** అన్నది మకారార్థము. రెండవపాదములో నమశ్శబ్దార్థము తెలుపబడినది. **"పయన్ద"** అనునది నారశబ్దార్థము. అ తరువాత మిగిలిన అంశముయొక్క అర్థము.

**(ఉయర్న్ద) (నన్) "యతో వా ఇమాని.....స బ్రహ్మ"** అనునట్లు జగత్కారణత్వప్రయుక్తమైన నిరతిశయోత్కర్షమును పొందినవాడగు, **(నన్)** మనయొక్క) **(కావలన్)** రక్షకుడగు శ్రియః పతికి తప్ప, **(అల్లార్కు)** వేఱైనవారికి, **(ఉరిమై తుఱన్దు)** శేషత్వమును వీడి, **(ఉయిరాయ్)** దేహాదివిలక్షణుడగు ఆత్మయై, **(మయర్న్దమై తీర్న్దు)** అహంకారమమకారాదులను పోగొట్టుకొని, **(మఱ్ఱు ఓర్ వఴి యిన్ఱి)** జ్ఞానశక్త్యాదులు లేకపోవుటచే, ప్రపత్తితప్ప వేఱొక ఉపాయము లేకుండ, **(అడైక్కలమాయ్)** అతనికి భరముగా సమర్పింపబడినవాడై, **(పయన్ద) "నరా జ్జాతమ్"** అనునట్లు సర్వమును సృష్టించిన, **(అ నారాయణన్)** ప్రాప్యప్రాపకభూతుడై, ప్రసిద్ధుడైన శ్రియఃపతియొక్క, **(పాదఙ్గళ్ శేర్న్దు)** శ్రీపాదములను వైకుంఠమున పొంది, **(పఴ్ అడియార్)** నిత్యసూరులు, **(నయన్ద)** ప్రీతితో చేయుచున్న, **(కుఱ్ఱేవల్ ఎల్లామ్)** సర్వకైంకర్యములను, **(నాడు)** ఆశపడి పొందుటకు కారణమైన, **(నల్)** గొప్ప, **(మను)** మంత్రమును, అనగా అష్టాక్షరిని, **(ఓదినమ్)** అర్థముతో తెలిసితిమి. **"శేర్న్దు"** అనుటకు **"నాడు"** అనుదానితో అన్వయము. ఇచట **"నాడు"** అనుటకు మనము అన్వేషించుటకు–అని అర్థము. **"వినైత్తొకై"**లోని **"వినై"** (క్రియ) కు సందర్భమునకు తగిన రీతిలో అర్థము చెప్పు విధానము కలదు. **"నాడ"** అను పాఠముండియుండిన అర్థము స్పష్టము.



## ద్వయార్థము

35. ఓదు మిరణ్డైయిశైత్తరుళా లుదవు న్దిరుమాల్
పాద మిరణ్డుఞ్జరణెన ప్పఱ్ఱి నమ్ పఙ్గయత్తాళ్
నాదనై నణ్ణి నలన్తికఴ్నాట్టి లడిమైయెల్లామ్
కోదిలుణర్త్తియుడన్ కొళ్ళుమాఱు కుఱిత్తనమే

ఓదుమ్ ఇరణ్డై ఇశైత్తు = (వేదమునందు) అధ్యయనము చేయబడుచున్న రెండు వాక్యములను ఒకటిగా చేర్చి, అరుళాల్ ఉదవుమ్ తిరుమాల్ = కృపతో (ద్వయ రూపమున మనకు) ఉపకరించిన శ్రియఃపతియొక్క, పాదమ్ ఇరణ్డుమ్ శరణ్ ఎన ప్పఱ్ఱి = శ్రీ పాదములు రెండును ఉపాయముగా ఆశ్రయించి, నమ్ పఙ్గయత్తాళ్ నాదనై నణ్ణి = తామరపూవులో నివసించు మన తల్లి అగు లక్ష్మీదేవికి నాయకుడగు భగవానుని సమీపించి, నలమ్ తికఴ్ నాట్టిల్ = ఆనందము వృద్ధిచెంది ప్రకాశించు దేశమగు పరమపదమునందు, అడిమై ఎల్లామ్ = కైంకర్యములను అన్నిటిని, కోదు = ఇల్ ఉణర్త్తియుడన్ = (మేము చేయుచున్నాము, మేము అనుభవించుచున్నామను కర్తృత్వభోక్తృత్వాది) దోషము లేని నిశ్చయజ్ఞానముతో, కొళ్ళుమాఱు=పొందు ప్రకారమును, కుఱిత్తనమ్ = (ద్వయమునందు) అనుసంధించితిమి.

భగవానుడు కఠవల్లినుండి విభజించి అనుసంధింపబడు రెండు వాక్యములను ఏకముచేసి, ద్వయముగా రూపొందించి, మనకు అనుగ్రహించెను. లక్ష్మీదేవితో కలసియున్న ఆ స్వామి శ్రీపాదములే ఉపాయముగా ఆశ్రయించి, శ్రీవైకుంఠమునకు చేరి, అతనినే సమీపించి, అహంకార–మమకారాది దోషరహితమైన కైంకర్యమును చేయుదుము–అను అర్థమును ద్వయములో అనుసంధించితిమి.

ఈ పాశురము ద్వయాధికారములోనిది

**ఉత్తమూర్:–** ద్వయార్థమును సంగ్రహించు ఈ పాశురముతో ద్వయాధికారార్థమును నిగమించుచున్నారు. **(ఓదుమ్)** కఠశ్రుతినుండి విభజించి పఠింపబడిన, **(ఇరణ్డై)** రెండు ఖండములను, **(ఇశైన్దు)** మోక్షసాధనముగా గొని, **(అరుళాల్)** దయతో, **(ఉదవుమ్)** మనకు ఉపకరించును. **"ఇశైన్దు"** అనుటకు **"శేర్త్తు"** (చేర్చి) అను అర్థమునుకూడ చెప్పుదురు. పూర్వోత్తరభాగములుగా యథేష్టముగా అనియును వివరింపవచ్చును. **"శేర్త్తు"** అను అర్థమునకు తగినట్లు, **"ఇశైత్తు"** అను పాఠమునుకూడ పఠింతురు.

**“ఓదుమ్”** అనునపుడు **“ఓది”** అను పాఠముకూడ కలదు. **“ఇరణ్డై”** అనుదానిని విడదీసి **“ఓది”** అను పదమును దానిముందు చేర్చవలెను. **(ఇశైన్దు)** దాని ఉచ్చారణ మాత్రముతోనే మోక్షమును అనుగ్రహించి, సహాయపడును–అని చెప్పినట్లయినది. **(తిరుమాల్)** లక్ష్మీదేవివిషయమున వ్యామోహమును కలవానియొక్క, **(పాదమ్ ఇరణ్డుమ్)** రెండు శ్రీపాదములను, **(శరణమ్)** మనకు ఉపాయము, **(ఎన)** అని, **(పఱ్ఱి)** ఆశ్రయించి. మనము చేయు కైంకర్యమునకు లక్ష్యమైన, **(పఙ్గయత్తాళ్నాదనై)** అలర్మేల్ మఙ్గైపతిని, **(నల్ తికఴ్ నాట్టిల్)** ఆనందమే అంతులేకుండ ప్రకాశించు పరమపదములో, **(నణ్ణి)** చేరి, అనుభవించి, **(అడిమై ఎల్లామ్)** సర్వదేశసర్వకాల సర్వావస్థోచిత కైంకర్యములను, **(కోదు ఇల్ ఉణర్త్తియుడన్)** స్వార్థ కర్తృత్వ–భోక్తృత్వములను దోషములు లేకుండునట్లు వివేకముతో, **(కొళ్ళుమ్ ఆఱు)** పొందు రీతిని, **(కుఱిత్తనమ్)** ఈ అధికారములో నిరూపించితిమి. **“తిరు”** అను పదమునుండి **“ఉణర్త్తియుడన్”** అనునంతవరకు గల పదములచే క్రమమున ద్వయములోని పదముల అర్థము చెప్పబడినది.

## చరమశ్లోకార్థము

**36.** **కుఱిప్పుడన్ మేవు న్తరుమఙ్గళిన్ఱియ క్కోవలనార్**
**వెఱిత్తుళవ క్కఴన్ మెయ్యరణెన్ఱు విరైన్దడైన్దు**
**పిరిత్త వినైత్తిరళ్ పిన్తొడరావకై యప్పెరియోర్**
**మఱిప్పుడై మన్నరుళ్ వాశకత్తాన్ మరుళఱ్ఱనమే**

కుఱిప్పుడన్ మేవుమ్=మనోనిశ్చయముతో అనుష్ఠింపతగిన, తరుమఙ్గళ్ ఇన్ఱి=(భక్తియోగము మొదలగు) ఉపాయములను అనుష్ఠింపలేక, అక్కోవలనార్=ఆ గోపాలునియొక్క, వెఱి త్తుళవ కఴల్=సువాసననుకల తులసి చేరిన శ్రీపాదములను, మెయ్ అరణ్ ఎన్ఱు=సత్యమైన ఉపాయమని, విరైన్దు అడైన్దు=(ఆర్తితో) వేగముగా ఆశ్రయించి, పిరిత్త వినై త్తిరళ్=(దానిచే) పోగొట్టబడిన పాపకూటము, పిన్ తొడరా వకై=తిరిగి రాకుండునట్లు, మఱిప్పు ఉడై =వలవేసి పట్టుకొనునది, అప్పెరియోర్=ఆ గొప్పవాడగు శ్రీకృష్ణుని, మన్ అరుళ్ వాశకత్తాల్ =దృఢమైన కృపతో వ్యక్తమైనదగు చరమశ్లోకమను సూక్తితో, మరుళ్ అఱ్ఱనమ్=అజ్ఞానమును పోగొట్టుకొంటిమి.

ఇది చరమశ్లోకాధికారములోనిది. శ్రీకృష్ణుడు మిక్కిలి శ్రమపడి, అనుష్ఠింపతగిన భక్తియోగాది ఉపాయములను ఆచరింపలేక, తన శ్రీపాదములును శరణు పొందిన ప్రపన్నుల పాపరాశి అంతటిని తిరిగి సంక్రమింపకుండురీతిలో నశించునని దృఢమై



కృపతో చరమశ్లోకమును అనుగ్రహించెను. ఆ శ్లోకమును అనుసంధించుటవలన ప్రపన్నుని అజ్ఞానము నశించి, దుఃఖము తీరి, ఫలవిషయమున సందేహము తొలగి, తనను తాను రక్షించు బాధ్యతయు తీరి, అతడు ఎల్లప్పుడు ఆనందించును.

**ఉత్తమూర్:–**అధికారార్థమును సంగ్రహించు పాశుర మిది. **(కుఱిప్పుడన్)** మిక్కిలి జాగరూకతతో, **(మేవుమ్)** ఆదరించి, అనుష్ఠింపవలసిన, **(తరుమఙ్గళిన్ఱి)** కర్మయోగ–జ్ఞానయోగ– భక్తియోగములను అనుష్ఠింపలేక, **(అ కోవలనార్)** వానిని ఉపదేశించినవాడు, వేదరక్షకుడును అయిన గోపాలుని, **(వెఱి)** మిక్కిలి పరిమళమును కల, **(తుళకమ్)** తులసిచే అలంకరింపబడిన, **(కఴల్)** శ్రీపాదములను, (దీనికి **“అడైన్దు”** అను పదముతో అన్వయము), **(మెయ్ అరణ్)** స్థిరమైన ఉపాయమని గ్రహించి, **(విరైన్దు)** మహావిశ్వాసముతో త్వరపడి, **(అడైన్దు)** ఆశ్రయించి, **(పిరిత్త)** మనలను వేఱుచేసిన, **(వినై తిరళ్)** పుణ్యపాపరాశి, **(పిన్ తొడరా వకై)** తిరిగి మనవద్దకు చేరి, వెంటనంటకుండురీతిలో ఏర్పడిన, **(అ పెరియోర్)** అట్టి సర్వోత్కృష్టుడగు కృష్ణునియొక్క, **(మఱిప్పు ఉడై)** మనలను అడ్డగింపకుండునట్లు, చుట్టుకొనియుండు, **(మన్)** స్థిరముగానుండు, **(అరుళ్)** కృపవలన పుట్టిన, **(వాశకత్తాల్)** చరమశ్లోకముతో, **(మరుళ్ అఱ్ఱనమ్)** అజ్ఞానము పోయినవారమైతిమి. పరమపురుషార్థముకొఱకు వేఱు ఉపాయములను పలు మార్లు ఉపదేశించిన ఆ మహాపురుషుడే వేదసంరక్షకుడనుటను తెలుపుటకై గోసంరక్షకుడై, పశుప్రాయులమగు మనలనుకూడ రక్షించుటకు దుష్కరములగు ఉపాయములను ఉపదేశించుటతోపాటు నిలువకుండ, తులసీదళముతో ప్రసన్నుడగు తన స్వభావమునకు తగినట్లు తన శ్రీపాదములలో శరణాగతియే చాలును, సర్వపాపవిమోక్షము నిశ్చయము–అని నిర్హేతుకకృపతో చేసిన, ఇంతకు మించి లఘూపాయములేకుండుటచే స్థిరమైన ఉపదేశముతో మన అజ్ఞానములు అన్నియు నశించినవి.

## ఆచార్యుడు చేయు ఉపకారము

**37.** **మరుళఱ్ఱ దేశికర్ వానుకప్పా లిన్ద వైయ మెల్లామ్**
**ఇరుళఱ్ఱిఱైవనిణైయడి పూణ్డుయ వెణ్ణుదలాల్**
**తెరుళుఱ్ఱ శెన్దొఴిల్చెల్వమ్ పెరుకి చ్చిఱన్దవర్పాల్**
**అరుళుఱ్ఱ శిన్దైయినా లఴియా విళక్కేఱ్ఱినరే**

మరుళ్ అఱ్ఱ దేశికర్=అజ్ఞానములేని ఆచార్యులు, వాన్ ఉకప్పాల్ =(తాము) పరమపదమును చేరవలెనని కోఱుటచే, ఇన్ద వైయమ్ ఎల్లామ్=ఈ లోకము అంతయు,

ఇరుళ్ అఱ్ఱు = అజ్ఞానము పోయి, ఇఱైవన్ ఇణై అడి=భగవానుని రెండు శ్రీపాదములను, పూణ్డు ఉయ ఎణ్ణుదలాల్=ఉపాయముగా ఆశ్రయించి, ఉజ్జీవింపవలెనని తలచుటచే, అరుళ్ ఉఱ్ఱ శిన్దైయినాల్=కృపనిండిన మనస్సుతో, తెరుళ్ ఉఱ్ఱ=వివేకముతో కూడి, శెమ్ తొఴిల్ శెల్వమ్ పెరుకి=లభించిన కైంకర్యము అను సంపద వృద్ధిచెంది, శిఱన్దవర్‌పాల్=ఉన్నతులగు శిష్యులపట్ల, అఴియా విళక్కు=నశింపని (సంప్రదాయమను) దీపమును, ఏఱ్ఱినర్ =వెలిగించిరి. (ఉపదేశించిరి)

అజ్ఞానలేశముకూడ లేని మన ఆచార్యులు రహస్యత్రయములను తగనివారికి ఉపదేశింపకుండ కాపాడిరి. తాము పరమపదమును చేరగోరిన సమయము ఈ సంసారులు అందఱు అజ్ఞానము పోయి, భగవానుని పాదములందు ప్రపత్తిని అనుష్ఠించి, ఉజ్జీవింపవలెనని చల్లని చూపుతో కటాక్షించిరి. వివేకమును పొంది, భగవత్కైంకర్యమునందు శ్రద్ధనుకల గొప్ప శిష్యులవద్ద ఏ సమయముననూ నశింపని సంప్రదాయమను దీపమును వెలిగించి, లోకమునందు అంతట దాని ప్రకాశము వ్యాపించునట్లు చేసిరి.

ఈ పాశురము ఆచార్యకృత్యాధికారములోనిది. అక్షరము అధికమగును కావున **"ఇఱైయవన్"** అను పాఠము సరి కాదు. **"జ్ఞానదీపేన భాస్వతా"** అనునట్లు సంప్రదాయజ్ఞానము దీపముగా చెప్పబడినదికదా! **"లక్ష్మణో లక్ష్మిసంపన్నః" "స తు నాగవరః శ్రీమాన్"** ఇత్యాదిసూక్తులలో కైంకర్యము గొప్ప సంపదగా చెప్పబడుట ఇచట స్మరణీయము.

**ఉత్తమూర్:–** అధికారార్థము ముగిసినది. ఈ అధికారార్థము ప్రస్తుతపాశురములో సంగ్రహింపబడుచున్నది.

**(మరుళ్)** అజ్ఞానము, **(అఱ్ఱ)** లేనివారగు, **(దేశికర్)** ఆచార్యులు, **(వాన్ ఉకప్పాల్)** పరమపదమునందలి ఆశచే, **(ఇన్ద వైయ మెల్లామ్)** ఈ లీలావిభూతి అంతట, **(ఇరుళ్ అఱ్ఱు)** అజ్ఞానము తొలగి, **(ఇఱైయవన్)** స్వామియైన శ్రియఃపతియొక్క, **(ఇణై అడి)** ఒక దానికి వేఱొకటి ఈడయిన శ్రీపాదములను, **(పూణ్డిడ)** ఉపాయోపేయములుగా గ్రహించిన, లేక, **(పూణ్డు ఉయ)** ఉజ్జీవించుటకు, **(ఎణ్ణుదలాల్)** తలచి, **(తెరుళ్ ఉఱ్ఱ)** వివేకమును కలవారును, **(శెమ్ తొఴిల్)** ఋజువైన కైంకర్యమనెడి, **(శెల్వమ్) సంపద, (పెరుకి)** వృద్ధిచెంది, **(శిఱన్దవర్ పాల్)** ఉత్కృష్టులగు శిష్యులపట్ల, **(అరుళ్ ఉఱ్ఱ శిన్దైయినాల్)** కృపను పొందిన చిత్తముతో, **(అఴియాద విళక్కు ఏఱ్ఱినార్)** నశింపని



ఆరిపోని దీపమును వెల్గించిరి. మనము పొందు పరమపదము తరువాతవారికి లభింపవలెనని తలచి యోగ్యతను కలవారికి ఉపదేశించిరి. ఇదియే ఆచార్యకృత్యమని భావము.

### శిష్యుని కర్తవ్యము

38. ఏఱ్ఱి మనత్తెఴిన్ ఞానవిళక్కై యిరుళనైత్తు
మాఱ్ఱినవర్క్కొరు కైమ్మాఱు మాయను మ్కాణకిల్లాన్
పోఱ్ఱి యుకప్పదుమ్ పున్దియిఱ్కొళ్వదుమ్ పొఙ్గుపుకఴ్
శాఱ్ఱి వళర్ప్పదుమ్ శిఱ్ఱల్లవో మున్నమ్ పెఱ్ఱదఱ్కే

మనత్తు = (మన) మనస్సులో, ఎఴిల్ ఞాన విళక్కై ఏఱ్ఱి = ప్రకాశించుచున్న జ్ఞానమను దీపమును వెలిగించి, ఇరుళ్ అనైత్తుమ్ మాఱ్ఱినవర్క్కు = అజ్ఞానము నంతటిని పోగొట్టిన ఆచార్యుల విషయమున, ఒరు కైమ్మాఱు = (చేయతగిన) ఏ ప్రత్యుపకారమును, మాయనుమ్ కాణకిల్లాన్ = భగవానుడును తెలియలేడు (కావున మనము), పోఱ్ఱి ఉకప్పదుమ్ = (ఆచార్యుని) కీర్తించి, సంతోషించుట, పున్దియిల్ కొళ్వదుమ్ = మనస్సులో ధ్యానించుట, పొఙ్గు పుకఴ్ శాఱ్ఱి వళర్ప్పదుమ్ = నిండిన (పూర్ణమైన) కీర్తిని అంతట ఘోషించి, (మిక్కిలి) వృద్ధి పొందించుట–అను ఇవి అన్నియు, మున్నమ్ పెఱ్ఱదఱ్కు = (మనము ఆచార్యునివద్దనుండి) పూర్వము పొందిన ఉపకారమునకు, శిఱ్ఱు అల్లవో = మిక్కిలి అల్పము (తక్కువ) కదా!

ఆచార్యుడు శిష్యులకు తత్త్వము, ఉపాయము, పురుషార్థము – అను వీనిని ఉపదేశించి, **"జ్ఞానదీపేన భాస్వతా"** అనునట్లు జ్ఞానము దీపమును వెల్గించి, అజ్ఞానమును నశింపచేయును. ఇట్టి ఆచార్యుని విషయమున చేయగల్గిన ప్రత్యుపకారమును తెలియుటకు సర్వజ్ఞుడగు సర్వేశ్వరునకును వీలుకాదు. మిగిలినవారినిగూర్చి ఇక చెప్పవలసినదేమి? అయినను, లోకమున శిష్యులు ఆచార్యుని కీర్తించి, ఆనందింతురు. మనస్సులో ధ్యానింతురు. **"గురుపాదాంబుజం ధ్యాయేత్, గురో ర్నామ సదా జపేత్" "గురుం ప్రకాశయే ద్ధీమాన్"** అనునట్లు ఆచార్యుని కీర్తిని మిక్కిలి పొగడి, పొగడి వృద్ధి పొందింతురు. ఇవి అన్నియు మనస్సులోగల భక్తిని ప్రకాశింపచేయుటకే తప్ప, ఆచార్యునివలన పొందిన మహోపకారమునకు కొంచెముకూడ సాటిరావు. **"యో దద్యాత్ భగవద్జ్ఞానం కుర్యా ద్ధర్మోపసేవనమ్, కృత్స్నాం వా పృథివీం దద్యా న్న తత్తుల్యం**

**కథంచన"** ఇత్యాది ప్రమాణములిచట స్మరణీయము. **"అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక....ఞానచ్చుడర్ విళక్కేఱ్ఱినేన్"** అని ఆఴ్వార్లును జ్ఞానమును దీపముగా పల్కిరి. ఈ పాశురము శిష్యకృత్యాధికారములోనిది.

**ఉత్తమూర్:–**ఆచార్యవైభవమును కీర్తించుట శిష్యకృత్యము. కాని, అట్లు కీర్తించుట ప్రత్యుపకారముగా తలపరాదనుటను ఈ పాశురములో తెలుపుచున్నారు.

**(మనత్తు)** శిష్యుని మనస్సులో, **(ఎఴిల్)** ప్రకాశించు, **(ఞానమ్ విళక్కై)** జ్ఞానమను దీపమును, **(ఏఱ్ఱి)** వెలిగించి, **(ఇరుళ్ అనైత్తుమ్)** అజ్ఞానమను చీకటిని అంతటిని, **(మాఱ్ఱినవర్క్కు)** పోగొట్టిన ఆచార్యులకు, **(ఒరు కైమ్మాఱు)** ఏదైన ఒక ప్రత్యుపకారమును, **(మాయనుమ్)** సర్వజ్ఞుడై, సర్వస్రష్ట అగు పరమాత్మకూడ, **(కాణకిల్లాన్)** కనుగొనలేడు. ఏదైన ఉన్నచో కదా ఎవరైనను చూడగలరు. **(పోఱ్ఱ ఉకప్పదుమ్) "ప్రత్యక్షే గురవః స్తుత్యాః"** అనునట్లు **"జయ విజయీభవ"** అనుచు పొగడి, దానితో మనస్సున సంతోషించుటయును, **(పున్దియిల్)** తన బుద్ధిలో, **(కొళ్వదుమ్)** ధ్యానము చేయుట, **(పొఙ్గు)** పైపైకి వృద్ధి చెందు, **(పుకఴ్)** గుణప్రశస్తిని, **(శాఱ్ఱి)** లోకమంతట తెలియునట్లు ఉద్ఘోషించి, **(వళర్ప్పదుమ్)** వృద్ధిచేయుటయు, (ఇది కాయికములగు ప్రణామపూజనాదులకును ఉపలక్షణము) ఇవి అన్నియును, **(మున్నమ్ పెఱ్ఱదఱ్కే)** దీనికి ముందుగనే శిష్యుడు పొందియున్న పరిపూర్ణబ్రహ్మానుభవహేతువిద్యకు, **(శఱ్ఱు అల్లవో)** మిక్కిలి అల్పములే అగును. కావున ప్రత్యుపకారములు కాజాలవు. ఇంత మాత్రము చేయుటయును ఇతని నిష్ఠ పాడుకాకుండుటకొఱకేనని బావము. శిష్యకృత్యాధికారమగుటచే **"శఱ్ఱు అల్లవో"** అనుటచే ఈ అనుసంధానమును ఒక శిష్యకృత్యమని తాత్పర్యము.

**శ్రీమద్రహస్యత్రయసారముయొక్క నాల్గు విభాగములు**

**39.** **మున్పెఱ్ఱ ఞానము మోక స్తుఱక్కలు మూన్టురైయిల్**
**తన్ పఱ్ఱ తన్మైయుమ్ తాఴ్న్దవర్క్కీయు స్తనిత్తకవు**
**మన్పఱ్ఱి నిన్ఱవకై యురైక్కిన్ఱ మఱైయవర్పా**
**ఱ్పిన్పఱ్ఱి యెన్ పయన్ శీరఱివోర్క్కివై శెప్పినమే**

మన్ పఱ్ఱి నిన్ఱ వకై = ప్రభువు అగు భగవానుని (శరణముగా) ఆశ్రయించి, గొప్పవాడైన ప్రకారమును, ఉరైక్కిన్ఱ మఱైయవర్పాల్ = ఉపదేశించు వేదాంతములను తెలిసినవారగు



ఆచార్యులపట్ల, శీర్ అఱివోర్క్కు = గొప్ప జ్ఞానమును పొందవలెనని ఆశించు అధికారులకు, మున్ పెఱ్ఱ ఞానముమ్ = పూర్వము ఆచార్యుని సన్నిధిలో పొందిన వివేకము, మోకమ్ తుఱక్కలుమ్ = మోహము నశించి, తేటపడుట, మూన్టు ఉరైయిల్ = రహస్యములు మూడింటిలో, తన్ పఱ్ఱు అదు అన్మైయుమ్ = (భగవానునకే శేషమై) తన స్వాతంత్ర్యము లేకుండుట, తాఴ్న్దవర్క్కు ఈయుమ్ తని త్తకవుమ్ = వచ్చి ఆశ్రయించి, సేవచేసిన వారికి ఉపదేశించుటకు కారణమైన సాటిలేని మేటి కృపయును అను, ఇవై శెప్పినమ్ = ఈ విషయములను (ఈ గ్రంథములో) తెలిపితిమి. (వీనిని అర్థము చేసికొనకుండ) శిన్ పఱ్ఱి ఎన్ పయన్ = అల్పవిషయములందు ఆసక్తిని పొంది ఏమి ప్రయోజనము?

ప్రపత్తిమహిమను ఉపదేశించు ఆచార్యునివలన వివేకమును పొందవలెనని కోఱు ఆస్తికులగు శిష్యులకు మిక్కిలి ఉపయోగపడునట్లు ఈ రహస్యత్రయసారమను గ్రంథమును రచించితిమి. ఇందు మొదట తత్త్వము, ఉపాయము, పురుషార్థము–అను మూడింటి స్వరూపస్వభావములను ఆచార్యునివద్దనుండి పొందురీతిలో చక్కగా వివరించితిమి. పిమ్మట అందు వచ్చు ఆక్షేపములకు అన్నిటికిని సప్రమాణముగా సమాధానములను పల్కి సిద్ధాంతమును స్థాపించితిమి. పిదప రహస్యములు మూడింటిలో అర్థమును గ్రహించు రీతిలో వివరించి, వానిలో ముఖ్యముగా, జీవుడు భగవానునకు మాత్రమే శేషమని, స్వాతంత్ర్యము లేనివాడని చెప్పబడుచున్నదని తెలిపితిమి. అనంతరము సత్సంప్రదాయమును తెలియగోరి వచ్చి, సేవ చేయు శిష్యులగు సత్పాత్రములందు ఉపదేశించు రీతిలో కరుణ మరియు ఆచార్యుని గొప్పతనము – మొదలగువానిని వివరించితిమి. ఇట్టి సారార్థములను కల్గిన ఈ సూక్తిని అనుభవింపకుండ, అల్పవిషయములందు ఆసక్తి కల్గియున్నచో ఏ ప్రయోజనమును కలుగదు.

ఈ పాశురము తరువాతి పాశురమును నిగమనాధికారములోనిది.

**ఉత్తమూర్:–** ఈ గ్రంథములోని అన్ని అధికారముల అర్థమును, దృష్టిలో నుంచుకొని ప్రస్తుత అధికారార్థమును సంగ్రహించు ఈ పాశురమును పల్కుచున్నారు. ఈ పాశురము **"తిరువుడన్ వన్ద"** అను పాశురమునుండి ప్రారంభమైన అన్దాదిపాశురములలో ముప్పది రెండవది అగుటచే, ఈ అధికారమునకు పాశురము కావలసివచ్చుటచే ఇది ఈ అధికారనిగమన పాశురము. అందుచే ఈ అధికారప్రారంభములోనున్న శ్లోకార్థ మిచట అనుసంధేయము. కనుక సారదీపికలోనున్న అర్థము సారాస్వాదినిలో చివరగా

చెప్పబడినను మొదట సారాస్వాదినిలో చెప్పబడిన అర్థమే గ్రాహ్యము. కావున మూడవపాదములోని **"మన్ పఱ్ఱి"** ఇత్యాదిచే **"సుచరితసిలహారీ"** అనుచు ముందు పల్కిన ఈ అధికారార్థమును చెప్పినచో పొసగును. అందువలన **"మోహముమ్ తుఱక్కలుమ్"** అనునపుడు **"మోహత్తు ఉఱక్కలుమ్"** అనెడి పాఠమును విడువబడును. **"తన్ పఱ్ఱు"** అని, **"తన్ పెఱ్ఱు"** అనియును పాఠములు. **(మున్)** అర్థానుశాసన భాగమును అనుసరించి, **(పెఱ్ఱు)** పొందిన జ్ఞానమును, **(మోహమ్ తుఱక్కలుమ్)** మోహము, నిద్రయును, **(మూన్ఱు ఉరైయిల్)** పదవాక్యయోజనాభాగమును బట్టి మూడు రహస్యములలో, **(పెఱ్ఱు తన్ తన్మైయుమ్)** జీవస్వరూపముయొక్క మోహాతిరేక, పరమాత్మశేషత్వాది స్థితిని-అని భావము. **"పఱ్ఱు"** అను పాఠమైనచో దానికి పూర్తిగా అను అర్థమును కలదు. దానిని గ్రహింపవచ్చును. **"తున్బఱ్ఱు"** అనియును ఉండవచ్చును. వివరణమువలన కష్టము తీరునుకదా! **(తాళ్న్దవర్క్కు)** నమస్కరించిన శిష్యులకు, **(ఈయుమ్)** సంప్రదాయమును అనుగ్రహించుటకొఱకైన, **(తని త్తకవుమ్)** సాటిలేని ఆచార్యకృపను, **(మన్ పఱ్ఱి నిన్ఱ వకై)** రాజాధిరాజై, స్థిరపురుషార్థమైన పరమాత్మనే విషయీకరించిన మహానుభావులయొక్క సువ్యాహృతములతోను, సుచరిత్రలతోను వివరించుచున్న, **(మఱైయవర్పాల్)** వేదాంతార్థమును తెలిసినవారివద్దగల, **(శీర్ అతివోర్క్కు)** గొప్పతనమునందు ఆకృష్టులైనవారికి, **(ఇవై)** ఇన్ని అధికారార్థములను, **(శెప్పినమ్)** చెప్పితిమి. **''మఱైయవర్పాల్''**-వేదార్థములను తెలిసినవారివద్ద, **"అతివోర్క్కు"** తెలియగోరి వచ్చువారికి-అనియును వివరింతురు. **(శిన్ పఱ్ఱి)** చిన్నవి అయినవానిలో ఆదరమును కల్గి, **(పెఱుమ్ పయన్)** పొందు ప్రయోజనము, **(ఎన్)** ఏమి? ఈ రీతిగా ఉపదేశము నరకాదిమార్గ-ధూమాదిమార్గములకే అగును. కావున క్షుద్రము. ఈ ప్రబంధములో తెలుపబడిన నాల్గు విధములైన అర్థములను, మిగిలిన మహనీయుల సువ్యాహృతములను, సుచరితములను మనకు ముందుగా పల్కిన మన పూర్వాచార్యులవద్దను, ఇపుడున్న మహాత్ములవద్దనుగల గొప్పతనమునందు ఆదరమును కలవారికే మేము పల్కితిమి. అనధికారులకు కాదు. వీటిని విడచినచో నైచ్యమును పొందినట్లగును-అని భావము.

**"తన్ పెఱ్ఱి"** అనునది సారదీపికాపాఠము. **"తన్బఱ్ఱు"** అను పాఠమున, **"తన్బు"** అపకర్షము, **"అఱ్ఱు"** అది లేని-అను వివరణము కన్పించుచున్నది. **"తన్బు"** అనెడి పదము ఉన్నచో అది శుద్ధపాఠమే. **"తన్ పఱ్ఱు అదు అన్మై"** అని విడదీసి



**"అన్మై"** అనుటకు **"ఇన్మై"** అను అర్థమును చెప్పి, తనకు స్వాతంత్ర్యము లేకుండుట మూడు రహస్యములలోని అర్థమని అందురు. సారాస్వాదినిలో-**"తన్బఱ్ఱు తన్మై"** మూడు రహస్యములలో ఇది మూలమంత్రార్థము, **''తని త్తకవు''** అనగా ఉపాయాంతరస్థాననివేశమగు కృప. ఇది ద్వయార్థము, **"మన్ పఱ్ఱి నిన్ఱ వకై"** చరమశ్లోకార్థము-అను యోజన కలదు. సారదీపికలో "మొదటినుండి జీవులకు సృష్టికాలములో వచ్చు జ్ఞానవికాసమును, విషయమోహమువలన కల్గు అజ్ఞానమును, నిద్రయును, భగవత్కృపచే పిమ్మట ఏర్పడిన, మంత్రముల మూలమైన తన స్వభావమును, ముఖ్యోపాయమైన భగవత్కృపయును, నిర్యాణమునకు పిదప ప్రభువు అగు భగవానునిగూర్చిన గొప్ప కైంకర్యమును" అని వివరింపబడినది. ముందు తెల్పిన వివరణమే స్వరసము.

**ఈ పాశురములు తమిళభాషకే అలంకారము**

40. **శెప్పుచ్చెవ్విక్కముదెన్న త్తికళుమ్ శెళుఙ్కుణత్తు**
**త్తప్పఱ్ఱవరుక్కు త్తామే యుకన్దు తరున్దకవా**
**లొప్పఱ్ఱ నాన్మఱైయుళ్ళ క్కరుత్తిలుఱైత్తురైత్త**
**ముప్పత్తిరణ్డివై ముఱ్ఱమిళ్ శేర్న్ద మొళిత్తిరువే**

శెళుమ్ కుణత్తు త్తప్పు అఱ్ఱవరుక్కు = గొప్ప గుణములయందు ఎట్టి లోపము లేని అధికారుల విషయములో, తామే ఉకన్దు తరుమ్ తకవాల్ = (భగవానుడు, భాగవతులును) తామే ఆనందించి అనుగ్రహించు కృపచే, ఒప్పఱ్ఱనాల్ మఱై = సాటిలేని నాల్గు వేదముల, ఉళ్ల క్కరుత్తిల్ = తాత్పర్యములందు, ఉఱైత్తు = చక్కగా పరిచయమును పొంది, ఉరైత్త = వివరింపబడినవి, శెప్ప చ్చెవిక్కు అముదు ఎన్న = ఉచ్చరించునపుడు చెవికి అమృతము అని చెప్పదగినట్లు, తికళుమ్ = ప్రకాశించునవి యగు, ఇవై = ఈ, ముప్పత్తిరణ్డు = ముప్పదిరెండు, పాశురములును, ముత్తమిళ్ శేర్న్ద= (ఇయల్, ఇశై, నాటకమ్) అను మూడు విధములైన తమిళమునకు చెందిన, మొళి త్తిరు= భాషకే అలంకారము.

భగవానుడు, భక్తులును సద్గుణములలో లోటు లేని అధికారులపట్ల ఆనందించి, అనుగ్రహింతురు. వారి కృపను ఆధారముగాగొని, వేదాంతశాస్త్రమున చక్కని పరిచయమును పెంచుకొని, ఈ పాశురములను రచించితిమి. వీని అర్థమును తెలియక, ఊరికే అనుసంధించినను, తీయని అమృతమువలె ఆనందము కల్గించును. అంతాది

ప్రక్రియలో కూర్పబడిన ఈ ముప్పది రెండు పాశురములు ఇయల్, ఇశై, నాటకము -అను మూడు విధములైన ద్రావిడ భాషకే అలంకారమై వెల్గును.

ఇచట **"ముత్తమిழ் శేర్న్ద"** అను ప్రయోగమునకు కవియొక్క గొప్పతనము, విషయగౌరవము, వాక్యముల అందము-అను మూడు అంశములు నిండిన-అని, శబ్దమాధుర్యము, అర్థగాంభీర్యము, రాగమునకు తగియుండుట-అను మూడు విషయములతో పూర్ణమైన అని, ఆశుకవిత్వము, చిత్రకవిత్వము, మాధుర్యము-అను మూడింటిని కల్గిన అని పూర్వ వ్యాఖ్యాతలు వివరించిరి. శడకోపర్ అన్దాదిలో నమ్మాழ్వార్ పాశురములను గూర్చి కంబమహాకవి **''ఆయిరమామఱై క్కు అలఙ్గారవ్ అరున్దమిழ్క్కుపాయిర నాఙ్గివిక్కు ప్పడిచ్చన్దవ్''** ఇత్యాదిగా కీర్తింపబడుట, తిరువాయ్మొழிప్రబంధమువలెనే, రహస్యత్రయసారమునకు చెందిన పాశురములు అంతాది ప్రక్రియలో కూర్పబడుట గమనింపతగినవి.

ఈ పాశురముతో అంతాదిప్రక్రియ ముగిసినది. ఇంతవరకు గల పాశురములు కట్టళైక్కలిత్తుఱై ఛందస్సులో రచింపబడినవి.

**ఉత్తమూర్:-** అన్దాదిక్రమమునకు తగినట్లు **''మున్ పెఱ్ఱ''** అను పాశురము నిగమనాధికారములోని చివరిది. అధికారసంగ్రహపాశురములలోని విశేషమును అన్దాదిప్రక్రియలోని చివరిది అగు ఒక పాశురములతో పల్కుచున్నారు. ఇందులో **"ముప్పత్తిరణ్డివై"** అనునది కర్తృపదము. **"తికழుమ్"** అనునది సమాపకక్రియ. దీనిని **''ముప్పత్తిరణ్డు''** అనుటకు విశేషణముగా చేసినచో **''మొழி త్తిరు''** అనుటను **''మొழிత్తిరువాకుమ్''** అను క్రియాపదముగా చేయవలెను. ఈ పాశురము అన్దాదిగానుండుటచే **''ముప్పత్తిరణ్డు''** అనుదానికి దీనికిముందుగల అన్దాదిపాశురములు-అను అర్థమును గ్రహింపవలెను.

**(శెழுమ్ కుణత్తు)** శ్లాఘ్యములగు గుణములను కలవారు. **(తప్పఱ్ఱవర్క్కు)** దోషములేని వారును అగు పురుషులకు, భగవద్భాగవతులకు-అని చేర్చుకొనవలెను. **(ఉకన్దు)** సంతోషించి, **(తామే తరుమ్)** తామే అర్థములను అనుగ్రహించు, **(తకవాల్)** దయతో, **(ఒప్పు అఱ్ఱ)** సాటిలేని, **(నాల్ మఱై)** నాల్గు వేదముల, **(ఉళ్ళమ్ కరుత్తిల్)** తాత్పర్యార్థమును గ్రహించిన మనస్సులో, **(ఉఱైన్దు)** గీటురాయిలో గీచినట్లు గీచి, **(ఉరైత్త)** చెప్పబడినవియు, **(ముత్తమిழ்)** ఇయల్, ఇశై, నాటకమ్-అనెడి మూడు విధములగు తమిళములతో చేరిన, **(మొழி)** భాషకు , లేక, ఈ గ్రంథమునకు, **(తిరు)** అలంకారముగా నున్న, **(ముప్పత్తిరణ్డు ఇవై)** ఈ అన్దాదిపాశురములు, ముప్పది రెండు, **(శెప్ప)** తగినరీతిలో



చెప్పునపుడు, **(శెవిక్కు)** వినువారి చెవులకు, **(అముదు ఎన్న తికழுమ్)** అమృతమనునట్లు వెల్గును. సత్పురుషులవద్ద భగవానుడు, భాగవతులును సంతోషించి కృపజేయునపుడు నాల్గువేదములు మొదలగు ప్రమాణముల అర్థము చక్కగా వెల్గును. అందు చక్కగా విమర్శించి చూచి, ఋజువైన విశేషార్థములను ఉద్ధరించి, ఈ అన్దాది పాశురములు రచింపబడినవి. మధురములగు పలుకులు, రాగము, ఉచితమైన అభినయము చేరిన తమిళభాషకే ఈ పాశురములు అలంకారములు. కావున కర్ణామృతములు.

ఇచట **''తామే''** అను పదమునకు భగవద్భాగవతులు-అను అర్థము అధ్యాహరించుకొనుటద్వారా చెప్పనగును. లేక, **"తామే"** అను పదము వేదములను నిర్దేశించుచున్నదని భావించి **"తామే"** -సాటిలేని నాల్గు వేదము తామే, సత్పాత్రములను చూచి, **"ఉకన్దు తకవాల్ తరుమ్"** తమను తామే స్పష్టముగా అనుగ్రహించుచున్న నాల్గు వేదముల తాత్పర్యార్థమును-అని వివరింపవచ్చును. తపశ్శీలురకు వేదములు తమకు తామే స్ఫురించును కదా! విద్యాదేవి దయతో తనకు తానే ఆవిష్కరించుకొనునని అనవచ్చునే. **''ముప్పత్తిరణ్డివై''** అనుటకు ఈ సమగ్రగ్రంథమైన ముప్పదిరెండు అధికారములు-అను అర్థమును చెప్పినచో, **"ముత్తమిழ்"** అనుటకు మూడు విధములైన తమిళములు అనగా-వచనశైలిలోని తమిళము, పాశురరూపములోని తమిళము, ఆழ்వార్ల శ్రీసూక్తులవంటి ఉదాహరింపబడిన తమిళము-అను మూడు విధములైన తమిళములు చేరిన, **"మొழிక్కు"** - సంస్కృతభాష అను సంబంధమును కల్గినవి - అని భావము.

**తత్త్వములు ఈశ్వరుని మేనిలోనుండు తీరు**

**41. పురుడన్ మణి వరమాక ప్పొన్ఱా మూల**
**ప్పిరకిరుతి మఱువాక మాన్దణ్డాక**
**త్తెరుళ్ మరుళ్ వాళుఱైయాక వాఙ్గారఙ్గళ్**
**శార్ఙ్గ ఇచ్చఙ్గాక మన న్తికిరియాక**
**విరుడికజ్ఞభీరైన్దు ఇచ్చరఙ్గళాక**
**విరు పూదమాలై వనమాలైయాక**
**క్కరుడనురువా మఱైయిన్ పొరుళాఙ్కణ్ణన్**
**కరి గిరిమేనిన్దనైత్తు త్తాఙ్కిన్నానే**

కరుడన్ ఉరు ఆమ్ మఱైయిన్ = గరుడుని శరీరముగానున్న వేదముయొక్క, పొరుళ్ ఆమ్ కణ్ణన్ = అర్థమైయున్న భగవానుడు, పురుడన్ = జీవుడు, మణి వరమ్ ఆక =

రత్నములలో గొప్పది అగు కౌస్తుభముగా, పొన్హా మూల ప్పిరకిరుతి = నశింపని మూలప్రకృతి, మఱు ఆక = శ్రీవత్సమను పుట్టుమచ్చగా, మాన్ తణ్డు ఆక = మహాన్ అను తత్త్వము కౌమోదకి అను గదగా, తెరుళ్ వాళ్ ఆక = జ్ఞానము నందకము అను కత్తిగా, మరుళ్ వాళ్ ఉఱై ఆక = అజ్ఞానము కత్తియొక్క ఒరగా, ఆజ్కారజ్గళ్=తామసాహంకారము, సాత్త్వికాహంకారమును, శార్జ్గమ్ శఙ్గ ఆక=క్రమముగా శార్ఙ్గమను విల్లుగా, పాంచజన్యమను శంఖముగా, మనమ్ తికిరి ఆక = మనస్సు సుదర్శనమను చక్రముగా, ఇరుడికజ్గళ్ = జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములు అయిదు- అను ఇంద్రియములు పది బాణములుగా, ఇరు పూత మాలై = తన్మాత్రలు అయిదు, భూతములు అయిదు అను రెందు విధములైన భూతములవరుస, వనమాలై ఆక= వనమాలగా - (ఇట్లు సకలతత్త్వములు తనకు ఆయుధములుగా, ఆభరణములుగా నుండగా), కరి గిరిమేల్ నిన్ఱు = హస్తిగిరిపై నిలచియుండి స్వామి, అనైత్తుమ్ కాక్కిన్హాన్= సకలమును రక్షించుచున్నాడు.

వరదరాజస్వామి చేతనము, అచేతనము అను తత్త్వములనన్నిటిని తనకు ఆభరణములుగా, ఆయుధములుగా కల్గి, కొండ శిఖరముపై పెట్టిన దీపమువలె హస్తిగిరిపై అందఱు దర్శించి ఆనందించు రీతిలో నిలచియుండి, లోకములనన్నిటిని రక్షించుచున్నాడు.

జీవుడు కౌస్తుభమైయున్నాడనగా జీవతత్త్వముయొక్క అభిమానదేవత, కౌస్తుభముయొక్క అభిమానదేవత ఒకటేనని తాత్పర్యము. ఇట్లే, మిగిలినవాని విషయమునను అన్వయించుకొనవలెను. విష్ణుపురాణములోని అస్త్రభూషణా ధ్యాయతాత్పర్య మిచట అనుసంధేయము. ఈ పాశురము తత్త్వత్రయ చింతనాధికారములోనిది. విష్ణుపురాణము ప్రథమాంశ చివరలోని - **"బిభర్తి కౌస్తుభమణిస్వరూపం భగవాన్ హరిః, శ్రీవత్ససంస్థాన పరమనంతేన సమాశ్రితమ్, ప్రధానం బుద్ధి రధ్యాస్తే గదా పూర్వేణ మాధవః, బిభర్తి శంఖరూపేణ శార్ఙ్గరూపేణ చ స్థితమ్, చలస్వరూప మత్యంతజవేనాంతరితానిలమ్, చక్రరూపం చ మనో ధత్తే విష్ణుకరే స్థితమ్, పంచరూపా తు యా మాలా వైజయంతీ గదాభృతః, సా భూతహేతుసంఘాతో భూతమాలా చ వై ద్విజ, యానీంద్రియాణ్యశేషాణి బుద్ధికర్మాత్మికాని వై, శరరూపాణ్యశేషాణి తాని ధత్తే జనార్దనః, బిభర్తి చ్చాసివర మచ్యుతోఽత్యంత నిర్మలమ్, విద్యామయం తు తద్జ్ఞాన మవిద్యాచర్మసంస్థితమ్ ఇత్థం పుమాన్ ప్రధానాం చ బుద్ధ్యహంకార మేవ చ, భూతాని చ హృషీకేశే మన స్సర్వేంద్రియాణి చ, విద్యావిద్యే చ**



**మైత్రేయ సర్వ మేతత్ సమాశ్రితమ్"** అను శ్లోకముల అర్థ మిచట భావ్యము. **"వేదాత్మా విహగేశ్వరః"** అనునట్లు గరుడుడు వేదస్వరూపుడు. హృషీకములను పదమే **"ఇరుడికజ్గళ్"** అయినది.

**ఉత్తమూర్:- (పురుడన్)** జీవులందఱు, **(మణి వరమ్ ఆక)** కౌస్తుభమైయున్న స్థితిలో, **(పొన్హా)** నశింపని, **(మూల ప్పిరకిరుతి)** ఇరువదినాల్గు తత్త్వములలో ఆది కారణమైన ప్రకృతి, **(మఱు ఆక)** శ్రీవత్సమనెడి పుట్టుమచ్చగా **(మాన్)** మహాన్ అనెడి తత్త్వము, **(తణ్డు ఆక)** కౌమోదకి అనెడి గదిగా, **(తెరుళ్)** జ్ఞానము, **(వాళ్ ఆక)** నందకమనెడి కత్తిగా **(మరుళ్)** అజ్ఞానమనునది, **(మఱైవు ఆక)** ఆ కత్తిని పెట్టు ఒఱగా. **"మఱైవాక"** అనుటకు **"ఉఱైయాక"** అఱు పాఠాంతరము కలదు. **(ఆజ్కారజ్గళ్)** సాత్వికము, తామసమనెడి రెండు అహంకారములును, **(శార్జ్గమ్ శఙ్గు ఆక)** శార్ఙ్గమనెడి విల్లుగను, పాంచజన్యమనెడి శంఖముగను, **(మనమ్)** మనస్సు అనెడి ఇంద్రియము, **(తికిరి)** చక్రముగా, **(ఇరుడీకజ్గళ్)** హృషీకములు - ఇంద్రియములు, **(ఈర్ ఐన్దు ఆమ్)** పదియును, **(శరజ్గళ్ ఆక)** బాణములుగను, **(ఇరుపూతమాలై)** పంచభూతతన్మాత్రలు పంచభూతములనెడి సూక్ష్మస్థూలరూపములై, రెండు విధములైన భూతముల మాల-వరుస, **(వనమాలైయాక)** వైజయంతీ మాలగను **"మణివర మాక"** అనునది. మొదటనుండు **"ఆక"** అనెడి పదమునకు **"పొరుళామ్"** అనుచోట అన్వయమే వ్యాఖ్యలలో అంగీకరింపబడినది. ఇవి అన్నియు అస్త్రభూషణములగునట్లు **(మఱైయిన్ పొరుళామ్)** వేదమునకు అర్థమగు వేదములో తెలుపబడిన-అని భావము. **(కరుడన్ ఉరు ఆమ్ మఱైయామ్)** గరుత్మంతునకు అవయవములగు వేదములకు, **(పొరుళామ్ కణ్ణన్)** అర్థముగా వెల్గు శ్రీకృష్ణుడు, **(కరికిరిమేల్ నిన్ఱు)** కాంచీపురములోని హస్తిగిరిలోశిఖరములో వెల్గుచు, **(అనైత్తుమ్)** అన్ని లోకములను, **(కాక్కిన్హాన్)** రక్షించుచున్నాడు.

**"పొన్హా మూల ప్పిరకిరుతి"**-మహదాది వికారములు ప్రకృతిలో ఏ ప్రదేశములోనున్నవో ఆ భాగము మూలశబ్దముచే గ్రహింపబడును. **"పొన్హా"** అను పదముచే ఆ విధమైన కార్యప్రళయమునకు స్థానమగు సామ్యావస్థమగు ప్రదేశము సూచింపబడును. అహంకారములు మూడయినను పైన శార్ఙ్గము, శఙ్గ అని సూచించుటచే సాత్వికము, రాజసము-అనెడి రెండు మాత్రమును గ్రహింపనగును. రాజసాహంకారమునకు ప్రత్యేకముగా కార్యము లేకుండుటచే అది ఉపేక్షింపబడును. శ్రీవిష్ణుపురాణములో పంచభూతములకు కారణమైన తామసాహంకారము శంఖముగను,

ఇంద్రియములకు కారణమైన సాత్త్వికాహంకారము శార్ఙ్గముగను క్రమముగా చెర్పడుటచేతను, పాశురములో ప్రకృతి నుండి భూతములవరకు ఈ రీతిలోనే అర్థమును గ్రహింపనగును. కొన్ని వ్యాఖ్యలలో సాత్త్వికమును శంఖముగను, తామసమును శార్ఙ్గముగను కన్పించుట అచ్చు తప్పు మాత్రమే. విష్ణుపురాణములో సాత్వికము, తామసము–అనెడి పదములను విడచి, **"భూతాది"** అయిన అహంకారము శంఖముగను, ఇంద్రియాదియైన అహంకారము శార్ఙ్గము గనునున్నవి'' అనియుండుటచే భూతాదిఅయిన తామసము శబ్దతన్మాత్రమునకే సాక్షాత్ కారణమగుటచే అది శబ్దహేతువైన శంఖమగుట, ఇంద్రియాది అయిన సాత్త్వికము పది ఇంద్రియములును పది బాణములగుటచే, బాణములను విడుచు సాధనమగు శార్ఙ్గముగను తగును–అని సూచింపబడవచ్చునని తెలియనగును. సత్యవ్రతక్షేత్రములో బ్రహ్మ అనుష్ఠించిన అశ్వమేధములో **"పురుడన్ మణివర మాక"** అని వేదము పఠించిన రీతిలో వెల్గు స్వామి ప్రత్యక్షమై, వరము నిచ్చువాడైనపుడు, "ఇచట ఎల్లప్పుడు అందఱికిని ఈ రీతిలో నీవు దర్శనమును అనుగ్రహింపవలెనని" బ్రహ్మ ప్రార్థింపగా, ఆ రీతిలోనే స్వయంవ్యక్తమైన స్వామి మూలమూర్తిలోవలె అస్త్రభూషణములను అలంకరించుకొని, ప్రకాశించుటచే జ్ఞానులకు ఇతడే సర్వజగదభిమాని, నిత్యసూరినాథుడుని తెలియును–అని సూచించుటకై **"కరికిరిమేల్"** అనుప్రయోగము చేయబడినది. ఈ పాశురములో **"కాక్కిన్టాన్"** అనునది విధేయముగా తోచినను, ఇతరులు తెలియని అంశమే అంతట వాక్యములో విధేయమగును కావున, **''పురుడన్ మణివర మాక''** అనునది విధేయముగా గ్రహింపనగును. ఇక, హస్తిగిరిపైనుండి అన్నిటిని కాపాడు కృష్ణుడు జీవుడు మొదలైనవి కౌస్తుభము మొదలైనవి అగునట్లు **(మఱ్ఱైయిన్ పొరుళామ్)** వేదములో తెలియబడుచున్నాడు అను అన్వయమును గ్రహింపవచ్చును. **(కరికిరిమేల్ నిన్ఱు అనైత్తైయుమ్ కాక్కిన్ఱ కణ్ణన్, పురుడన్ ముదలానవై మణివరమ్ ముదలానవైయాక మఱ్ఱైయిన్ పొరుళామ్"** అని ఇచటి అన్వయము) **"కణ్ణన్"** అనెడి ప్రయోగము ద్వారా రామాద్యవతారములకంటె కృష్ణావతారములో గరుడవాహనుడుగానున్న విశేషమును, వరదరాజస్వామికి గరుడోత్సవము విశిష్టమైనది అనునదియును స్ఫురించుటను పరిశీలించి, ఆనందింపనగును.

పురుషాదులు కౌస్తుభాదులుగా చెప్పబడుట విష్ణుపురాణోక్తమేకాని, వేదోక్తము కాదుకదా! అనినచో, పురాణము వేదమూలకమగుటచే పురాణమునుగొనియే, వేదమును అనుమింపవలెను. లేక, **"స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్"** అనెడి



సద్విద్యావాక్యములో ఈ జగత్తు సత్తు అని చెప్పబడు బ్రహ్మగా ప్రళయములో నున్నదనునపుడు **''సత్''** అనెడి పదములో బ్రహ్మమునకు విశేషణముగా జ్ఞానబలాదివిశేషణములవలె నిత్యవిభూతిపరిజనస్థానాదులను కూడ గ్రహింపవలెను–అని వేదార్థసంగ్రహములో ముగింపుకు కొంచెము ముందుగా నిత్యవిభూతిస్థాపనసందర్భములో భగవద్రామానుజులు అనుగ్రహించిరి. **"సత్"** అనుటకు–ప్రామాణికము అనునది అర్థము. ఎన్నియో వస్తువులు ప్రామాణికములైనను, **"ఇదమ్"** అని లోకములకు కారణమై, లోకముతో అభిన్నమైన బ్రహ్మమే సత్పదార్థములో విశేష్యమైనను, దానికి విశేషణముగా ఆ కాలములో నున్నవి అని ప్రమాణ సిద్ధమైనవి అన్నియు గ్రహింపబడును. అందుచే అవి తప్ప మిగిలినవియే కార్యములగునని నిత్యవిభూతి మొదలైనవి సత్పదార్థములో చేరియున్నపుడు సృష్టిలో పైనవచ్చు భూత భౌతికసర్వకార్యములకును అభిమానులగుటచే కారణకోటిలో చేరిన అస్త్రభూషణములు సత్పదార్థములోచేరుట కైముతికన్యాయసిద్ధము. అందుచే ఈ అర్థము ప్రసిద్ధమగు వేదమునకును సమ్మతమైనదియే.

**శ్రీరంగముయొక్క గొప్పతనము**

**42.** **ఆరాద వరుళముదమ్ పొదిన్ద కోయిల్**
**అమ్బుయత్తో నయోత్తిమన్న ఙ్కళిత్తకోయిల్**
**తోలాద తని వీరన్ఱొழుద కోయి**
**ఱుణైయాన వీడణఱ్కు త్తుణైయా మ్కోయిల్**
**శేరాద పయనెల్లామ్ శేర్క్కు మ్కోయిల్**
**శెழుమఱైయిన్ ముదలెழுత్తు చ్చేర్న్దకోయిల్**
**తీరాత వినైయనైత్తున్దీర్క్కుమ్ కోయిల్**
**తిరువరఙ్గమెన త్తికழுమ్ కోయిలానే**

ఆరాద = ఎంత అనుభవించినను తృప్తి కల్గింపని, అరుళ్ అముదమ్ పొదిన్ద = కృపయే మూర్తీభవించిన (శ్రీరంగనాథుడను) అమృతమునిండిన, కోయిల్ = సన్నిధియు, అమ్బుయత్తోన్ = తామరపూవులో నివసించు బ్రహ్మ, అయోత్తిమన్నఱ్కు అళిత్త కోయిల్ = అయోధ్యను పాలించు ప్రభువు అగు ఇక్ష్వాకుమహారాజుకు అనుగ్రహించిన సన్నిధి, తోలాద = ఏనాడు పరాజయము పొందని, తని వీరన్ = సాటిలేని మేటివీరుడగు శ్రీరాముడు, తొழுద కోయిల్ = ఆరాధించిన కోవిల, తుణైయాన వీడణఱ్కు = శ్రీరామునకు సహాయమైయున్న విభీషణునకు, తుణై ఆమ్ కోయిల్ = రక్షకమైయున్న

సన్నిధి, శేరాద పయన్ ఎల్లామ్ = (వేతెచటను) పొందుటకు వీలుకాని ఫలము నన్నిటిని, శేర్క్కుమ్ కోయిల్ = పొందించు కోవిల, శెழ మఱైయిన్=గొప్పగా నున్న వేదముయొక్క, ముదల్ ఎழుత్తు చ్చేర్న్ద కోయిల్ = మొదటి అక్షరమగు ప్రణవముతో (రూపమున ప్రణవాకారమగు విమానముతో) చేరిన కోవిల, తీరాద వినై అనైత్తుమ్ = (మిగిలిన దేని చేతను) నశింపని పాపములన్నిటిని, తీర్క్కుమ్ కోయిల్= పోగొట్టు కోవిల, తిరువరఙ్గమ్ ఎన త్తికழుమ్ = శ్రీరంగమను పేర వెల్గు, కోయిల్తానే= దివ్యదేశము అగును.

శ్రీరంగమను దివ్యదేశము ఎంత అనుభవించినను (సేవించినను) తృప్తి కల్గింపని అమృతమై, కరుణయే మూర్తీభవించినట్లున్న శ్రీరంగనాథుడు నిత్యవాసము చేయు చోటు. అచటి స్వామిమూర్తి బ్రహ్మచే ఇక్ష్వాకువు అను సూర్యవంశపురాజునకు అనుగ్రహింపబడెను. ఈ కోవెల శ్రీరాముడును సేవించి ఆరాధించిన గొప్పతనమును కల్గినది. అతనికి సహాయముగా నున్న విభీషణునకు రక్షకమైయున్న కోవిల. వేతెచ్చటను పొందుటకు సాధ్యము కాని ఫలములను అన్నిటిని ఇచ్చు దివ్యదేశము శ్రీరంగము. ప్రణవ రూపములోనున్న విమానముతో కూడియున్న క్షేత్రమిది. సకలపాపములను పోగొట్టగల్గిన ఇట్టి స్థానము దివ్యదేశములన్నిటిలో అగ్రగణ్యమైనది. శ్రీరంగవిమానము అయోధ్యాధిపతియగు ఇక్ష్వాకువునకు బ్రహ్మచే అనుగ్రహింపబడినది. క్రమముగా ఆ ప్రభువు వంశములో జన్మించిన రాజులందఱు దానిని ఆరాధించిరి. ఆ వంశమున అవతరించిన శ్రీరామునిచే ఆరాధింపబడిన శ్రీరంగవిమానము తనకు సహాయపడిన విభీషణునకు శ్రీరామునిచే అనుగ్రహింపబడినది. విభీషణుడు ఆ విమానమును శ్రీరంగమున ప్రతిష్ఠించెను. **"ప్రపద్యే ప్రణవాకారమ్"** అనునట్లు శ్రీరంగవిమానము ప్రణవమువంటి రూపమును కల్గినది.

42, వ 43, వ 44 వ పాశురములు మూడును స్థానవిశేషాధికారములోనివి. ఇవి ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము అను ఛందస్సులో రచింపబడినవి. **"శ్రీరంగం ప్రణవాకారం వైకుంఠం రంగమందిరమ్, స వాసుదేవో రంగేశః -"** ఇత్యాది ప్రమాణములు ఇచట భావ్యములు.

**ఉత్తమూర్:-** స్థానవిశేషాధికారములో దేశనియమమును స్థాపించి, మొదటిశ్లోకములో భగవత్ క్షేత్రము, భాగవతస్థానమును చెప్పిన క్రమమును అనుసరించి భగవానుని క్షేత్రములన్నిటిలో శ్రీరంగము) కోయిల్-తిరుమల-పెరుమాళ్ కోయిల్-అనెడి ప్రసిద్ధ క్రమమును అనుసరించి ప్రధానములగు మూడు పాశురములను, భాగవతస్థానమునకై



ఒక పాశురమును అనుగ్రహించుచున్నారు. **(తిరువరఙ్గమ్ ఎన)-** శ్రీరంగము అని. **"రంగ రంగ మితి బ్రూయాత్ క్షుత్రప్రస్ఖలనాదిషు"** అనుచు అందఱును పొగడునట్లు, **(తికழుమ్ కోయిల్)** వెల్గు దేవాలయమే, **(అరుళ్)** దయయే మూర్తీభవించిన, **(ఆరాద)** తృప్తిని కల్గింపని, అనుభవింపగా అనుభవింపగా మఱింత భోగ్యమైన, **(అముదమ్)** అమృతమువంటి శ్రీరంగనాథమూర్తి, **(పొదిన్ద కోయిల్)** పూర్ణావిర్భావమున్న కోవెల, **(అమ్బుయత్తోన్)** మొదట సత్యలోకములో ఈ అర్చామూర్తిని ఆరాధించిన బ్రహ్మ **(అమ్బుయమ్ -అంబుజమ్-తామరై-**అందు జన్మించినవాడు **"అమ్బుయత్తోన్".)** అయోధ్యయొక్క ప్రభువులు ఆరాధించు రీతిలో ఇక్ష్వాకుమహారాజునకు, **(అళిత్త)** అర్పించిన, **(కోయిల్)** విమానము, వారు అందఱు ఆరాధించుచు వచ్చు క్రమమున ఆ వంశములో అవతరించిన, **(తోలాద తని వీరన్)** ఎచటను అపజయ మెఱుగని, అనపాయసాహసుడై, అసహాయశూరుడైన శ్రీరాచంద్రునిచే, **(తొழుద)** (విభవావతారమగు తనకంటె అర్చామూర్తికికల పరత్వమును గమనించి) ఆరాధించిన విమానము ఇదియే. తరువాత, **(తుణై యాన)** రాక్షసులతోటి యుద్ధములో తనకు సహాయముగా వచ్చిన ధర్మమూర్తి అగు, **(వీడణఱ్కు)** విభీషణునకు రామునిచే అనుగ్రహింపబడి, **(తుణై ఆమ్ కోయిల్)** రాజ్యపరిపాలనమున అయోధ్యాప్రభువులకు సహాయముగానున్నట్లే, రాక్షసరాజ్యపరిపాలనలో సహాయమైన విమానము. **"వీడణఱ్కు"** అను పదము **"విభీషణఱ్కు"** అను పదముయొక్క వికృతి. **"విభీషణ"** అనుపదములోని **"వి"** అను అక్షరమును విడువగా **"భీషణ"** అనునది **"వీడణ"** అని అయినది. మఱియు,, **"తుణైయామ్ విభీషణఱ్కు"** అనియును పాఠముండవచ్చును. ఇంతవరకు శ్రీరంగవిమానముయొక్క చరిత్ర తెలుపబడినది. దీని మహిమ ఇకపై తెలుపబడుచున్నది. **(శేరాద)** వేఱు ఏ చోటను జనులకు లభింపని, **(పయన్ ఎల్లామ్)** పురుషార్థములను అన్నింటిని, **(శేర్క్కుమ్ కోయిల్)** పొందించు విమానము, (శెழ- దట్టమైన, సాంగోపాంగముగా వృద్ధినికల, **(మఱైయిన్)** వేదముయొక్క, **(ప్రథమాక్షరము)** ఆరంభములో చెప్పబడు అక్షరము ప్రణవము, దానిచే, **(శేర్న్ద)** తన రూపముగా గ్రహింపబడినదియును (ప్రణవాకారమై) తనకు వాచ్యమగు భగవానునిచే పొందబడినదియును అగు విమానము. **"ఆద్యం తు త్ర్యక్షరం బ్రహ్మ త్రయీ యత్ర ప్రతిష్ఠితా"** అనునట్లు వేదమునకు ఆధారమై, ప్రారంభమైన ప్రణవము విమానమైయుండుటయును ఇందులకు విశేషము. ఇక ఈ అధికారమునకు విషయమైన క్షేత్రవాసమునకుగల ముఖ్యమైన ఫలమును చివరలో తెలుపుచున్నారు. **(తీరాద)** ఎంత అనుభవించినను తీరని, **(వినై అనైత్తుమ్)** అన్ని పాపములను, **(తీర్క్కుమ్**

**కోయిల్)** పోగొట్టు విమానము, సత్యలోకమునుండి ప్రకాశించి, బ్రహ్మ, శ్రీరాముడు మొదలగువారిచే ఆరాధింపబడి, మిక్కిలి దీర్ఘకాలముగా వెల్గు కోవెల. కావున దీనినిగూర్చి భగవద్రామానుజులును **"అత్ర శ్రీరంగే సుఖ మాస్వ"** అని అనుగ్రహించిరి.

**వేంకటాచలమహిమ**

**43. కణ్ణనడి యిణై యెమక్కు క్కాట్టుమ్ వెఱ్ఱ్పు**
**కడువినైయ రిరువినైయు ప్కడియుమ్ వెఱ్ఱ్పు**
**తిణ్ణ మిదు వీడెన్న త్తికழుమ్ వెఱ్ఱ్పు**
**తెళిన్ద పెరుమ్ తీర్త్తఙ్గళ్ శెఱిన్ద వెఱ్ఱ్పు**
**పుణ్ణియత్తిన్ పుకలిదెన ప్పుకழుమ్ వెఱ్ఱ్పు**
**పొన్నులకి ఱ్పోకమెలామ్ పుణర్క్కుమ్ వెఱ్ఱ్పు**
**విణ్ణవరు మన్నవరుమ్ విరుమ్బుమ్ వెఱ్ఱ్పు**
**వేఙ్గడ వెఱ్పెన విళఙ్గుమ్ వేద వెఱ్పే.**

కణ్ణన్ అడి ఇణై = భగవానుని శ్రీ పాదములు రెండిటిని, ఎమక్కు = మాకు (మనకు), కాట్టుమ్ వెఱ్ఱ్పు = దర్శింపచేయు కొండ, కడు వినైయర్ = మిక్కిలి క్రూరకర్మలను చేసినవారి, ఇరు వినైయుమ్ = (పుణ్యాపాపములనెడి) రెండు విధములైన కర్మలను, కడియుమ్ వెఱ్ఱ్పు = పోగొట్టు కొండ, తిణ్ణమ్ = నిశ్చయముగా, ఇదు వీడు ఎన్న = ఈ క్షేత్రము పరమపదమే అని పల్కునట్లు, తికழుమ్ వెఱ్ఱ్పు = ప్రకాశించు కొండ, తెళిన్ద = స్వచ్ఛమైన, పెరుమ్ తీర్త్తఙ్గళ్ = గొప్ప పుణ్యతీర్థములు, శెఱిన్ద వెఱ్ఱ్పు = నిండిన కొండ, పుణ్ణియత్తిన్ పుకల్ ఇదు = పుణ్యముయొక్క స్థానము ఇది, ఎన పుకழుమ్ వెఱ్ఱ్పు = అని పొగడబడు కొండ, పొన్ ఉలకిల్ పోకమ్ ఎలామ్ = పరమ పదములోపొందు భోగము అంతయు, పుణర్క్కుమ్ వెఱ్ఱ్పు = (ఇచటనే) పొందించు కొండ, విణ్ణవరుమ్ మణ్ణవరుమ్ = నిత్యసూరులచే, భూలోకములోని వారిచే, విరుమ్బుమ్ వెఱ్ఱ్పు = అభిలషించుకొండ, వేఙ్గడ వెఱ్ఱ్పు = వేంకటాచలము, ఎన విళఙ్గుమ్ = అని ప్రకాశించు నట్టి, వేదవెఱ్పే = వేదమునందు పొగబడిన కొండ.

వేంకటాచలమను కొండ భగవానుని శ్రీపాదములను భక్తులకు చూపు కొండ. ఎట్టి క్రూరకర్మలను చేసినవారైనను ఎవరు తన సమీపమున నివసించినచో, వారి పుణ్యాపాపములను రెండిటిని పోగొట్టు కొండ. వేంకటశబ్దమునకు గల **"వేం కటతి"** అను వ్యుత్పత్తి, శ్రీవేంకటాచలమాహాత్మ్యములోని మాధవుని కథ (**"పరన్ శెన్ఱు శేర్ తిరువేఙ్గడమామలై ఒన్ఱుమే తొழ నమ్ వినై యోయుమే"**, **"శమన్ కొళ్ వీడు తరుమ్ తడమ్ కున్ఱమే"** అను మొదలగు తిరువాయ్మొழి సూక్తులును అనుసంధేయములు) పరమపద మిదియే అని పొగడు రీతిలో అతిశయమును కల్గినది. ఇది స్వామి పుష్కరిణి, పాపనాశనము మొదలగు పలు పుణ్య తీర్థములతో నిండియున్నది. పుణ్యముయొక్క నిలయమని చెప్పతగినట్లున్నది. పరమపదములో చేరి పొందదగిన భగవదనుభవమంతయు ఇచటనే అనుగ్రహింపగల్గినది. శ్రీ వైకుంఠములోని నిత్యసూరులు, భూమిలో భక్తులునూ ఆశపడి, అభినివేశము పొందు కొండ ఇది. దీనిని వేదము సైతము కీర్తించినది. ఇట్టి గొప్పతనమునుకల వేంకటాచలము భక్తులు నివసింపతగిన చోటు. **"కణ్ణావా నెన్నుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు"** అని, **"వానోర్క్కుమ్ మణ్ణోర్క్కుమ్ వైప్పు"** అని – ఇత్యాదిగా దివ్యసూరుల సూక్తులు ఇచట భావ్యములు.



**ఉత్తమూర్:–** ఇక, శ్రీవేంకటాచలముయొక్క మహిమను తెలుపుచున్నారు. **(వేఙ్గడమ్ వెఱ్ఱ్పు)** వేంకటాచలము అని వ్యవహరింపబడునట్లు, **(విళఙ్గుమ్)** ప్రసిద్ధమైయున్న, **(వేదమ్ వెఱ్ఱ్పు)** వేదముచే తెలుపబడిన వేదమూర్తి అగు కొండ, **(కణ్ణన్)** శ్రీనివాసరూపియైన గీతాచార్యుని, **(అడి ఇణై)** ఒకదానితో వేఱొకటి తులతూగు రెండు శ్రీపాదములను, **(ఎమక్కు)** దాసులగు సర్వజనులకు, **(కాట్టుమ్ వెఱ్ఱ్పు)** కనిపింపజేయకొండ. (లేక), **(కణ్ణన్)** కృష్ణుడు శ్రీనివాసరూపియై తన శ్రీపాదములను రెండింటిని మనకు శరణముగ చూపుచున్న చోటు అగు కొండ అనియును చెప్పవచ్చును. ఇంతవరకు శ్రీకృష్ణచరమశ్లోకములోని పూర్వార్ధము తెలుపబడినది. ఇక ఉత్తరార్ధమున చెప్పబడిన దాని ఫలము తెలుపబడుచున్నది. **(కడు వినైయర్)** భక్తియోగమును చేయుచు కాలమును గడుపలేకపోవుటచే కఠినములగు కర్మలను చేయువారి, **(ఇరు వినై ఉమ్)** పుణ్యము, పాపము–అను రెండు విధములైన పాపములను, **(కడియుమ్)** పోగొట్టుచున్న, **(మలై)** కొండ. చరమశ్లోకఉత్తరార్ధములో అనిష్టనివృత్తివలెనే ఇష్టప్రాప్తియును చెప్పబడినది. కావున, దానిని అనుసరించి ఇక తెలుపబడుచున్నది. **(ఇదు)** ఈ వేంకటాచలము, **(తిణ్ణమ్)** నిశ్చయముగనే, **(వీడు)** మోక్షస్థానము, **(ఎన్న)** అనునట్లు, **(తికழుమ్)** ప్రత్యక్షవైభవముచేతను, పురాణములయందు ప్రకాశించు, **(వెఱ్ఱ్పు)** కొండ. ఇచట భగవానుని సేవించువారు **"సత్వోన్మేషాత్ వ్యపగతమిథః తారతమ్యాదిభేదైః"** అని అనుగ్రహించునట్లు సత్త్వపూర్ణులై, బ్రహ్మానందతుల్యానందమును కలవారైయుండుటచేత

ఇదు **"వీడు"**-నివాసమే. నిజమునకు పరమపదములో నున్న ఒక క్రీడాద్రియే వరాహస్వామియొక్క నియమనముతో ఈ భూమికి తీసికొనిరాబడి, వేంకటాచలమను పేరు వెల్గుచుండుట చేతనుకూడ ఇది పరమపదమే. మిగిలిన స్థలములలో దొరకని వేఱొక విశేషముకూడ ఇచట చెప్పబడుచున్నది. ఈ కొండలోనున్న కొండవాగులు, జలపాతములు మొదలగు తీర్థములకు లెక్క లేదు. **(తెళిన్ద)** కొండపై రాతి ప్రదేశమున ప్రవహించుటచే ఈ వాగులు, జలపాతములలోని నీరు కలగిపోవుటకు అవకాశమేమాత్రము లేకుండ స్వచ్ఛముగా, తేటపడి ఉన్న, **(పెరు త్తీర్త్తఙ్గళ్)** రూపమునందు, గొప్పతనమునందును గొప్పవి అగు తీర్థములు, **(శెఱిన్ద)** దట్టముగా నున్న చోటు అగు, **(వెఱ్ఱు)** కొండ. **"వేంకారోఽమృతబీజం స్యాత్ కట మైశ్వర్య ముచ్యతే, అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటేతి విదు ర్బుధాః"** అనునట్లు ఐశ్వర్యమును, మోక్షానుభవమును రెండిటిని అనుగ్రహించుట తిరునామమువలననే వ్యక్తము అగుచున్నదను భావముతో అనుగ్రహించుచున్నారు. **(ఇదు)** ఈ కొండ, **(పుణ్ణియత్తిన్ పుకల్)** ఆశ్రయించినవారిని సకలవిధపుణ్యములు ప్రవేశించుటకు కారణమగును, **(ఎన్న)** అనునట్లు కీర్తింపబడు, **(వెఱ్ఱు)** కొండ. ఏ ఫలమునకు ఏ విధమైన పుణ్యము కావలయునో ఆ పుణ్యమును చేయకుండగనే దాని ఫలమును కోరి ఈ కొండకు వచ్చినంతమాత్రములోనే ఈ కొండ ఆ పుణ్యము స్థానమున తాను నిలచి ఫలము నిచ్చునని భావము. ఇట్లు ఐశ్వర్యము, కైవల్యము రెండును చెప్పబడినవి. **(పొన్నులకిల్) "హిరణ్మయే పరే కోశే"** అనునట్లు జ్యోతియై, భోగ్యమై వెల్గు పరమపదములో పొందబోవు భోగమంతయు **"భోగమాత్రసామ్యలింగా చ్చ"** అనబడిన ఆనంతపరమసామ్యాదులను, **(పుణర్క్కుమ్)** చేర్పించు, **(వెఱ్ఱు)** కొండ. పరమపదముకంటె దీనికిగల వైలక్షణ్యమును ఇకపై తెలుపుచున్నారు. **(విణ్ణవరుమ్)** పరమపదములోనుండు నిత్యసూరులు, **(మన్నవరుమ్)** ప్రకృతిమండలములో నున్నవారు, **(విరుమ్బుమ్)** కోరు, **(వెఱ్ఱు)** కొండ. **"మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్, స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే"** అనునట్లు పరమపదవాసి అగు భగవానుడు లక్ష్మీదేవితోపాటు ఇచట పొందు ఆనందము అచట లేదు అని చెప్పబడినచో, అతనిని విడువని నిత్యసూరులు వచ్చుటలో ఏమి ఆశ్చర్యము? భూలోకమున కొందఱు కొన్ని ఆలయములకే పోవుదురు. ఇచటకు వచ్చి ఫలమును పొందని జనము ఈ లోకములో లేరని భావము. ఈ అర్థము **"వేం పాపం కటతి దహతి ఇతి వేంకటః"** అను అర్థమునుగల తిరునామమువలననే స్ఫురించుననుచున్నారు. వేదములో **"అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే, శిరింబిఠస్య సత్త్వభిః తేభి ష్ట్వా చాతయామసి"** అనెడి మంత్రములతో-"రాగము లేకున్నను,



అంగవైకల్యమున్నను, సంకటమున చిక్కుకొన్నను, దానవులచే పీడింపబడినను తిరుమలకు పొమ్ము. శ్రీనివాసుని కాంతులచే నిన్ను తృప్తి పఱచుకొనవచ్చును" అని చెప్పుచున్నట్లు శ్రీవేంకటాచలమాహాత్మ్యములో కలదుకదా! ఇంతకంటె వివరమును అచటనే గమనింపనగును. ఇక వేదాత్మయైయున్న గరుడుడే కొండగా నుండుటచే గరుడాచలమని దీనికి పేరు కలదు. అందుచేకూడ ఇది **"వేదవెఱ్ఱు..** అయినది. ముందు పాశురములో ఒక పాదముతో శ్రీరంగమును ఉద్దేశించి, **"కోయిల్"** అని పూర్తి అగు ఏడు విశేషణములతో సప్తప్రాకారములమధ్యలో అది ఉన్నట్లు సూచింపబడినది. ఇచట ఈ **"వేదవెఱ్ఱును"** ఉద్దేశించి ఏడుమార్లు **"వెఱ్ఱు"** అని అనుటచే ఇచట ఏడు పర్వతములు కలవని తెలుపబడినది.

### హస్తిగిరిప్రశస్తి

**44.** **ఉత్తమ వమర్త్తల మమైత్త తొర్**
**ఎழிற்றనువి నుయ్త్త కణైయాల్**
**అత్తిర వరక్కన్ ముడిపత్తు మొరు**
**కొత్తెన వుతిర్త్త తిఱలోన్**
**మత్తుఱు మికుత్త తయిర్ మొయ్త్త వెణెయ్**
**వైత్తతుణు మత్త నిడ మా**
**మత్తికిరి పత్తర్వినై తొత్తఱవ**
**ఱుక్కు మణి యత్తికిరియే.**

ఉత్తమ అమర్త్తలమ్ = గొప్ప రణరంగమందు, అమైత్తతు ఒర్ ఎழில் తనువిన్ = అమర్చినదగు అద్వితీయమైన, అందమైన ధనుస్సునుండి, ఉయ్త్త కణైయాల్ = ప్రయోగించిన బాణముచే, అత్తిర అరక్కన్ ముడి పత్తుమ్ = అస్త్రబలమునుకల రాక్షసుడగు రావణుని పది తలలను, ఒరు కొత్తు ఎన = ఒక గెల అనునట్లు, ఉతిర్త్త తఱలోన్ = ఖండించి, క్రిందకు పడగొట్టిన బలమునుకల శ్రీరాముడు, మత్తు ఉఱు= కవ్వముచే చిలుకదగిన, మికుత్త తయిర్ = అధికమైన (చిక్కని) పెఱుగును, వైత్తతు మొయ్త్త వెణెయ్ = (యశోదచే) చేర్చి పెట్టబడిన అధికమైన వెన్నను, ఉణు(ణ్ణు)మ్ అత్తన్ = ఆరగించు శ్రీ కృష్ణుడును అగు స్వామియొక్క, ఇడమ్ ఆమ్ = నివాసమగు, అత్తికిరి = హస్తిగిరి అను కాంచీక్షేత్రము, పత్తర్ వినై = భక్తుల కర్మలను, తొత్తు అఱ అఱుక్కుమ్ = సంబంధములేకుండ పోగొట్ట గల్గిన, అణి అ త్తికిరియే = ఆ చక్రాయుధమువంటిదే.

హస్తిగిరి పాపములను పోగొట్టును, ఆ చక్రాయుధము భగవానుని చేతికి ఆభరణము మాత్రమే. **"(అత్తికిరి వినైయై ఒఴిత్తు విడుమ్, అత్తికిరి అణియే"** అని అన్వయించి) పెద్దలు ఇచట చమత్కరింతురు. శ్రీసుదర్శనము పాపములను అన్నిటిని పోగొట్టుననుటకు – **"వృద్ధి స్సా దీధితానాం వృజిన మనుజను ర్మార్జయత్వార్జితం వః"** అను సుదర్శనశతకసూక్తిని, ఈడులోని – **"ఒరుముఴక్కాలుమ్ ఇరణ్డుముఴక్కాలుమ్ పోకాదుకాణ్! తెఱ్కాఴ్వార్కైయిల్ తిరువాఴియాలే వినైయై యఱుత్తుక్కొణ్డుపోకిల్ అత్తనైయొఴియ ఒన్ఱిరణ్డు ముఴక్కాల్ పోకాదుకాణ్ నాన్ పణ్ణిన పాపమ్"** అను (1–4–2) సూక్తిని స్మరింపనగును.

**"రామరావణయో ర్యుద్ధమ్ రామరావణయో రివ"** అని లోకములో గొప్పగా చెప్పబడు రణరంగమునందు సాటిలేని వింటినుండి ప్రయోగింపబడిన బాణముతో రావణుని పది తలలను ఒకే గెలను కోయు రీతిలో రాలగొట్టి, తన గొప్పతనమును ప్రదర్శించిన శ్రీరాముడు, యశోద చేర్చియుంచిన పెఱుగును, చిలికి చేర్చియుంచిన వెన్నను చేతులార గైకొని భుజించి, తన సౌలభ్యమును చూపిన శ్రీ కృష్ణుడే వరదరాజ స్వామిగా నిలచి, అందఱు దర్శించి ఆనందించు రీతిలోనున్న నివాసస్థానమగు హస్తిగిరి అను దివ్యదేశమే భక్తుల పాపములను పోగొట్ట గల్గిన చక్రాయుధమువంటిది అగును. (పాపములను నశింపచేయునది హస్తిగిరియే, చక్రాయుధము భగవానుని చేతికి ఆభరణము మాత్రమే–అనియు భావము). ఈ పాశురము ఆఱుశీర్చ్ఛందవిరుత్తము. ఛందస్సులో రచింపబడినది. ఇచటి **"అత్తికిరి"**, **"అ–త్తికిరి"** అను యమకాలంకార ప్రయోగసౌందర్యము గమనింపతగినది.

**ఉత్తమూర్:–** పెరుమాళ్ కోయిల్ అనబడు కాంచీపురముయొక్క మహిమ ఇకపై తెలుపుచున్నారు. మొదటిపాశురములో **"తోలాద తని వీరన్"** అనుచు రాముని ప్రస్తావము వచ్చినది. **"అయోత్తి ఎమ్మరశే"** అనుచు అయోధ్యలో వేంచేసియున్న రంగనాథుని రామునిగను తొణ్డరడిప్పొడి ఆఴ్వార్లు అనుసంధించిరి. పై పాశురములో శ్రీకృష్ణుని ప్రస్తావము రాబోవుచున్నవి. ఈ రెండు విభవ మూర్తులును ఒకటి అయిన చోటు ఈ కాంచీపురము అని అనుచున్నారు. ఎచటనున్న స్వామియైె నను **"పెరుమాళ్"** అని వ్యవహరింపబడువాడేకదా! ఈ క్షేత్రమునకు మాత్రము ఎందులకీ పేరు వచ్చినది? అని అనినచో, కాంచీపురములోగల పలు ఆలయములలోనున్న మూర్తులకంటె వీరే గొప్పవారు కావున, వీరికే **"పెరుమాళ్"** అను పేరును పెట్టి, హస్తిగిరినే పెరుమాళ్ కోయిల్ అని



వ్యవహరించిరి. అందుచేతనే ఈ పాశురములో ఈ క్షేత్రమును హస్తిగిరిపదముతోనే నిర్దేశించిరి. ఈ స్వామియే మొదట **"రాజాధిరాజన్ దేవాధిరాజన్ పెరుమాళ్"** అనబడు శ్రీరాముడు అని అనుచున్నారు.

**(ఉత్తమ)** సర్వోత్కృష్టమైన, తనకు తానే సదృశమైన, **(అమర్)** యుద్ధము, సంభవించినచోట (రామరావణయుద్ధభూమిలో) **(అమైన్దదు)** నిలుపబడిన, **(ఓర్)** సాటిలేని **(ఎఴిల్)** ప్రకాశమును కల, **(దను)** ధనుస్సుచే, **(ఉయర్త్త)** పైకి ప్రయోగింపబడిన, **(కణైయాల్)** బాణముచే, **(అత్తిరమ్ అరక్కన్)** అస్త్రవిద్యలో ప్రసిద్ధుడగు రాక్షసుడైన రావణుని, **(ముడి పత్తుమ్)** పది తలలను, **(ఒరు కొత్తు ఎన)** ఒక గెల అనునట్లు అనాయాసముగా, **(ఉదిర్త్త)** క్రిందకు పడునట్లు చేసిన, **(తిఱలోన్)** సామర్థ్యమును కల శ్రీరామచంద్రుడును, **(మత్తు)** చిలుకు కవ్వముతో, **(ఉఱు)** చిలుకబడిన, **(మికుత్త)** అంతులేని, **(తయిర్)** పెరుగునుండి, **(మెయ్త్త)** దట్టముగా పైకి వచ్చిన, **(వెణెయ్)** నవనీతమనెడి, **(వైత్తదు)** చేర్పబడి పెట్టిన వస్తువును, **(ఉణుమ్)** తానే భుజించు, **(అత్తన్)** పరమాప్తుడగు కృష్ణస్వామి అగు భగవానునకు, **(ఇడమ్)** నిత్యవాసస్థానమైన, **(అత్తి కిరి)** హస్తిగిరి, **(పత్తర్ వినై)** బద్ధులగు భక్తుల పాపములను, **(తొత్తు అఱ)** సవాసనగా పోవునట్లు, **(అరుక్కుమ్)** ఖండించు, **(అ త్తికిరి)** విరోధినిరసనమున ప్రసిద్ధమగు ఆ సుదర్శనము, **(అణియే)** తనకు ఆయుధకార్యము లేకుండుటచే కేవలము అలంకారమే. ఆ స్వామికి అలంకారమే అగును. **"ఉత్తమ అమర్"** అనునపుడు యుద్ధమునకుగల ఉత్తమత్వము ఏమనగా అన్ని యుద్ధములలోను గొప్పదిగను, అచట నడచిన పోరులలో చివరిదియై, పరమావధి అయినదిగను ఉండుటయే. ధనస్సునకు **"ఓర్"** అను విశేషణము ఇంద్రుడివ్వగా పొందిన అగస్త్యముని ఇచ్చిన విల్లు, బ్రహ్మాస్త్రమును అగుటచేతను ప్రయోగింపబడినది. **"అత్తిర రావణన్"** అను ప్రయోగము రావణుడు అస్త్రములో శూరుడైయుండుటచేత చేయబడినది. రాముడు దానిమూలముగనే అతనిని వధించెను. **"ఒరు కొత్తు"**–పది పదిగా శిరస్సులను ఖండించుటచే **"కొత్తు"** అని ప్రయోగింపబడినది. **"కొత్తు"** అనగా గుత్తి, ఒక గుత్తిని కోసినట్లు చాల అవలీలగా ఖండించెననియును భావము. శిరస్సులు మాటిమాటికి పుట్టుకొనివచ్చునపుడు, "ఇక మీద శిరస్సులు మొలువవు, ఉన్నది ఈ ఒక గుత్తియే" అనునట్లు హృదయమను మూలస్థానమును ఖండించుటను తెలుపుటకై **"ఒరు"** అని

ప్రయోగింపబడినది. **"తిఱలోన్"** అనునది, **"ఉణుమ్"** అనునదియును **"అత్తన్"** అను పదమునకు విశేషణములు. రాముడు సీత విశ్వసించునట్లు పరమాప్తుడై, లోకమునకు హితమగునట్లు తన శక్తిని, సామర్థ్యమును ఉపయోగించెనని భావము. **"మత్తు ఉఱు"** అనుటచే పెరుగు మిక్కిలి గట్టిగా నుండుట తెలువబడినది. **''వైత్తదు ఉణుమ్"**–దాచియుంచిన వెన్నెను ఇట్లు భుజించుట వంచనకొఱకు కాదు. అప్పుడగుటచే దయ చూపుటకు భుజించెనని భావము. **"అత్తన్"** అనుటకు **"హస్తా"** నక్షత్రములో ఆవిర్భవించిన వరదుడు అనియును చెప్పవచ్చును. రావణసంహారమునకు తగిన శక్తిని పొందుటకై బాల్యముతో ఇంత వెన్నను భుజించుట ఆశ్చర్యమే. అందుచే ఏర్పడిన తిరుమేని భోగ్యత దేవాధిరాజు మేనిలో ఉపుడు బాగుగా ప్రకాశించుచున్నది.

**అష్టాక్షరి సకలఫలములను ఇచ్చుట**

**45.** **ఎట్టుమా మూర్త్తి యెణ్ కణనెణ్డిక్కు**
**ఎట్టిఱై యెణ్ పిరకిరుతి**
**యెట్టు మావరైకళీన్ఱ వెణ్ కుణత్తోన్**
**ఎట్టెఱు మెణ్కుణమదియోర్**
**క్కెట్టుమా మల రెణ్ శిత్తి యెణ్ పత్తి**
**ఎట్టియోగాఙ్గ మెణ్ శెల్వ**
**మెట్టు మాకుణ మెట్టెట్టెణు ఙ్కలై యె**
**ట్టిరతమే లతువు మెట్టినవే**

ఎట్టు మా మూర్త్తి = ఎనిమిది పెద్ద రూపములనుకల శివుని, ఎణ్ కణన్ = (చతుర్ముఖుడగుటచే) ఎనిమిది కన్నులనుకల బ్రహ్మను, ఎణ్ తిక్కు = ఎనిమిది దిక్కులను, ఎట్టు ఇఱై = ఎనిమిది దిక్పాలకులను, ఎణ్ పిరకిరుతి = ఎనిమిది తత్త్వములను, ఎట్టు మా వరైకళ్ = ఎనిమిది గొప్పకుల పర్వతములను, ఈన్ఱ = సృష్టించినవాడు, ఎణ్ కుణత్తోన్ = ఎనిమిది గుణములను కల్గినవాడును అగు భగవానుని (గొప్పతనమును ప్రకటించు) ఎట్టు ఎ(ణ్ణు)ణుమ్ = అష్టాక్షరిని (అర్థముతో పాటు) అనుసంధించువారు, ఎణ్ గుణ మదియోర్క్కు = ఎనిమిది గుణములనుకల బుద్ధినికలవారగు వివేకులకు, ఎట్టు మా మలర్ = ఎనిమిది గొప్ప పుష్పములును, ఎణ్ శిత్తి = ఎనిమిది విధములైన సిద్ధులును, ఎణ్ పత్తి = అష్టవిధ భక్తులును, ఎట్టు యోగాఙ్గమ్ = ఎనిమిది యోగాంగములును, ఎణ్ శెల్వమ్ = అష్టైశ్వర్యములను, ఎట్టు మా గుణమ్ = (ముక్తిని



పొందునపుడు కల్గు) గొప్పవి అయిన అష్టగుణములును, ఎట్టు ఎట్టు ఎణుమ్ కలై = ఎనిమిదిని ఎనిమిదితో గుణించి లెక్కించగా వచ్చు (అరువది నాల్గు) కళలను, ఎట్టు ఇరదమ్ మేల్ అదువుమ్ = శృంగారాది ఎనిమిది రసములకంటె గొప్పది అగు శాంతమను రసమును అను ఇవి అన్నియు, ఎట్టిన = లభించును.

**1. శివుని అష్టమూర్తులు :–**

భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, చంద్రసూర్యులు, యజమాని అనునవి. వీనినిగూడ కాళిదాసు అభిజ్ఞాన శాకుంతల నాటక ప్రారంభములో **"యా సృష్టిః స్రష్టు రాద్యా వహతి విధిహుతం యా హవిః యా చ హోత్రీ, యే ద్వే కాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్,..... అష్టాభి స్తాభి రీశః"** అని పల్కెను కదా

**2. ఎనిమిది దిశలు :–**

తూర్పు, దక్షిణం, పడమర, ఉత్తరం, ఆగ్నేయం, నైఋతి, వాయవ్యం, ఈశాన్యం – అనునవి.

**3. ఎనిమిదిమంది దిక్పాలకులు :–**

ఇంద్ర, యమ, వరుణ, కుబేర, అగ్ని, నిఋతి, వాయువు, ఈశానులు.

**4. అష్టవిధప్రకృతులు :–**

ప్రకృతి, మహాన్, అహంకారము, భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అనునవి.

**5. ఎనిమిది కులపర్వతములు :–**

హిమవంతము, ఋషభము, వింధ్యము, మలయము, మాల్యదంతము, పారియాత్రము, మందరము, మేరువు – అనునవి.

**6. భగవానుని గుణాష్టకము :–**

అపహతపాప్మత్వము (కర్మలకు వశుడు కాకుండుట), విజరత్వము (ముసలితనము లేకుండుట), విమృత్యుత (మృత్యువు లేకుండుట), విశోకత్వము (శోకము లేకుండుట), అవిజిఘత్సత (ఆకలి లేకుండుట), పిపాసారాహిత్యము (దాహము లేకుండుట), సత్యకామత్వము, సత్యసంకల్పత్వము (తలచిన దానిని నిర్వహింపగల్గుట) – అనునవి.

**బుద్ధియొక్క ఎనిమిది గుణములు :–**

**గ్రహణం ధారణం చైవ స్మరణం ప్రతిపాదనమ్, ఊహాపోహార్థవిజ్ఞానం తత్త్వజ్ఞానం చ ధీగుణాః"** అనునట్లు విషయమును మనస్సున గ్రహించుట, గ్రహించిన విషయమును

ధరించుట, స్మరించుట, దానిని ఇతరులకు చెప్పుట, ఇతరులు తనకు చెప్పని విషయములనుకూడ తెలిసికొనుట, ఇతరులు తనకు చెప్పిన విషయములలో అనావశ్యకములైన వానిని త్యజించుట, విషయములను వివేకించి గ్రహించుట, యథార్థమును (నిజమైన విషయమును) తెలిసికొనుట – అనునవి.

**ఎనిమిది పుష్పములు :-**

**"అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియనిగ్రహః, సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః, జ్ఞానం పుష్పం తపః పుష్పం ధ్యానం పుష్పం తథైవ చ, సత్య మష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్"** అనునట్లు అహింస, ఇంద్రియ నిగ్రహము, సకలప్రాణులపట్ల కరుణ, సహనము, జ్ఞానము, తపస్సు, ధ్యానము, సత్యము – అనునవి.

**అష్ట సిద్ధులు :-**

**"ఊహ స్తర్కో ధ్యానం దుఖవిఘాతా స్త్రయః, సుహృత్ప్రాప్తిః దానం చ సిద్ధయోఽష్టౌ"** అని చెప్పబడిన వేదాధ్యయనముచేయుట, దాని అర్థమును గ్రహించుట, విచారించి అర్థనిర్ణయమును చేయుట, తాను గ్రహించిన అర్థమును స్థిర పఱచుకొనుటకు విద్వాంసులతో కలిసి చర్చించుట, సిద్ధాంతమును ఎప్పుడును మనస్సున భావించుట, ఆత్మకు సంబంధించిన క్లేశము లేకుండుట (ఆధ్యాత్మిక క్లేశము), ఆధిభౌతికక్లేశము లేకుండుట, ఆధిదైవిక క్లేశము లేకుండుట.

**ఎనిమిది విధములైన భక్తులు :-**

**మద్భక్తజనవాత్సల్యం పూజాయాం చానుమోదనమ్, మత్కథాశ్రవణే భక్తిః స్వరనేత్రాంగవిక్రియా, స్వయ మారాధనే యత్నో మమార్థే దంభవర్జనం, మమానుస్మరణం నిత్యం యచ్చ మాం నోపజీవతి"** అనునట్లు భగవానుని పట్ల భక్తిని కల్గియుండుట, భగవదారాధనలో సంతోషమును పొందుట, భగవానుని చరిత్రలను వినుటలో ఆసక్తిని కల్గియుండుట, భగవానునిగూర్చి పల్కినను, తలచినను, వినినను **"ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్"** అని, **"మొయ్‌త్తు కణ్ పని శోర మెయ్‌కళ్ శిలిర్‌ప్ప"** అనియును చెప్పు రీతిలో కంఠము రుద్ధమై, కన్నీటిని స్రవించుచు, రోమాంచమును పొందుట, అతనినే ఆరాధింప ప్రయత్నించుట, అతనికి చేయు కైంకర్యములలో ఆడంబరము లేకుండయుండుట, అతనిని ధ్యానించుట, అతనివలన అల్పఫలములను ఆశింపకుండుట అనునవి.



**యోగముయొక్క ఎనిమిది అంగములు :-**

యమము (అహింస, సత్యము, అస్తేయము, కామవర్జనము, అర్థసంచయ రాహిత్యములను కల్గియుండుట), నియమము (పరిశుద్ధి, ఉన్నదానితో తృప్తిపడుట, వ్రతదానాదులను అనుష్ఠించుట, వేదాంతశాస్త్రమున పరిచయమును పొందుట, అన్ని కర్మలను భగవానునియందు సమర్పించుట) ఆసనము (పద్మాసనము, భద్రాసనము మొదలగునవి), ప్రాణాయామము (శ్వాసమును నియంత్రించుట), ప్రత్యాహారము (ఇంద్రియములను లౌకిక విషయములునుండి మరల్చుట), ధారణము (భగవానుని దివ్యరూపమును మనస్సున గ్రహించుట), ధ్యానము (ఎడతెగక భగవానుని ధ్యానించుట), సమాధి (అట్లు ధ్యానించి, ప్రత్యక్షసమానాకారముగా దర్శింపగల్గుట) అనునవి. (ఈ సమాధియే అంగి, మిగిలినవన్నియు అంగములు)

**అష్టైశ్వర్యములు -**

అణిమ (శరీరమును మిక్కిలి చిన్నదిగా కుచించుకొనగల్గుట), మహిమ (పెద్ద రూపమును పొందుట), లఘిమ (మిక్కిలి తేలికగా అగుట), గరిమ– (మిక్కిలి బరువుగా అగుట), వశిత్వమ్ (అన్నిటిని తన వశములో నుంచుకొనగల్గుట), ప్రాప్తి – (తలచిన వానిని పొందగల్గుట), ప్రాకామ్యమ్ (తలచిన చోటుకు వెడలగల్గిన శక్తి – అనునవి. **("అణిమా గరిమా చైవ లఘిమా మహిమా తథా, ప్రాప్తిః ప్రాకామ్య మైశ్వర్యమ్")**

**ఎనిమిది గుణములు :-**

పూర్వము తెలిపిన భగవానుని అపహతపాప్మత్వాది గుణాష్టకము. లేక, సర్వజంతు దయ, క్షమ, అసహనము లేకుండుట, మనః పరిశుద్ధత, దుఃఖము లేకుండుట, మంచిని తలచుట, లోభరాహిత్యము, ఆశారాహిత్యము – అను ఎనిమిది.

అరువది నాల్గు కళల వివరమును గ్రంథాంతరములలో కాననగును.

**ఎనిమిది రసములు :- "శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకాః, భీభత్సాద్భుత సంజ్ఞాశ్చ"** అనునట్లు శృంగార, వీర, కరుణము, అద్భుతము, హాస్యము, రౌద్రము, బీభత్సము, భయానకము అనునవి. **"శాంతోఽపి నవమో రసః"** అనునట్లు శాంతము తొమ్మిదవది. ఇదియే రసరాజమని ధ్వన్యాలోకకారుని మతము.

**"మంత్రః సర్వార్థసాధకః"** అనునట్లు అష్టాక్షరిని అనుసంధించువారికి పూర్వము తెల్పిన ఫలము లన్నియు సిద్ధించునని పాశురసారము. ఈ పాశురము ఎఴుశీర్ ఆశిరియ విరుత్త ఛందస్సులో రచింపబడినది. తిరుమంత్రాధికారము లోనిది.

**దేశికవ్యాఖ్య:-**

**సర్వకారణభూతనుమాయ్, అఖిలహేయప్రత్యనీకకల్యాణైకతాననుమాన సర్వేశ్వరనుక్కు ప్రతిపాదకమాన తిరువష్టాక్షరత్తై అనుసంధిక్కుమ్ మహామతికళుక్కు ఆత్మగుణాదికళిలుమ్, అష్టైశ్వర్యాదికళిలుమ్ యథామనోరథమ్ దుర్లభమాయిరుప్పదు ఒన్ఱు మిల్లై యెన్గిఱదు. ఎట్టు మా మూర్త్తి = ఆకాశాదిభూతఙ్గళ్ ఐన్దుమ్, చంద్రాదిత్యర్కళుమ్, యజమాననుమ్ తనక్కుమూర్త్తికళాక, వరమ్ పెఱ్ఱ అష్టమూర్త్తి ఎన్ఱు పెయర్ పెఱ్ఱ రుద్రన్, ఎణ్ కణ్ణన్=చతుర్ముఖనాకైయాలే ఎట్టుక్కణ్ణుడైయ బ్రహ్మా, ఎణ్ దిక్కు=ఎట్టు దిక్కుకళ్, ఎణ్ పిరకిరుతి-అవ్యక్త మహదహంకారాదికళాన ఎట్టు తత్త్వఙ్గళ్, ఎట్టు మా వరైకళ్=ఎట్టు కులపర్వతఙ్గళ్, ఈన్ఱ ఎణ్ కుణత్తోన్ = ఇవై యెల్లావఱ్ఱైయుమ్ సృష్టిత్త గుణాష్టకావిష్టనాన పరమాత్మా. ఇవనుక్కు ఎట్టు కుణఙ్గళెన్గిఱదు కర్మవశ్యత్వ-జరా - మరణ - శోక-క్షుత్ -పిపాసైకళ్ ఇన్ఱిక్కే యొఴిక్కైయుమ్, నిత్యఙ్గళాన భోగఙ్గళైయుడైయనాకైయుమ్, నినైత్తదు ముడిక్కవల్లవనాకైయుమ్, ఎట్టెణు మెణ్ కుణమదియోర్క్కు-ఇప్పడిప్పట్ట సర్వేశ్వరనుక్కు ప్రధానమంత్రమాన తిరువష్టాక్షరత్తై సార్థమాక క్కేట్టు అనుసంధిక్కుమ్ అష్టాఙ్గబుద్ధియుడైయ అనన్యరాన ప్రతిబుద్ధర్క్కు. బుద్ధిక్కు ఎట్టు అఙ్గఙ్గళావన "గ్రహణం ధారణం చైవ స్మరణం ప్రతిపాదనమ్, ఊహాపోహోఽర్థవిజ్ఞానం తత్త్వజ్ఞానం చ ధీగుణాః" ఎన్గిఱవై. ఎట్టు మామలర్ "అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియనిగ్రహః, సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః, జ్ఞానం పుష్పం తపః పుష్పం ధ్యానం పుష్పం తథైవ చ, సత్య మిష్ట విధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్" ఎన్గిఱ పుష్పఙ్గళ్, ఎణ్ శిత్తి="ఊహః శబ్దోఽధ్యయనం దుఃఖవిఘాతా స్త్రయః సుహృత్ప్రాప్తిః దానం చ సిద్ధయోఽష్టౌ" ఎన్గిఱ ఎట్టు సిద్ధి, ఎణ్ పత్తి ="మద్భక్తజనవాత్సల్యం పూజాయాం చానుమోదనమ్, మత్కథాశ్రవణే భక్తిః స్వరనేత్రాంగవిక్రియా, స్వయ మారాధనే యత్నో మమార్థే దంభవర్జనమ్, మమానుస్మరణం నిత్యం యచ్చ మాం నోపజీవతి, భక్తి రష్టవిధా హ్యేషా" ఎన్గిఱ ఎట్టు విధఙ్గళాన భక్తికళ్, ఎట్టు యోగాఙ్గమ్ =యోగాఙ్గమాక చ్చొల్లప్పట్ట యమనియమాదికళ్, ఎణ్ శెల్వమ్=అణిమా మహిమా చ తథా లఘిమా గరిమా వశిత్వ మైశ్వర్యమ్, ప్రాప్తిః ప్రాకామ్యం చైత్యష్టైశ్వర్యాణి యోగయుక్తస్య" ఎన్గిఱ విభూతికళ్, ఎట్టు మా కుణమ్=ముక్తదశైయిల్ ఆవిర్భవిక్కుమ్ గుణాష్టకమ్. "అష్టౌ గుణాః పురుషం దీపయంతి" ఇత్యాదికళిల్ శొన్నవైయాకమామ్, ఎట్టెట్టెణుమ్ కలై = చతుష్షష్టికలైకళ్, ఎట్టిరతమేలదువుమ్**



**= "శృంగారహాస్య కరుణాద్భుతహాస్యభయానకాః, బీభత్సరౌద్రౌ చ రసాః" ఎన్గిఱ రసఙ్గళెట్టిక్కుమ్ మేలాన శాంతరసమ్. ఇవై యెల్లామ్, ఎట్టినవై=ఇవఱ్ఱిల్ ఇవనుక్కు ఇచ్చై యుళ్ళపోదు ఎట్టాదవై యొన్ఱు మిల్లై.**

**ఆత్మగుణాదికళ్ నిరవ్యాబదొఴికిఱదు అనుసంధానత్తిల్ ఊఱ్ఱమ్ పోదామైయాలే. అష్టైశ్వర్యాదికళ్ వారాదొఴికిఱదు ఉపేక్షైయాలే. కడుక సంసారమ్ నివర్త్తియాదొఴికిఱదు ఇచ్చైయిల్ కుఱైవాలే. ఆకైయాలేయిఱే "నమో నారాయణాయేతి మంత్రః సర్వార్థసాధకః" ఎన్గిఱదు.**

**ఉత్తమూర్:-** అష్టాక్షరిమూలముగా సర్వార్థవిశిష్టుడగు నారాయణుడు సర్వదా అనుభవింపబడవలసినవాడైయుండునని, ఇట్లు అనుభవించువారికి జీవనమున సర్వఫలప్రాప్తి కల్గునని ఈ పాశురమున తెలుపుచున్నారు. **(ఎట్టు ఇతి) "ఎట్టు మూర్త్తి"** మొదలు ఎనిమిది ఎనిమిదిగా ఎన్నియో ఎనిమిది నిర్దేశింపబడినవి. **(ఈన్ఱ)** మించిన, **(ఎణ్ కుణత్తోన్)** సర్వేశ్వరుని అష్టాక్షరీమంత్రమును, **(ఎణుమ్)**, జపించువానికి. అష్టవిధపుష్పములు మొదలు, ఎనిమిదిరసములతోపాటు శాంతరసమువరకుగల అన్నియు, **(ఎట్టినవే)** సిద్ధించును-అని అన్వయము. ఈ పదార్థములను అన్నిటిని దేశికులే వివరించిరి.

## చరమశ్లోకార్థ వివరణము

**46.** **ఒణ్డొడియాడిరుమకళు న్దానుమాకి**
**యొరునినైవా లీన్ఱ వుయిరెల్లా ముయ్య**
**వణ్డువరైనకర్వాఴ వశుదేవఱ్కాయ్**
**మన్నవఱ్కు త్తేర్ పాకనాకి నిన్ఱ**
**తణ్డుళవమలర్మార్బన్ఱానే శొన్న**
**తనిత్తరుమన్దా నెమక్కాయ్ త్తన్నై యెన్ఱుమ్**
**కణ్డు కళిత్తడి శూడ విలక్కాయ్ నిన్ఱ**
**కణ్పుదైయల్ విళైయాట్టై క్కఴిక్కిన్ఱానే**

వణ్ తువరై నకర్ వాఴ = అందమైన ద్వారకానగరములోని జనులు ఉజ్జీవించుట కొఱకు, వశుదేవఱ్కు ఆయ్ = వసుదేవునకు కుమారుడై అవతరించి, మన్నవర్క్కు త్తేర్ పాకన్ ఆకి నిన్ఱ = పాండవులకు సారథియై యున్నవాడు, తణ్ తుళవ మలర్ మార్బన్ = చల్లని తులసితోపాటు పూలను వక్షఃస్థలమున అలంకరించుకొనినవాడును అగు

శ్రీకృష్ణుడు, ఒణ్ తొడియాళ్ తిరుమకళుమ్ = అందమైన చేతి గాజులను కల లక్ష్మీదేవి, తానుమ్ ఆకి = తాను ఒకటిగా కలసి, ఒరు నినైవాల్ ఈన్ఱ = ఒకే విధమైన సంకల్పముతో సృష్టించిన, ఉయిర్ ఎల్లామ్ ఉయ్య = జీవాత్మలన్నియు ఉజ్జీవించుటకు, తానే శొన్న = తానే (చరమశ్లోకములో) వ్యక్తీకరించిన, తని తరుమమ్= సాటిలేని ఉపాయముగా, ఎమక్కు తాన్ ఆయ్ = మాకు తానేయై నిలచి, (మేము భరన్యాసముచేయగా అతడే ఉపాయముగా నిలచి), తన్నై ఎన్నుమ్ కణ్డు కళిత్తు అడి శూడ = తనను (పరమ పదములో) ఎల్లప్పుడు సేవించి, ఆనందించి, పాదములను (మన శిరస్సుపై) ధరించి, కైంకర్యమును చేయుటకు, విలక్కాయ్ నిన్ఱ= ఆటంకముగా నున్న, కణ్ పుదైయల్ విళైయాట్టై = (ప్రకృతిని గ్రహించి తత్త్వజ్ఞానమును ఆవరించుట అనెడి) కనికట్టు ఆటను, కఴిక్కిన్ఱాన్ = లేకుండ చేయుచున్నాడు.

సర్వేశ్వరుడు మహాపుణ్యక్షేత్రమగు ద్వారకలోనున్నవారు తనను ఆశ్రయించి, తరించునట్లు వసుదేవుని వరపుత్రునిగా అవతరించెను. అర్జునునకు సారథియై, తన సౌలభ్యగుణపరాకాష్ఠను వ్యక్తముచేసెను. ఇట్టి శ్రీ కృష్ణుడు పూర్వము తాను, లక్ష్మియు కలసి ఒకేవిధమైన సంకల్పముతో సృష్టించిన జీవాత్మలు అందఱు ఉజ్జీవింపవలెనని తలచి,**''పాండుతనయ యుద్ధప్రోత్సాహనవ్యాజేన పరమపురుషార్థలక్షణ మోక్షణసాధనతయా వేదాంతోదిత.....భక్తియోగ మవతారయామాస''** అనునట్లు అర్జునవ్యాజముతో చరమశ్లోకమును లోకమునకు ఉపదేశించెను. అందు (అనుగ్రహింపబడిన) చెప్పబడిన సిద్ధోపాయముగా తానే నిలచి, మనలను రక్షించు బాధ్యతను తానే గైకొనెను. ఇక, అంతవరకు మోక్షమును పొంది, భగవానుని శ్రీ పాదములకు అవిచ్ఛిన్నమైన కైంకర్యమును చేయుటకు అడ్డుగానున్న ప్రకృతిని గ్రహించి, మనకు తత్త్వమును మఱగుపఱచిన కనికట్టు విద్యను మానుకొనవలెననియున్నాడు. ఇక త్వరలో మనము మోక్షమును పొందవచ్చును.

ఈ పాశురము మొదలు 49 వ పాశురము వరకు గల నాల్గు పాశురములు చరమశ్లోకాధికారములోనిది. ఈ నాల్గును ఎణ్శీర్ ఆశిరియ విరుత్తచ్ఛందస్సులో కూర్పబడినవి. సృష్టికాలమున భగవానుడు సలక్ష్మీకుడనుట **"సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషా దధి"** ఇత్యాది శ్రుతులు, **"సర్గోపసర్గస్థితీః......సర్వం చ కుర్వన్ హరిః యస్యా వీక్ష్య ముఖమ్"** ఇత్యాద్యాచార్య సూక్తులును తెలుపుచున్నవి. **"ఉలకుమ్....తిరుమాల్**



**తన్పుణ్దియిలాయ పుణర్పు"** అను నరోయోగిసూక్తి కూడ ఇచట స్మరణీయము.

**ఉత్తమూర్:-** భగవానుడు సారథియై విధించెనన్నను, బుద్ధావతారములో అందఱిని అన్నిపాపముల నుండి విడిపింతునని అన్నట్లు ఇది కపటభాషణమా? అను ప్రశ్నకు ఈ అవతారము లోకక్షేమముకొఱకు ఏర్పడినది. బంధువైయుండి ఉపదేశించుచున్నాడు. వేద -స్మృతి-పాంచరాత్రములలో పల్కిన విషయమే అతని ఉపదేశమున చెప్పబడియున్నది. అజ్ఞానమూలమైన కార్యమును పోగొట్టునదిగను అది అగుచున్నది. ఇతనితో పరమసామ్యమును పొందించుచున్నది. అందుచే ఇది బుద్ధోపదేశమువంటిది కాదు అని తెలుపు పాశురమిది. **(ఒణ్ తొడియాళ్)** అందమైన ముంజేతిగాజులను ధరించిన, సర్వాభరణభూషిత అయిన, **(తిరుమకళుమ్)** లక్ష్మీదేవియును, **(తానుమ్ ఆకి)** ఇరువురును చేరి, **(ఒరు నినైవాల్)** దీనికి ముందు చేసిన సృష్టివలె ఏకరూపమైన, **"తదైక్షత బహుస్యామ్"** అనెడి సంకల్పముతో, **(ఈన్ఱ)** సృష్టింపబడిన, **(ఉయిరెల్లామ్)** జీవాత్మలు అన్ని, **(ఉయ్య)** ఉజ్జీవించునట్లు, **(వణ్)** విలక్షణమైన, భూమిలోనున్న మిగిలిన ప్రదేశములలోవలెకాకుండ, తనకొఱకే కడలినుండి ఉద్భవించి, విశ్మకర్మమూలమున నిర్మింపబడిన, **(తువరై నకర్)** ద్వారకాపురి, **(వాఴ)** గొప్ప ఉజ్జీవనము పొందునట్లు, లేక, ద్వారకానగరములో తాను ఉజ్జీవనము పొందునట్లు, లేక, ద్వారకానగరములో తాను ఉజ్జీవించుటకు, **(వశుదేవర్క్కాయ్)** వసుదేవునకు కుమారుడుగా అవతరించి, **(మన్నవఱ్కు)** ప్రభువగు అర్జునునకు, **(తేర్ప్పాకనాకి నిన్ఱ)** సారథియై అందఱును చూచునట్లు ముందుగా వేంచేసియున్న, **(తణ్ తుళవమ్ మలర్మార్బన్)** చల్లని తులసీమాలను వక్షఃస్థలములో అలంకరించుకొనిన సర్వేశ్వరుడు, **(తానే శొన్న)** వేదపాంచరాత్రములలో ఉపదేశించిన, **(తని)** గురూపాయనిరపేక్షమైన, (సహాయమును అపేక్షింపని) **(తరుమమ్)** సిద్ధోపాయమైన, **(తాన్ ఎమక్కు ఆయ్)** స్వయముగా మన కొఱకున్నవాడై, **(ఎన్ఱుమ్)** అన్ని కాలములలో, **(తన్నే కణ్డు)** పరమపదములో తనను అనుభవించి, **(కళిత్తు)** ఆనందమును పొంది, **(అడిశూడ)** తిరువడి శిరసా వహించి, కైంకర్యమును చేయుటకు, **(విలక్కు ఆయ్ నిన్ఱ)** అడ్డముగా అనాదిగానున్న, **(కణ్పుదైయల్ విళైయాట్టై)** కన్నులను మూసికొనుట మొదలగు బాల్యక్రీడలను, అనాది అజ్ఞానమూలమైన సంసారగతాగతమును, **(కఴిక్కిన్ఱాన్)** పోగొట్టుచున్నాడు. **"తాన్ తమక్కు త్తని తరుమనాయ్"** అనుటకు **"కఴికిన్ఱాన్"** అను పదముతో అన్వయము.

## చరమశ్లోకార్థవివరణము

47. మూణ్డాలు మరియదనిన్ ముయలవేణ్డా
మున్నమది లాశైతనైవిడుకైతిణ్మై
వేణ్డాదు శరణ నెఱి వేఱోర్ కూట్టు
వేణ్డిలయనత్తిరమ్ పోల్ వెళ్కి నిఱ్కు
నీణ్డాకు నిఱైమదియోర్ నెఱియిఱ్కూడా
నిన్దనిమై తుణైయాక వెన్దన్ పాదమ్
పూణ్డాలున్ పిఴైకళెలామ్ పొఱుప్పనెన్ద
పుణ్ణియనార్ పుకఴ్నైత్తుమ్ పుకఴ్వోమే.

1. అరియదనిల్ మూణ్డాలుమ్ = చేయుటకు సాధ్యముకాని ఉపాయమును అనుష్ఠింపప్రారంభించి విడచినను, ముయల వేణ్డా = (ఇక దానిని చేయ) ప్రయత్నింపవద్దు 2.మున్నమ్= మొదటలోనే, అదిల్ = ఆ ఉపాయములో, ఆశైతనై విడుకై = (చేయుటకు) ఆశనే విడచుట, తిణ్మై = బలమైనది దృఢమైనది (అనగా గొప్పది) 3.శరణ నెఱి = శరణాగతి, వేఱు ఓర్ కూట్టు వేణ్డాదు = (గుర్తించిన అయిదు అంగములు తప్ప) వేఱొక సహాయమును ఎదురుచూడకుండ, 4.వేణ్డిల్ = (చేతనుడు తెలియక వేఱు అంగములను అనుష్ఠింప) గోరినచో, అయన్ అత్తిరమ్ పోల్ = బ్రహ్మాస్త్రమువలె (వేఱొక అస్త్రప్రయోగమును సహింపకుండునట్లు), వెళ్కి నిఱ్కుమ్= (శరణాగతియు ఫలమును ఇచ్చుటకు) జంకును, 5. నీణ్డాకుమ్ = చాలాకాలము అనుష్ఠింపవలసినదియు, నిఱ్ద మదియోర్ నెఱియిల్ = పూర్ణమైన జ్ఞానమును కలవారికి తగినదను (భక్తియోగము మొదలగు) ఉపాయములోకూడా (నీ) = ప్రవర్తింపని (నీవు) 6.నిన్ తనిమై = నీ నిస్సహాయస్థితిని, తుణైయాక = సహాయముగా గ్రహించి, ఎన్దన్ పాదమ్ పూణ్డాల్ = నా పాదములను ఉపాయముగా గ్రహించినచో, ఉన్ పిఴైకళ్ ఎలామ్ పొఱుప్పన్ = నీ పాపములను పూర్తిగా సహించెదను, ఎన్ద పుణ్ణియనాల్ = అని (చరమశ్లోకములో) అనుగ్రహించిన శ్రీ కృష్ణుని, పుకఴ్ అనైత్తుమ్ పుకఴ్వోమ్= కీర్తిని మొత్తము స్తుతింతుము.

ఈ పాశురార్థమునకు అనుగుణముగా – **“అతోశక్తాధికారిత్వమాకించన్యపురస్క్రియా, అనంగభావో ధర్మానా మశక్యారంభవారణమ్, తత్ఫ్రత్యాశాప్రశమనం బ్రహ్మాస్త్రన్యాయసూచనమ్, సర్వధర్మపరిత్యాగశబ్దార్థాః సాధుసమ్మతాః”**



అను శ్లోకముల భావమును అనుసంధింపనగును. ఇట్లు ఈ పాశురములో చరమశ్లోకములోగల **“సర్వధర్మాన్”** అను వాక్యమునకు ఆఱు అర్థవిశేషములు తెలుపబడినవి. (ఈ పాశురార్థము, తరువాతి పాశురార్థమును 316, 318 **“చరమశ్లోకచ్చురుక్కు”** లోని 4వ పాశురములను వివరించునపుడు విశదీకరింపబడును.)

**ఉత్తమూర్**:– పూర్వము తెలుపబడిన చరమశ్లోకములోని ఆఱు అర్థములను ఇందు సంగ్రహించుచున్నారు.

**(మూణ్డాలుమ్)** పూర్వము తెల్పిన రీతిలో ఇచట చెప్పబడలేదు. అర్థమునకు తగినట్లు మాఱియున్నది. **“మూణ్డాలుమ్”** అని ప్రారంభించి, **“పొఱుప్పేన్”** అనునంతవరకు అర్జునునకు శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశము. **(మూణ్డాలుమ్)** ప్రయత్నించినను, **(అరియదనిల్)** చేయకూడని కార్యములో ప్రయత్నింపవద్దు. ఆ ప్రయత్నమును విడువుము. దానికి ముందు అగు, ఆ కార్యములో ఆశను విడుచుట అనునది, **(తిణ్మై)** శ్రేష్ఠమగును. ఎందులకనగా, **(శరణమ్ నెఱి)** శరణాగతి అనెడి ఉపాయము, **(వేఱు ఓర్ కూట్టి)** వేఱొక ధర్మముయొక్క చేరికను, **(వేణ్డాదు)** అపేక్షింపదు, అట్లున్నపుడు, **(వేణ్డిల్)** నీవు దేనినైనను చేర్చుటకు ప్రయత్నించినచో, **(అయన్ అత్తిరమ్ పోల్)** బ్రహ్మయొక్క అస్త్రమువలెనే, శరణాగతి అనెడి ఉపాయము, **(వెళ్కి నిఱ్కుమ్)** సిగ్గుపడి ఫలము నివ్వకుండ తొలగిపోవును. ఇట్లు **“అశక్యారంభవారణం తత్ఫ్రత్యాశాప్రశమనమ్, అనంగభావో ధర్మాణాం బ్రహ్మాస్త్రన్యాయసూచనమ్”** అనెడి నాల్గు అర్థములు తెలుపబడినవి. ఇక అశక్తాధికారమును గూర్చి తెలుపుచున్నారు. **(నీణ్డాకుమ్ ఇతి) (నీణ్డు ఆకుమ్)** చిరకాలములో సాధింపవలసిన, **(నిఱై మదియోర్ నెఱి)** పూర్ణమైన బుద్ధినికల భక్తుల మార్గమగు యోగములో, **(కూడా)** కూడని అశక్తుడవగు, **(నిన్)** నీయొక్క, **(తనిమై)** ప్రత్యేకమైన స్థితి, కార్పణ్యమనునది, **(తుణైయాక)** అంగముగా నుండగా, **“తనిమై”** ఇత్యాదులచే **“ఆకించన్యపురస్క్రియా”** అనెడి కార్పణ్యాంగత్వము తెలుపబడినది. ఇట్లు నీవు నా యొక్క **(పాదమ్)** శ్రీపాదమును, **(పూణ్డాల్)** ఆశ్రయించినచో, **(పిఴైకళెల్లామ్ పొఱుప్పేన్)** **“సర్వపాపేభ్యో మోక్షయిష్యామి”**, **(ఎన్ద పుణ్ణియనార్)** అని ఉపదేశించిన **“పుణ్యానా మపి పుణ్యోఽసౌ”** అనబడిన సనాతనధర్మమగు భగవానుని, **(పుకఴ్ అనైత్తుమ్)** ప్రసిద్ధములగు కల్యాణగుణములన్నియు, **(పుకఴ్వోమ్)** పొగడెదము. ఇంతవరకు చరమ శ్లోకములోని పూర్వార్ధము తెలుపబడినది.

### చరమశ్లోకములోని ఏకశబ్దార్థము

**48.** **శాదనము నల్పయను నానే యావన్**
**శాదకను మెన్వయమా యెన్నై ప[illegible]మ్**
**శాదనము ఇ్చరణ నెతి యన్నునక్కు**
**చ్చాదనజ్గళిన్నిలైక్కోరిదైయినిల్లా**
**వేదనైశేర్ వేఱజ్గమిదనిల్ వేణ్డా**
**వేఱెల్లా నిఱ్కునిలై నానే నిఱ్పన్**
**దూతనుమా నాదనుమా మెన్నై ప[illegible]**
**చ్చోకన్తీరెన వురైత్తాన్ శూ[illegible]కిన్డానే**

1.శాదనముమ్ = ఉపాయముగా, నల్ పయనుమ్ = గొప్ప ఫలముగా, నానే ఆవన్ = నేనే అగుదును, 2. శాదకనుమ్ = ఉపాయమును చేయువాడు, ఎన్ వయమాయ్ = నాకు వశుడైయుండి, ఎన్నై ప[illegible]మ్ = నన్ను శరణుపొందుము 3. ఉనక్కు (చేతనుడవగు) నీకు, శరణ నెఱి = శరణాగతి, శాదనముమ్ అన్రు = వేఱు ఉపాయముకూడ కాదు, (ఫలమును ఇచ్చుటకు శరణాగతి వ్యాజము మాత్రమే), 4.శాదనజ్గళ్ = (భక్తి మొదలగు) ఉపాయములు, ఇన్నిలైక్కు = ఈ శరణాగతికి, ఓర్ ఇడైయిల్ నిల్లా = ఒక సంబంధమునుకల స్థితిలో నుండవు (అనగా – భక్తి యోగాదులు ప్రపత్తికి సహాయము కావు) 5.వేదనై శేర్ = శ్రమతో చేయవలసిన, వేఱు అజ్గమ్ = అన్యములైన అంగములు, ఇదనిల్ = ఈ ప్రపత్తికి, వేణ్డా = (ఆవశ్యకములు కావు) అక్కరలేదు 6.వేఱు ఎల్లామ్ = మిగిలిన ఉపాయములన్నియు, నిఱ్కుమ్ నిలై = ఉన్న స్థానమున, నానే నిఱ్పన్ = నేనే నిలచి, ఫలము నిత్తును, దూతనుమ్ ఆమ్ = (భక్తులకై) దూతగా వెడలు సకల సౌలభ్యమును కలవాడును, నాదనుమ్ ఆమ్ = (అందఱికి) స్వామియు అగు, ఎన్నై ప[illegible] = నన్ను ఆశ్రయించి, శోకమ్ తీర్ = (నీ) దుఃఖమును పోగొట్టుకొనుము, ఎన ఉరైత్తాన్ = అని (చరమశ్లోకములో) ఉపదేశించిన కృష్ణుడు, శూ[illegible] కిన్డాన్ = (తానే మనలను విడువక) చుట్టు కొనియున్నాడు (రక్షించుచున్నాడు)

ఈ పాశురార్థమును తెలుపు **"ప్రాప్యస్యైవ ప్రాపకత్వం స్వప్రాధాన్య నివారణమ్, ప్రపత్తేః వ్యాజమాత్రత్వ మన్యోపాయై రనన్వయః, తదంగై రవ్యసంబంధః సర్వసాధ్యేష్వభిన్నతా, ఇత్థ మర్థా ష్షడాచార్యై రేకశబ్దస్య దర్శితాః"** అను సంగ్రహశ్లోకము లిచట అనుసంధేయములు.



**ఉత్తమూర్:– "ఏక"** పదముచే సూచింపబడు ఆఱు అర్థములను కలిపి ఈ పాశురములో తెలుపుచున్నారు.

**(శాదనముమ్ ఇతి)** ఉపాయమును, గొప్ప ఉపేయమును నేనే అగుదును. **"ప్రాప్యస్యైవ ప్రాపకత్వమ్". (సాదకనుమ్)** అనుష్ఠించు జీవుడును, **(ఎన్ వయమ్ ఆయ్)** నాకధీనుడైయుండి, **(ఎన్నై ప[illegible]మ్)** శరణు పొందుచున్నాడు. అతనికి ప్రాధాన్యము లేదు. **"స్వప్రాధాన్యనివారణమ్". (శరణమ్ నెఱియుమ్)** శరణాగతియును నీకు సాధనము కాదు. సాక్షాత్ ఉపాయము కాలేదు. **"ప్రపత్తేః వ్యాజమాత్రత్వమ్". (ఇన్నిలైక్కు)** స్వతంత్రప్రపత్తియగు ఉపాయమునకు, **(ఓర్ ఇడైయిల్)** ప్రపత్తికి ఫలమునకు మధ్యలో ఎచటకూడ, **(సాదనజ్గళ్ నిల్లా)** వేఱు ఉపాయము లేదు. ద్వారముగా సాధ్యోపాయములేకుండగనే నేను ఉపాయమగుదును. **"అన్యోపాయై రనన్వయః". (వేదనై శేర్)** సరిగా చేయకపోయినచో ఫలము పోవునే అను వేదనకు కారణమైన, **(అజ్గమ్ వేఱు)** అయిదు అంగములకు పైన ఏమియు దీనికి అక్కఱ లేదు. **"తదంగై రవ్యసంబంధః" (వేఱు ఎల్లామ్)** మిగిలిన గురూపాయములు, **(నిఱ్కుమ్ నిలై)** సాధించు కార్యములో, **(నానే నిఱ్పన్)** నేనొక్కడనే నిలిచెదను. **"సర్వసాధ్యేషు అభిన్నతా".** అన్ని స్థితులలోను నిలుచుట తెలియునట్లు, **(తూదనుమామ్ నాదనుమామ్)** దూత్యమునకు పోవువాడు, స్వామియును అగు భగవానుడు సారథ్యములో నుండుటచే ఆ స్థితి స్ఫురించునట్లు. **"తూదనుమామ్"** అనుటకు సూతుడనగుదును–అను అర్థమునుకూడ చెప్పనగును. సకారము తకారమగును. **(ఎన్నై ప[illegible])** నన్ను ఆశ్రయించి, **(శోకమ్ తీర్)** సంసారబంధశోకమును తీర్చుకొనుడు, **(ఎన ఉరైత్తాన్)** అని ఉపదేశించినవాడు, **(శూ[illegible] కిన్డాన్)** మనవద్ద ప్రపత్తిని ఎదురు చూచి, ఎల్లప్పుడు విడువకుండనున్నాడని భావము.

### మోక్షమును పొందుటకు వెనుకంజవేయుట

**49.** **తన్నినైవిల్ విలక్కిన్ఱి త్తన్నై నణ్ణార్**
**నినైవనైత్తు న్దాన్ విళైత్తుమ్ విలక్కునాదన్**
**ఎన్నినైవై యిప్పవత్తి లిన్రు మా[illegible]**
**యిణైయడిక్కీ[illegible]డైక్కల మెన్రైమ్మై వైత్తుమ్**
**మున్నినైవాల్ యా ముయన్ర వినైయార్ వన్ద**
**మునివయర్న్దు ముత్తితర మున్నే తోన్ఱి**
**నన్నినైవా నామిశైయుజ్కాల మిన్రో**
**నాళైయో ఓ వెన్రు నకై శెయ్ కిన్డానే**

తన్ నినైవిల్ విలక్కు ఇన్ఱి = తాను సంకల్పించిన విషయమునందు (ఎవరిచేతను) ఆటంకము లేకుండనుండియు, తన్నై నణ్ణార్ = తనను చేరని విరోధులకు, నినైవు అనైత్తుమ్ = ఆశను అంతటిని, తాన్ విళైత్తుమ్ విలక్కుమ్ నాదన్ = తాను సృష్టించు (అనంతభోగములను అనుభవింపకుండ) ఆటంకపఱచు స్వామి, ఇప్పవత్తిల్ = ఈ సంసారములో, ఎమ్ నినైవై = మాకు గల ఆశను, ఇన్ఱు మాఱ్ఱి = ఇపుడు పోగొట్టి, ఇణై అడి క్కీఴ్ = తన రెండు శ్రీపాదముల క్రింద, అడైక్కలమ్ ఎన్ఱు = రక్షింపబడవలసిన వస్తువుగా, ఎమ్మై వైత్తు = మనలను పరిగ్రహించి, మున్ నినైవాల్ యామ్ ముయన్ఱ = పూర్వము అహంకారాదులచే మనము చేసిన, వినైయాల్ వన్ద మునివు అయర్న్దు = కర్మవలన ఏర్పడిన కోపము తీరి, ముత్తి తర మున్నే తోన్ఱి = మోక్షమును అనుగ్రహించుటకు పూర్వము (పలు రీతులలో) అవతరించి (యున్నను), నల్ నినైవాల్ నామ్ ఇశైయుమ్ కాలమ్ = మంచి జ్ఞానముతో మనము (పరమపదమునకు పోవుటకు) అంగీకరించు కాలము, ఇన్ఱో నాళైయో ఓ ఎన్ఱు = నేడో రేపో అని, నకై శెయ్‌కిన్ఱాన్ = మనలను పరిహాసము చేయుచున్నాడు.

సత్యసంకల్పుడగు భగవానుడు సంకల్పించిన విషయమును ఎవరును అడ్డుకొనుటకు సాధ్యము కాదు. అతడు, తనను చేరని విరోధులకు అన్ని విధములైన కోరికలను కల్గించి, వారు ఆ భోగములను పొందకుండ తానే అడ్డుపడును. ఇట్టి స్వామి మనపై కరుణ జూపి, మనకు సంసారమునందున్న ఆశను తీర్చెను. తన పాద సన్నిధిలో మనలను రక్ష్యవస్తువుగా స్వీకరించెను. పూర్వము అహంకార–మమకారములచే మనము చేసిన కర్మలవలన తనకు కల్గిన కోపము తీరినవాడయ్యెను. మనకు మోక్షమును అనుగ్రహించుటకు ముందుకు వచ్చి, పలు అవతారములను ఎత్తి, మనతో కలసి వ్యవహరించెను. ఇట్లయినను, ఈ మహిమను తెలియని మనము సంసారమును వీడుటకు ఇష్టపడక "ఈ దినమో, మఱునాడో" అని కాలమును గడపుటను చూచి అతడు పరిహాసము చేయుచున్నాడు. ఏమి మన అజ్ఞానము!

"నేను మోక్షము నిచ్చుటకు త్వరపడుచున్నాను. కాని, జీవుడు సంసారమును విడచుటకు అంగీకరింపకుండ, "ఈ రోజు, రేపు" అని కాలము గడపుచున్నాడు. వీని అజ్ఞానము ఏమి!" అని భగవానుడు పరిహసించుచున్నాడని భావము.

**ఉత్తమూర్:–** చరమశ్లోకములోని మూడవపాదముయొక్క అర్థమును ఇందు తెలుపుచున్నారు. **(తన్ ఇతి) "నాదన్"** అనునంతవరకు **"అహమ్"** శబ్దార్థము. **"ఎన్నై"**



అనునంతవరకు **"త్వా"** శబ్దార్థము. ఈ పాదములో వాక్యము పూర్తికాకుండుటచే మోక్షమునకు పోవుచున్నానని అనుచున్నారు–అని పలుకకుండ వేఱువిధముగా వాక్యమును **"మున్"** ఇత్యాదిగా పూర్తిచేయుచున్నారు. భగవానుడు పల్కునట్లు శ్లోకముయొక్క సన్నివేశము ఉన్నది. దానిని విను అర్జునుని వంటివారికి మూడవ పాదమును వినునపుడు ఏర్పడు అభిప్రాయానుసారము పాశురస్థితి ఉన్నది. **(తన్ నిలైవిల్)** తన సంకల్పముతో, **(విలక్కు ఇన్ఱి)** ఆటంకము లేకుండ సత్యసంకల్పుడై–అని అర్థము. **(తన్నై నణ్ణార్)** తనను చేరనివారియొక్క, **(నినైవు అనైత్తు ఆమ్)** మనోరథములను అన్నిటిని, **(తాన్ విళైత్తుమ్)** కార్యానుగుణముగా సృష్టించువాడైనను, **(విలక్కుమ్) "అన్యోహి అన్యత్ చింతయతి స్వచ్ఛందం విదధామ్యహమ్"** అనునట్లు వ్యర్థము చేయువాడై, **(నాదన్)** స్వామియైనవాడు, అందఱిని అసత్యసంకల్పులను చేసి, తాను సత్యసంకల్పుడై రక్షించు సంబంధమును కలవాడు. **(ఇ పవత్తిల్)** ఈ సంసారవిషయకమైన, **(ఎన్ నినైవై)** నా ఆశను, **(ఇన్ఱు)** అజ్ఞానసుకృతాదులు ఫలించు ఈ జన్మలోనే, **(మాఱ్ఱి)** తన విషయముగా చేసి, **(ఇణై అడి కీఴ్)** ఒకదానితో వేఱొకటి తగినట్లున్న శ్రీపాదముల కింద, **(అడైక్కలమ్)** రక్ష్యవస్తువుగా, **(ఎన్నై వైత్తు)** భరన్యాసమును చేయించి–అని భావము. దీనికి **"ముత్తి తర"** అనుదానితో అన్వయము. **(మున్ నినైవాల్)** ముందున్న క్షుద్రఫలవిషయమైన నా దృష్టితో, లేక, దేహాత్మభ్రమలతో, **(యాన్ ముయన్ఱ)** నేను చేసిన, **(వినైయాల్)** పాపముమూలముగా, **(వన్ద మునివు)** నాపట్ల అతనికికల కోపమును, **(అయర్న్దు)** మఱచి. విడచి–అని భావము. **(ముత్తి తర)** మోక్షమును అనుగ్రహించుటకు. అందు నా ఇష్టమును తెలియుటకు, **(మున్నే తోన్ఱి)** నాతో మాటలాడువాడై, **(నల్ నినైవాల్)** మంచిని పొందుటకగు మంచిభావనతో, **(నామ్ ఇశైయుమ్ కాలమ్)** మోక్షమును పొందుటకు నేను అపేక్షించు కాలము **(ఇన్ఱో నాళైయో)** ఈనాడో, మఱునాడో. ఈ జన్మకు చెందిన దినమా? మఱుజన్మకు చెందిన దినమా? **(ఎన్ఱు నకై శెయ్‌కిన్ఱాన్)** అని అడుగువాడై నవ్వుచున్నాడు. ఇట్లు మూడవ పాదము వినునపుడు శిష్యునకు తోచునని భావము. సత్యసంకల్పుడైన స్వామి సంసారవైరాగ్యమును కల్గించి, తనను ఆశ్రయించునట్లు చేసి, మోక్షమును అనుగ్రహించుటకు ముందుకు వచ్చి, **"సర్వపాపేభ్యః"** అని పల్కువాడై, "నీవు ఇచట ఎంతకాలము ఉండగోరుచున్నావో, ఏ కాలమునకు పైన గల కాలములో అనుభవింపవలసిన పాపములను అడ్డుకొన గోరుచున్నావో పల్కుము. పల్కినచో, **"సర్వ"** అనుటచే పోగొట్టుకొనవలసిన ఆ పాపములను అన్నిటిని నేను పోగొట్టుటకు వీలగును." అని ఆశ్రితుని ఇష్టమును ప్రశ్నించును. ఇంతవరకు నా భావనను మార్చినవాడు ఇపుడు

నా ఇచ్ఛకు అంగీకరించి వచ్చుచున్నాడు. నా భావన ఎట్లయినను మంచిదిగానుండుటయే దానికి కారణము. స్వామి నవ్వుట ఎందులకు? అనగా, ఈ స్థితిలోకూడ ఆలస్యము చేయుచున్నాడే!-అని పరిహసించుటయే. త్వరలో ఇతడు మనకు లభించునను సంతోషముచేకూడ. ఈ పాశురములో **"ఎన్ నినైవై"** ఇత్యాదులలో **"ఎమ్ నినైవై"** అను బహువచనరూపపాఠమును కొందఱు గ్రహించిరి.

**ముదలాళ్వార్ల మహిమ**

**50.** **పాట్టుక్కురియ పழైయవర్ మూవరై ప్పణ్డొరుకాల్**
**మాట్టుక్కరుళదరు మాయన్ మలిన్దు వరుత్తదలాల్**
**నాట్టుక్కిరుళ్ శెక నాన్మఱై యన్ది నడై విళఙ్గ**
**వీట్టుక్కిడైకழிక్కే వెళి కాట్టు మమ్మెయ్విళక్కే**

మాట్టుక్కు అరుళ్ తరుమ్ మాయన్ = (తన) సంపద అగు జీవునకు కరుణ జూపువాడు, అత్యాశ్చర్యకరములగు లీలలను చేయువాడును అగు స్వామి, పాట్టుక్కు ఉరియ = గొప్ప పాశురములతో తనను) కీర్తించుటకు తగినవారగు, పழైయవర్ మూవరై = ముదలాళ్వార్లు ముగ్గురను, పణ్డు ఒరుకాల్ = పూర్వము ఒకానొక సమయమునందు, (ద్వాపరయుగములో), మలిన్దు వరుత్తుదలాల్ = అధికముగా సమ్మర్దించుటవలన, వీట్టుక్కు ఇడైక్కழிక్కే = తిరుక్కోవలూరులో ఉన్న ఒక ఇంటి వాకిలి అరుగుపై (వారు ముగ్గురు ఉన్న చోట అవతరించిన), అమ్మెయ్ విళక్కు = (మూడు తిరువన్దాదులు అను) ఆ సత్యమైన దీపము, నాట్టుక్కు ఇరుళ్ శెక = లోకమునకంతటికి అజ్ఞానము పోవునట్లు, నాన్మఱై అన్ది నడై విళఙ్గ = నాలుగు వేదముల అంతములో తెలుపబడిన మార్గము ప్రకాశించునట్లు, వెళి కాట్టుమ్ = (భక్తి-ప్రపత్తులను) ఉపాయములను) ప్రకాశింపచేయును.

భగవానుడు ముదలాళ్వార్లను ఆధారముగా చేసికొని, వారిచే మూడు తిరువన్దాదిప్రబంధములను పాడించి, లోకములోని అజ్ఞానమును పోగొట్టి, భక్తి, ప్రపత్తులనెడి ఉపాయములను తెలియజేసి, లోకమును ఉజ్జీవింపచేసెను. అట్లే, దాసుని మూలముగా ఆస్వామి ప్రవర్తింపజేసిన ఈ శ్రీమద్రహస్యత్రయసారమను సూక్తిద్వారా తత్త్వ-ఉపాయ-పురుషార్థములను ప్రకాశింపచేసి, లోకమును తరింపచేయును-అని తాత్పర్యము.



ద్వాపరయుగములో ఒకనాటి రాత్రి పొయ్కై ఆళ్వార్, పూదత్తాళ్వార్, పేయాళ్వార్ అనబడు ముదలాళ్వార్లు ముగ్గురు తిరుక్కోవలూర్‌లో వర్షము కారణముగా మృకండుముని వాకిలిలోని చిన్న అరుగుపై చేరియుండిరి. భగవానుడును వీరి తిరుమేని సంబంధమును ఆశించి, ఆ చోటనే సలక్ష్మీకుడై, అవతరించి, వారితో కలిసి, వారికి సమ్మర్దమును కలుగజేసెను. పిమ్మట ఆళ్వార్లు ముగ్గురు భగవానుని దర్శించి మూడు తిరువన్దాది ప్రబంధములను అనుగ్రహించిరి. నాలాయిరదివ్యప్రబంధములో ఇయఱ్పా అను విభాగము చరమశ్లోకార్థమును వివరించుచున్నదని ఆచార్యుల అభిప్రాయము. ముదలాళ్వార్ల ప్రబంధము ప్రపత్తిని ప్రకాశింపజేయుచున్నదనుటద్వారా ఆ ప్రబంధములు చరమశ్లోకార్థ ప్రకాశములనుటను ఇచట దేశికులు సూచించిరి.

ఈ పాశురము ఆచార్యకృత్యాధికారములోనిది. ఇది కట్టళైక్కలిత్తుఱై ఛందమున రచింపబడినది.

**ఉత్తమూర్:-**మన సత్సంప్రదాయమునకు మూలమైన ఉభయవేదాంతములలో ఒకటి అగు ద్రావిడవేదాంతములో మొదటి మూడుతిరువన్దాదులను ప్రకాశింపజేయుటకు పడిన ప్రయాస మొదలగు తన ప్రయత్నములు అన్నియు-పూర్ణముగా ఫలమును పొందుటకొఱకు అను అభిప్రాయముతో ప్రస్తుతపాశురమును దేశికులు అనుగ్రహించుచున్నారు.

**(పాట్టుక్కు)** సాంప్రదాయికార్థములను వ్యక్తీకరించు దివ్యప్రబంధములలో మొదటివి అగు మూడు తిరువన్దాదులను రాగయుక్తముగా అనుగ్రహించుటకు, **(ఉరియ)** తగిన, **(పழைయవర్)** దివ్యసూరులలో మొదటివారు. **"ఏతత్ సామ గాయ న్నాస్తే"** అను సామగానాసక్తులగు నిత్యసూరుల అవతారమును అయిన పొయ్కైముని, పూదత్తాళ్వార్లు, పేయాళ్వార్లు, **(మూవరై)** అను ముగ్గురిని, **(పణ్డు)** మిగిలినవారికంటె ముందు, **(ఒరుకాల్)** తిరుక్కోవలూరులో ఒక్కొక్కరు వేంచేసి, రాత్రివేళ-వర్షములో యాదృచ్ఛికముగా కలసినపుడు, **(వీట్టుక్కు)** ఒక ఇంటి, **(ఇడై కழிక్కు)** వీధి అరుగులో, **(మాట్టుక్కు)** **"మాట్టు"** అనగా సొత్తు. లేక, **మాడు**-పశుప్రాయులు. అట్టి జీవులకు, **(అరుళ్ తరుమ్)** అనుగ్రహమును చేయు, **(మాయన్)** ఆశ్చర్యభూతుడు అగు, పశువులను సైతము అనుగ్రహించువాడగు, **(ఆయన్)** గోపాలకుడు, **(మలిన్దు)** అధికముగా, **(వరుత్తుదలాల్)** సమ్మర్దించుటచే ఆవిర్భవించిన, **(ఇ మెయ్ విళక్కే)** ఈ పాశుర మనెడి శాశ్వతమైన దీపమే, **(వెళి కాట్టుమ్)** తత్త్వార్థములను వ్యక్తీకరించు, **(నాట్టుక్కు)** లోకమునంతటికిని,

**(ఇరుళ్ శెక)** అజ్ఞానము పోవునట్లు, **(నాల్ మఱై)** నాల్గు వేదముల, **(అన్ది)** అంతములగు ఉపనిషత్తులలో గల, **(నడై)** మోక్షోపాయములు, **(విళఙ్గ)** చక్కగా ప్రకాశించునట్లు ఒకరు పరుండవచ్చును, ఇద్దరు కూర్చుండ వచ్చును, ముగ్గురు నిలుచుండవచ్చును- అని ఒకటిగా చేరి నిలిచిన ముగ్గురిని, ఇదియే తన ఇష్టపూర్తికి తగిన సమయమని సంప్రదాయ ప్రథమప్రవర్తకాచార్యుడైన గీతాచార్యుడు మధ్యలో తానెవ్వరో తెలియకుండు రీతిలో సమ్మర్దించెను. ఇంతటి సమ్మర్దము ఎందువలన? అని ఆశ్చర్యపడి, చీకటిలో దీపమును కోరినవారై, ఇతడు ఆశ్రితవ్యాముగ్ధుడే అయి ఉండునని తలచి, పాశురము అనెడి దీపముతో దర్శించి, తెలిపిరి. ఈ మూడు తిరువన్దాదులు అనెడి దీపము లక్ష్మీవిశిష్టుడైన స్వామి అనెడి తత్త్వహితపురుషార్థముల విషయమై, లోకమంతట వ్యాపించిన అజ్ఞానాంధకారము నశించునట్లు నాల్గువేదముల సారమగు అన్దాదులు అంతట ప్రవర్తించుటతోపాటు దేహళికి సైతము ప్రకాశమును కల్గించినవి అయినవి. లోకమున దీపమున్న చోట నీడగా, దానిచుట్టుగల ప్రదేశమున వెలుతురుగా నుండును. ఈ దీపము లోకమునందు అంతటయే గాక, దేహళికిసైతము ప్రకాశకమై అచటనున్నది. గోపాలుడను విషయమును బాగుగా స్పష్టపఱచినది. అందుచే **"ఇదై కఴిక్కు"** అనునది షష్ఠీవిభక్తిరూపముగానే వ్యక్తమగును. కావున **"వెళి కాట్టుమ్"** అను అనంతరపదముతోనే అన్వయింపనగును. **"వరున్దుదలాల్"** అను పదమునకు పిమ్మట **"తోన్ఱియ"** అవతరించిన అను పదమును చేర్చుకొని **"విళక్కు"** అను పదముతో అన్వయింపనగును. లేక, **"వెళి కాట్టుమ్"** అనుటను సమాపకక్రియారూపముగా కాకుండ, **"విళక్కు"** కు విశేషణము చేసి, ప్రకాశింపజేయు దీపము సమ్మర్దించుటచే అవతరించిన **(వెళి కాట్టుకిఱ విళక్కు వరుత్తుదలాల్ తోన్ఱిన)** అనియును చెప్పవచ్చును. **"వరుత్తుదలాల్ వెళికాట్టుమ్"** అను అన్వయము సరసముగా లేదని తోచును. **"వఴి కాట్టుమ్"** అను వేఱొక పాఠము కన్పించినచో వేదాంతములు ప్రవర్తించునట్లు భక్తిప్రపత్త్యాదులను చూపును-అని అర్థము వచ్చును. ఇట్లు అవతరించిన ద్రావిడవేదమును మూలముగాగల మన సత్సంప్రదాయము అప్పటివలె ఇపుడును ఈ రీతిలో హయగ్రీవుడు నిర్దుష్టములైన పాశురములతో మా ద్వారా ప్రకాశింపజేసెనని భావము.

**శ్రీరంగనాథుని పాదద్వంద్వమహిమ**

51. **ఉఱుశకడ ముడైయ వొరుకాలుఱ్ఱుణర్న్దన**
**వుడన్ మరుత మొడియ వొరుపోదిఱ్ఱవఴ్న్దన**
**వుఱితడవుమళవి లురలోడుఱ్ఱు నిన్ఱన**
**వుఱునెఱియోర్ తరుమన్ వీడు తూదుక్కుకన్దన**



**మఱనెఱియార్ ముఱియ పిరుదానత్తు వన్దన**
**మలర్మకళ్ కైవరుడ మలర్ పోదిఱ్చివన్దన**
**మఱుపిఱవి యఱుమునివర్ మాలుక్కిశైన్దన**
**మనుముఱైయిల్ వరువతోర్ విమానత్తుఱైన్దన**
**వఱముడైయ విశయనమర్ తేరిఱ్ఱికఴ్న్దన**
**వడలురకపటమడియ వాడి క్కడిన్దన**
**వఱుశమయ మఱివరియ తానత్తమర్న్దన**
**వణికురుకైనకర్ మునివర్ నావుక్కమైన్దన**
**వెఱియుడైయ తుళవమలర్ వీఱుక్కణిన్దన**
**విఴకరియోర్ కుమరనెన మేవిచ్చిఱన్దన**
**విఱలశురర్పడైయడైయ వీయ త్తురన్దన**
**విడలరియ పెరియ పెరుమాణ్ మెన్పదఙ్గళే**

విడల్ అరియ = వీడుటకు వీలుకాని, పెరియ పెరుమాళ్ = శ్రీరంగనాథుని, మెన్ పదఙ్గళ్ = మృదువైన పాదములు, ఉఱు శకడమ్ ఉడైయ = బలిష్ఠుడైన శకటాసురుడు బ్రద్దలగునట్లు, ఒరు కాల్ ఉఱ్ఱు ఉణర్న్దన = పూర్వము ఒకానొక సమయమున పదునైనవి అయ్యెను, ఉడన్ మరుతమ్ ఒడియ = ఒకటిగా చేరియున్న రెండు మద్దిచెట్లు విరిగిపడునట్లు, ఒరు పోదిల్ తవఴ్న్దన = వేఱొక సమయమున పాకినవి (దోగాడినవి), ఉఱి తడవుమ్ అళవిల్ = (పెఱుగు, వెన్న ఉంచిన) ఉట్టిని తాకినపుడు, ఉరలోడు ఉఱ్ఱు నిన్ఱన = రోలుతో కలిపికట్టబడినవి, ఉఱి నెఱి ఓర్ తరుమన్ = తగిన ధర్మమార్గమున ప్రవర్తించు, సాటిలేని ధర్మపుత్రుడు, విడు తూదుక్కు ఉకన్దన = (దుర్యోధనుని వద్దకు) దూతగా పోవుటకు సంతోషముతో నడచినవి, మఱ నెఱియార్ మఱియ = (కోపమును పొంది), దుర్మార్గమున నడచు దుష్టులు నశించినట్లు, పిరుతానత్తు వన్దన = బృందావనమునకు వచ్చినవి, మలర్ మకళ్ కై వరుడ = తామరపూవులో నివసించు పిరాట్టి తన చేతులతో సంవాహనముచేయగా, మలర్ పోదిల్ శివన్దన = (ఆ స్పర్శనుకూడ తాళలేక) పూవుకంటె ఎఱ్ఱగా అయినవి. మఱు పిఱవి అఱుమ్ మునివర్ = మఱల (ఈ కర్మభూమిలో) జన్మను లేకుండ చేసికొనగోరు మునుల, మాలుక్కు ఇశైన్దన = భక్తికి తగిన విషయమైనవి, మను ముఱైయిల్ వరువదు = (బ్రహ్మనుండి) మనువంశమునకు వచ్చిన, ఓర్ విమానత్తు = సాటిలేని శ్రీరంగవిమానములో, ఉఱైన్దన = నిత్యవాసము చేసినవి, అఱమ్ ఉడైయ విశయన్ అమర్ = ధర్మమునుకల అర్జునుడు

ఉన్న, తేరిల్ తికఴ్న్దన = రథములో నిలచి ప్రకాశించినవి, అడల్ ఉరక పడమ్ మడియ = బలమును కల(కాళియుడను) సర్పముయొక్క పడగలు నలుగునట్లు, ఆడి క్కడిన్దన = నటనమాడి అణగదొక్కినవి; అఱు శమయమ్ అఱివు అరియ = అఱు మతములచే తెలిసికొనలేని, తానత్తు అమర్న్దన = (పరమపదమను) స్థానములో అమరియున్నవి, అణి కురుకై నకర్ మునివర్ = (భూమండలమునకే) అలంకారమైయున్న కురుకాపురి (తిరుక్కురుకూర్) అను ఆఴ్వార్ తిరునకరికి నాథులగు నమ్మాఴ్వార్ల, నావుక్కు అమైన్దన = నాలుకతో పాడుటకు తగిన విషయమై అమరియున్నవి, వెఱి ఉడైయ తుళవ మలర్ = వాసననుకల తులసీమాలికయొక్క గొప్ప, వీఱుక్కు అణిన్దన = మహిమకు తగిన అందమును కల్గినవైయున్నవి, విఴ కరి ఓర్ కుమరన్ ఎన = (ఉత్తరాగర్భమునుండి) ప్రసవించిన నల్లని కొఱివికట్టె, అద్వితీయుడైన (పరీక్షిత్తు అను) బాలకుడు అని పల్కునట్లు, మేవి చ్చిఅన్దన = (ఆ నల్లని కట్టెనే) ఉద్ధరించినవి, విఱల్ అశురర్ పడై = పరాక్రమమును కల అసురలసేన, అడైయ వీయ త్తురన్దన = మొత్తము నశించునట్లు తరిమినవి, (శ్రీరంగనాథుని పాదములే ఇన్ని అపూర్వకార్యములను చేసిన అతిశయమును కల్గినవి)

భక్తులకు విశ్లేషించుటకు వీలుకాక, ఎల్లప్పుడు అనుభవించుచున్నను తృప్తితీరని అపర్యాప్తామృతమైయున్న శ్రీరంగనాథుని మృదుపాదములే పూర్వము కృష్ణావతార సమయమున శకటాసురుడు భగ్నమగునట్లు తన్నినవి. రెండు మద్ది చెట్లు విరిగిపడునట్లు దోగాడినవి. వెన్నను దొంగిలించునపుడు రోలితో కట్టబడినవి, ధర్మసుతుని ప్రార్థనకు అంగీకరించి దుర్యోధనునివద్దకు దూతగా సంతోషముతో వెడలినవి. పలువురు దుష్టులను నశింపజేయుటకై బృందావనములో సంచరించినవి. లక్ష్మీదేవి తన కరములతో సంవాహనముచేయగా పూవుకంటె ఎక్కువగా ఎఱ్ఱబడినవి. ముముక్షువులగు మహర్షుల భక్తికి లక్ష్యములైనవి, శ్రీరంగవిమానమునందు నిత్యనివాసము చేయునవి, అర్జునుని రథములో సారథిగా నిలచినవి, కాళియుని పడగలు అణగునట్లు నాట్యమాడినవి, ఇతర మతములవారికి తలచుటకు, చేరుటకును వీలుకాని పరమపదమున అమరియున్నవి. నమ్మాఴ్వార్లు తమ సూక్తులద్వారా ఆస్వాదింప సాధ్యమైనవి, తులసీమాలను అలంకరించుకొనిన అందమును పొందినవి, **"పాదేన కమలాభేన పస్పర్శ"** అనునట్లు ఉత్తర గర్భమునుండి పుట్టిన కాలినకట్టెను పరీక్షిత్తు అను బాలకునిగా చేసినవి. గొప్ప పరాక్రమమునుకల అసురసేనను పూర్తిగా నశింపజేసినవి. ఇట్టి శ్రీ పాదములనే ఉపాయముగా, ఫలముగా భావించి భక్తులు తరింతురుగాక!



ఈ పాశురములో **"పెరియపెరుమాళ్"** అను ప్రయోగము **"సత్యవ్రత మాహాత్మ్య"** మను రహస్యములోని **"పదై యిరణ్డై"** అను పాశురములోని అవతారికలో శ్రీవరదరాజస్వామినే పెరియపెరుమాళ్ అని దేశికులు అనుగ్రహించుటనుబట్టి వరదరాజస్వామినే ఇచట ఉద్దేశించి పల్కునట్లు, **"మను ముఱైయిల్......ఉఱైన్దన"** అను ప్రయోగము శ్రీ పరాశరభట్టర్ అనుగ్రహించిన శ్రీరంగరాజస్తవము 78వ శ్లోకమును అనుసరించి వరదరాజస్వామియే శ్రీరంగమున శయనించియుండుటను తెలుపుచున్నదనియు శ్రీవరదరాజస్వామి విషయమున మిక్కిలి అభినివేశమునుకల అభిజ్ఞులైన పెద్దలు సరసముగా అనుగ్రహింతురు.

అఱు మతములు- సాంఖ్య, కణాద, బౌద్ధ, పతంజలి, (యోగ), జైన, శైవములు- అనునవి.

ఈ పాశురమునుండి ఈ ప్రబంధము చివరివరకుగల పాశురములు అఱు నిగమనాధికారములోనివి. ఇది పదునాఱుశీర్ ఆశిరియవిరుత్తఛందస్సులో కూర్పబడినది. ప్రస్తుతపాశురార్థమునకు అనుగుణముగా శ్రీరంగరాజస్తవ-పూర్వ శతకములోని **"యద్బృందావనపండితమ్"** ఇత్యాదిశ్లోకము స్మరణీయము. **"బృందావన, విజయ"** పదములే **"విరుతానమ్, విశయ"** అని అయినవి.

**ఉత్తమూర్:- ఉరుశకడ-** ప్రాప్యదశలోవలెనే పూర్వదశలోను భగవానునియొక్క లక్ష్మియొక్క శ్రీపాదములకు అధీనముగానే తన స్థితిని కల్గియుండవలెనుటను తెలుపుటకై ఈ పాశురమున వారి శ్రీపాదములకుగల వైభవమును తెలుపుచున్నారు. శ్రీకృష్ణుడు మూడు రహస్యములకు వక్త అగుట చేత **"కణ్ణాలమ్ కోడిత్తు...అఱ్ఱు అవనై క్కై పిడిత్త పెణ్ణాళన్ పేణుమ్ ఊర్ పేరుమ్ అరఙ్గమే"** (11-2) అని, **"శెమ్మైయుడైయ తిరువరఙ్గర్ తామ్ పణిత్త మెయ్మ్మై ప్పెరువార్త్తై"** (11-10) అనియును శ్రీకృష్ణుని శ్రీరంగనాథునిగా గోదాదేవి పల్కుటచేతను, అ శ్రీరంగనాథుడే పెరియపెరుమాళ్ అగుటచేతను శ్రీరంగనాథుని శ్రీపాదము ఉపాయదశలోను, ఫలదశలోను ఉపజీవ్యములుగా భగవద్రామానుజులు శరణాగతిగద్యలో అనుగ్రహించుటచేతను శ్రీరంగములో ఈ గ్రంథము పూర్తి అగుట వ్యక్తమగునట్లును శ్రీరంగనాథుని శ్రీపాదముల విషయమున ఈ పాశురమును అనుగ్రహించిరి.

ఈ పాశురములో **"విడలరియ పెరియపెరుమాళ్ మెన్ పదఙ్గళ్"** అనునది కర్తృపదము. **"ఉణర్న్దన"** ఇత్యాది పదునైదును క్రియాపదములు.

**(ఒరు కాల్)** ఒకానొక సమయమున (యశోదాదేవి బండికింద తొట్టిలో పెట్టి యమునానదికి పోయినపుడు), **(ఉఱు)** బలిష్ఠమైన, **(శకడమ్)** అసురావేశమునుకల శకటమును, **(ఉఱియ)** తన పైన పడబోవుచున్నదని గమనించి, **(ఉడైయ)** అది భగ్నమగునట్లు, **(ఉణర్న్దన)** తెలిసికొన్నది. అవతరించిన నాలుగైదు నెలలలోనే శకటాసురవధను చేసి, లోకమునకు ఉపకారము చేసినవాడని తాత్పర్యము. **(ఒరు పోదిల్)** వేఱొకసమయములో, **(ఉడన్)** ఒక దానితో వేఱొకటి కలసియున్న, **(మరుదమ్)** రెండు మద్దిచెట్లు, **(ఒడియ)** విఱిగి కూలునట్లు, **(తవఴ్న్దన)** దోగాడుచు పోయినవి, **(ఉఱి తడవుమ్ అళవిల్)** నేయి, పెరుగు, వెన్నలకొఱకు ఉట్టెలను చీకటిలో తడవినపుడు, **(ఉరల్ ఊడు)** రోలు నడుమన, **(ఉఱియ నిన్ఱన)** సంబంధమును కల్గియున్నవి. ఉట్టెలను తడవినందులకు రోటితో చేర్చి యశోదకట్టిన చరిత్ర ఇచట తెలుపబడుచున్నను **"ఓడు"** అనెడి పాఠము నవీనము. **"ఊడు"** అనియే పూర్వవ్యాఖ్యలలో కలదు. రోటితో కట్టిన పిమ్మటనేకదా మద్దిచెట్లను కూల్చెను. దానిని ముందుగా పల్కుట ఎందులకు? అనినచో, ఈ పాశురములో అన్నియు క్రమానుసారముగా చెప్పబడలేదు. అనుభవమునకు వచ్చిన క్రమములోనే చెప్పబడినవి. లేక, ఇచట యశోద కట్టినది విషయము కాదు. రోటిని నిలువుగా నిలిపి, దానిపై భాగము చివరలో నిలచి ఉట్టెలను ఎత్తెననుట విషయము. కట్టుట ఇచట విషయమైనచో, యశోద కృష్ణుని కాలును కట్టలేదు కావున **"ఉరలూడుఱియ"** అను ప్రయోగముకూడ పొసగదు. **"ఒత్తు"** అను పాఠమునుబట్టి ఒకదానితో వేఱొకటి కలసియున్న అందము అనుభవింపబడినదనవచ్చును. **"ఉఱు నెఱి"**- తనకు సంబంధించిన సన్మార్గమును కల, **"ఓర్"**-సాటిలేని, లేక, **"నెఱి ఓర్"** సన్మార్గమును పరిశీలించిన, **(తరుమన్)** ధర్మపుత్రునిచే, **(విడు తూతుక్కు)** నియమింపబడిన దూత కృత్యమునకై, **(ఉకన్దన)** సంతోషించినవి. **(మఱ నెఱియర్)** **"మఱమ్"**-కోపము, కోపమునే దారిగా కల శత్రువులు, **(మఱియ)** నశించునట్లు, **(పిరతానత్తు)** బృందావనములో, **(వన్దన)** సంచారమును చేసినవి. **"పిరతానత్తు"** అనియే ప్రాచీనపాఠము. **"పిరున్దావనత్తు"** అను పదములో **"రు"** అను అక్షరముండుటచే **"పిరుతానత్తు"** అని మార్చిరి. దీనికంటె **"పిరతానత్తు"** అనునది **"ప్రధనమ్" (పోర్)** అను పదముయొక్క వికృతి. **"నీట్టల్ వికారముగా"** గ్రహించి, యుద్ధమునకు వచ్చినవి అను అర్థమును గ్రహింపవచ్చును. కావున, దౌత్యమునకు వెడలుటకై ఆనందించిన పిమ్మట బృందావనమునకు వచ్చినట్లు పల్కుట ఏమి? అని అడుగనక్కఱ లేదు. ఇచట యుద్ధమునకు వచ్చినది దుష్టమానవులను సంహరించుటకొఱకు. చివరిపాదములో



**"విఱలశురర్ పడై"** అనుచోట దేవాసురయుద్ధాదులు విషయము. సారప్రకాశికలో కంస-జరాసంధ-శిశుపాలాదులు నశించునట్లు ప్రధానస్థానమగు భూమికి వచ్చినవి అనియే అర్థము చెప్పబడినది. మొదటిపాదములో మొదట ఉకారము, రెండవ పాదములో మకారము, ఆ పిమ్మట అకారమును ప్రణవాకారవిమానమున వేంచేసియున్న స్వామి విషయమున ఇది **"ఉయర్వఱ"** అనెడి పాశురములోవలె ప్రణవాక్షరములను సూచించును. **(మలర్ మకళ్)** లక్ష్మీదేవి, **(కై వరుడ)** పూవుకంటె సుకుమారమైన చేతితో తడవునపుడు, **(మలర్ పోదిన్)** పుష్పించిన పూవుకంటె ఎక్కువగా, (పరాదిరూపములో) **(శివన్దన)** ఎఱ్ఱబడినవి. పూర్వము పల్కిన మొఱటుపనులను చేసినవి అయినను శ్రీపాదముల సౌకుమార్యమునకు లోటు లేదని భావము. **(మఱు పిఱవి)** పునర్జన్మను, **(అఱు)** ఛేదించుచున్న, **(మునివర్)** ముముక్షువులగు మహర్షులయొక్క, **(మాలుక్కు)** వ్యామోహమునకు, **(ఇశైన్దన)** పొందికగానున్నవి. ఇది బ్రహ్మలోకములో బ్రహ్మచే ఆరాధింపబడునపుడు సనకాదిమునులు అనుభవించిన రీతిని సూచించుచున్నదనవచ్చును. సనకాదులకు ఈ జన్మ దీర్ఘముగా అగుటచే మఱుజన్మ లేదని భావము. పిమ్మట బ్రహ్మచే అనుగ్రహింపబడి, అయోధ్యానగరములో, **(మను ముఱైయిల్)** మనువు, ఆ పిమ్మట ఇక్ష్వాకువు అనెడి క్రమములో ఒక్కొక్క ప్రభువుచేతను ఆరాధ్యమై, **(వరువతు)** వచ్చుటకు అయిన, **(ఓర్)** సాటిలేని, **(విమానత్తు)** శ్రీరంగవిమానములో, **(ఉరైన్దన)** స్థిరముగా చేరివి. ఇందుచే శ్రీరాముని మాత్రమే చెప్పినట్లు కాదు. సామాన్యముగా అయోధ్యలోనుండుట తెలుపబడినది. ఇట్లు పరవ్యూహములందును, అర్చలోను సేవ్యమానములే సేవకవృత్తిలో ప్రవేశించినవి అనుచున్నారు. **(అఱ ముడైయ)** ధర్మమునే కలవాడై, గీతోపదేశానుసారము నడచుటచేతను, ఏనాడును అధర్మయుద్ధములో ప్రయత్నింపనివాడును అగు, **(విశయన్)** అర్జునుడు, **(అమర్)** అమరియున్న తేరులో సారధియైయున్నపుడు, **(తికఴ్న్దన)** ప్రకాశించినవి. ఇక విష్ణుత్వప్రదర్శనము చేయబడుచున్నది. **(అడల్)** పరాక్రమమునుకల, **(ఉరగమ్)** కాళియునియొక్క, **(పడమ్ మడియ)** పడగలను అన్నిటిని అణగిపోవునట్లు, **(ఆడి)** అద్భుతముగా నాట్యమును పడగలపై చేసి, **(కడిన్దన)** (అతని) గర్వమును పోగొట్టి శిక్షించినవి. లేక, ఆ మడుగునుండి తఱిమివేసినవి. కాళియుడు ఈ శ్రీపాదముల చిహ్నములను పొంది, శ్రీవైష్ణవలాంఛనమును కలవాడై, గరుడుడు మొదలగువారివలన భయము తీరినవాడగుటను భావించి అవైష్ణవమతములను దృష్టిలోనుంచుకొని ఇక పల్కుచున్నారు. సాంఖ్యము, యోగము, కాణాదము, బౌద్ధము, జైనము, పాశుపతము -అనెడి, వ్యాసుడు

ఖండించిన ఆఱు సిద్ధాంతములకు అందని, **(తానత్తు)** స్థానములో, **(అమర్న్దన)** స్థిరమైనవి. ఆ మతములు అంగీకరించిన భూమ్యాదులలో ఈశ్వరసంబంధము తెలియుటకు వీలు కానిదని భావము. లేక, వేదపాంచరాత్రములందు అమరియున్నవి-అనియును చెప్పవచ్చును. ఇచట అందఱికిని సులభముగా తెలిసికొనుటకు వీలుగానుండు చోటును తెలుపుచున్నారు. **(అణి)** లోకమునకే అలంకారమనదగిన, **(కురుకై నాదర్)** తిరుక్కురుకూరిలో అవతరించిన, **(మునివర్)** పరాంకుశముని, శఠారి అనబడు, నమ్మాళ్వార్ల, **(నావుక్కు)** జిహ్వాలోనుండి పుట్టిన సూక్తులకు, **(అమైన్దన)** పొందికగానున్నవి. **"తుయ రఱు శుడరడి, పరనడిమేల్ కురుకూర్, తిణ్ కళల్ శేర్, తిరునారణన్ తాళ్ కాలమ్ పెఱ, అడిక్కీళ్ అమర్న్దు పుకున్దేన్, తాళిణైక్కీళ్ కొళ్ళుమప్పన్"** అను రీతిలో, **"సంతప్తచరణం యథా"** అనునట్లును స్వామి శ్రీపాదములనే ప్రధానముగా నమ్మాళ్వార్లు భావించిరికదా! **(వెఱి అడైయ)** పరిమళమును కల్గిన, **(తుళవమ్ మలర్)** తులసీపుష్పములను, **(వీఱుక్కు)** ఈశ్వరత్వగౌరవము తోచునట్లు కృష్ణావతారమునందుకూడ, **(అణిన్దన)** అలంకారముగా గ్రహించినవి, **(విళ కరి)-** ఉత్తరాగర్భమునుండిపడిన నల్లని కాలిన కట్టెను, **(కుమరన్ ఎన)** సాటిలేని రాజకుమారుడు అని అందఱు గ్రహించునట్లు, **(మేవి)** భక్తులపట్ల అభిమానమును కల్గి, **(శిఱన్దన)** మహిమను పొందినవి. ఇది చివరలో చేసిన హితము. **(విఱల్)** క్రూరత్వమునుకల, **(అసురర్)** అసులరుగు మాలి, సుమాలి మొదలగువారి, **(పడై)** సేనను, **(అడైయ)** పూర్తిగా, **(వీయ)** నశించునట్లు, **(తుఱన్దన)** తఱిమికొట్టినవి. **(విడల్ అరియ)** ఎల్లప్పుడు విడుచుటకు సాధ్యము కాని, గొప్ప ఆశకు విషయమైన, **(పెరియపెరుమాళ్)** శ్రీరంగనాథుని యొక్క, **(మెన్ పదఙ్గళే)** సుకుమారములగు శ్రీపాదములే. పెరుమాళ్ అగు శ్రీరాముడు ఆరాధించుటచే శ్రీరంగనాథుడు పెరియపెరుమాళ్ అనబడుచున్నారు. వాల్మీకి అయోధ్యాకాండలో **"మహతే దైవతాయాజ్యం జుహావ జ్వలితేఽనలే"** అనుటచే ఈ పేరు పూర్వమునుండి ఉన్నది. **"మెయ్ ప్పదఙ్గళ్"** అనియే పఠించి, మృదువైన శ్రీపాదములని అర్థము చెప్పుదురు. వ్యాఖ్యకు తగినట్లు **"మెన్ పదఙ్గళ్"** అనియును కొందఱు గ్రహించిరి. **"మొయ్ ప్పదఙ్గళే"** అని యున్నచో **"మొయ్త్త"** -నిబిడమైన, మాంసళమైన, సుకుమారమైన- అని అనవచ్చును. బింబములో తిరుమేని ప్రవేశము సత్యము, నతసత్యుడగువాని పదమును సత్యము, **"తిణ్ కళల్"** అనునట్లు స్థిరమై, సత్యమై నిబిడములైనవి-అనియును భావము.



ఈ పాశురములో కృష్ణచరిత్ర ప్రస్తావింపబడినది. అందుచే **"మలర్మకళ్"** ఇత్యాదులు **"అఱముడైయ"** అను వాక్యమునకు శేషము. **"అఱు శమయమ్"** ఇత్యాదులు **"విళకరి"** అను వాక్యమునకు శేషము. ఇట్టి శ్రీపాదములు విష్ణువై, అసురులను పారదోలిన శ్రీరంగని శ్రీపాదములే-అని భావము. పాశురము మధ్యలో **"మను ముఱైయిల్"** అని పల్కినది అంతయు శ్రీరంగనాథుని విషయమే అని గ్రహించుటకు. ఈ క్రియలద్వారా పరత్వసౌలభ్యాదిగుణములను యథాయోగ్యముగా అనుసంధింపవచ్చును.

**మన సంప్రదాయములో అభినివేశమును పొందుట**

**52. మఱై యురైక్కుమ్ పొరుళెల్లా మెయ్యెన్నోర్వార్**
**మన్నియకూర్ మదియుడైయార్ వణ్కుణత్తిల్**
**కుఱై యురైక్క నినైవిల్లార్ కురుక్కడమ్ పా-**
**ల్కోదΘO మనమ్ పెΘOర్ కొళ్వార్ నన్మై**
**శిఱై వళర్క్కుమ్ శిలమాన్దర్ శఙ్కేతత్తా**
**ల్చిదైయాద తిణ్మదియోర్ తెరిన్దదోరార్**
**పొఱైనిలత్తిన్ మికుమ్ పునితర్కాట్టు మెఙ్గళ్**
**పొన్నాద నన్నెఱియి ల్పుకుదువారే**

మఱై ఉరైక్కుమ్ పొరుళ్ ఎల్లామ్ = వేదములో తెలుపబడిన అర్థము లన్నియు, మెయ్ ఎన్ఱు ఓర్వార్ = సత్యమని నిశ్చయించు ఆస్తికులుగా, మన్నియ కూర్ మదియుడైయార్ = దృఢమైన, పదునైన బుద్ధిని కలవారుగా, వణ్ కుణత్తిల్ = (ఇతరుల) గొప్ప గుణములయందు, కుఱై ఉరైక్క నినైవు ఇల్లార్ = కొఱతను పలుకునట్టి భావమును లేనివారుగా, కురుక్కళ్ తమ్పాల్ = ఆచార్యులవద్ద, కోదు అΘO మనమ్ పెΘOర్ = దోషములేని మనస్సును కలవారుగా, నన్మై కొళ్వార్ = సద్విషయములనే గ్రహించువారుగా, శిఱై వళర్క్కుమ్ శిల మాన్దర్ శఙ్కేతత్తాల్ = చెఱవంటి సంసారమును వృద్ధిచేయువారగు కొందఱు (సామాన్య) మానవుల సంకేతములచే, శిదైయాద తిణ్ మదియోర్ = చెదఱని, బలమైన మనస్సును కలవారుగా, తెళిన్దదు ఓరార్ = (సాధారణమై లోకములో) కనుపించు అల్పఫలములయందు మనస్సును లేనివారుగాగల అధికారులు, నిలత్తిల్ పొఱై మికుమ్= భూమికంటె ఎక్కువ క్షమను కల, పునితర్ కాట్టుమ్ = పరిశుద్ధులగు ఆచార్యులచే చూపబడు, ఎఙ్గళ్ పొన్నాద నల్ నెఱియిల్ = మా, అనశ్వరమైన సన్మార్గములో, పుకుదువార్ = (అభినివేశమునుపొంది) అన్వయింతురు.

వేదార్థములలో మిక్కిలి నమ్మకమునుకల ఆస్తికులు, సూక్ష్మబుద్ధిని కలవారు, ఇతరుల పట్ల అసూయను లేనివారు, ఆచార్యులవద్ద సంప్రదాయమును ఉపదేశముగా పొందినవారు, సారములైన విషయములను గ్రహించువారును, సంసారమున అభినివేశమునుకల పామరుల సంకేతములకు వశము కానివారు, అల్పఫలములయందు ఆసక్తిని లేనివారును అగు అధికారులు పరమసాత్త్వికులైన మన ఆచార్యులచే చూపబడిన సన్మార్గములో నడచి, ఉజ్జీవింతురు. కావున ఏ విధముగానైనను మన సంప్రదాయము నిరాఘాటముగా, శాశ్వతముగా వర్ధిల్లును. **"ఆస్తిక్యాన్ నిశితబుద్ధి రనభ్యసూయః సత్సంప్రదాయపరిశుద్ధమనాః సదర్థీ, సంకేతభీతిరహితః సతృణేష్వసక్తః సద్వర్తనీ మనువిధాస్యతి శాశ్వతీం నః"** అను శ్లోకార్థమిచట భావ్యము.

ఈ పాశుర ఛందస్సు - ఎణ్‌శీర్ ఆశిరియ విరుత్తము

**ఉత్తమూర్:-** నిగమనాధికారము చివరలో **"ఆస్తిక్యాన్ నిశితబుద్ధి రనభ్యసూయః"** అను శ్లోకము యొక్క అర్థమును ఈ పాశురముద్వారా తెలుపుచున్నారు. **"ఎజ్జళ్ ఎన్నుమ్ పుకుదువారే"** అనియుండుటచే ఇదియును శ్లోకమువలె సత్సంప్రదాయవంశమున జన్మింపనివారును ఇందులో తామే చేరుదురని తెలుపుటకు రచింపబడినదని తెలియుచున్నది. వేదములచే వివరింపబడిన అపూర్వార్థములన్నిటిని సత్యములని నిశ్చయించుకొన్నవారై, ఆస్తిక్యబుద్ధిని కలవారై-అని భావము. **(మన్నియ)** స్థిరమైన, కుతర్కములచే చలింపని, నిశితమైనబుద్ధిని కలవారై, **(వణ్ కుణత్తిల్)** ఇతరుల సద్గుణములలో, **(కుత్తై ఉరైక్క)** దోషమును పలుకవలెనను, **(నినైవు ఇల్లార్)** తలపు లేనివారై. ఇతరుల గుణములను దోషములుగా తలచుట అసూయ. అది లేనివారని భావము. ఇతరుల గుణములను సహింపలేకపోవుటయును అసూయయే అగును. దానికి మించిన స్థితి అభ్యసూయ. **(కురుక్కళ్ తమ్‌పాల్)** సదాచార్యులవద్ద. **''సత్సంప్రదాయపరిశుద్ధమనాః''** అనునది ఇచట చెప్పవలసియుండుటచే ఆచార్యులవద్దనుండి వారి మూలమున-అని దీనికి అర్థము. **"కురుక్కళ్‌తమ్మాల్"** అనియే పాఠము కావచ్చును. **(నన్మై కొళ్ వార్)** సద్విషయములను అన్వేషించి గ్రహించువారై, ఇది **"సదర్థీ"** అను ప్రయోగముయొక్క భావము. ఇక, **"సంకేతభీతిరహితః"** అను దానిని వివరించుచున్నారు. **(శిత్తై వళర్‌క్కుమ్)** క్షుద్రఫలము అనెడి కారాగారస్థితిని వృద్ధి చేయుచున్న, **(శిల మాన్దర్)** కొందఱు మానవుల, **(సజ్కేతత్తాల్)** కట్టుబాటు కారణముగా, కొందఱు, **(శిదైయాద)** చెడని, **(తిణ్)** దృఢమైన, **(మదియోర్)** బుద్ధిని కలవారై. ఆ



విధమైన కట్టుబాటుకు లొంగినచో సంసారమే వృద్ధి చెందునని భావము. **"తెరిన్దదు ఓరార్"** అనుటకు **"సతృణేష్వసక్తః"** అనుటకు క్షుద్రమని తెలిసిన పురుషార్థములో మనస్సును నిలుపనివారని భావము. లేక, **(తెరిన్దు అదు ఓరార్)** కట్టుబాటుకు లోనైనచో, అదు చెఱ అని తెలిసి, ఆ క్షుద్రఫలములో మనస్సును పెట్టనివారు. దీనికి **"పుకుదువారే"** అను దానితో అన్వయము. **"తెరిన్ద దోర్‌వార్"** అని పాఠమైనచో తెలిసి, మంచిని వివేకించి, దానిని **"ఓర్‌వార్"** -ఆదరించువారు అని ఒక విధముగా అర్థమును చెప్పవచ్చును. అపుడు **"సతృణేష్వసక్తః"** అను ప్రయోగముయొక్క అర్థము ప్రకాశింపదు. **(పొఱై)** క్షమలో, **(నిలత్తిన్)** భూమికంటెను, **(మికుమ్)** గొప్పవారైన, **(పునిదర్)** పరిశుద్ధులగు ఆచార్యులచే, భూమి కంటెను **"మికుమ్ పొఱై"** -అధికమైన క్షమను కలవారనియు కొందఱు వివరింతురు. **(పొఱ నిలత్తిల్)** క్షమలో చివరిదశలో గొప్పవారైన పవిత్రులు-అని ప్రాచీన వ్యాఖ్యలు. **(కాట్టుమ్)** చూపబడిన, **(పొన్రాద)** నశింపని, **(నల్)** మంచిదగు, **(ఎజ్గళ్ నెఱియిల్)** ఈ రహస్యత్రయసారమార్గములో, **(పుకుదువారే)** ప్రవేశించుట నిశ్చయమని భావము. ప్రవేశింపనివారికి పూర్వము పల్కిన ఆకారములలో కొన్ని లేవు-అని గ్రహింపవలెను. ఈ సంప్రదాయవంశములో తప్ప వేఱెచటనైన జన్మించివారును ఈ గుణములను పొందిన పిదప ఇందు ప్రవేశించి, **"గోపాయతి స్వమ్"** అనునట్లు తమను కాపాడుకొందురనియు భావము. ఇచట క్షమనుగూర్చి ఎందులకు చెప్పవలెను? అనగా, చెఱను వృద్ధిచేయు కొందఱు మందబుద్ధుల కట్టుబాట్లే భూమిలో ప్రబలములైనను, దాని విషయములో మనకు క్షమ ముఖ్యము. అట్లు సహించినవాడు భూమిని ఏలగలడు. అది (క్షమ) వివేకమును కల్గి, వారికివారే వచ్చిచేరునట్లు చేయునని భావము.

**ఈ ప్రబంధములో తెలుపబడిన మార్గమే గొప్పది**

**53.** **ఇదు వழி యిన్నముదెన్ఱవరిన్ పులన్ వేఱిడువార్**
**ఇదువழியా మలవెన్ఱఱివారెజ్గదేశికరే**
**యిదు వழி యెయ్‌దుక వెన్ఱుకప్పా లెమ్బిழைపొఱుప్పార్**
**ఇదు వழியా మఱైయోరరుళాల్ యా మిశైన్దనమే**

ఇన్ పులన్ = (లోకులచే) తీయనైనవిగా భావింపబడు అల్పవిషయములను, వేఱు ఇడువార్ = (మనకు తగవు అని) వేఱుగా విడదీసి చూపువారును, ఇదు వழியామ్= (ఉపాయానుష్ఠానముచే కల్గిన) ఈ భగవత్కృపయే మోక్షమునకు ముఖ్యమైన ఉపాయము, అల ఎన్ఱు అఱివార్=(మిగిలినవి ముఖ్యోపాయములు) కావు అని తెలియువారును అగు,

ఎజ్గళ్ దేశికరే= మా ఆచార్యులే, ఇదు వఴి = ఇందు తెలుపబడిన ప్రపత్తి మార్గమును, ఎయ్దుక ఎన్ఱు = స్థిరముగా అనుసరింపుడు అని (తలచి), ఉకప్పాల్ = (లోకమునకు ఉపదేశించుటలోని) సంతోషముతో, ఎమ్ పిఴై పొఱుప్పార్ = మా అపరాధములను సహించువారై, ఇదు వఴి = ఈ ప్రబంధములో తెలుపబడిన మార్గమే, ఇన్ అముదు ఎన్ఱవర్ = తీయని అమృతమువంటిది–అని ఉపదేశించువారు అగుదురు, (అందుచే) మఱైయోర్ అరుళాల్ = వైదికులగు ఆచార్యుల కృపచే, ఇదు వఴియా = (వారుచూపిన)ఈ మార్గమునే సన్మార్గముగా, యామ్ ఇశైన్దనమ్ = మేము అంగీకరించితిమి.

మన ఆచార్యులు లోకులచే భోగ్యముగా తలపబడు అల్పవిషయములను తమ స్వరూపమునకు తగినవి కావు అని వానిని నిషేధించి, ఉపాయమును అనుష్ఠించుటచే కలుగు భగవత్కృపయే మోక్షమునకు ముఖ్యకారణము అని, వేఱేదియు కాదని స్థిరముగా తలచి, మేము ఇపుడు ఈ ప్రబంధములో వివరించి తెలిపిన ప్రపత్తిమార్గము శాశ్వతముగా అనుసరింపవలెనని అభిప్రాయపడి, మనలను ఉజ్జీవింపజేయుటలోగల గొప్ప అభినివేశమువలన మనపట్లగల దోషములను సహించి, మనకు ఈ ప్రపత్తిమార్గమునే తీయని అమృతముగా ఉపదేశించిరి. మనము ఈ ప్రపత్తిమార్గమునే గ్రహించితిమి.

**ఉత్తమూర్:–** ఈ గ్రంథములో అన్ని విషయములను వివేచనము చేసి, విస్తృతముగా వివరించుటచే పరిశీలించువారు చక్కగా తెలిసికొని, ఈ సంప్రదాయమున ప్రవేశించి సంసార కారాగృహమునుండి విడివడి, ప్రకాశింతురనుచున్నారే. అయినను పూర్వాచార్యులు రహస్యార్థములను మఱగుపఱచి, కాపాడినట్లు తెలియుచున్నది. భగవద్రామానుజులును శ్రీగీతాభాష్యములోని చరమశ్లోకవ్యాఖ్యలో వ్యక్తము చేయకపోవుటయేగాక, గద్యలోకూడ **"శరణం ప్రపద్యే"** అనుచు శరణాగతిని చేయునపుడుకూడ అంగపంచకాదులను వివరింపలేదు. అందుచే ఇట్లు మీరు వ్యక్తము చేయుట దోషమా? అను ప్రశ్నకు సమాధానమును ఇందు అనుగ్రహించుచున్నారు.

**(ఇదు వఴి)** వేదములో విధింపబడిన బ్రహ్మజ్ఞానాదులే, **(ఇన్ అముదు)** మోక్షసాధనమగుటచేతను, భోగ్యమైయుండుటచేతను, ఆత్మను నశింపకుండునట్లు చేయుటచేతను తీయని అమృతమగును. **(ఎన్ఱవర్)** అని పలికినవారు, **(ఇన్ పులన్ వేఱు ఇడువార్)** తీయగా తోచు విషయములను వేఱుగా నుంచువారు. అమృతమునకు సాధనములు కావు అని, అమృతముకంటె వేఱయిన విషమగుననియును. లేక, **"విషస్య విషయాణాం చ దూర మత్యంత మంతరమ్"** అనునట్లు విషము భుజించినవానిని చంపును. విషయము



భావించినవానినికూడ చంపును. విషమువలన దేహనాశము. విషయమువలన ఆత్మనాశము అనుచు నిషేధించువారును–అని భావము. ఇచట కైవల్యమునుకూడ గ్రహింపనగును. **"ఇన్నముదు"**–తీయని మోక్షసాధనమనుటచే మధురము కాని కైవల్యము అముఖ్యమైన మోక్షమని తెలుపబడినది. **(ఇదు వఴియామ్)** ప్రమాణములలో మోక్షసాధనముగా తోచు పెక్కింటిలో భక్తి ప్రపత్తులే సాక్షాదుపాయములు. **(ఇదు వఴి అల)** అవికాక కర్మయోగము, జ్ఞానయోగము, శ్రవణము, మననము, నామసంకీర్తనము, క్షేత్రవాసము, పురుషోత్తమత్వజ్ఞానము, ద్వయోచ్చారణ మాత్రము, ఆత్మసమర్పణమాత్రము, మహావిశ్వాసము, అనివారణ మాత్రము, స్వప్రవృత్తి నివృత్తి అను రీతిలో నివి అన్నియును సాక్షాన్మార్గములు కావు, **(ఎన్ఱు అఱివార్)** అని తెలిసినవారగు, **(ఎజ్గళ్ దేశికరే)** మా ఆచార్యపరంపరలో నున్నవారే. ఇచట వాక్యము ముగింపకుండ **"పొఱుప్పార్"** అను క్రియతో అన్వయింపనగును. **(ఇదు వఴి** సపరికరసాంగభరన్యాస అనుష్ఠానమనెడి మార్గము, **(ఎయ్దుక)** నిజమైన హితమును తెలిసి, ఉజ్జీవింపవలెననెడి శ్రద్ధను కలవారందఱును గ్రహించునట్లు దీర్ఘమైయుండవలెను, **(ఎన్ఱు ఉకప్పాల్)** అని తలచి, మనము చేసిన దానిని చూచి సంతోషించుటచే, **(ఎమ్ పిఴై)** రహస్యార్థస్పష్ట ప్రకాశనమనెడి దోషమును, **(పొఱుప్పార్)** సహింతురు. భగవద్రామానుజులు రహస్యమగు సిద్ధాంతార్థమును వేదాంతసూత్రగీతాదులకు వ్యాఖ్యానమును చేసి ఇతరులు గమనించునట్లు స్పష్టపఱచిరి. తాము అనుష్ఠించిన ప్రపత్తియే అందఱును తెలియునట్లు ప్రకాశింపజేయు గద్యమును అనుగ్రహించిరి. రహస్యము శిష్యులందఱు తెలియునట్లు అంతట వ్యాపించిన సదస్యమైనది. అయినను ఉపదేశించువారు ఇది రహస్యమను భావనయు ప్రవర్తించుటచే కొన్ని అంశములను పల్కుట, కొన్నిటిని మఱగుపఱచుటయై అరకొఱగా చేసిరి. అందుచే వైశ్వానరవిద్యను తెలిసికొనవలెనని కేకయరాజువద్దకు పోయిన పలువురు ఋషులవంటివారయ్యిరి. ఇట్లు శాస్త్రార్థవిశ్వాసమును కలవారుకూడ చెడిపోవుచున్నవారే–అని విష్ణుచిత్తవరదాచార్య, వాదిహంసాంబువరదాచార్యులు సంగ్రహించి, ప్రకాశింపజేసిరి. అందుచే దీనిని వివరించితిమి. మేముమాత్రమే ప్రయత్నించలేదు అనుచు నాల్గవపాదములో అనుగ్రహించుచున్నారు. **(మఱైయవర్ అరుళాల్)** వేదవిత్తులగు ఆచార్యుల అనుగ్రహమును పురస్కరించుకొని, **(ఇదు వఴి ఆమ్)** ఆ సాంగప్రపత్త్యనుష్ఠానమే లోకము ఆదరించు ఉపాయమగుట కొఱకు, **"సంగృహీతం రహస్యైః"** ఆ గ్రంథము రచించుటయును ఒక మార్గమే. **(ఇశైన్దనమ్)** అంగీకరించితిమి. పెద్దలు ప్రవర్తించి, స్పష్టపఱచినదారిలో పడిన

కంటకములను ఆవలికి పారవేసి సన్మార్గశోధనము చేయుట సదుపదేశమును పొంది నడుచువారి మంచి కొఱకే. కావున దోషముగా గ్రహింపరాదని భావము.

**చరమశ్లోకమువలన దుఃఖనివృత్తి అగుట**

**54. ఎట్టు మిరణ్డు మఱియాద వెమ్మై యివై యఱివిత్తు**
**ఎట్టవొణ్ణాద విడన్తరు మెజ్గళ మ్మాదవనార్**
**ముట్ట వినైత్తిరళ్ మాళ ముయన్ఱిడు మఞ్జలెన్హార్**
**కట్టెழில్ వాశకత్తా ల్కలజ్గానిలై పెఱ్ఱనమే**

ఎట్టుమ్ ఇరణ్డుమ్ అఱియాద ఎమ్మై = ఎనిమిది, రెండు (కలిసి పది) అని తెలియని అజ్ఞానులమగు మాకు, (లేక) అష్టాక్షరిని, ద్వయమును, తెలియని మాకు, ఇవై అఱివిత్తు = (ఆచార్యమూలమున) ఈ రహస్యార్థములను ఉపదేశించి, ఎట్ట వొణ్ణాద ఇడమ్ తరుమ్ = (ఉపాయమును అనుష్ఠింపక) పొందుటకు వీలులేని స్థలమగు పరమపదమును అనుగ్రహించు, ఎజ్గళ్ అమ్ మాదవనార్ = మా ఆ (కృష్ణునిగా అవతరించిన) మాధవుడు, ముట్ట వినైత్తిరళ్ మాళ = "కర్మసమూహము మొత్తము నశించిపోవునట్లు, ముయన్ఱిడుమ్ = (ప్రపత్తిలో) ప్రయత్నము చేయుడు, అఞ్జల్ ఎన్హార్ = భయపడకుడు" అని పల్కిరి. కట్టు ఎழில் వాశకత్తాల్ = (వారి) బలమైన, అందమైన ఆ చరమశ్లోకముచే, కలజ్గా నిలై పెఱ్ఱనమ్ = క్లేశము తీరిన దశను పొందితిమి.

రహస్యార్థములను తెలిసికొనలేని మనము ఎనిమిది, రెండు కలసినచో పది అగును అని చెప్పలేని స్థితిలో నుండుటచే భగవద్భక్తియొక్క గొప్పతనమును తెలిసి కొనలేకున్నాము. శ్రీమన్నారాయణుడు మనకు ఆచార్యముఖముగా రహస్యార్థమును ఉపదేశించి, శ్రీ వైకుంఠమును అనుగ్రహించుటకు ముందుకు వచ్చుచున్నాడు. అతడు పూర్వము చరమశ్లోకములో "మీ కర్మలన్నియు పోవుటకు ప్రపత్తిని అనుష్ఠించి, భయము తీరియుందురుగాక'' అని ఉపదేశించుటను తలచి, నమ్మకముతో దు:ఖము తీరియున్నాము.

**"ఎట్టు.ఇరణ్డుమ్ = పత్తు"** – అనగా పది, పత్తు అను పదము భక్తిని తెల్పును. **"పత్తుడై యడియవర్క్కు", "ఎట్టినోడిరణ్డుమ్"** ఇత్యాది దివ్యసూరి యోగములు గమనింపనగును. కావున భక్తిని తెలియని–అను అర్థము లక్షితలక్షణప్రక్రియలో (ద్విరేఫమనురీతిలో) తెలుపబడినదను అర్థమునుకూడ చెప్పవచ్చును. లేక, **"ఎట్టు**



**మిరణ్డుమ్"** అను పదములు ఎనిమిదిసంఖ్యలో అక్షరములనుకల అష్టాక్షరిని, రెండుఖండములను కల్గియుండుటచే ద్వయమనబడు ద్వయమంత్రమును లక్షించుచున్న వదనగును. అపుడు ఈ రెండును **"ఆకుపెయర్"** (లక్షకపదములు).

**ఉత్తమూర్:–** **(ఎట్టుమ్)** ఎనిమిది అక్షరములనుకల మూలమంత్రమును, **(ఇరణ్డుమ్)** ద్వయమును, **(అఱియాద)** తెలియకుండనున్న, **(ఎమ్మై)** సంసారులమగు మనలను, **(ఇవై)** వీనిని, **(అఱివిత్తు)** అథర్వనారాయణము మొదలగువానిని మొదట ఉపదేశించుద్వారా తెలియజేసి, ఇందులకు ఫలమును తెలుపుచున్నారు. **(ఎట్ట వొణ్ణాద)** ఉపాయానుష్ఠానము చేయనివారికి దఱి చేరుటకు వీలుకాని, **(ఇడమ్)** పరమపదమును, **(తరుమ్)** ఇచ్చుచున్న, **(ఎజ్గళ్ మాదవనార్)** మన శ్రియఃపతి అనెడి–అని భావము. ఇంతవరకు గీతోపదేశమునకు ముందుగానే అతడు చేసిన ఉపకారము. **"ఎట్టు మిరణ్డుమ్"** అనునపుడు **"ఇరణ్డుమ్"** అనుటచే ద్వయము, చరమశ్లోకము అనెడి రెండింటిని గ్రహింపనక్కఱలేదు. చరమశ్లోకమును పైన తెలుపుచున్నారుకదా! **"ఎట్టుమ్, ఇరణ్డుమ్ పత్తాయ్"** (ఎనిమిది రెండును కలిసి పదియై) **"పత్తు"** అను పదము (తిరుమழிశై యాழ்వార్ల పాశురములో గ్రహించినరీతిలో) భక్తిని తెలుపును. భక్తిని అనుష్ఠించుటకు సాధ్యముకాని మనలను–అనియును వివరింపవచ్చును. **"ఎట్టుమ్"** అష్టాంగయోగమనెడి పరమభక్తిని, **"ఇరణ్డుమ్"** పరజ్ఞానపరమభక్తులను, **"అఱియాద"** తెలియని–అనియును చెప్పవచ్చును. ''ఎట్టు''–అపహతపాప్మత్వాది ఎనిమిది ఆత్మగుణములు, **"ఇరణ్డు"**–జ్ఞానము, శక్తి అనెడి రెండు. భగవానునకు అసాధారణములగు స్వాతంత్ర్యము, కారుణ్యము అనెడి రెండు. సిద్ధోపాయము, సాధ్యోపాయము, సిద్ధప్రాప్యము, సాధ్యప్రాప్యము–అనునవి అన్నియును– అనియు అర్థము. అట్లే, **"ఎట్టు మామూర్త్తి"** వంటి పొసగునట్టి పలు అష్టసంఖ్యతో కూడిన వానినికూడ గ్రహింవపచ్చును. **"ఎట్టు మిరణ్డుమ్"**–పొందుటకు సులభమైన మూలమంత్రమును, ద్వయమును, **"అఱియాద"** తెలియని అని, పైన గల **"ఎట్ట వొణ్ణాద"** అను ప్రయోగమునకు అనుగుణముగా వివరింపవచ్చును. ఎనిమిది,రెండు కలిసి పది అనెడి చిన్న కూడికనుకూడ తెలియని మనలను అనునది ఇచట చాటువగు అర్థము. **"ఇవై"** అనుటద్వారా ముందుపాశురములో చెప్పినవి గ్రాహ్యములు. ఇట్లు అనుగ్రహించు, **(మాదవనార్)** శ్రియఃపతియై, సంచిత–ప్రారబ్ధ పుణ్యపాపవర్గములు అంతయును, **(మాళ)** నా ప్రసాదముతో నశింపజేయుటకు, **(ముయన్ఱిడుమ్)** ప్రపత్తినిచేయుటకు మీరు ప్రయత్నింపవలెను **(అఞ్జల్)** భయపడవద్దు, **(ఎన్హార్)** అని అనుగ్రహించిన, **(మాదవనార్)** మధువంశమనెడి

యాదవవంశములో అవతరించిన శ్రీకృష్ణుడు, **(కట్టు ఎఱిల్ వాశకత్తాల్)** అర్థపుష్టిని, శబ్దసౌష్ఠవమును కల్గినదై ప్రకాశించు చరమశ్లోకముతో, **(కలఙ్గా నిలై) "మా శుచః"** అనుటచే కలతలేని స్థితిని, **(పెఱ్ఱనమ్)** పొందితిమి. అనాదియైన అష్టాక్షరిని, ద్వయమునుగొని మోక్షము నిచ్చునట్టి శ్రియఃపతి గురూపాయోపదేశములను విని, భ్రమించి, బాధపడు అర్జునుని ఉద్దేశించి, సంచితముతో ప్రారబ్ధమునుకూడ చేర్చి పోగొట్టు ప్రపత్తి అనెడి లఘూపాయమును ఉపదేశించుటకై చెప్పిన శ్లోకము, గురూపాయములను గురూపాయములను అన్నిటిని విడువవచ్చునని స్పష్టముగా చెప్పుటచేతను, ప్రపత్తిని కర్తవ్యముగా విధించుటచేతను ఇందుచే అన్ని పాపములును పోవునని చక్కగా ఫలమును వివరించి, **"మా శుచః"** అని ముగించుటచేతను అష్టాక్షరితో తత్త్వజ్ఞానమును కలవానికి ద్వయముతో ప్రపత్తిని అనుష్ఠించుటలో తీవ్రమైన రుచిని కల్గించుటచేతను ఈ చరమశ్లోకము మహోపకారమైనదని తాత్పర్యము.

**"ఎజ్గళ్ మాదవనార్"** అనునపుడు **"ఎజ్గళ్ అమ్మాదవనార్"** అనియును పఠింతురు. అపుడు కృష్ణావతారమునకు ముందుగల మాధవుడు-అని అర్థము. మాధవుడనెడి, భయము లేదని పల్కిన వానియొక్క వాక్కుతో **"మాదవనారాకియ అజ్ఞలెన్నారుదైయ వాశకత్తాల్"** అని ఒకే వాక్యముగా చేయవచ్చును. పూర్వము తెల్పిన పాశుములతో రహస్యత్రయమును తెలియుట ఈ గ్రంథముయొక్క కార్యమని ఇంతవరకు తెలిపినట్లయినది.

**ఈ గ్రంథమువలన గొప్ప నిష్ఠను పొందుట**

**55.** **వానుళమర్న్దవరుక్కుమ్ వరున్ద వరు నిలైకళ్**
**తానుళనా యుకక్కు న్తర మిఙ్గు నమక్కుళదే**
**కూనుళ నెఞ్జుకళా ఱ్కుఱ్ఱ మెణ్ణి యికళ్న్దిడినుమ్**
**తేనుళ పాదమలర్ త్తిరుమాలుక్కు త్తిత్తిక్కుమే**

వానుళ్ అమర్న్దవరుక్కుమ్ = స్వర్గములోనున్న ఇంద్రాదులకు, (లేక) పరమ పదములోనున్న నిత్యసూరులకుకూడ, వరున్ద వరుమ్ = మిక్కిలి ప్రయాసతో లభించు, నిలైకళ్ తాన్ ఉళనాయ్ = (ఈ ప్రబంధములో తెలుపబడిన) నిష్ఠలు తనయందు కలవారమై, ఉకక్కుమ్ తరమ్ = (ఈ నిష్ఠను కలవారిని చూచి) అనందించు గొప్పతనము, ఇఙ్గు నమక్కు ఉళదే = ఈ సంసారములో మనకు కల్గినదే! (ఏమి మన భాగ్యము!), కూన్ ఉళ నెఞ్జుకళాల్ = గూనిని కల (వక్రమైన) మనస్సుచే, కుఱ్ఱమ్ ఎణ్ణి



ఇకళ్న్దిడినుమ్ = (కొందఱు ఈ గ్రంథములో, దీనిని వ్రాసిన నాపట్ల) దోషము కలదని తలచి, ఈసడించుకొన్నను (దూషించినను), తేన్ ఉళ పాద మలర్ = మధువు (తేనె) నిండిన పాద పద్మములను కలవాడగు, తిరుమాలుక్కు తిత్తిక్కుమ్ = భగవానునకు మిక్కిలి భోగ్యమైయుండును. (ఆనందమును కల్గించును)

ఈ ప్రబంధములో తెలుపబడిన నిష్ఠలు ఇంద్రుడు మొదలగు దేవతలకు, నిత్యసూరులకును సులభముగా పొందుటకు వీలుకానివి. ఆచార్యకటాక్షమువలన ఈ నిష్ఠలు కల్గుట, వీనిని కలవారిని చూచి ఆనందించుటయు ఈ కర్మభూమిలో మనకు లభించినదికదా! ఏమి మన భాగ్యము! ఇక, వక్రబుద్ధినికల కొందఱు ఈ ప్రబంధములో, దీనిని వ్రాసిన మాపట్లకూడ దోషము కలదని తలచి, ఈసడించుకొన్నను భగవానుని చిత్తమునకు ఈ ప్రబంధము మిక్కిలి భోగ్యముగానే యుండును. కావున మాకు ఏవిధమైన చింతయును లేదు.

గణము అధికమగును కావున **"వరుమిన్నిలైకళ్"** అను పాఠాంతరము ఆదరణీయముకాదు. ఇచటి ఛందస్సు కట్టళైక్కలిత్తుఱై.

**ఉత్తమూర్:-** ఇకపై, రెండు పాశురములతో భగవానుని ప్రీతిని, ఇందులకగు స్థితులను మనము పొందుటయే దీని పరమోద్దేశ్యమనుచు ఉపసంహరించుచున్నారు.

**(వాన్ ఉళ్)** స్వర్గములో, **(అమర్న్ద వరుక్కుమ్)** స్థిరముగానున్న బ్రహ్మ-రుద్ర -ఇంద్రాదులకును, (పరమపదములోనున్న నిత్యసూరులకును) **(వరున్ద)** మిక్కిలి ప్రయాసను పొందిన పిదపనే, **(వరుమ్)** పొందదగిన స్థితులను, **(తా నుళనాయ్)** మనలో ఒక్కొక్కరును ఇచట తెలుపబడిన పరమైకాంతి నిష్ఠలను తనయందు కలవారమై, **(ఉకక్కుమ్ తరమ్)** ఇతరులవద్దకూడ వానిని చూచి, అసూయుపడకుండ సంతోషపడుట-అనెడి గౌరవము, **(ఇఙ్గు)** ఇచట ప్రకృతి మండలములోకూడ, **(నమక్కు ఉళతు)** మనకు కల్గునట్లు గ్రంథము కూర్చబడినది. **(ఏ)** ఇది ఆశ్చర్యసూచకము. ఇచట **"వానుళ్"** అను ప్రాససుభగత్వము కొఱకు **"తానుళనాయ్"** అని ప్రయోగింపబడినది. అందుచే **"తా ముళనాయ్"** అని ప్రయోగించలేదు, వారు వారు ప్రత్యేకముగా దర్శించుటయే తప్ప, తనకున్నది ఇతరులకు చెప్పి ఆత్మప్రశస్తిని చేసికొనుటలేదని దీనివలన వ్యక్తమగును. **"ఉళదే"** అనుటకు **"ఉళదో ఎన్ఱు కవనియుజ్గోళ్"** (ఉన్నదా అని గమనించుడు) అనియును వివరింపవచ్చును. కార్పణ్యము, అనన్యగతిత్వము, మోక్షమును పొందవలెనను తీవ్రమైన కోరిక, స్వనిష్ఠాభిజ్ఞానాధికారములో పల్కిన నిష్ఠలును వివేకులగు

సనకాదులకును కల్గుట అరుదైయుండగా, మనకు లభించుట సులభము కాదు. ఈ గ్రంథములో తెల్పిన రీతిలో ప్రవర్తించువారిలో ఒక్కొక్కరికిని ఈ స్థితి కల్గుట మొదటి ఫలము. **(కూనున్ ఉళ)** వక్రమైన, **(నెఞ్జుకళాల్)** తమ మనస్సులతో ఇచట **"ఆల్"** అనుటను **"అశై"** గా విడదీసినచో **"నెఞ్జుకళ్"** అనునది **"ఇకఴ్వదు"** అను క్రియకు కర్త కావచ్చును. **(కుఱ్ఱమ్ ఎణ్ణి)** మన వద్దను, మన గ్రంథమునందునుగల దోషములను తామే తలచి, **(ఇకఴ్న్దిడినుమ్)** నిందించినను, **(ఉళదే)** అని ప్రత్యేకవాక్యము. లేక, పూర్వపాదము ఇంతటితో ఏకవాక్యమై , మనకు గొప్పతనముండుటయే దోషముగా తలచి నిందించినను-అనియు వివరింపవచ్చును. వక్రతను కల మనస్సులకు ఆనందించు ప్రసక్తి లేకున్నను-అని అన్నట్లయినది. **(తేన్ ఉళ) "తవామృతస్యందిని పాదపంకజే"** అనునట్లు మోక్షానందమనెడి మధుప్రవాహమును ప్రవహించు శ్రీపాదములను కలవాడగు, **(తిరుమాలుక్కు)** శ్రియఃపతికి, **(తిత్తిక్కుమే)** పూర్వము తెల్పిన గౌరవము, అందులకు కారణమైన ఈ గ్రంథమును లక్ష్మికిని, భగవానునకును భోగ్యమైయుండునని భావము. శ్రియఃపతి శ్రీపాదములనుండి వెలువడు మధుప్రవాహమును ఆస్వాదింపవలెనని భక్తులు ఆసక్తిని కల్గియుందురు. భగవానుడును దాని భోగ్యతను తెలిసికొనుటకొఱకే వటపత్రశాయియై, ఏకాంతములో పదారవిందమును ముఖారవిందములో పెట్టుకొనుచున్నాడని చమత్కారపూర్వకముగా పెద్దలు పల్కుదురు. అట్టి మధుప్రవాహములో ఆశపడునట్లు చేయునది ఈ గ్రంథమనెడి కారణముతో ఇది అతనికి మిక్కిలి భోగ్యమైయుండును.

**శ్రీ హయగ్రీవస్వామి ఆచార్యుడై ఉపదేశించుట**

**56.** **వెళ్ళై ప్పరిముకర్ దేశికరాయ్ విరకాలడియో**
**ముళ్ళత్తెఴుదియ దోలైయిలిట్టనమ్ యా మిదఱ్కెన్**
**కొళ్ళత్తుణియిను జ్కోదెన్నికఱ్ఱిను జ్కూర్మదియీర్**
**ఎళ్ళత్తనై యుకవాదికఴాదెమ్మెఱ్ఱిన్ మదియే**

వెళ్ళై ప్పరి ముకర్ = తెల్లని అశ్వమువంటి ముఖమును కల్గిన శ్రీ హయగ్రీవుడు, దేశికర్ ఆయ్ = ఆచార్యుడై అవతరించి, విరకాల్ = ఉపదేశమను సాధనముతో (ఉపాయముతో) (గంటముతో), అడియోమ్ ఉళ్ళత్తు ఎఴుదియదు = దాసులమగు. మా మనస్సున వ్రాసిన విషయమును, యామ్ ఓలైయిల్ ఇట్టనమ్ = మేము తాటియాకుపై వ్రాసితిమి, ఇదఱ్కు ఎన్ = (అందుచే) ఈ గ్రంథమునకు ఏమి దోషము? కూర్ మదియీర్ = పదునైన బుద్ధిని కలవారలారా! కొళ్ళ త్తుణియినుమ్ = (ఈ గ్రంథములోని గొప్పతనమును మీరు) అంగీకరింప సిద్ధపడినను, ఎమ్ ఎఱ్ఱిల్ మది= మా స్థిరమైన అందమైన మనస్సు, ఎళ్ అత్తనై ఉకవాదు = నూవు గింజ అంత అయినను ఆనందమును పొందదు, కోదు ఎన్ను ఇకఴ్నుమ్ = దోషమున్నదని (కొందఱు అసూయతో తలచి) తెగడినను, ఎళ్ళత్తనై ఇకఴాదు = మా మనస్సు వారిని నూవుగింజఅంత అయినను దూషింపదు.



శ్రీ హయగ్రీవస్వామి మాకు ఆచార్యుడై, మా మనస్సులో లిఖించిన విషయములనే మేము అందఱు తెలిసికొని తరించుటకై తాళపత్రములో వ్రాసితిమి. అందువలన, శ్రీ హయగ్రీవుడే సాక్షాత్తు అనుగ్రహించిన ఈ సూక్తికి దోషమేమియు చెప్ప వీలులేదు. జ్ఞానులారా! ఈ సూక్తియొక్క గొప్పతనమును చూచి మీరు అంగీకరించినను దానివలన మా మనస్సు కొంచెముకూడ ఉబ్బి తబ్బిబ్బు కాదు. అసూయవలన దోషమున్నదని కొందఱు దూషించినను మా మనస్సు మిమ్ములను ఏ కొంచెముకూడ దూషింపదు. శ్రీహయగ్రీవుడే ముఖ్యవక్తగా (గ్రహించి) అవతరించిన ఈ గ్రంథమును అంగీకరించుటవలన ఆనందించువాడు, దూషించినచో నిగ్రహించువాడును అతడే.

లోకములో పత్రములో లిఖించినదానిని మనస్సున ధరింతురు. మా హయగ్రీవుడు మా మనస్సులో వ్రాసినదానిని **"ఉళ్ళత్తు ఎఴుదియదు ఓలైయిల్ ఇట్టనమ్"** అని ఇచట దేశికులు అనుగ్రహించుట గమనింపతగినది. ఇందలి ఛందస్సు కట్టళైక్కలిత్తుఱై.

**ఉత్తమూర్:-** ఈ గ్రంథము తమ ప్రయత్నముతో ఆవిర్భవించియున్నచో ఇందలి గుణములను గూర్చి ఇతరులు పల్కునపుడు ఆనందమును, దోషములనుగూర్చి పల్కునపుడు కలతయును కలుగవచ్చును. భగవానుడే **"స్వస్మై స్వప్రీతయే స్వయ మేవ కారయతి"** అను రీతిలో రచించుచే మాకు ఇందులో ఏ సంబంధమును లేదు-అనుచు సాత్త్వికత్యాగమును చేయుచున్నారు.

**(వెళ్ళై)** తెల్లని వర్ణమును కల, **(పరిముకర్)** హయగ్రీవులు, **"పరి"** అనగా అశ్వము. దేశికులై, అప్పుళ్ళార్ అను ఆచార్యులుగా అవతరించి, **(విరకాల్)** ఉపదేశమనెడి లేఖనసాధనముతో, **(అడియోమ్)** ఆశ్రితులమగు మనము, మన సంప్రదాయపూర్వాచార్యులును. అట్లే అనుటను తెలుపుటకై ఇచటి బహువచనప్రయోగము, **(ఉళ్ళత్తు)** మనస్సులో, **(ఎఴుదియదు)** నిలుచునట్లు చేసినది, **(ఓలైయిల్)** తాళపత్రములో, **(ఇట్టనమ్)** పెట్టితిమి. లిఖించితిమి. ఈనాడు ఒకరు పల్కు మాటను యంత్రముద్వారా గ్రహించుచున్నారు. ఆ యంత్రములో ముల్లును పెట్టి, దానిమూలమున ఆ మాటనే

మరల వ్యక్తమగునట్లు చేయుచున్నారు (గ్రామ్‌ఫోన్). అట్లే, ఆచార్యులు ఉపదేశించినపుడు మన మనస్సు అనెడి యంత్రములో ఆ ఉపదేశము మూలమున రేఖలు ఏర్పడినవి. ఆ రేఖలలో మన మనస్సు అనెడి ముల్లుపడి, తన్మూలముగా వెలువడిన ఆ పలుకులు లేఖినివంటివారమగు మనచే పత్రములో లిఖింపబడినవి. అందుచే ఈ పల్కులన్నియును ఆచార్యప్రోక్తములే. **(యామ్ ఇదఱ్కెన్)** మేము ఎట్లు కర్తలమైతిమి? మాకేమి సంబంధము? లేక? పత్రములో మేము లిఖించితిమి. **"ఇదఱ్కు ఎన్"** ఇందులో దోషమెట్లు ఏర్పడును? అయినచో ఆచార్యులవద్ద దోషముండవచ్చునే! అనినచో, హయగ్రీవులే దేశికులైయుండుటచేత, అందులకు అవకాశము లేదు. బుద్ధావతారమువంటిదికాదు హయగ్రీవావతారము-అని భావము. ఆ అవతారము శ్వేతవర్ణమగుట శుద్ధసత్త్వమయమనుటను సూచించును. **(కూర్ మదియీర్)** సూక్ష్మమైన బుద్ధినికల మన సంప్రదాయప్రవర్తకులారా! ఈ గ్రంథమును వేఱు కొందఱు ఆదరించి, గ్రహించినచో, ఆ విధముగానే కావచ్చును. **(తుణియినుమ్)** నిశ్చయించి, నమ్మినను, **(ఎమ్)** మా, **(ఎళిల్ మది)** భగవానుడే దీనికి కర్త అనెడి నిజమైన జ్ఞానముచే ప్రకాశించు బుద్ధి, **(ఎళ్ అత్తనై)** నూవుగింజ అంతకూడ, **(ఉకవాదు)** సంతోషింపదు. మేము రచించిన గ్రంథమును అంగీకరించిరి అని తలచి సంతోషింవదు. మిగిలిన మతాంతరసంప్రదాయాంతరస్థులు, **(కోదు ఎన్రు)** సారమును అసారమని, **(ఇకழ్న్దుమ్)** గర్హించినను, నిందించినను, **(ఎమ్ ఎళిల్ మది ఎళ్ళత్తనైయుమ్ ఇకழాదు)** వెగటును పొందదు. మా గ్రంథమనెడి మమత్వబుద్ధిలేదు కదా! ఇతరుల గ్రంథములో గుణదోషములనుగూర్చి పల్కునపుడువలె మనస్సు ఒకే విధముగా నుండును. అట్లు నమ్మినను, నిందించినను వారికి తగిన ఫలము కల్గుననుట వేఱు విషయము. అది గ్రంథకర్త అయిన ఈశ్వరుని అధీనము. అతడే మొదట **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై, తగ్ం హ దేవ మాత్మ బుద్ధిప్రకాశం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే"** అను శ్వేతాశ్వతరోపనిషత్తు ప్రకారము బ్రహ్మను సృష్టించి, వేదములను అనుగ్రహించి, శ్వేతాశ్వముఖుడై, మధుకైటభసంహర్తయైన పరమాత్మ జీవాత్మజ్ఞానమును కల్గించి, మోక్షమునకై శరణాగతిని అందఱు అనుష్ఠించుటను ఎదురుచూచువాడైనాడు. అతడే ఇపుడు ఆ ప్రపత్తిశాస్త్రార్థమును మా మనస్సులో లిఖించి, నాచే పత్రములో లిఖింపజేయుటద్వారా తాను ప్రధానకర్తయై, నన్ను నిమిత్తమాత్రుని చేసెను. అతనికి కల్గు రసానుభవమే మనకు ఉద్దేశ్యము.

**అధికారసంగ్రహవ్యాఖ్యానము సంపూర్ణము**





## అమృతాస్వాదిని - అవతారిక

సారసంగ్రహముమొదలు మునివాహనభోగమువరకు మణిప్రవాళశైలిలో శ్రీ దేశికులు రచించిన రహస్యగ్రంథములు చిల్లర రహస్యములలో వేఱొకభాగముగా వర్గీకరింపబడినవి. వీనిలోగల విషయములను తెలుపు ముప్పది ఏడు పాశురములను ఒక ప్రబంధముగా కూర్చి, దానికి **"అమృతాస్వాదినీ"** అను పేరును పెద్దలు పెట్టిరి. అమృతమువంటి విషయములను తనలో ఇముడ్చుకొని, మనలను ఆనందింపచేయుటచే దీనికీ పేరు సార్థకము.

ఇందు అష్టాక్షరి మొదలగు మూడు రహస్యముల తాత్పర్యము తెలుపబడినది. మఱియు, శ్రీమద్రామాయణముఖ్యసారమగు కాకాసురశరణాగతి, విభీషణశరణాగతి మొదలగునవి ప్రస్తావింపబడుచున్నవి. వరాహస్వామికి, భూదేవికిమధ్య జరిగిన సంభాషణచే అవతరించిన వరాహచరమశ్లోకముయొక్క అర్థము, అంజలియొక్క గొప్పతనము మొదలగునవి తెలుపబడుటతోపాటు, మిగిలిన రహస్యముల విషయములుకూడ ఇందు సంగ్రహముగా తెలుపబడినవి. మఱియు, అత్యద్భుతముగా నడచిన సంభాషణరూపములోనున్న ఒక పాశురముతో శ్రీరామానుజుల కీర్తి ప్రకాశింప చేయబడినది. అమలనాదిపిరాన్ ప్రబంధసారమును తెలుపుటతో ఈ ప్రబంధము ముగియుచున్నది.

---ooo---

### జీవించియున్న కాలముయొక్క సాఫల్యము

1. **మూల కిళైయెన వొన్ఱిరణ్డాన మొழి యిరణ్డు**
**మేలొన్ఱిలైయెన నిన్ఱ వవ్విత్తకన్ఱన్నురైయుమ్**
**కాలజ్కழివదన్ మున్న ఙ్కురుత్తుఱ క్కణ్డిడవే**
**ఞాలమ్ పుకழు నన్దేశికర్‌తా నమై వైత్తనరే**

ఞాలమ్ పుకழుమ్ = భూలోకములోనివారు పొగడునట్టి, నమ్ దేశికర్ = మన ఆచార్యులు, మూలమ్ కిళై ఎన = వేరు, గెలయు అని పల్కునట్లు, ఒన్ఱు ఇరణ్డు ఆన= (క్రమముగా) ఒక వాక్యము, రెండు ఖండములుగానున్న, మొழి ఇరణ్డుమ్= (తిరుమంత్రము, ద్వయము అను) మంత్రములు రెండిటిని, మేల్ ఒన్ఱు ఇలై ఎన నిన్ఱ= (దీని కంటె) గొప్పది వేఱొకటి లేదు అనునట్లు నిలచి, అవ్విత్తకన్ తన్ ఉరైయుమ్=

ఆశ్చర్యకరచేష్టితుడగు ఆ శ్రీ కృష్ణుని వాక్యమగు చరమశ్లోకమును, కాలమ్ కழிవదన్ మున్నమ్ = (మనము) జీవించియున్న కాలము గడచి పోవుటకు ముందే, కరుత్తు ఉఱ క్కణ్డిడవే = మనస్సులో స్థిరముగా నిలుపుకొని, అనుభవించునట్లు, నమై వైత్తనర్ = మనలను నిలిపిరి. (తామ్– అను పదము పాదపూరకము, నిరర్థకము)

మన ఆచార్యులు రహస్యములు మూడింటిని వానిని తాత్పర్యముతో పాటు మనకు మనము జీవించు సమయములోనే ఉపదేశించిరి. తిరుమంత్రముచే స్వరూపమును చక్కగా తెలిసికొనిన పిమ్మట, ద్వయముద్వారా ప్రపత్తిని అనుష్ఠింపవలసియుండుటనుగూర్చి, అవి క్రమముగా మూలముగా, గెలగా చెప్పబడినవి. చరమశ్లోకము వేఱొకటిని దేనిని అన్వేషింపవలసిన అవసరములేనట్లు ఉపాయమును వివరించి విధించుటచే సాటిలేనిది అని చెప్పబడినది.

ఈ పాశురమునుండి వరుసగా ఆఱు పాశురములు సారసారములోని తిరుమంత్రాధికారములోనివి. ఇచటి ఛందస్సు కట్టళైక్కలిత్తుఱై.

**తమిళవ్యాఖ్య:– "అమృతాస్వాదినీ" ఎన్గిఱ ఇన్ద ఇరణ్డామ్ ప్రబంధత్తిలే "శ్రీమత్సారసార" మ్మదల్ "మునివాహనభోగ" మళవాక ఒన్బదు రహస్యఙ్గళిల్ శేర్న్దిరుక్కుమ్ పాశురఙ్గళ్ (37) ముప్పత్తేழு.**

**ప్రథమమ్ సారసారత్తిలే పదినాలు పాట్టుక్కళ్. అదిల్ తిరుమన్త్రాధికారత్తడియిలే ఒన్ఱు, ప్రణవమ్, నమస్సు, నారాయణపదమ్, చతుర్థి – ఇదుకళుడైయ వర్థానన్తరమ్ నాలు, అధికారాన్తత్తి లొన్ఱు–ఆక ఆఱు. ద్వయాధికారత్తిల్ మూన్ఱు, చరమశ్లోకాధికారత్తిల్ ఆఞ్జు. ఆక, ఇన్ద రహస్యత్తిల్ పదినాలు పాశురఙ్గల్. అవైకళిల్ ముదల్పాట్టు.**

**కీழ் – "త్రిభి రనవధికార్థం సంగృహీతం రహస్యైః" ఎన్ఱరుళిచ్చెయ్దపడియే సంగ్రహరుచికళుక్కు సారసంక్షేపమ్ అరుళిచ్చెయ్దదై సూచనమ్ శెయ్దు, "సహృదయబహుమాన్యం సారసారమ్" ఎన్గిఱపడియే సహృదయభాగవతర్కళుక్కాక సారసార మెన్గిఱ రహస్యత్తై యరుళిచ్చెయ్యప్పుకుకిఱవరాయ్, అడియిలే ఆచార్యస్తుతిరూపమంగళమాయుమ్, అన్ద రహస్యార్థసంగ్రాహకమాయుమ్ ఒరు పాట్టు అరుళిచ్చెయ్కిఱార్.**

**శ్రీమద్రహస్యత్రయసారమ్ శ్రీభాష్యస్థానత్తిలుమ్, ఏతత్పూర్వవర్తికళాన విరణ్డు రహస్యఙ్గళై వేదాంతదీప–సారస్థానీయఙ్గళాకవుమ్ అనుసంధిప్పార్కళ్.**



**(మూల) మిత్యాది. ఞాలమ్పుకழ் – భూమియిలుళ్ళ జనఙ్గళాలే పుకழప్పడుమవర్కళాన (ఞాల శబ్దమ్ లక్షణయా తత్రత్యజనపరమ్) నన్దేశికర్ – అస్మదాచార్యర్కళ్. (ఇవర్కళుక్కు నన్మై యావతు సదాచార్యకటాక్షముమ్, శాస్త్రసమ్మతమాన జ్ఞానానుష్ఠానముమ్) తామ్ – తామే, మూలఙ్గళ్ యెన – (ఎన ఇవార్థకమ్) వేరే పోలవుమ్, కిళైకళ్ పోలవుమ్, ఒన్ఱిరణ్డాన మొழి యిరణ్డుమ్ – ఒన్ఱుతానే ఇరణ్డాక వాకానిన్ఱ శబ్దద్వయముమ్, (మొழిశబ్దమ్ మూలమూలికళ్ పోలే తిరుమన్త్రమొన్ఱుమే ఖండద్వయాత్మకమాన మంత్రరత్నమాకవాకానిన్ఱ ప్రథమమధ్యమరహస్యఙ్గళు మెన్ఱపడి) మేల్ – ఇదఱ్కుమేల్, ఒన్ఱిలై – వేఱొన్ఱిల్లై, ఎన – ఎన్నుమ్పడి, నిన్ఱ – ఇరున్ద, అవ్విత్తకన్తన్ – అన్ద ఆశ్చర్యస్వభావనాన కృష్ణనుడైయ, ఉరైయుమ్ – ఉక్తియాన చరమశ్లోకత్తైయుమ్ కాలమ్ – వయదానతు, కழிవదన్ మున్నమ్ – అతీతమావదఱ్కు, మున్నమే, కరుత్తు – హృదయత్తిల్, ఉఱ – అర్థఙ్గళై నిలైనిఱ్కుమ్పడియాక, కణ్డు – అన్ద రహస్యార్థఙ్గళై ఉళ్ళపడి కణ్డు, ఎమ్మై – తఙ్గళ్ తిరువడికళై ఆశ్రయిత్త నమ్మై, అదైవే – క్రమత్తిలే, (తిరుమన్త్రాదికళాలే ప్రతిపాదితమాన స్వరూపోపాయపురుషార్థఙ్గళుడైయ నిష్ఠాక్రమత్తిలే) వైత్తనరే – స్థాపిత్తార్కళ్. ఇత్తాల్–ఇన్ద గ్రన్థత్తుక్కు రహస్యత్రయసారమే ముఖ్యవిషయ మెన్ఱు శొన్నపడి.**

**తిరుమంత్రము – ప్రణవార్థము**

**2. కారణము క్కావలును మాకి యెన్ఱుమ్**
**కమలైయుడన్ పిరియాద నాదనాన**
**నారణనుక్కడియేనా నడిమై పూణ్డ**
**నల్లడియార్క్కల్లాన్ మற்றொరువర్క్కల్లేన్**
**ఆరణఙ్గళ్ కొణ్డకముమ్ పుఱముమ్ కణ్డా**
**లఱివాకి యఱివదుమా యఱునాన్గన్ఱి**
**చ్చీరణిన్ద శుడర్పోల త్తికழ్న్దు నిన్ఱేన్**
**శిలై విశయన్దేరనైయ శిఱు వేదత్తే**

శిలై విశయన్ తేర్ అనైయ = (గొప్ప గాండీవమను) వింటినికల అర్జునుని రథమువంటి, శిఱు వేదత్తు = చిన్న వేదము (సంగ్రహరూపమైన వేదము) అగు ప్రణవములో, కారణమామ్ = అన్నిటికిని మూలకారణమును, కావలనుమ్ ఆకి = సర్వరక్షకుడును అయి, ఎన్ఱుమ్ కమలైయుడన్ పిరియాద నాదనాన = ఏనాడును లక్ష్మీదేవిని ఎడబాయని స్వామియగు, నారణనుక్కు, అడిమై పూణ్డ నల్ అడియార్క్కు అల్లాల్ = (భగవానునకు)

కైంకర్యమును చేయు గొప్ప భక్తులకుతప్ప, మఱ్ఱు ఒరువర్క్కు అల్లేన్ = వేఱొకరికి నేను దాసుడను కాను, ఆరణఙ్గళ్ కొణ్డు = వేదముల సహాయముగా గొని, అకముమ్ పుఱముమ్ కణ్డాల్ = (జీవాత్మనగు నా స్వరూపమును) లోపల బయట గమనించి చూచినచో, అఱివు ఆకి = జ్ఞానమే రూపముగా కల్గినదై, అఱివదుమాయ్ = ధర్మభూతజ్ఞానముతో మిగిలిన వస్తువులను తెలియునదియై, అఱు నాన్గు అన్ఱి = ఇరువది నాల్గు తత్త్వముల రూపమగు అచేతనముకంటె విలక్షణమై, శీర్ అణిన్ద శుడర్ పోల్ = గొప్పతనమును కల్గి ప్రకాశించు తేజస్సువలె, తికழ்న్దు నిన్ఱేన్= ప్రకాశించుచున్నాను.

సర్వేశ్వరుడు అన్నిటికిని మూలకారణమైయున్నాడు. అతడు అన్నిటిని రక్షించువాడు. లక్ష్మిని ఏనాడును ఎడబాయనివాడును. చేతనుడగు జీవుడు జ్ఞానస్వరూపుడైయున్నాడు. జ్ఞానమును గుణముగా కల్గియున్నాడు. అచేతనముకంటె విలక్షణుడు. ఇట్టి జీవుడనను నేను భగవానునకు దాసుడను. ఆ స్వామి దాసులకు దాసుడను. వేఱెవ్వరికిని దాసుడను కాను. ఇదియే అర్జునుని రథమువంటి ప్రణవముయొక్క సారార్థము. ఇదియే వేదాంతప్రతిపాదితార్థము.

అర్జునుని రథములో, నాయకుడగు శ్రీ కృష్ణుడు ముందు, దాసుడగు అర్జునుడు వెనుక ఉన్నట్లే, ప్రణవములోకూడ స్వామియగు భగవానుని నిర్దేశించు అకారము ముందు, మకారము పిమ్మట ఉండుటచే ప్రణవమునకు, అర్జున రథమునకుమధ్య సామ్యము కలదని పెద్దలు వచింతురు.

**తమిళ:– ఇప్పడి ప్రథమాధికారత్తిల్ తిరుమంత్రార్థవిచారమ్ తుడఙ్గి ప్రథమపదమాన ప్రణవత్తిలడఙ్గియ అకారాద్యక్షరత్రయత్తుక్కు ప్రకృతిప్రత్యయత్తాలే వరు మర్థఙ్గళై విస్తారమాక వాక్యరూపమాయ్ అరుళిచ్చెయ్‌తు, సుఖబోధార్థమాక ఒన్బదర్థఙ్గళ్ ప్రధానమాక వనుసన్ధేయఙ్గళెన్ఱు కాట్టుకిఱారొరు గాథారూపత్తాలే. (కారణము) మిత్యాది. శిలై – ధనుః, గాండీవధన్వావాన, విశయన్ – అర్జుననుడైయ, తేరణైయ – రథత్తుక్కు సదృశమాన, శిఱు వేదత్తు – శిఱియ వేదమాన ప్రణవత్తిల్, కారణముమ్ – నిమిత్తోపాదానకారణముమ్, కావలనుమ్ – రక్షకనుమ్, ఆకి – పోయ్, ఎన్ఱుమ్ – ఎప్పోదుమ్, కమలైయుడన్ – పెరియపిరాట్టియారోడు, పిరియాద – పృథక్సిద్ధనాకాద, నాథనాన – సర్వస్వామియాన, నారణనుక్కు – నారాయణశబ్దవాచ్యనాన పురుషోత్తమనుక్కు, నాన్ – అహమ్, అడియేన్ – దాసభూతన్, అడిమై పూణ్డ – అవనుడైయ దాస్యత్తైయే భోగ్యమాయ్ వహిత్త, నల్లడియార్క్కల్లాల్ – నల్లవరాకియ భాగవతర్క్కల్లదు, మఱ్ఱొరువర్క్కు – వేఱొరువర్క్కు, అల్లేన్ – శేషభూత నల్లేన్, ఆరణఙ్గళ్ – వేదఙ్గళై, కొణ్డు – ప్రమాణమాక క్కొణ్డు, అకముమ్ పుఱముమ్ – అంతర్బహి శ్చ, కణ్డు – పరామర్శిత్తఱిన్దు, అఱివాకి – జ్ఞానస్వరూపనాయ్, అఱివదుమాయ్ – జ్ఞాతావుమాయ్, అఱు నాన్గన్ఱి – చతుర్వింశతితత్త్వఙ్గళిలుమ్ వేఱుపట్టు, శీఱణిన్ద – పెరుమై పెఱ్ఱ, శుడర్పోల – తేజస్సుపోల, తికழ்న్దు నిన్ఱేన్ – విళఙ్గి నిన్ఱేన్. ప్రకాశియానిన్ఱేన్ – ఎన్ఱపడి.**

**సవిభక్తికమాన అకారత్తిల్ ఈశ్వరనుక్కుణ్డాన కారణత్వ–రక్షకత్వ–శేషిత్వ–శ్రియః పతిత్వ రూపమాన వర్థచతుష్టయముమ్, ప్రణవగతలుప్తచతుర్థియి లర్థసిద్ధమాన భాగవతశేషత్వముమ్, మధ్యమాక్షరార్థమాన తదీయపర్యంతదేవతాంతరవర్జనముమ్, ఇప్పడియే మకారత్తిల్ జ్ఞానస్వరూపముమ్, జ్ఞానగుణకత్వముమ్, చతుర్వింశతి తత్త్వవైలక్షణ్యముమ్ అనుసంధేయమ్.**



**తిరుమంత్రము – నమశ్శబ్దార్థము**

**3. యానెనదొన్బదొన్ఱిల్లై యెన్ శెయ్‌వదవనైయల్లాల్**
**ఆనదఱిన్దడు న్దన్నడియార్క్కెనై యాట్పడుత్తి**
**త్తానెనై నల్‌కి నడత్తుకిన్ఱాన్ఱాన్నరుళ్‌వழியే**
**నా నునై వీడు శెయ్‌వే నెన్ఱ నన్దిరునారణనే**

నాన్ ఉనై వీడు శెయ్‌వేన్ ఎన్ఱ = నేను నీకు సంసారమును పోగొట్టి, ముక్తిని ప్రసాదించెదను అని, నమ్ తిరునారణన్ = మన శ్రీమన్నారాయణుడు, తాన్ ఎనై నల్‌కి = తాను నాపట్ల ప్రేమను కలిగి, ఆనదు అఱిన్దడుమ్ = తగిన మంచి విషయమును తెలిసినవారగు, తన్ అడియార్క్కు = తన భక్తులకు, ఎనై ఆట్పడుత్తి= నన్ను దాసునిగా చేసి, తన్ అరుళ్ వழியే = తన కరుణ ప్రసరించు మార్గముననే, నడత్తు కిన్ఱాన్ = (నన్ను) మంచి దారిలో పెట్టుచున్నాడు. (ఉపాయమున ప్రవేశింపచేసి, దానిని అనుష్ఠింపజేయుచున్నాడు.) యాన్ ఎనదు ఎన్బదు = నేను అని, నాది అని పల్కుటకు తగిన వస్తువు, ఒన్ఱుమ్ ఇల్లై = ఏదియు లేదు, అవనై అల్లాల్ = ఆ స్వామిని (సేవించుట) తప్ప, శెయ్‌వదు ఎన్ = చేయతగినది ఏమున్నది?

శ్రీమన్నారాయణుడు "నీకు సంసారబంధమును పోగొట్టి ముక్తిని ప్రసాదింతును" అని చరమశ్లోకములోని నిష్కర్షించెను. ఆ స్వామి నా పట్లగల ప్రేమతో నన్ను తన భక్తులకు దాసునిగా చేసెను. తన కరుణతో ప్రపత్తిని అనుష్ఠింపచేసెను. నా అహంకార–మమకారములను పోగొట్టి "నేను, నాది" అని పలుకకుండునట్లు చేసెను.

ఆ భగవానునకు పరతంత్రుడనగు నేను అతని దయవలనతప్ప దేనివలనను తరింపను.

**"యాన్ ఎనదు ఇలై"** అనుటచే అహంకార-మమకారరాహిత్యము, **"ఎన్ శెయ్‌వదు"** అనుటచే తనకు స్వాతంత్ర్యము లేకపోవుటయు, రెండవపాదముచే భాగవతులకు దాసుడైయుండుటయు, మూడవపాదముచే శరణాగతి-అను అర్థములు నమశ్శబ్దమునకు తెలుపబడినవి. తిరువాయ్‌మొழிలోని **"నీర్ నుమదు ఎన్ఱి వైముదల్ మాయ్‌త్తు"** అనుసూక్తి, అమలపిరాన్ పిరాన్ ప్రబంధములోని **"అడియోర్‌క్కెన్నై ఆళ్‌వడుత్త"** ఇత్యాది సూక్తులు ప్రకృతపాశురమునకు అనుగుణముగా అనుసంధేయములు.

ఈ పాశురము కట్టళైక్కలిత్తుఱై ఛ్ఛందస్సులో రచింపబడినది.

**తమిళ:-ఇప్పడి ప్రణవార్థానంతరమ్ నమశ్శబ్దత్తుక్కు స్థూలసూక్ష్మయోజనాదికళాల్ వరుమ్ అర్థవిశేషఙ్గళై విస్తారమాక వరుళిచ్చెయ్‌దు, ఇదుకళిల్ ముఖ్యమాన స్వస్వామిత్వనివృత్తి, స్వకీయస్వామిత్వనివృత్తి, స్వస్వాతంత్ర్యనివృత్తి, భాగవతశేషత్వమ్, శరణాగతి-ఆక, విన్ద వర్థఙ్గళై సుఖానుసన్ధానార్థమాక ఒరు పాట్టాలే కాట్టుకిఱార్. (యా నెన) దిత్యాది. యానెనదు - నాన్ ఎన్నుడైయదు, ఎన్బదు - ఎన్ఱు శొల్‌వదు, ఒన్ఱిలై-ఒరు వస్తువిలై. ("అహం, మదీయమ్" ఎన్ఱు శొల్లప్పడు మొరు వస్తు విలై. ఏతేన స్వస్వకీయస్వామిత్వనివృత్తి రుక్తా. విరోధియాన అహంకారమమకారనివృత్తిః ఫలితా.)**

**అవనైయల్లాల్ - స్వతంత్రనాన అన్ద ఈశ్వరన్ తవిర, ఎన్ శెయ్‌వతు-ఎన్న పణ్ణువతు, నా నితి శేషః (తత్ప్రవృత్త్యధీన మస్మదాదిప్రవృత్తి యెన్ఱపడి. అనేన స్వస్వాతంత్ర్య నివృత్తి రుక్తా) నా నున్నై-స్వతంత్రనాన నాన్ అకించననాన వున్నై, వీడుశెయ్‌వేన్ - (వీడు-మోక్షః) సంసారనివృత్తి పణ్ణువేన్, ఎన్ఱ - ఇప్పడి శొన్న, నమ్ తిరునారణనే - నమక్కు స్వామియాన శ్రియఃపతియే, (ఇదుక్కు క్రియైకళోడే అన్వయమ్. ఇత్తాల్ నమశ్శబ్దార్థమాన ప్రపత్తిక్కు లక్ష్యమాన మేల్ పదార్థముమ్, అత్తాల్ లక్ష్యమాన కీழ్పదార్థముమ్ శొన్నపడి) ఆనదటిన్దిడుమ్ - ఆనదు - యోగ్యమానతు, అదై యటిన్దిడుకై - అటిన్దువిడుకై. (యోగ్యమాన శేషత్వాదికళై నన్ఱాక వటిన్దిరుక్కుమవర్‌కళాన వెన్ఱపడి) తన్నడియార్‌క్కు - తన్నుడైయ స్వరూపాదికళై అటిన్ద భాగవతాళుక్కు, ఎన్నై - పరతంత్రనాన వెన్నై. ఆళ్‌పడుత్తాన్ - దాసనాకప్పడుత్తాన్ (నిరుపాధికదాస్యమ్ వహిక్కుమ్బడి పణ్ణినానెన్ఱపడి) తాన్ - సర్వతంత్రస్వతంత్రనాన వీశ్వరన్, ఎన్నై - అవన్ నడత్తిన వழியే - తన్నుడైయ కృపైయాలే వన్ద వழியిలే, (తన్ కృపైయాలే నమ్ముడైయ భరత్తై స్వీకరిక్కుమ్బడియాన ప్రపత్తిరూపమార్గత్తి లెన్ఱపడి) నడత్తుకిన్ఱాన్ - నడత్తి**



**వైయానిన్ఱాన్. (వ్యాజమాత్రసాపేక్షనాకైయాలే నమ్మై క్కొణ్డు న్యాసత్తై పృణ్ణివైయానిన్ఱా నెన్ఱపడి) ఇత్తాల్ పారతంత్ర్యలబ్ధభాగవతశేషత్వ శరణాగత్యాదికం శొన్నపడి.**

**తిరుమంత్రము-నారాయణశబ్దార్థము**

**4.** **యాదా మివై యనైత్తుమ్ పడైత్తేన్ఱు మిఱైవనుమాయ్**
**క్కోదా ఝ్కుణఙ్గళుడన్ కుఱుకాద కుణత్తనుమాయ్**
**మాదా పితా వెన మన్నుఉవాయ్ క్కతి యెన్న నిన్ఱాన్**
**పోదార్ తిరువుడన్ పొన్నరుళ్ పూత్తనమ్ పుణ్ణియనే**

పోదు ఆర్ తిరువుడన్ = (తామర) పుష్పమునందు నివసించు లక్ష్మితో, పొన్ అరుళ్ పూత్త = గొప్ప కరుణను పూచిన (వికసించిన), నమ్ పుణ్ణియన్ = మన పుణ్యమే రూపునొందిన (మూర్తీభవించిన) ట్లున్నవాడగు భగవానుడు, యాదామ్ ఇవై అనైత్తుమ్ = అన్ని విధములైన పదార్థములగు ఈ చేతనాచేతనములనన్నిటిని, పడైత్తు ఏన్ఱుమ్ ఇఱైవనుమాయ్ = సృష్టించి కాపాడు స్వామియైయుండి, కోదు ఆమ్ కుణఙ్గళుడన్ = దోషములనబడు హేయగుణములతో, కుఱుకాద గుణత్తనుమాయ్= చేరని గుణములను కలవాడై, మాతా పితా ఎన = తల్లి తండ్రి అనదగినట్లు, మన్ ఉఉవాయ్ = దృఢమైన బంధువైయుండి, కతి ఎన్న నిన్ఱాన్ = (అతడే) గతి అనునట్లు నిలచియున్నాడు.

లక్ష్మీదేవితో కూడియుండి, కరుణాసముద్రుడై మన పుణ్యస్వరూపుడై నిలచియున్న భగవానుడు అన్నిటిని సృష్టించువాడుగను, రక్షించువాడుగను, స్వామిగను, హేయగుణస్పర్శ లేశమాత్రమైనను లేనివాడుగను, కళ్యాణగుణపూర్ణుడుగను, సర్వవిధ బంధుగను, ఉపాయము (గతి) గను నారాయణ శబ్దముచే తెలియబడుచున్నాడు. భగవానుడు పుణ్యస్వరూపుడనుట **"పుణ్యానా మపి పుణ్యోఽసౌ", "పఱై తరుమ్ పుణ్ణియన్"** అను సూక్తులు, **"పుణ్యః"** అను నామము ఇత్యాదులవలన స్పష్టము. **"ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః"** అను సుబాలోపనిషద్వాక్యములో సమస్తభూతములయందు అంతర్యామియైయున్నను, ఆ చిదచిత్తుల దోషములేమియు సంక్రమింపకుండనున్నవాడు, దివ్యమంగ'విగ్రహవిశిష్టుడైన దేవుడు నారాయణడొక్కడేనని, **"మాతా పితా భ్రాతా శరణం సుహృ ద్గతిః నారాయణః"** అను వాక్యములో తల్లి, తండ్రి, భ్రాత, శరణము, సుహృత్తు, గతి అయినవాడు నారాయణుడేనని తెలుపబడినది. ఈ అర్థవిశేషములే ప్రకృతపాశురమునందు అనుసంధింపబడినవి. ఇచటి **"ఏష సర్వభూతాంతరాత్మా"** అను శ్రుతివాక్యములోని **'దేవ'** శబ్దము ప్రయోగమును

బట్టి, **"శద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"** అను వేఱొక శ్రుతిసూక్తి స్వారస్యమునుబట్టి ఆ దేవుడు లక్ష్మీసహితుడనుట ధ్వనించుచున్నది. కావున దేశికులు **"పోదార్ తిరువుడన్"** అని ప్రయోగించిరి అని అనదగును. ఇట్టి శ్రుత్యర్థవిశేషములు దేశికప్రబంధములో పలు చోట్ల ఉన్నను విస్తరభీతిచే తను, అవి ఉపదేశగమ్యములు కావునను ప్రస్తావింపబడలేదు.

ఈ పాశురము కూడ కట్టళైక్కలిత్తుఱైలో రచింపబడినది.

**తమిళ:- ఇప్పడి నమశ్శబ్దార్థ మరుళిచ్చెయ్దు, మేల్ నారాయణశబ్దత్తిల్ నరశబ్దత్తాలుమ్, నారశబ్దత్తాలుమ్, బహువ్రీహితత్పురుషసమాసద్వయత్తాలుమ్ వరు మర్థ విశేషఙ్గళై నన్గాక వెళియిట్టు, అవైకళిల్ ప్రధానమాన శిల వర్థఙ్గళై సంగ్రహిత్తుక్కాట్టుకిఱార్. (యాదా) మిత్యాది. పోదార్ తిరువుడన్ - పుష్పత్తిలే పూర్ణైయాయిరుక్కిఱ పిరాట్టియుడనే (పోదు - పుష్పమ్, ఆర్ - పూర్తి), ఇత్తాల్ నారాయణశబ్దత్తిల్ వివక్షితమాన శ్రీసంబంధమ్ శొన్నపడి. పొన్నరుళ్ పూరిత్త - స్పృహణీయమాన కృపైయై పుష్పిత్త. (కృపైయాల్ విళఙ్గు మెన్నై) నమ్మువిణ్ణియనే - నమక్కు స్వామియాన పుణ్యపురుషనే (సకలపుణ్యభూతనాన శ్రియఃపతియే - ఎన్ఱపడి) యాదామ్ - ఏదేనుమామ్. చిదచిత్తుకళిలేదేనుమామ్. (చిదచిద్విభాగ మఱ వెల్లాత్తైయుమ్ సృష్టిత్తైన్ఱపడి) ఇదు "నరా జ్జాతాని" ఎన్గిఱ వర్థమ్. ఏన్దు మిత్తైవనుమాయ్ - ఇవైకళై ధరిక్కు మీశ్వరనుమాయ్, (ఇదు "నృ-నయే" - ఎన్గిఱ ధాతులబ్ధమాన నరశబ్దార్థమ్) కోదాఙ్గు ప్పదాత, కుణత్తనుమాయ్ - గుణఙ్గళై యుదైయవనుమాయ్, (ఇత్తాలుభయలింగత్వమ్ శొల్లుకిఱతు. "నరసమ్బన్ధి నార" మెన్గిఱ గుణవర్గపరమ్) మాతా పితా వెన - మాతా వెన్టుమ్, పితా వెన్టుమ్ శొల్లుమ్బడి, గతిశబ్ద ముపాయోపేయపరమ్. నిన్టాన్ - వీఱ్ఱిరున్దాన్.**

**ఇత్తాల్ తత్పురుషని లయనశబ్దత్తిల్ అధికరణవ్యుత్పత్తియాల్ వన్ద ఆధారత్వముమ్, అత్తాల్ ఫలిత్త సర్వవిధబంధుత్వముమ్, కరణాదివ్యుత్పత్తియాల్ ఉపాయోపేయత్వముమ్ శొన్నపడి. "ఏన్దు మిఱవను మా" యిత్యత్ర బహువ్రీహియి నర్థమాన సర్వాంతర్యామిత్వ, సర్వనియంతృత్వాదికళుమ్ అనుసంధేయమ్.**

**తిరుమంత్రము - చతుర్థీవిభక్త్యర్థము**

**5. ఇరు విలఙ్గు కళ్త్తిదరా ముదలన్దన్నిల్
ఇలఙ్గు నడునాడియినా లెమ్మై వాఙ్గి
యొరు విలఙ్గు నెఱియల్లా వళియాన్ మన్ను**



**ముయర్ వానిలేఱ్ఱి యుయిర్ నిలైయు న్తన్దు
పెరువిలఙ్గా మరుదన్నాఱ్ఱన్నడిక్కీళ్
ప్పిరియాద వమరరుడన్ పిణైత్తుత్తన్నా
రురు విలఙ్గు మిశైవిక్కు ముమ్బర్ పోక
ముకన్దు తరు న్తిరుమాలై యుకన్దో నామే**

ఇరు విలఙ్గు కళ్త్తు = (పుణ్య పాప కర్మలనెడి) రెండు విధములైన సంకెళ్ళను ఛేదించుకొని, ఇదర్ ఆమ్ ఉడలమ్ తన్నిల్ = (ముక్తికి) అవరోధముగా నున్న ఈ శరీరములో, ఇలఙ్గుమ్ నదు నాడియినాల్ = ప్రకాశించు నడుమనాడియగు బ్రహ్మనాడితో, ఎమ్మై వాఙ్గి = జీవులమగు మమ్ములను (ఈ శరీరమునుండి విడదీసి) గ్రహించి, ఒరు విలఙ్గు నెఱి అల్లా వళియాల్ = (ధూమాదిమార్గము వలె) సంసారమునందే తిరిగి బంధించు మార్గము కాని అర్చిరాదిమార్గముద్వారా, మన్నుమ్ ఉయర్ వానిల్ ఏఱ్ఱి = శాశ్వతమైన, ఉన్నతమైన పరమపదమునకు చేర్చి, ఉయిర్ నిలైయుమ్ తన్దు = జీవునకు (కర్మసంబంధముచే ఇంతవరకు మఱుగుపడియున్న) గుణములనుకూడ ఇచ్చి, పెరు విలఙ్గు ఆమ్ అరుళ్తన్నాల్= (భక్తులను విడువకుండ గట్టిగా పట్టుకొని రక్షించుటచే) గొప్ప సంకెలవంటిదగు కృపతో, తన్ అడి క్కీళ్ పిఱియాద అమరరుడన్ పిణైత్తు = తన శ్రీ పాదముల క్రింద (క్షణముకూడ) విశ్లేషింపకుండ కైంకర్యమును చేయు నిత్యసూరులతో ఒకటిగా కలిపి, అఙ్గు = పరమపదములో, తన్ ఆర్ ఉరువిల్ = తనయొక్క పరిపూర్ణమైన స్వరూపములో, మిశైవిక్కుమ్ ఉమ్బర్ పోకమ్ = అనుభవింపచేయు నిత్యసూరుల అనుభవమును, ఉకన్దు తరుమ్ తిరుమాలై = (మనకు) ఆనందించి ఇచ్చు శ్రియఃపతిని (ఆశ్రయించి), నామ్ ఉకన్దోమ్ = మనము ఆనందించితిమి.

శ్రీమన్నారాయణుడు ఉపాయమును అనుష్ఠించిన జీవుని పుణ్యపాపములనెడి కర్మలను నశింపచేయుచున్నాడు. పిమ్మట, ముక్తికి ఆటంకముగానున్న ఈ శరీరమునుండి బ్రహ్మనాడిద్వారా జీవాత్మను గొని అర్చిరాది మార్గమున పదమునకు కొని పోవుచున్నాడు. కర్మసంబంధముచే మఱచియున్న గుణములను అనుగ్రహించుచున్నాడు. జీవుడు అడ్డగించినను బలముగా గ్రహించి, ఆకర్షించి, లాగికొని, మనకు మంచిని చేయునట్టి తన కృపతో ఈ జీవుని నిత్యసూరుల గోష్ఠిలో ఒకనిగా తన పరిపూర్ణానుభవమును ఇచ్చుచున్నాడు. ఈ అర్థమే నారాయణశబ్దముపైగల చతుర్థీవిభక్తిద్వారా తెలుపబడినది.

**"ఇరు విలఙ్గు"** అను ప్రయోగము పుణ్యపాపరూపద్విధకర్మలను లక్షించును. ఇది **"ఆకుపెయర్"** పాపమువలె పుణ్యముకూడ మోక్షప్రాప్తికి అవరోధమే కావున రెండు సంకెళ్ళుగా రూపింపబడినవి.

**తమిళ:-** ఇప్పడి నారాయణశబ్దార్థ మరుళిచ్చెయ్‌తు మేల్ చతుర్థియినర్థమాన సంప్రదానతాదర్థ్యాదికళైయుమ్, అన్ద ధాత్వర్థత్తాల్ వన్ద కైంకర్యాదికళైయుమ్ విస్తారమాక వరుళిచ్చెయ్‌తు, అన్ద కైంకర్యమ్ వరువతు దేశవిశేషత్తిలేయాకైయాలే, తత్ప్రాప్తిక్కు విరుద్ధమాన శరీరాదిసంబంధఙ్గళై యెల్లామ్ విడువిత్తు, దేశవిశేషప్రాప్తిపూర్వకమాక అన్ద వీశ్వరన్ నమ్మై క్కొణ్డు కైంకర్యమ్ శెయ్‌దువిక్కుమ్ ప్రకారఙ్గళై యెల్లామ్ ఒరు గాథైయాలే అరుళిచ్చెయ్‌కిఱార్. (ఇరు విఙ్గి) త్యాది. ఇరు విలఙ్గు - పుణ్యపాపరూపమాన విరణ్డు నిగళఙ్గళైయుమ్, కళైత్తు, నీక్కి, ఇడరామ్ - దుఃఖప్రదమాకియ, ఉడలన్తన్నిల్ - శరీరత్తిల్, ఇలఙ్గుమ్ - విళఙ్గుకిన్ఱ, నడునాడియినాల్ - మధ్యనాడియినాల్. (శతాధికైయాన బ్రహ్మనాడియాలే - ఎన్ఱపడి) ఎమ్మై - నమ్మై, వాఙ్గి - దేశత్తినిన్ఱు మెడుత్తు, ఒరు విలఙ్గు నెఱియిల్లా - ప్రతిబంధకమాన వళియొన్ఱు మిల్లాత, వళియాల్ - అర్చిరాదిమార్గత్తిల్, మన్నుమ్ -దృఢమాకియ, ఉయర్ - సర్వోత్కృష్టమాన, వానిల్ - పరమపదత్తిల్, ఏఱ్ఱి - ఏఱవైత్తు, ఉయర్ - జీవాత్మావినతు, నిలైయుమ్ - అపహతపాప్మత్వమ్ ముదలాన స్వరూపత్తైయుమ్, తన్దు - కొడుత్తు, (ఆవిర్భవిప్పిత్తెన్ఱపడి) పెరు విలఙ్గుమ్ - పెరియనిగళమాకవాకిన్ఱ, అరుళ్‌తన్నాల్ - కృపైయినాల్, తన్ - తనతు, అడిక్కీళ్ - తిరువడిక్కీళ్, పిరియాత - ఎప్పోదుమ్ పిరియాదవర్‌కళాన, అమరరుడన్ సంతోషిత్తు, తరుమ్ - నమక్కు క్కొడానిన్ఱ, తిరుమాలై - శ్రియఃపతియై, నామ్- ఇవ్వళవు భాగ్యమ్ పెఱ్ఱ నామ్, ఉకన్దోమ్ - సంతోషిత్తు శరణవరణమ్ శెయ్‌దోమ్, (ఇప్పడిప్పట్ట నిరుపాధికకృపావానుణ్డో! ఎన్ఱు సంతోషిత్తోమ్.) సన్తోషిప్పిత్తో మెన్ఱు ఱిజంతమాకవుమ్ శొల్లలామ్. ఇన్ద ఫలఙ్గళై నామ్ పెఱుమ్బడియాయత్తాలే యవనై నామ్ సంతోషిప్పిత్తోమ్.

## తిరుమంత్రముయొక్క సారార్థము

**6.** ఉఱవై యిశైన్దిఱైయిల్లా వొరువఱ్కెన్ఱుమ్
ఒణ్ శుడరా యొరెళుత్తి లోఙ్గినిన్ఱోమ్
తుఱవఱము న్దూమతియు న్దుయర న్దీర్‌వుమ్
తూయవర్‌కట్కానమైయు మిరణ్డిలుఱ్ఱోమ్



**అఱముయలు మనైత్తుఱవా యనైత్తు మేన్దుమ్**
**అమ్బుయత్తాళ్‌కణవనై నా మణుక ప్పెఱ్ఱోమ్**
**పిఱవియఱుత్తడిశూడి యడిమై యెల్లామ్**
**పిరియాద వమరరుడన్ పెఱ్ఱో నామే**

ఓర్ ఎళుత్తిల్ = ఒక అక్షరమును ప్రణవమందు, ఇఱై ఇల్లా ఒరువఱ్కు = (తనను నియమించు) నాయకుడు లేని సాటిలేని స్వామితో, ఎన్ఱుమ్ ఉఱవై ఇశైన్దు = ఎల్లప్పుడును (మనకు గల శేషత్వము అను) సంబంధమును అంగీకరించి, ఒణ్ శుడరాయ్ = అందమైన ప్రకాశస్వరూపమై, ఓఙ్గి నిన్ఱోమ్ = ఉన్నతముగానుంటిమి, ఇరణ్డిల్ = రెండు అక్షరములుగానున్న నమశ్శబ్దములో, తుఱవఱముమ్ = అహంకార - మమకారములను విడుచుట అను ముఖ్యధర్మము, తూ మతియుమ్ = పరిశుద్ధమగు జ్ఞానమను శరణాగతియు, తుయరమ్ తీర్‌వుమ్ = (తనను స్వతంత్రునిగా తలచుట అనెడి) దుఃఖము తొలగుటయు, తూయవర్‌కట్కు ఆనమైయుమ్ = పరిశుద్ధులగు భాగవతులకు దాసులమగుటయు, (అను విషయములను), ఉఱ్ఱోమ్ = పొందితిమి, (పిమ్మట నారాయణపదములోని) అఱమ్ ముయలుమ్ = (శరణాగతుని కాపాడుట అనెడి) ధర్మమునందే ప్రయత్నమును కలవాడు, అనైత్తు ఉఱవాయ్ అనైత్తుమ్ ఏన్దుమ్= సకలవిధ బంధువై, సకలవస్తువులను రక్షించువాడును అగు, అమ్బుయత్తాళ్ కణవనై= తామరపూవులో నివసించు లక్ష్మీదేవికి భర్తయగు భగవానుని, నామ్ అణుక ప్పెఱ్ఱోమ్= మనము సమీపించి, అనుభవింపగల్గితిమి, (పిమ్మట చతుర్థీవిభక్తిద్వారా), పిఱవి అఱుత్తు= మఱుజన్మ నశింపచేసికొని, అడి శూడి = శ్రీ పాదములను, (మన శిరస్సులలో) అలంకరించుకొని, అడిమై ఎల్లామ్ = కైంకర్యముల నన్నిటిని, పిరియాద అమరరుడన్= (భగవానుని క్షణమైనను) వీడియుండని నిత్యసూరులతో (చేరి), నామ్ పెఱ్ఱోమ్ = మనము పొందగల్గితిమి.

ప్రణవముద్వారా, జ్ఞానస్వరూపమైయున్న మనకు భగవానునితో ఎప్పటికిని నిత్యమైయున్న శేషత్వమను సంబంధమును తెలిసికొని, గొప్పతనమును (ఔన్నత్యమును) పొందితిమి. నమశ్శబ్దముచే అహంకార -మమకారములు నశింపచేసికొనుట, శరణాగతి, మనలను స్వతంత్రులమని తలచు భావము పోవుట, భాగవతులకు దాసులమైయుండు స్థితియు - అను విషయములను అనుసంధించితిమి. నారాయణ శబ్దముద్వారా సకలవిధబంధువై, సమస్తవస్తువులను రక్షించువాడగు శ్రీమన్నారాయణుని గుణములు మొదలగువానిని తెలిసికొంటిమి. దానిపైగల చతుర్థీవిభక్తివలన, సంసారము పోయి,

భగవానుని పాదములను శిరస్సున దాల్చి, నిత్యసూరులతో చేరి, అవిచ్ఛిన్న కైంకర్యమును చేసి, అనుభవించుట అను అర్థమును గ్రహించితిమి. ప్రణవములోని ఉకారము అవధారణార్థకము. అకారవాచ్యుడైన శ్రియపతికే మకారవాచ్యుడగు జీవుడు శేషమను అర్థమిచట తెలుపబడినది. ప్రణవార్థము మంత్రశేషమును వివరించుచున్నది. కావున అకారవాచ్యుడు నారాయణుడేనను అష్టాక్షరియొక్క అర్థమును ద్వయము వివరించుటచే ఆ నారాయణుడు లక్ష్మీసహితుడను అర్థమును వ్యక్తమగుచున్నది. కావున దేశికులు ఇచట **''అమ్బుయత్తాళ్ కణవనై''** అని అనుగ్రహించిరి. నారాయణుడు సకలవిధబంధువనుటను పూర్వోదాహృతమగు.. **"మాతా పితా .......నారాయణః"** అను శ్రుతివాక్యము తెలుపుచున్నది.

**తమిళ:- ఇప్పడి తిరుమంత్రత్తుక్కు అర్థవిశేషఙ్గళైయుమ్, యోజనావిశేషఙ్గళైయు మరుళిచ్చెయ్తు తత్త్వహితపురుషార్థప్రతిపాదక మెన్గిఱ అంతిమయోజనైయిలే నోక్కాక ప్రణవాదిపదత్రయఙ్గళుక్కు ఇన్ద ఇన్ద అర్థఙ్గళై అరుళిచ్చెయ్దో మెన్ఱు సుఖబోధార్థమాక వొరుపాట్టరుళిచ్చెయ్ కిఱార్. (ఉఱవై) యిత్యాది. నామ్ - స్వస్వరూప పరస్వరూపాదికళై యఱిన్ద నామ్. ఓరెళుత్తిల్ - ఏకాక్షరమాన ప్రణవత్తిలే, ఉఱవై ఇశైన్దు - సంబంధత్తై అంగీకరిత్తు, ఇఱైయిల్లా - ఈశ్వరనల్లాద, ఒరువర్క్కన్ఱ - ఒరువర్క్కుమ్ యోగ్యనాకవన్ఱిక్కే, (మధ్యమాక్షరార్థ మిదు) ఒణ్ శుడరాయ్-విలక్షణమాన తేజస్సాయ్, (జ్ఞాతావుమాయ్ - జ్ఞానస్వరూపనుమాయిరుక్కైయాలే నమక్కు వైలక్షణ్యమ్) ఓఙ్గి నిన్ఱోమ్ - ఓఙ్గిక్కొణ్డిరానిన్ఱోమ్. (ఓఙ్గుకై యావదు-శేషప్రధానమాన వర్ణనరథవ్వాలే ప్రథమాంతముఖ్యవిశేష్యతయా జీవప్రధానమా యిరుక్కై. ఓఙ్గుకై - సర్వోన్నత్వత్తోడిరుక్కై. స్వస్వరూపమ్ తెళిన్దు నిఱ్కైయే - ఓఙ్గుకై యాకవుమామ్.)**

**ఇరణ్డిల్ - అక్షరద్వయాకమాన నమస్సిల్, తుఱవఱముమ్ - స్వస్వకీయఙ్గళాలే తనక్కు శేషిత్వసంబంధ మఱ్ఱుప్పోకైయుమ్, తూయ్ మదియుమ్ - పరిశుద్ధమాన బుద్ధియుమ్, (స్వస్వాతంత్ర్యనివృత్త్యాత్మకజ్ఞానము మెన్ఱపడి. సంబంధత్తై యఱియప్పోకుమ్బడి పణ్ణుమ్ తూయ్మది యెన్ఱుమ్ యోజిక్కిలామ్) తుయరమ్ తుఱవుమ్ - (తుయరమ్- దుఃఖమ్, తుఱక్కై-నివృత్తిక్కై) దుఃఖఙ్గళ్ విట్టుప్పోమ్ ప్రకారఙ్గళుమ్. (ఇత్తాల్ సకలదుఃఖనివర్తకఙ్గళాన వుపాయవిశేషఙ్గళ్ వివక్షితమ్) తుయవర్క్కట్కాణ్మైయుమ్ - పరిశుద్ధరాన భాగవతర్కళుక్కు దాసనాకవానమైయుమ్, ఉరైత్తోమ్ - నమస్సిలే నన్ఱాక చ్చొన్నోమ్.**



**అఱ - అత్యన్తమ్, ముయలుమ్ - అభినివేశిక్కుమవర్కళాన, అనైత్తుఱవాయ్ - సర్వవిధబంధువాయ్, అనైత్తు మేన్దుమ్ - సకలత్తైయుమ్ ధరియానిఱ్కుమవరాన, అమ్బుయత్తాళ్ కణవనై-కమలవాసినియాన పిరాట్టిక్కు నాయకనాన శ్రియఃపతియై, నామ్ - తదాయత్తస్వరూపస్థితికళాన నామ్, అణుక - కిట్టపెఱ్ఱోమ్. పేరుడైయవర్కళాకవానోమ్, (అవన్ కిట్టుకైయే పేఱెన్ఱపడి - ఇవ్వళవుమ్ నారాయణశబ్దార్థమ్)**

**నామే - అవనై ఉపాయోపేయమాక ప్పఱ్ఱిన నామ్, పిఱవి - జన్మత్తై, యఱుత్తు - ఛేదిత్తు, అడి శూడి - అవన్ తిరువడికళై శిరోభూషణమాక ధరిత్తుక్కొణ్డు, పిరియాద వమరరుడన్ - 'సదా పశ్యంతి' ఎన్గిఱపడియే ఒరునాళుమ్ అవనై విట్టుప్పిరియాద నిత్యసూరికళోడే, అడిమై యెల్లామ్ - దాస్యకృత్య మెల్లామ్, పెఱ్ఱోమ్ - అడైన్దోమ్ (వర్తమానసామీప్యే వర్తమాననిర్దేశః. ఇదు వ్యక్తచతుర్థ్యర్థమ్)**

**ద్వయము - శరణాగతిని చేయుట**

**7.** **కరుమమెన ఞానమెన వదనాఱ్కణ్డ**
**వుయిర్ కవరు ఙ్కాదలెన క్కానిలోఙ్గుమ్**
**అరుమఱైయాఱ్ఱరునిలైయి విన్నాళెల్లామ్**
**అడియిణై యలైయాద వణ్ణ మెణ్ణి**
**త్తరుమముడైయారురైక్క యానఱిన్దు**
**తనక్కెన్నా వడిమైక్కామ్ వాళ్చ్చి వేణ్డి**
**త్తిరుమకళోడొరు కాలుమ్ పిరియా నాదన్**
**తిణ్కళలే శేదు వెన చ్చేర్కిన్ఱేనే**

కరుమమ్ ఎన ఞానమ్ ఎన = కర్మయోగమును, జ్ఞానయోగమును, అదనాల్ కణ్డ = అవి రెండిటిచే దర్శించిన, ఉయిర్ = జీవాత్మను, కవరుమ్ = వశపఱచుకొని, తనపట్ల అభినివేశమును కల్గునట్లుచేయు, కాదల్ ఎన = భక్తియోగము అను ఉపాయమగు, కానిల్ ఓఙ్గుమ్ = (అనుష్ఠించుటకు కష్టసాధ్యములై యుండుటచే) అరణ్యమువంటి వీనిలో ఉన్నతములైయున్నవి, అఱు మఱైయాల్ తరుమ్ నిలైయిల్= అరుదైన వేదముచే ఉపదేశింపబడునట్టి నిష్ఠలో, ఇన్నాళ్ ఎల్లామ్ = ఈ దినములన్నియు, అడియేనై అలైయాద వణ్ణమ్ ఎణ్ణి = దాసుడనగు నేను, అనుష్ఠింప ప్రయత్నించి, దుఃఖము పొందకుండునట్లు మనస్సున భావించి, తరుమమ్ ఉడైయార్ ఉరైక్క = ధర్మమును తెలిసిన ఆచార్యులు

(దాసునకు శరణాగతిని) ఉపదేశింపగా, యాన్ అఱిన్దు = దాసుడనను నేను దానిని తెలిసికొని, తనక్కు ఎన్నా అడిమైక్కు ఆమ్= నాకు అని భావింపక, (మమకారము లేక) చేయు కైంకర్యమునకు తగినట్లు, వాÇచ్చి వేణ్డి = ఉజ్జీవనమును వాంఛించి, తిరుమకళోడు ఒరు కాలమ్ = లక్ష్మీదేవితో ఏనాడును, పిరియా నాదన్ = విశ్లేషింపని భగవానుని, తిణ్ కÇలే శేదు ఎన = దృఢమైన శ్రీ పాదములే (సంసారమును దాటించు) వారధి అని భావించి, శేర్కిన్టేన్ = (వానిని ఉపాయముగా) పొందితిమి.

వేదములలో తెలుపబడిన కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము మొదలగు కఠినములైన ఉపాయములను దాసుడనగు నేను చేయప్రారంభించి, వ్యర్థ శ్రమను పొందకుండునట్లు చేయవలెనని ఆచార్యులు భావించి, మిక్కిలి సులభముగా ప్రపత్తిని దాసునకు ఉపదేశించిరి. దానిని తెలిసికొనిన నేను పరమపదములో అహంకార–మమకారములు లేని నిత్యకైంకర్యమును చేయు ఉజ్జీవనమును పొందగోరితిని. పిమ్మట శ్రీమన్నారాయణుని శ్రీ పాదములే సంసారమునకు తగిన సేతువు అని నిశ్చయించుకొని, వానిని ఉపాయముగా ఆశ్రయించితిని.

కర్మయోగముతో, జ్ఞానయోగముతో జీవాత్మ సాక్షాత్కారము కల్గుటచే **"అదనాల్ కణ్డ"** అని ప్రయోగింపబడినది. ఈ మూడు యోగములు అనుష్ఠించుటకు కష్టసాధ్యములగుటచే వానిని అరణ్యముగా వర్ణించిరి. ఆ ఉపాయములలోని నిష్ఠ అనగా వానియందు అభినివేశమును కల్గియుండుటయే కదా!

**"ప్రీతిపూర్వ మనుధ్యానం భక్తి రిత్యభిధీయతే"** అను సూక్తినిబట్టి భక్తియోగము **"కాదల్"** అని నిర్దేశింపబడినది **"ఎమ్మై విక్కవుమ్ పెఱువార్కళే"** అని, **"హరిభక్తిదాస్యరసికాః పరస్పరం క్రయవిక్రయార్హదశయా సమింధతే"** అనియుగల సూక్తులనుబట్టి **"ఉడైయార్"** అని ప్రయోగింపబడినది. **"అమృతస్యైష సేతుః"** అని, **"ఏష సేతు ర్విధరణః"** ఇత్యాది శ్రుతిసూక్తిస్వారస్యమునుబట్టి భగవానుడు సేతువని రూపింపబడినది. ఈ పాశురమునుండి 9వ పాశురమువరకుగల మూడు పాశురములు– సారసారము – ద్వయాధికారములోనివి.

**తమిళ:– ఇని ద్వితీయరహస్యత్తుక్కు సముదితమాన వర్థత్తై స్వానుసంధానరూపమాయ్ కాట్టుకిఱార్ (కరుమమెన) ఇత్యాది. కరుమమెన – కర్మయోగమెన్టు ప్రసిద్ధమాక చ్చొల్లప్పడు**



**మదెన్న, ఞానమెన్న – జ్ఞానయోగమెన్న, అదనాల్ కణ్డ – అన్ద కర్మజ్ఞానయోగఙ్గళాలే కాణప్పడుమదాన, కాదలెన్న – ప్రేమమెన్న (ప్రేమవిశేషమాన భక్తియోగపర మిఙ్గు కాదల్ శబ్దమ్) కానిలోఙ్గుమ్–కాన్ – వనమ్, అదిల్ ఓఙ్గుకై – "అరణ్యే అధీయీత" ఎన్గిఱపడియే అరణ్యత్తిలే అధ్యయనమ్ పణ్ణప్పడుమ్ సూక్ష్మార్థప్రతిపాదకమాన వేదాంతత్తాలెన్టపడి. తరునిలై – తరుకిఱ నిలై, (అన్ద వేదాంతభాగత్తాలే ప్రతిపాద్యమాన పూర్వోక్తభక్తియోగాదిరూపసిద్ధి యెన్టపడి)**

**ఇన్నాళ్ – ఇప్పోదు, ఇల్లా వడియేనై, – భక్త్యాదికళిలే అధికారమిల్లాదపడి యెన్నై, అలైయాద వణ్ణమ్ – అలైయాదిరుక్కుమ్ ప్రకారత్తై, ఎణ్ణి – నినైత్తు, (ముఖ్యోపాయానధికారత్తాల్ వన్ద ఫలత్తిల్ ఇÇవాలే నాన్ అలైయాద ప్రకారత్తై నినైత్తైన్టపడి) తరుమముడైయారురైక్క – ధర్మముడైయవర్కళ్ శొల్ల, యా నఱిన్దు – అవర్కళుక్కు దాసనాన అడియేనఱిన్దు. (ఇవ్వళవాల్ అధికారమ్ శొన్నపడి) మేల్ ద్వయార్థమ్. అదిల్ అన్వయక్రమత్తాలే ఉత్తరఖండార్థత్తై మున్నమే యరుళిచ్చెయ్కిఱార్.**

**తనక్కెన్నా – తనక్కెన్టు శొల్లాదదాన, అడిమైక్కాక – దాస్యమ్ పణ్ణుకైక్కాక, వాÇచ్చి వేణ్డి – వాÇక్కైయే వేణ్డి, (శెయ్కిఱ కైంకర్యమ్ స్వాధీన మెన్టుమ్, స్వశేష మెన్టుమ్ ఎణ్ణాద భగవత్కైంకర్యమాకిఱ వాÇచ్చియై అపేక్షిత్తుక్కొణ్డెన్టు విశేషార్థమ్) తిరుమకళోదు – పెరియపిరాట్టియారోడే, ఒరుకాలమ్ – ఎప్పోదుమ్, సర్వదా ఎన్టపడి. పిఱియాద నాదన్ – విశ్లేషియాద స్వామియినుడైయ, (పురుషకారమాయుమ్, ఉపాయవిశేషమాయు మాకానిఱ్కిఱ తిరుమకళోడు నిత్యసంశ్లిష్టనాన సర్వస్వామియినుడైయ – ఎన్టర్థమ్) తిణ్ కÇలే – దృఢమాన తిరువడికళై – (ఇఙ్గు తిణ్మైయావతు స్వాశ్రితరై ఉపాయాంతరసంబంధ మఱ రక్షిక్కై) శేతు వెన – సేతు వెన్టు (సేతు వానదు తరణత్తుక్కుపాయమ్, సంసారతారణోపాయమాక – వెన్టపడి) శేర్కిన్దేన్ – శేరానిన్టేన్, అడైయానిన్టే నెన్టపడి.**

ద్వయము – శ్రీ శబ్దముయొక్క ఆఱు అర్థములు

**8.** వినై విడుత్తు వియన్ గుణత్తా లెమ్మై యాక్కి
వెరువురై కేట్టవై కేట్క విళమ్బి నాళుమ్
తనైయనైత్తు మదైన్దిడత్తా నడైన్దు నిన్ఱ
తన్తిరుమా తుడనిఱైయు న్దనియా నాదన్

వినై వఴిక్కుమ్ వినైవఴిక్కు విలక్కాయ్ నిఱ్కు
నికరిల్లా నెడుఙ్గుణఙ్గణిలై ప్పెఱ త్తన్
కనైకఴల్కీఴడైక్కలమా క్కాట్టి తన్దు
కారణనాన్దన్ కావల్ కవర్కిన్డానే

వినై విడుత్తు = తనను (ఆశ్రయించినవారి) కర్మలను పోగొట్టి, వియన్ కుణత్తాల్ ఎమ్మై ఆక్కి = అతిశయింపతగిన (తన గొప్ప కరుణ మొదలగు) గుణములతో మనలను సంస్కరించి, వెరు వురై కేట్టు = (పాపులమగు మనలను భగవానుడు అంగీకరించునట్లు చేయవలెనని దాసులు) భయముతో చేయు పెద్ద ఆర్తనాదములను విని, అవై కేట్కు విళమ్బి = ఆ ఆర్తనాదములను భగవానుడు వినునట్లు విన్నపించి, నాళుమ్ తనై అనైత్తుమ్ అడైన్దిడ = ఎల్లప్పుడు తనను అందఱు శరణు పొందునట్లు, తాన్ అడైన్దు నిన్ఱ = (వారిని ఉజ్జీవింపచేయుటకై) తాను భగవానుని ఆశ్రయించి నిలచిన, తన్ తిరుమాదుడన్ = తనకే చెందినదగు లక్ష్మీదేవితో, ఇఱైయుమ్ తనియా నాదన్ = క్షణకాలమైనను విశ్లేషించియుండని భగవానుడు, నినైవు అఴిక్కుమ్ వినై వఴిక్కు = మంచిజ్ఞానమును పోగొట్టు పాపమార్గమునకు, విలక్కాయ్ నిఱ్కుమ్= అంతరాయముగా నున్నవియు, నికర్ ఇల్లా = సాటిలేనివి అగు, నెడుమ్ కుణఙ్గళ్ నిలై పెఱ = అంతులేని (తన) గుణములు స్థిరముగా నిలచియుండుటకు, తన్ కనై కఴల్ కీఴ్ = శబ్దించు వీర కడియములను అలంకరించుకొనిన తన శ్రీపాదముల క్రింద, అడైక్కలమా క్కాట్టి తన్దు = మనలను రక్షింపబడవలసిన వస్తువుగా గ్రహించి, సేవను అనుగ్రహించి, కారణనామ్ తన్ కావల్ = సర్వకారణుడగు తన రక్షణస్వభావమును, కవర్కిన్డాన్ = (స్థిరపఱచుకొనుటకు) అపేక్షించుచున్నాడు.

లక్ష్మీదేవిని విడచి క్షణకాలమైనను విశ్లేషింపని శ్రీమన్నారాయణుడు చేతనులను ఉజ్జీవింపజేసినపుడే తన కల్యాణగుణములు స్థిరముగా నిలచియుండునని తలచెను. జీవులను పరమపదమునకు పొందించి, తన శ్రీ పాదముల క్రింద రక్షింపబడవలసిన వారినిగా గైకొని "రక్షకుడు" అను తన పేరును స్థిరపఱచుకొనుచున్నాడు.

ద్వయములోని పూర్వార్ధములో లక్ష్మీదేవిని తెల్పు శ్రీశబ్దమునకు అఱు అర్థములు పాంచరాత్రమున తెలుపబడినవి. అవి ఏవి అనగా – **"శృణాతి, శ్రీణాతి, శృణోతి, శ్రావయతి, శ్రీయతే, శ్రయతే"** అనునవి. ఆ అర్థములు ఈ పాశురములోని మొదటి భాగమున క్రమముగా దేశికులు తెలిపిరి.



**1. శ్రీయతే–** ఆశ్రయింపబడుచున్నది. అనగా ముముక్షువులగు జీవులందఱిచే పురుషకారార్థము ఆశ్రయింపబడుచున్నది–అని భావము. **"నాళుమ్తనై అనైత్తుమ్ అడైన్దిడ"** అను ప్రస్తుతప్రయోగము ఈ అర్థమును తెల్పుచున్నది.

**2. శ్రయతే–** ఆశ్రయించుచున్నది. అనగా తనను ఆశ్రయించినవారిని ఉజ్జీవింపజేయగోరి సర్వేశ్వరుని తాను ఆశ్రయించుచున్నది–అని భావము. అందఱిచే సేవింపబడు తాను భగవానుని సేవించుచున్నదనియు అర్థము. లేక, **"శ్రీయతే"** అనుటకు అన్ని వస్తువులచే ఆధారముగా ఆశ్రయింపబడుచున్నదని, **"శ్రయతే"** అనుటకు అన్ని వస్తువులను ప్రవేశింపబడు చోటుగా పొందుచున్నదని అర్థము చెప్పి, సకలవస్తువులయందు భగవానునివలెనే లోపల బయట వ్యాపించియుండు గొప్పతనమును కల్గియున్నదని లక్ష్మీవిభుత్వమును అంగీకరించు ఆచార్యులు తెల్పుదురు. **"తాన్ అడైన్దు నిన్ఱు"** అను ప్రకృతప్రయోగ మీ అర్థమును తెల్పుచున్నది.

**3. శృణోతి–** వినుచున్నది. చేతనులు "అపరాధులమగు మమ్ములను సర్వేశ్వరుని శ్రీపాదములలో చేర్చవలెను" అని భయముతో పల్కు మాటలను వినును. **"వెరు వురై కేట్టు"** అను ప్రయోగ మీ అర్థమును తెల్పుచున్నది.

**4. శ్రావయతి–** వినిపించుచున్నది చేతనులు చేయు ప్రార్థనలను సర్వేశ్వరునకు వినిపించుచున్నది–అని భావము. లేక, చేతనులకు హితముగా భగవానుడు పల్కిన సుక్తులను విని, తాను వానిని తగిన సమయములో ఆ స్వామికి వినిపించి, చేతనులను రక్షించును–అని భావము. లేక, సర్వేశ్వరునివద్ద లోకహితమును విని, వానిని పిమ్మట శత్రువులు సైతము వినునట్లు ఉపదేశించును–అనియును చెప్పవచ్చును. **"అవై కేట్కు విళమ్బి"** అను సూక్తివలన ఈ అర్థము వ్యక్తము.

**5. శృణాతి–** తొలగించుచున్నది. తనను ఆశ్రయించినవారికి ఉపాయమును అనుష్ఠించునపుడు ఎదురగు కర్మలు మొదలగు ఆటంకములను పోగొట్టుచున్నది. **"వినై విడువిత్తు"** అను ప్రయోగమువలన ఇది వ్యక్తము.

**6. శ్రీణాతి–** పరిపక్వదశను పొందించుచున్నది. తనను ఆశ్రయించినవారు కైంకర్య –ప్రకృతమున **"వియన్ కుణత్తాల్ ఎమ్మై ఆక్కి"** అనుటచే ఇది వ్యక్తము.

**తమిళ:–ఇప్పడి తామరుళిచ్చెయ్ద వర్థఙ్గళై యెల్లామ్ సంగ్రహియానిన్డుకొణ్డు ఇన్ద పూర్వఖండత్తి లుక్తమాన ఉపాయత్తై యన్ద సర్వేశ్వరనే నమ్మై క్కొణ్డనుష్ఠిప్పిత్తా నెన్గిఱార్.**

**(వినై విడు) విత్యాది - వినై - పాపఙ్గళై, (ప్రబలమాన వజ్ఞానాదికళై - ఎన్నపడి), విడుత్తి-పోక్కి, వియన్ - మేన్ తఙ్గియ, కుణత్తాల్ - గుణఙ్గళినాల్, ఎమ్మై - నమ్మై, ఆక్కి - జ్ఞానాదికళాలే పక్వమాక్కి, పెరువురై - ఆర్తధ్వనియై, కేట్టు - తాన్ కేట్టు, అవై - అన్ద ఆర్తధ్వనికళై, కేట్క - సర్వేశ్వరన్ కేట్కుమ్బడి, సర్వేశ్వరనై ఆశ్రయిత్తిరున్దుమవళుమాన, తన్ తిరుమాదుడన్ - తనక్క సాధారణైయాన పిరాట్టియారోడు, ఇఴైయముమ్ - క్షణకాలముమ్, తనియా - పిరియాద, నాదన్ - సర్వస్వామియాన నారాయణన్, నినైవు - స్మృతియై, అఴిక్కుమ్ - అఴిక్కిన్ఱ, వినై వఴిక్కు - పాపమార్గత్తుక్కు, విలక్కాయ్ నిఱ్కుమ్ - ప్రతిబంధకమాయ్ నిఱ్కిన్ఱ, నికరిల్లా - అసదృశఙ్గళాన, నెడు ఙ్గుణఙ్గళ్ - అతిశయితఙ్గళాన గుణఙ్గళ్, నిలై పెఱ - నిలైయాయిరుక్కుమ్బడి, తన్-తనతు, కనై - ధ్వనియా నిఱ్కుఱ, కఴల్కీఴ్ - తిరువడికళిన్ కీఴ్, (కనై - ధ్వని, శ్రీపాదాభరణధ్వని ఇఙ్గు శొల్లప్పడుకిఱదు) అడైక్కలమాయ్ - రక్ష్యవస్తువాక వాకిఱ, కాట్చి - పెరుమైయై, తన్దు - కొడుత్తు, కారణనాన్తన్ కావల్ - జగత్కారణ భూతనాన తన్నుడైయ రక్షకత్వత్తై, కవర్కిన్ఱాన్ - నిలైనిఱుత్తిక్కొళ్ళుకిఱాన్.**

**ద్వయము - శ్రీరంగనాథుడై దయచూపుట**

9. ఎన్నదు యాన్ శెయ్కిన్ఱేనెన్నాతారుక్కు
ఇన్నడిమై తన్దళిప్పా నిమైయోర్ వాఴుమ్
పొన్నులకిల్తిరువుడనే యమర్న్ద నాదన్
పునలారుమ్ పొఴిలరఙ్గన్దికఴ్ మన్ని
త్తన్నకల మకలాద తకవాలోఙ్గుమ్
తకవుడనే తన్ కరుమ న్దానే యెణ్ణి
యన్నై యెన వడైక్కలఙ్గొణ్డఞ్జలన్దె
న్నఴలాఱ నిఴలార వళిక్కిన్ఱానే

ఎన్నదు యాన్ శెయ్కిన్ఱేన్ ఎన్నాదారుక్కు = ఈ వస్తువు నాది, దీనిని నేను చేయుచున్నాను - అను మమకార-అహంకారములు లేనివారికి, ఇన్ అడిమై తన్దు అళిప్పాన్ = మధురమైన కైంకర్యమును అనుగ్రహించి, రక్షించుటకు, ఇమైయోర్ వాఴుమ్ పొన్ ఉలకిల్ = నిత్యసూరులు నివసించు (పరమపదమను) బంగారు (వంటి గొప్ప) లోకములో, తిరువుడనే అమర్న్ద నాదన్ = లక్ష్మీదేవితో వేంచేసియున్న భగవానుడు, పునల్ ఆరుమ్



పొఴిల్ అరఙ్గమ్ తికఴ్ మన్ని = జలసమృద్ధి నిండిన, తోటలచే చుట్టబడియున్న శ్రీరంగము వెలుగునట్లు, స్థిరముగానుండి, తన్ అకలమ్ అకలాద = తన వక్షఃస్థలమును విడచియుండని, తకవాల్ ఓఙ్గుమ్ = కరుణాస్వరూపిణియైన లక్ష్మీదేవి సంబంధముచే వృద్ధిచెందుచున్న, తకవుడనే = కరుణతో,తన్ కరుమమ్ తానే ఎణ్ణి = (నన్ను రక్షించుట అను) తన బాధ్యతను తాను స్మరించి, అన్నై ఎన అడైక్కలమ్ కొణ్డు = కన్నతల్లి అనునట్లు (నన్ను) రక్షింపవలసిన వస్తువుగా గ్రహించి, అఞ్జల్ తన్దు = అభయప్రదానముచేసి, ఎన్ అఴల్ ఆఱ = నా (సంసార) తాప మంతయు తీరునట్లు, నిఴల్ ఆర = తన శ్రీపాదచ్ఛాయను పూర్ణముగా అళిక్కిన్ఱానే = అనుగ్రహించి, రక్షించుచున్నాడు.

శ్రీ వైకుంఠమునందు నిత్యసూరులచే అవిచ్ఛిన్నముగా సేవింపబడు శ్రీమన్నారాయణుడు, అహంకార-మమకారములు లేక తనను ఆశ్రయించినవారికి తన కైంకర్యమును చేయు భాగ్యమును ఇచటనే ఇవ్వవలెనని తలచి, శ్రీరంగములో శయనించి, నిత్యవాసమును చేయుచున్నాడు. అతనికి చేతనులపట్ల సహజముగా కల కరుణ తన వక్షఃస్థలములో కరుణారూపిణియై వెల్గు పిరాట్టి సంబంధముచే మీదుమిక్కిలి వృద్ధిచెందుచున్నవి. అట్టి కరుణతోకూడిన ఆ స్వామి నాకు కన్న తల్లివలె నిలచి, నన్ను కాపాడుటను తన బాధ్యతగా భావించి, అభయ మిచ్చి, నా సంసారతాపము అంతయు తీరునట్లు తన పాదచ్ఛాయను నాకు అనుగ్రహించెను.

**తమిళ:- ఇని ఉత్తరఖండార్థత్తై సంగ్రహియానిన్ఱుకొణ్డు కైంకర్యఙ్గళై కొళ్ళుకైక్కాకవుమ్, చేతనవర్గత్తై రక్షిక్కైక్కాకవుమ్ పరమపదత్తై విట్టు ఒరు పయణమెడుత్తు కోయిలిలే వన్దు కణ్వళర్న్దరుళు కిఱాన్ ఎన్ఱరుళిచ్చెయ్కిఱార్. (ఎన్న) దిత్యాది. ఎన్నదు - ఎన్నుడైయతు, యాన్ శెయ్కిన్ఱేన్ - నాన్ కర్మఙ్గళై అనుష్ఠిక్కిన్ఱేన్, ఎన్నాదార్క్కుమ్ - ఎన్ఱు శొల్లామల్, (ఎమ్బెరుమాన్ తన్ కర్మఙ్గళై త్తానే తన్ ప్రీతిక్కాక శెయ్విక్కిన్ఱానెన్ఱు సాత్వికత్యాగపూర్వకమాక కర్మానుష్ఠానమ్ శెయ్బవర్క్కుమ్) ఇన్నడిమై - భోగ్యమాన కైంకర్యత్తై, తన్దు - కొడుత్తు, అళిప్పాన్ - రక్షిక్కిన్ఱవనుమ్, ఇమైయోర్ వాఴుమ్ పొన్నులకిల్ - నిత్యసూరికళ్ వాఴానిన్ఱుళ్ళ స్పృహణీయమాన లోకత్తిలే, (నిత్యభోగ్యమాన పరమపదత్తిలెన్ఱపడి), తిరువుడనే - పెరియపిరాట్టియారుడనే, అమర్న్ద-నిత్యవాసమ్ శెయ్కిఱ, నాదన్ - సర్వస్వామియాన నారాయణన్, పునల్ ఆరుమ్ - జలమ్ నిఱైన్ద, పొఴిల్ - శోలైకళైయుడైయ, (శోలై - తోట్టమ్) అరఙ్గమ్ - శ్రీరంగమానతు, తికఴ్- ప్రకాశిక్కుమ్బడి, మన్ని - స్థిరప్రతిష్ఠనాయిరున్దు, తన్నకలమ్ - తన్ సమీపత్తై విట్టు, అకలాద-నీఙ్గాద, తకవాల్ - కృపైయినాల్, ఓఙ్గుమ్ - వృద్ధి యడైన్ద, తకవుడనే -**

ప్రసాదత్తోదే, తన కరుమమ్ - మోక్షప్రదానరూపమాన తన్ కృత్యత్తై, తానే యెణ్ణి - తానే విరకు పార్త్తు, (విరకు-వ్యాజమ్), ఎన్నైయుమ్ - అకించననాన వడియేనైయుమ్, అడైక్కలమ్ కొణ్డు - రక్ష్యవస్తువాక స్వీకరిత్తుక్కొణ్డు, అఞ్జల్ తన్దు-అభయప్రదానమ్ శెయ్దు, ఎన్నఁల్ - అడియేనుడైయ సమస్తతాపముమ్, అఱ - అఱుమ్బడియాక, నిఁల్ - తన్ తిరువడినిఁలై, ఆర - పూర్ణమాక, అళిక్కిన్షాన్ - కొడుక్కిన్షాన్.

చరమశ్లోకము - శ్రీ కృష్ణుని ఉపదేశము

10. ఒణ్డొడియాడిరుమగళుమ్ తానుమాకి
యొరునినైవా లీన్ఱ వుయిరెల్లా ముయ్య
వణ్డువరై నకర్ వాఁ వశుదేవణ్ఱాయ్
మన్నవఱ్కు త్తేర్ప్పాకనాకి నిన్ఱ
తణ్డుళవమలర్మార్బన్ఱానే శొన్న
తనిత్తరుమన్దానెమక్కాయ్ త్తన్నై యొన్ఱు
ఙ్కణ్డు కళిత్తడిశూడ విలక్కాయ్ నిన్ఱ
కణ్పుదైయల్ విళైయాట్టై క్కఁక్కిన్షానే

ఈ పాశురముయొక్క అర్థ తాత్పర్యాదులు అధికారసంగ్రహములోని 46వ పాశురమువద్ద గమనింపనగును. ఈ రెండు పాశురములు ఒకటియే. ఈ పాశురమునుండి 14వ పాశురము వరకుగల అయిదును సారసారములోని చరమశ్లోకాధికారమునందు కలవు. ''ఒణ్డొడియాళ్ తిరుమకళుమ్'' ఇత్యాది తిరువాయ్‌మొళి సూక్తి ప్రకృతమున అనుసంధేయములు. అట్లే **"కణ్పుదైయల్ విళైయాట్టై"** అనునపుడు **"లోకవత్తు లీలాకైవల్యమ్", "ఇన్బు ముఱు మివ్విళైయాట్టుడైయాన్", "క్రీడేయం ఖలు", "క్రీడసి శ్రీసమక్షమ్"** ఇత్యాది ఆఁళ్వార్ల, ఆచార్యుల సూక్తులు భావ్యములు.

**తమిళ:- ఇప్పడి ఇరణ్డధికారత్తాలే ప్రథమ-మధ్యమ-రహస్యార్థఙ్గళై యరుళిచ్చెయ్న్న ఉపాయమ్ సంసారనివర్తకమాకైయాలే స్వస్య లీలారసభఙ్గమ్ వారాతో! ద్వయత్తిల్ శ్రీవైశిష్ట్యమిరుక్క, తద్విరుద్ధమాక ''మా మేకమ్'' ఎన్ఱు తాన్ శొల్లలావో! ఇత్యాదిశంకాపరిహారపూర్వకమాక వన్ద శ్లోకావతారక్రమత్తై యరుళిచ్చెయ్కిఱార్ (ఒణ్డొడియా)ళిత్యాది. తణ్డుళవమలర్మార్బన్-తణ్ - శీతలమాన, తుళవ - తిరుత్తుఁాయ్, మలర్ - పుష్పత్తై, మార్బన్ - వక్షఃస్థలత్తిలే యుడైయవన్, శరణ్యన్. (ఇదు కర్తృపదమ్), ఒణ్డొడియాళ్-ఒణ్ - అఁకియదాయిరుక్కిఱ, తొడి - హస్తాభరణత్తైయుడైయ, తిరుమకళుమ్ - పిరాట్టిమారుమ్, తానుమాకి - న కేవలం**



**స్వయ మేవ, కిం తు శ్రియా సహితో భూత్వా-ఇత్యర్థః, ఒరు నినైవాలీన్ఱ - "బహుస్యా" మెన్ఱు ఏకరూపసంకల్పత్తాలే సృష్టిత్త, ఉయిరెల్లా ముయ్య-చేతనరెల్లారు ముజ్జీవిక్కుమ్బడి, (ఇదఱ్కు ''త్తానే శొన్న'' వెన్గిఱత్తోదే అన్వయమ్) వణ్డువరై నకర్ వాఁ - అఁకియతాయిరుక్కిఱ ద్వారకాజనపదమ్ వాఁమ్బడి, వసుదేవణ్ఱాయ్ - వసుదేవకుమారనాయ్ అవతరిత్తు, అనంతరమ్, మన్నవర్క్కు - పాండవర్కళాన రాజాక్కళుక్కు, తేర్‌పాకనాకి నిన్ఱ - సౌలభ్య -సౌశీల్యాదిస్వభావత్తాలే పాండవసారథియాయ్ నిన్ఱ, తానే శొన్న - (సకలజీవర్కళుమ్ ఉజ్జీవిక్కుమ్బడియాక శ్రీపార్థసారథి) స్వయ మేవ శొన్నదాన, (న తు పరప్రేష్యాది ముఖేన - ఎన్ను కరుత్తు) తని - అద్వితీయమాన, తరుమమ్ - "కృష్ణం ధర్మమ్ సనాతనమ్," మెన్గిఱపడియే సిద్ధోపాయభూతనాన, తాన్ - తామే, ఎమక్కాయ్ - అస్మాకమ్, స్వీకృతభరనాయ్‌క్కొణ్డు, ఉపాయభూతనాయ్, తన్నై - తన్నై, ఎన్ఱుమ్ - సర్వదా యావదాత్మభావి కణ్డు - దేశవిశేషత్తిలే కిట్టి సాక్షాత్కరిత్తు, కళిత్తు - ప్రేమపరశనాయ్, అడి శూడ - శిరసా పాదవహనోపలక్షిత సర్వవిధకైంకర్యత్తిఱ్కు, విలక్కాయ్ నిన్ఱ - ప్రతిబంధకమాయ్ నిన్ఱ, కణ్పుదైయిల్ విళైయాట్టై - నయనపిధానమయాం చ క్రీడామ్, (తత్త్వహితపురుషార్థవివేకచక్షుః పిధానాత్మకసంసారబంధలీలామ్) కఁక్కిన్షానే - నివర్తిప్పిక్క విరకుశెయ్‌కిన్షానే) స్వస్య లీలారసాపేక్షయాపి స్వపుత్రదాసాదిభూతనమస్తచేతనోజ్జీవనుమ్ తనక్కు భోగరసవర్ధకమాకైయాలే పురుషార్థ హానికర మెన్ఱు కరుత్తు. సృష్ట్యుపలక్షిత స్థితిసంహారమోక్షప్రదానాదికళుమ్ శ్రియఃకారణత్వబోధకమాకైయాలే "మా మేక" మెన్గిఱవిడత్తిలుమ్ శ్రీవైశిష్ట్యత్తిలే తాత్పర్యమాకైయాలే ద్వయాద్యుక్తవిశిష్టప్రపత్తవ్య విరోధమిల్లై - ఎన్ఱు కరుత్తు.**

చరమశ్లోకము - ప్రపత్తిలో అన్వయింపజేయుట

11. తుయ్య మనత్తర్‌తుఱై యణుకాద తుణైయిలియేన్
ఐయమఱుత్తునదాణై కడత్తలకఁఁనై నీ
కైయమర్ శక్కరక్కావల్ కాక్కు న్దిరువరుళాల్
వైయమళన్ద వడిక్కీఁడైక్కలమ్ వైత్తరుళే

కై అమర్ శక్కర క్కావల్ = శ్రీ హస్తములో అమరియున్న చక్రముతో (దాసవర్గమును) రక్షింపగలవాడా! తుయ్య మనత్తర్ తుఱై అణుకాద = పరిశుద్ధమైన మనస్సును గల ఉన్నతులైన అధికారులచే అనుష్ఠింపబడు (భక్తియోగము మొదలగు) ఉపాయములందు అన్వయించుటకుకూడ శక్తిలేనివాడను, తుణై ఇలియేన్ = వేఱు గతి లేనివాడనగు నాకు,

ఐయమ్ అఱుత్తు = (ఫలమును పొందుటలోగల) సందేహములను పోగొట్టి, ఉనదు ఆణై కడత్తల్ = నీ ఆజ్ఞను అతిక్రమించి నడచుట అనెడి అపరాధమును, నీ అకఱ్ఱినై = నీవు పోగొట్టితివి (ఇక నీవు చేయవలసినది ఏమనగా), కాక్కుమ్ తిరు అరుళాల్ = (లోకమునంతటిని) రక్షింపగల నీ గొప్ప కృపతో, వైయమ్ అళన్ద అడి క్కీఴ్ = (పూర్వము త్రివిక్రముడవై) లోకమును కొలిచిన నీ శ్రీపాదముల క్రింద, అడైక్కలమ్ వైత్తరుళ్ = (నన్ను) రక్ష్యవస్తువుగా చేసి, అనుగ్రహింపుము.

శ్రీహస్తమునందు సుదర్శనమును గైకొని, రక్షకుడవైయున్నవాడా! విశేషమైన జ్ఞానమును, శక్తిని పొందిన అధికారులకు తగిన భక్తియోగము మొదలగువానిని అనుష్ఠించు శక్తిని, నిన్ను తప్ప వేరు గతిని లేని ఈ దాసునకు ఫలమును పొందుటలోగల సందేహములను తీర్చి, ఇక నీపట్ల అపరాధమును చేయకుండునట్లు అనుగ్రహింపుము. లోకము అంతయు నీ నీడలో ఒదిగియుండునట్లు కొలిచిన నీ శ్రీపాదముల క్రింద, ఉపాయమును అనుష్ఠించిన నన్ను ఒక రక్ష్యవస్తువుగా గ్రహింపవలెను.

**తమిళ:- ఇప్పడి ఇశ్లోకత్తై యవతరిప్పిత్తు, అదిల్ పూర్వార్థప్రతిపాద్యమాన అర్థఙ్గళై పదశః విశదమాక అరుళిచ్చెయ్దు, ఇప్పడి తా మరుళిచ్చెయ్ద ప్రపత్తివిధాయక వాక్యార్థత్తై యవనై యభిముఖీకరిత్తు, ఇవ్వుపాయత్తై అకించననాన ఎనక్కు అనుష్ఠిక్కవేణ్డుమ్ రక్షకనాన నీయే యెన్ఱు శొల్లుకిఱ వొరు పాశురత్తాలే సంగ్రహిక్కిఱార్ (తూయ మనత్త) రిత్యాదినా.**

**(కై యమర్ శక్కర క్కావలన్)- కై - తిరుక్కైయిలే, అమర్-స్థిరప్రతిష్ఠితమాయిరుక్కిఱ, శక్కర - సుదర్శనాఖ్యచక్రత్తైయుడైయవనాన, కావలన్ - రక్షకనానవనే (ఇత్తాల్ స్వారాధన విరోధినిరసనసామగ్రినిత్యయోగముమ్, రక్షణోద్యుక్తత్తైయుమ్ శొల్లిఱ్ఱు) నీ - (స్వాశ్రితవిరోధి నిరసనశీలనాన) నీ, (ఇదుక్కు “వైత్తరుళె” న్గిఱ క్రియైయోడే అన్వయమ్) తూయ మనత్తర్ - పరిశుద్ధమనస్కరుడైయ, తుఱై యణుకాద - అవర్కళ్తుఱైయాన కర్మయోగాదికళై కిట్టాదవనాన, (తుఱై - ఎన్గిఱదు అవతరణస్థలమాయ్, లక్షణయా పరిశుద్ధమనస్కర్ ఇఴన్ద ఉపాయవిశేషత్తై చ్చొల్లుకిఱతు. ఇదు హేతుగర్భవిశేషణమ్. అవర్కళ్ తుఱైయై యణుకాదదనాలే) తుణై యిలియేన్ - సహాయాంతరమిల్లాద అకించననాన వెనక్కు (తుణైయిల్లాదవన్ తన్నై చ్చొల్లిక్కొళ్ళుమ్బోదు “తుణైయిలియేన్” ఎన్ఱు రూపమ్), ఐయమఱ త్తుణైయానై -అయ్యమ్ - సంశయమ్, అదు అఱుమ్బడి తుణైయాదవనై (నిస్సంశయమాక తుణైయా యిరుక్కిఱ ఉన్నై - ఎన్ఱపడి) కడైత్తలై - కడశిప్రదేశత్తలే, (గీతైయినుడైయ అంతిమప్రదేశత్తి లెన్ఱపడి)**



**కఱ్ఱినై - అభ్యసిప్పిత్తాయ్ (ఉపదేశిత్తాయ్ ఎన్ఱపడి - “ఉన్ కడత్తలై యిరున్దు వాఴుమ్’ ఎన్గిఱ విడత్తిల్పోలే లక్షణయా “కడత్తలై” ఎన్ఱు తిరువడికళై చ్చొల్లి, నిస్సంశయమాక తుణైయానవనుడైయ తిరువడికళై ఉపాయమాక ఉపదేశిత్తాయ్-ఎన్ఱుమ్ యోజిక్కలామ్), యద్వా, - “తుణైయిలియేన్” - అకించననాకైయాలే సహాయమిల్లాద నాన్, తూయ మనత్తర్తుఱై యణుకాద సహాయభూతనాన వున్నై, ఐయ మఱ - సంశయ మిల్లాదపడి, కడత్తలై కఱ్ఱినై - అంతిమోపాయమాక ఉపదేశిత్తాయ్, ఇదు విధిపక్షత్తై చ్చేరుమ్. మున్ యోజనై అనువాదపక్షమ్. కాక్కుమ్ తిరువరుళాల్ - అకించనజనత్తై రక్షిక్కుమతాన శ్రీమత్కృపైయాలే. సర్వజనరక్షకైయాన పిరాట్టికృపైయాలే-యెన్ఱుమామ్. ఇత్తాల్ “మా మేకమ్” ఎన్గిఱవిడత్తిల్ సౌలభ్యాదిగుణయోగముమ్, పత్నీసంబంధముమ్ వివక్షిత మెన్ఱపడి. వైయ మళన్ద అడిక్కీఴ్ - భూమియై యళన్దు కొణ్డ తిరువడికళిన్ కీఴ్, అడైక్కలమ్ వైత్తరుళే - రక్ష్యవస్తువాక వైత్తరుళాయే. ఇత్తాలిఙ్గు “మా మేక” మెన్గిరున్దాలుమ్ ఇదుక్కు మూలమాన ద్వయత్తిల్పోలే తిరువడికళిల్ సంబంధమ్ వివక్షితమెన్ఱపడి.**

**చరమశ్లోకము - ముక్తిని పొందుటకై త్వరపడుట**

**12. అఱియాద విడైచ్చియరు మఱియుమ్ వణ్ణమ్**
**అమ్బుయత్తాళుడ నన్నాళవతరిత్త**
**కుఱైయాదు మిల్లాద కోవిన్దా నిన్**
**కురైకఴల్కీఴడైక్కలమా ఙ్కుఱిప్పు త్తన్దాయ్**
**వెఱియారు మలర్మకళు నీయుమ్ విణ్ణిల్**
**విణ్ణవర్కళడిశూడ విరుక్కు మేన్మై**
**కుఱైయాద వినై యకఱ్ఱి యడిమై కొళ్ళ**
**క్కుఱుక వొరు నన్నాణీ కుఱిత్తిడాయే**

అఱియాద ఇడైచ్చియరుమ్ = జ్ఞానము లేని గోప స్త్రీలుకూడ, అఱియుమ్ వణ్ణమ్ = (తనను) తెలిసికొని, అనుభవించు రీతిలో, అమ్బుయత్తాళుడన్ అన్నాళ్ అవతరిత్త = తామరపుష్పమందు నివసించు లక్ష్మీదేవితోపాటు పూర్వము (ఈ లోకములో) అవతరించినవాడవగు, కుఱై యాదుమ్ ఇల్లాద కోవిన్దా = కొఱత ఏమియులేని పరిపూర్ణుడవగు గోవిందా ! నిన్ కురై కఴల్ కీఴ్ = నీ (కడియములచే) శబ్దించు శ్రీపాదముల క్రింద, అడైక్కలమ్ ఆమ్ కుఱిప్పు త్తన్దాయ్ = రక్షింపబడవలసిన వస్తువుగా అగునట్టి స్థితిని నాకు అనుగ్రహించితివి, వెఱి ఆరుమ్ మలర్ మకళుమ్ నీయుమ్=

పరిమళముతో నిండిన తామరపూవులోనున్న లక్ష్మీదేవి,నీవును,విణ్ణవర్కళ్ అడి శూడ= నిత్యసూరులు, ముక్తులును నీ శ్రీ పాదములను తమ శిరస్సున దాల్చి, కైంకర్యమును చేయగా, విణ్ణిల్ ఇరుక్కుమ్ మేన్మై = శ్రీవైకుంఠములో వేంచేసియున్న స్థితిలో నిలచి, కుఱైయాద వినై అకఱ్ఱి = మావద్ద ఎట్టి కొఱత లేక, పూర్ణముగానున్న కర్మలను పోగొట్టి, అడిమై కొళ్ల = (మా) కైంకర్యములను స్వీకరించుటకు, కుఱుక ఒరు నల్ నాళ్ = త్వరగా లభించునట్లు ఒక మంచి కాలమును, నీ కుఱిత్తిడాయ్ = నీవు నిర్ణయింపవలెను.

విశేషజ్ఞానము లేని గోపికలుకూడ తన మహిమను తెలిసికొని, అభినివేశమును పొందునట్లు లక్ష్మీదేవితో పూర్వము అవతరించి, దానివలన శరణు పొందుటకు తగిన చక్కని తలపును నాకు కల్గించితివి. శ్రీ వైకుంఠమునందు నిత్యసూరులు, ముక్తులును ఎడతెగని చేయు కైంకర్యమును లక్ష్మీసహితుడవైన నీకు అదేచోట, నేను కూడ కర్మలను తొలగించుకొని, చేయునట్టి ఒక మంచికాలము త్వరగా వచ్చునట్లు అనుగ్రహింపుము.

ఈ పాశురము ఎణ్శీర్ ఆశిరియవిరుత్త ఛందస్సులో కూర్చబడినది. **"రాఘవత్వే ఉ భవ త్సీతా రుక్మిణీ కృష్ణజన్మని"** ఇత్యాదిపురాణప్రమాణమును, తిరుప్పావైలోని **"కుఱై ఒన్ఱు మిల్లాద గోవిన్దా"** అను సూక్తిని, **"శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే"** ఇత్యాది సూక్తిని **"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైః భాగవతైః సహ"** అను సూక్తిని, **"ఉన్కమలమన్న కుఱై కழలే"** అను సూక్తిని ఈ పాశురసూక్తులకు అనుగుణముగా అనుసంధింపనగును.

**తమిళ:-ఇప్పడి పూర్వార్ధత్తుక్కు అర్థమ్ అరుళిచ్చెయ్తు అనంతరముత్తరార్ధత్తిల్ పాపనివర్తనాదిరూపఫలప్రతిపాదకమాన ఇరణ్డువాక్యజ్గళుక్కుమ్ పదార్థజ్గళైయుమ్, తాత్పర్యార్థజ్గళైయుమ్ అరుళిచ్చెయ్తు అధికారార్థసంగ్రహత్తై సంగ్రహియానిన్ఱుకొణ్డు స్వప్రార్థనారూపమాన ఒరు గాథైయాలే ఫలాంశత్తై విస్తారమాక వరుళిచ్చెయ్కిఱార్. (అఱియాద) ఇత్యాది. అన్నాళ్ - భారాక్రాంతైయాన భూమి ఉన్నవతారత్తై అపేక్షిత్తపోదు, అమ్బుయత్తాళుడన్ - కమలవాసినియాన పిరాట్టిమారుడనే, అఱియాద ఇడైచ్చియరుమ్ - ఇడక్కై వలక్కై తెఱియాద గోపికళుమ్, అఱియుమ్ వణ్ణమ్ - స్వభావత్తై అఱియుమ్పడి, (వణ్ణమ్ - స్వభావమ్) అవతరిత్తాయ్ - వసుదేవకుమారనాయ్ అవతరిత్తరుళినాయ్. ("అవతరిత్త" ఎన్ఱు పాఠమానాల్ గోవిన్దనుక్కు విశేషణమ్. ఇదువే సమీచీనమ్.) కుఱై యాదు మిల్లాదు కోవిన్దా - (యాదుమ్ - ఈషత్తుమ్, యాదుమ్ కుఱై ఇల్లాదవనాన గోవిందశబ్దవాచ్యనే, నిన్ కుఱై కழల్ కీழ் - ఉన్నుదైయ శబ్దాయమానమాన తిరువడికళిన్**



**కీழ். (చరణస్య శబ్దాయమానత్వమ్ కటకనూపురాదినా), అడైక్కలమా ఝ్గుఱిప్పు - (కుఱిప్పు - సావధానమ్, ఇఝ్గు ధర్మిపరమ్) అడైక్కలమాకానిన్ఱ సావధానకృత్యత్తై (నామ్ రక్ష్యవస్తు వాకైక్కాక ఉన్ తిరువడికళిలే శరలక్ష్యమ్ వేధనమ్బోలే జ్ఞానత్తాలే స్వరూపాదికళై సావధానమాయ్ సమర్పిక్కు వేణ్డుమదాన ప్రపత్తియై - ఎన్ఱపడి) తన్దాయ్ - కొడుత్తాయ్. (నీ ఎన్నై క్కొణ్డు పణ్ణివైత్తాయ్ - ఎన్ఱపడి) (వెఱియారుమ్ మలర్మకళుమ్) - వెఱి - పరిమళమ్, ఆర్ - పూర్తి, పరిమళపూర్ణమాన పుష్పత్తిల్ వసిక్కుమవళాన పిరాట్టియుమ్, నీయుమ్-అవళుక్కు పతియాన నీయుమ్, విణ్ణిల్ - పరమపదత్తిల్, విణ్ణవర్కళ్ అడిశూడ - నిత్యసూరికళ్ తిరువడికళై శిరోభూషణమాక వహిక్కుమ్పడి. (ఇదు సర్వవిధకైంకర్యత్తుక్కుమ్ ఉపలక్షణమ్) ఇరుక్కు మేన్మై - నిత్యవాసమ్ పణ్ణుమ్ మేన్మైయై. (మేన్మై - పరత్వాదికళ్, ఇదుక్కు క్రియైయోడే అన్వయమ్) కుఱియాద - ప్రాయశ్చిత్తాదికళాలే వినాశ్యమల్లాదవైయాన, వినై - ప్రపత్తివిరోధిపాపఝ్గళై, అకఱ్ఱి - పోక్కడిత్తు (సుహృదాదికళిడత్తిల్ అకలప్పణ్ణి - యెన్ఱపడి) అడిమై - దాసకృత్యమాన కైంకర్యత్తై, కొళ్ళ-స్వీకరిక్కైక్కాక, కుఱుకు - శీఘ్రమాక, ఒరు నన్నాళ్ - ఏదేను ఒరుమొరు నల్లనాళిలే, (పరమపదప్రదత్వమే నన్మై నాళుక్కు), కుఱిత్తిడాయే - సావధానమాక (నా అకన్ఱు పోకాదపడి తరుకైయే సావధానమ్) కృపైయాలే కొడాయే, (ఇదుకై - కొడుక్కై, ఎన్నై ఉద్దేశిత్తు అన్ద మేన్మైయై క్కొణ్డాయ్-ఎన్ఱుమామ్)**

రహస్యత్రయము తెలుపు అర్థములు

**13.** తత్తువము శాదనముమ్ పయను జ్కాట్టు
 న్దారముదలిరునాన్గు న్తన్ కరుత్తాల్
 ముత్తి వழி నా ముయలుమ్ వకైయే కాణ
 ముకున్ద నిశైత్తరుళ్ శెయ్ద వైన్నాలైన్దుమ్
 పత్తిద నిబ్బడివిల్లార్ పరఝ్గుమత్త
 పార్త్తన్తేర్మున్నే తాన్నాழ நిన్ఱ
 వుత్తమనా రుత్తమ నల్లురై నాలెట్టు
 మునర్న్దవర్ తా ముక న్దెమ్మై యుణర్విత్తారే

తత్తువముమ్ శాదనముమ్ పయనుమ్ కాట్టుమ్ = తత్త్వమును, ఉపాయమును, ఫలమును చూపుచున్న, తారమ్ ముదల్ ఇరు నాన్గుమ్ = ప్రణవమును మొదలుకొని ఎనిమిది అక్షరములను కల్గిన తిరుమంత్రమును, ముత్తి వழி = మోక్షోపాయమునందు, నామ్ ముయలుమ్ వకైయే కాణ = మనము అనుష్ఠించు ప్రకారమును చూపుటకొఱకు,

ముకున్దన్ తన్ కరుత్తాల్ = భగవానుడు తన చిత్తముతో, ఇశైత్తు అరుళ్శెయ్ద= (వేదములో విభజింపబడిన రెండు భాగములను) ఒకటిగాచేసి (లోకమునకు) అనుగ్రహించిన, ఐన్నాలైన్దుమ్ = ఇరువది అయిదు అక్షరములను కల్గిన ద్వయమును, పత్తితనిల్ పడివు ఇల్లార్ = భక్తియోగమునందు అభినివేశమును పొందలేనివారు, పరమ్ శుమత్త = తమను రక్షించు బాధ్యతను (అతనిపై ఉంచి) మోయునట్లు చేయగా, పార్త్తన్ తేర్ మున్నే = అర్జునుని రథమునందు, తాఴ్ నిన్ఱ = (సారథియై) తక్కువవాడైయున్నవాడగు, ఉత్తమనార్ = సర్వేశ్వరుని, ఉత్తమ నల్ ఉరై నాల్ ఎట్టుమ్= ఉన్నతమైన సదుపదేశమును, ముప్పదిరెండు అక్షరములను కల్గిన చరమశ్లోకమును, ఉణర్న్దవర్ = (అర్థముతోపాటు) తెలిసిన ఆచార్యులు, ఎమ్మై ఉకన్దు = మమ్ములను కోఱి, ఉణర్విత్తార్ = ఉపదేశించిరి.

ఎనిమిది అక్షరములను కల్గిన అష్టాక్షరీమంత్రము తత్త్వమును, ఉపాయమును, పురుషార్థమును తెలుపుచున్నది. వేదములో వేర్వేరుగానున్న రెండు భాగములను భగవానుడు వానిని ఏకముచేసి అనుగ్రహించిన ఇరువది అయిదు అక్షరములును కల్గిన ద్వయము ప్రపత్తిని మనము అనుష్ఠింపవలసిన క్రమమును తెలుపును. అర్జునుని రథములో సారథియై నిలచి, తన సౌలభ్యమును చూపిన శ్రీకృష్ణుడు అనుగ్రహించిన ముప్పదిరెండు అక్షరములను కల్గిన చరమశ్లోకము భక్తియోగానుష్ఠానములో శక్తిలేని ప్రపన్నులు మోయు భారమును శ్రీకృష్ణుడు తాను వహించి, ఆయా ఉపాయముల స్థానములో తానే నిలచిన స్థితిని తెలుపును. ఈ రహస్యముల అర్థమును ఆచార్యులు చక్కగా గ్రహించి, మనకు ఉపదేశించిరి. **"ఉణర్న్దవర్తామ్"** అనునపుడు **"తామ్"** అనునది నిరర్థకపదము.

**తమిళ:- ఇప్పడి మూన్ఱధికారత్తాలే తా మరుళిచ్చెయ్ద రహస్యత్రయార్థఙ్గళై సంగ్రహియానిన్ఱుకొణ్డు ఇవ్వర్థఙ్గళెల్లామ్ సదాచార్యప్రాప్తఙ్గళెన్ఱు కాట్టుకిఱార్. (తత్తువము) మిత్యాది. తత్తువముమ్-శేషశేషికళాన జీవేశ్వరాదితత్స్వరూపఙ్గళైయుమ్, శాదనముమ్ - మోక్షోపాయత్తైయుమ్, పయనుమ్ - ఫలత్తైయుమ్, కాట్టుమ్ - ప్రతిపాదిక్కిన్ఱ, తారముదల్ - ప్రణవత్తై ముదలాక వుడైయ, ఇరు నాన్గిన్ - ఎట్టు తిరువక్షరఙ్గళైయుడైయ తిరుమంత్రత్తినుడైయ, తన్ కరుత్తాల్ - అర్థఙ్గళాలే, ముత్తి వఴి-ముక్తి మార్గమాన ప్రపత్తియై, నామ్-తిరుమంత్రత్తాలే స్వరూపమ్ తెళిన్ద నామ్, ముయలుమ్ వకైయే కాణ - అభినివేశత్తోడే యనుష్ఠిక్కుమ్ ప్రకారత్తై క్కాణైక్కాక, ముకున్దన్ - మోక్షప్రదనాన శ్రియఃపతి, ఇశైన్దు - కఠశ్రుతియిలే పిరియ వోదిన ఖండద్వయత్తై చ్చేర్త్తు, అరుళ్శెయ్ద - కృపైయాల్ తన్ద తాన్, ఐన్దాలైన్దుమ్ - ఇరుపత్తైన్దక్షరమాన ద్వయమామ్ (ఇదుక్కు క్రియైయిలే అన్వయమ్) పత్తితనిల్ - భక్తియోగత్తిలే, (తన్ స్వార్థే), పడి విల్లాదార్ - ఆసక్తియిల్లాదవర్కళ్, పరమ్ శుమత్త - భరత్తై శుమత్తుకైక్కాక (అకించననుడైయ శుమైయాన భరత్తై తన్ శుమైయాక వంగీకరిక్కైక్కాక ఉణ్డాన. ఇదఱ్కు ఉరైనాలెట్టెన్గిఱత్తోదన్వయమ్) పార్త్తన్ తేర్మున్నే - అర్జునరథత్తినుడైయ మున్తట్టాలే, తాన్ - స్వయ మేవ, తాఴ్ నిన్ఱు - పార్థసారథి యెన్ఱు తాఴ్చ్చియాక చ్చొల్లుమ్పడి కీఴ్ స్థిరమాయిరున్ద, ఉత్తమనాల్ - ఇప్పడిప్పట్ట సౌశీల్యాదిగుణత్తాలే సర్వోత్కృష్టనానవనుడైయ, ఉత్తమ-(అకించనోపాయప్రతిపాదకమాకైయాలే కీఴ్శ్లోకఙ్గళుక్కు) శ్రేష్ఠమాన, నల్లురై నాలెట్టుమ్ - నల్లదాన శబ్దఙ్గళైయుడైయ ముప్పత్తిరణ్డక్షరముమ్ (చరమశ్లోకము మెన్ఱపడి) ఉణర్న్దవర్తామ్ - ఇదుకళై సదాచార్యర్కళ్ ఇడత్తిల్ నన్ఱాక అఱిన్దవర్కళ్తాఙ్గళే, ఉకన్దు - సంతోషిత్తు, (ఖ్యాత్యాదియన్ఱియిలే), ఎమ్మై - అవర్కళై ఆశ్రయిత్త ఎఙ్గళై, ఉణర్విత్తార్ - అఱియుమ్పడి పణ్ణివైత్తార్కళ్.**



### ప్రత్యుపకారమును ఆశింపని ఆచార్యుల స్వభావము

**14.** **పరక్కుమ్ పుకఴ్ వరుమ్ పైమ్బొరుళ్ వాయ్త్తిడుమ్ పత్తరకళా**
**యిరక్కిన్ఱవర్క్కివై యీన్దాలఱముళదెన్ఱియమ్బార్**
**కరక్కు ఙ్కరుత్తుడై త్తేశికర్ కన్ఱైన నమ్మై యెణ్ణి**
**చ్చురక్కు ఞ్జురవికళ్పోఱ్చొరికిన్ఱనర్ శొల్లముదే**

కరక్కుమ్ కరుత్తుడై త్తేశికర్ = (రహస్యార్థములను), రహస్యముగనే నిలిపియుంచవలెనని తలచిన మన పూర్వాచార్యులు, పత్తర్కళాయ్ ఇరక్కిన్ఱవర్క్కు = భక్తులైవచ్చి ప్రార్థించిన అధికారులకు, ఇవై ఈన్దాల్ = ఈ రహస్యార్థములను ఉపదేశించినచో, పరక్కుమ్ పుకఴ్ వరుమ్ = (లోకములో) విస్తరించు కీర్తి కలుగును, పైమ్బొరుళ్ వాయ్త్తిడుమ్= గొప్ప సంపద కలుగును, అఱమ్ ఉళదు = పుణ్యమును కల్గును, ఎన్ఱు ఇయమ్బార్= అని (తలచి) ఉపదేశింపరు, నమ్మై క్కన్ఱు ఎన ఎణ్ణి = మనలను లేగదూడలని తలచి, శురక్కుమ్ శురవికళ్పోల్ = (తమ దూడలకువలె) పాలను స్రవించు కామధేనువులవలె, శొల్ అముదు = ఉపదేశమను అమృతమును, శొరికిన్ఱనర్ = వర్షింతురు.

మన పూర్వాచార్యులు రహస్యార్థములను యోగ్యతలేనివారికి ఉపదేశింపక, రక్షించుచు వచ్చిరి. గొప్ప ఆచార్యభక్తిని కల్గి, తమ వద్దకు వచ్చి ప్రార్థించిన మనవంటి

శిష్యులకు ఆ రహస్యములను వర్షించిరి. ఇట్లు వారు ఉపదేశించుట తన వత్సమునకు పాలను స్రవించు కామధేనువువలె కృపతో మాత్రమే తప్ప, తమ కీర్తి లోకమున వ్యాపించుననియో, సంపద కల్గుననియో, పుణ్యము కల్గుననియో తలచిమాత్రము కాదు.

ఇందలి ఛందస్సు కట్టళైక్కలిత్తుఱై. **"సురభి"** శబ్దమే **'శురవి'** అయినది. కామధేనువని అర్థము.

**తమిళ:- ఈశ్వరవిషయత్తిలుమ్, ఆచార్యవిషయత్తిలుమ్ భక్తియుడైయవర్కళుక్కు ఇన్ద అర్థఙ్గళై ఉపదేశిత్తాల్ బహుకీర్తిధర్మఙ్గళుణ్డు ఎన్ఱెణ్ణాతే, కామధేనుసదృశర్ నమ్మై ఒరు తర్ణకమ్బోలే యెణ్ణి యిన్ద రహస్యత్రయత్తై వర్షిత్తార్కళెన్గిఱార్-చరమగాథైయాలే. (పరక్కు) మిత్యాది. పత్తర్ కళాయ్ - భక్తర్కళాయ్, ఇరక్కిన్ఱవర్క్కు-యాచిప్పవర్క్కు, ఇవై యీన్దాల్ - ఇన్ద రహస్యత్రయార్థఙ్గళై కొడుత్తాల్, పరక్కుమ్ పుకఴ్‌వరుమ్ - విస్తారమాయిరుక్కుమ్ కీర్తి యుణ్డామ్, పైమ్బొరుళ్ వాయ్త్తిడుమ్ - స్పృహణీయమాన ధనమ్ కిడైక్కుమ్, అఱ ముళదు-ధర్మ ముణ్డు, ఎన్ఱు - ఇప్పడి ఖ్యాతిలాభపూజైకళిలిచ్ఛైయాలే, ఇయమ్బార్ - శొల్లాదవర్కళాన, కరకాక్కుమ్ కరుత్తుడై - నిఱైన్దిరుక్కుమ్ కరుత్తైయుడైయవర్కళాన (పరిపూర్ణజ్ఞానౌదార్యాదికళుడైయవర్కళాన వెన్ఱపడి) తేశికర్ - నల్వఴి నడత్తు మాచార్యర్కళ్, నమ్మై - నఙ్గళ్ తిరువడికళిల్ భక్తియుడైయ నమ్మై, కన్ఱెన - తర్ణకమ్బోలే, ఎణ్ణి - నినైత్తు, (పశుప్రాయరాన నమ్మిడత్తిల్ దయైపణ్ణి - ఎన్ఱు కరుత్తు) శురక్కుమ్ శురబికళ్పోల్-కన్ఱుక్కిరఙ్గి పాల్ శురక్కుమ్ శురబికళ్పోల్, శొల్లముదే - రహస్యత్రయాత్మకమాన శబ్దరూపామృతత్తైయే, శొరికిన్ఱనర్ - శొరియానిన్ఱార్కళ్. అజ్ఞానసంశయవిపర్యయఙ్గళ్ తీరుమ్బడి నన్ఱాక వుపదేశియానిన్ఱార్కళ్.**

**శ్రీమన్నారాయణుడే ఉపాయము**

**15.** శోక న్తవిర్క్కు ఞ్జురుతిప్పొరుళొన్ఱు శొల్లుకిన్ఱో
నాకన్తనక్కు మిరాక్కదర్క్కు న్నమక్కు ఞ్జరణా
మాకణ్డలన్ మకనాకియ వావలిప్పేఱియ వోర్
కాకమ్ పిఴైత్తిడ క్కణ్ణఴివే శెయ్‌ద కాకుత్తనే

శోకమ్ తవిర్క్కుమ్ = సకలదుఃఖములను పోగొట్టగల్గిన, శురుది ప్పొరుళ్ ఒన్ఱు = వేదములందలి సారము అగు ఒక విషయమును, శొల్లుకిన్ఱోమ్ = ప్రకటించుచున్నాము. (అది ఏమనగా), ఆకణ్డలన్ మకన్ ఆకియ = ఇంద్రుని పుత్రుడనెడి, ఆవలిప్పు ఏఱియ= గర్వమును పొందిన, ఓర్ కాకమ్ పిఴై త్తిడ = ఒక కాకి అపరాధము చేయగా, (అతని)



ప్రాణములు ఉజ్జీవించునట్లు, కణ్ అఴివే శెయ్‌ద కాకుత్తనే = ఒక కన్ను మాత్రము పోగొట్టిన శ్రీరామచంద్రుడొక్కడే, నాకమ్ తనక్కుమ్ = స్వర్గలోకములోని దేవతలకును, ఇరాక్కదర్క్కుమ్ = రాక్షసులకు, నమక్కుమ్ (ముక్తిని ప్రార్థించు) మనకును, శరణ్ ఆమ్ = ఉపాయము అగుచున్నాడు (**"నాక"** శబ్దముచే నాకములోని దేవతలు **"మంచాః క్రోశంతి"** అనునపుడువలె లక్షణయా బోధింపబడుచున్నారు. ఇది **"ఇడవాకుపెయర్"**)

ఇంద్రుని పుత్రుడగుటచే మిక్కిలి అహంకరించి, సీతాపిరాట్టి దేహమునకు హానిని కల్గించిన రాకాసురుని ప్రాణము పోకుండ ఒక కన్ను మాత్రము పోగొట్టిన కాకుత్స్థుడగు శ్రీరాముడే దేవతలకు, రాక్షసులకు, మనవంటి చేతనులకును ఉపాయమగుచున్నాడు. ఇదియే సకలదుఃఖములను పోగొట్టగల్గిన, వేదములోని సారార్థము. **"దేవానా దానవానాం చ సామాన్య మధిదైవతమ్"** అను జితంతే స్తోత్రసూక్తి ఇచట అనుసంధేయము.

**"ఆఖండలః"** అను సంస్కృతపదమే **"ఆకణ్డలన్"** అయినది. స్తోత్ర రత్నములోని **"రఘువర యదభూ స్త్వం తాదృశో వాయసస్య"** ఇత్యాది శ్లోకముయొక్క అర్థము అనుసంధేయము. 15వ పాశురము మొదలు 19వ పాశురమువరకుగల అయిదు పాశురములు అభయప్రదానసారములోనివి.

**తమిళ:- ఇనిమేల్ అభయప్రదానసారత్తిల్ అడియిలిరణ్డుపాట్టు. ముడివిల్ మూన్ఱు పాట్టు. ఆక వైన్దుపాట్టిల్ ముదల్పాట్టు. ఇన్ద రహస్యమ్ మణిప్రవాళమాకైయాలే మంగళాత్మకమాన వొరు పాట్టాలే గ్రంథత్తుక్కు పరమతాత్పర్యత్తై యరుళిచ్చెయ్‌కిఱార్. (శోక న్తవిర్క్కు) మిత్యాది. శోక న్తవిర్క్కుమ్ - సకలశోకనివర్తకమాన, శురుదియుళ్ పొరుళొన్ఱు - శ్రుత్యర్థఙ్గళిలే ముఖ్యమాన వోరర్థమానతు (ఇఙ్గు శ్రుతిశబ్దమ్ 'వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా" ఎన్గిఱపడియే రామాయణపరమ్. శోకనివర్తకమాన శ్రుతివిశేషపరమాకవుమామ్) శొల్లుకిన్ఱేన్ - శొల్లానిన్ఱేన్, ఆకణ్డలన్ మకనాకియ - సహస్రాక్షనాన ఇన్ద్రనుడైయ పుత్రనాన, ఆవలిప్పేఱియదోర్ కాకమ్ - (ఆవల్ - ఆశావిశేషమ్, అదుడైయదు ఆవలి, అత్తాలే పెరియదాన వొరు కాకమానదు) పిఴైత్తిడ -పిఴైక్కైక్కాక, కణ్ణఴివే శెయ్‌ద - కణ్ణఴివుమ్ మాత్రమ్ శెయ్‌దవరాన, కాకుత్తనే - కాకుత్స్థనాన శరణ్యనే, (ఇదుక్కు శరణా మెన్గిఱత్తోడే అన్వయమ్), నాక న్తనక్కుమ్ - (తన్ - స్వార్థే), స్వర్గవాసికళాన సర్వదేవతైకళుక్కుమ్, (నాకశబ్దమ్ లక్షణయా తత్రత్యదేవతాపరమ్) ఇరాక్కదర్క్కుమ్ - రాక్షసర్కళుక్కుమ్, నమక్కుమ్ - అస్మదాదికళుక్కుమ్, శరణామ్ - రక్షకనామ్, దేవమనుష్యాదిసకలజాతీయరుక్కుమ్ అన్ద**

**కాకుత్థున్ రక్షకనెన్గైయే యిన్ద గ్రంథత్తుక్కు పరమతాత్పర్యమ్. శరణా మెన్గిఱత్తాలే సప్తకాండత్తిలుళ్ళ శరణాగతిప్రతిపాదన మవాంతరతాత్పర్యమెన్డదాయ్ఱ్ఱు.**

**శ్రీరాముని అభయప్రదానము**

**16. ఒరుక్కాలే శరణాక వడైకిన్టాఱ్కు**
**మునక్కడిమై యాకిన్టే నెన్గిన్టాఱ్కు**
**మరుక్కాద యనైవర్క్కు మనైవరాలు**
**మఞ్జేలె న్డరుళ్కొడుప్ప నిదుదా నోదు**
**మిరుక్కాలు మెఴిన్ మునివర్ నినైవినాలు**
**మివై యతివార్ శెయలుడనెన్నిశైవి నాలు**
**నెరుక్కాద నీళ్ విరద మెనక్కొన్డెన్ను**
**నెఱి యురైత్తార్ నిలైయుణర్న్దు నిలై పెఱ్ఱోమే**

ఒరుక్కాలే శరణాక అడైకిన్టాఱ్కుమ్ = ఒక పర్యాయమే (నన్ను) శరణముగా ఆశ్రయించినవారికిని, ఉనక్కు అడిమై ఆకిన్టేన్ ఎన్గిన్టాఱ్కుమ్ = నీకు దాసుడనై యున్నాను అని అనుసంధించినవానికిని, అరుక్కాదే = ఏ కొంచెము కొఱతలేనట్లు, అనైవర్క్కుమ్ అనైవరాలుమ్ = సకలచేతనులకు సకలప్రాణులవలన, అఞ్జేల్ ఎన్డు అరుళ్ కొడుప్పన్= భయపడవలసిన అవసరములేనట్లు అభయప్రదానమును చేసెదను, ఇదుదాన్ = ఇట్లు చేయుటయే, ఓదుమ్ ఇరుక్కాలుమ్ = అధ్యయనము చేయబడు వేదముద్వారా, ఎఴిల్ మునివర్ నినైవినాలుమ్ = మహిమగల మునులచే రచింపబడిన స్మృతులద్వారా, ఇవై యతివార్ శెయలుడన్ = వీనిని (వేదములను, స్మృతులను) తెలిసిన మహనీయుల అనుష్ఠానమువలనను, ఎన్ ఇశైవినాలుమ్ = నా అనుమతి చేతను, ఎనక్కు నెరుక్కాద = నాకు అతిక్రమింపరాని, ఒన్డు నీళ్ విరదమ్ = ఒక గొప్ప వ్రతము, ఎన్నుమ్ నెఱి ఉరైత్తార్ = అని శరణాగతి మార్గమును ఉపదేశించు శ్రీరాముని, నిలై యుణర్న్దు = నిశ్చయమును (స్థితిని) తలచి, నిలై పెఱ్ఱోమ్ = (మేము) నిర్భరత్వమును పొందితిమి.

శ్రీరామచంద్రుడు పూర్వము విభీషణుని అంగీకరించునపుడు తన అభిప్రాయమును ఈ విధముగా ప్రకటించెను. "ఒకసారి నన్ను శరణు పొందినవానికిని, నాకు దాసుడనగుచున్నాను అనిన వానికిని ఏ ప్రాణివలన భయము కలుకుండునట్లు అభయము నిచ్చెదను. ఇదియే నా వ్రతము. శ్రుతి, స్మృతి, సదాచారములు, నా అంతరంగము–అను వీని నన్నిటికిని అనుకూలమైన గొప్ప వ్రతము" – అని. ఇట్లు



శరణాగతియొక్క గొప్పతనమును వ్యక్తీకరించిన భగవానుని నిశ్చయమును తలచి మనస్సున స్థైర్యమును పొందితిమి.

ఈ పాశురార్థమునకు అనుగుణముగా **"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ","శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియ మాత్మనః, సమ్యక్ సంకల్పజః కామో ధర్మమూల మిదం స్మృతమ్", "ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదా శ్చ", "విధయ శ్చ వైదికాః త్వదీయగంభీరమనోను సారిణః"** ఇత్యాది ప్రమాణములను స్మరింపనగును. **"ఋక్"** శబ్దమే **"ఇరుక్కు"** అయినది. ఈ పదమిచట వేదమునంతటిని లక్షించును. ఇందలి ఛందస్సు ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము

**తమిళ:– ఇని తామరుళిచ్చెయ్యప్పుకుకిఱ "సకృ దేవ ప్రపన్నాయ" శ్లోకత్తైయుమ్, అన్ద అర్థ మరుళిచ్చెయ్కిఱ వెట్టామధికారత్తిలే తామ్ ప్రమాణమాక వెడుక్కిఱ "శ్రుతిః స్మృతిః సదాచారః" ఎన్గిఱ శ్లోకత్తుక్కర్థత్తైయుమ్ వివరిత్తరుళినార్ (ఒరుక్కాల్) ఇత్యాది – ఒరుక్కాలే సకృదావృత్తియే, శరణాక – ఉపాయమాక, అడైకిన్టార్క్కుమ్ – అడైయ నిన్టిక్కుమవర్కళుక్కుమ్ (ఇదుక్కుమ్, మేల్ షష్ఠిక్కుమ్ "అఞ్జా మరుళ్ కొడుప్ప" ఎన్గిఱత్తోడే అన్వయమ్) ఉనక్కడిమైయాకిన్టేన్ – స్వశరణ్యానాన వునక్కు దాసనాక వాకానిన్టేన్, ఎన్గిన్టార్క్కుమ్ – ఇప్పడి శొల్లుమవర్కళుక్కుమ్, అరుక్కాదే – సంశయప్పడాతే, (విరోధమ్ వారామల్ ఎన్డుమామ్. ఇదు ఇన్ద శ్లోకత్తిలర్థమ్) అనైవర్క్కుమ్ – సర్వభూతఙ్గళుక్కుమ్, అనైవరాలుమ్ – సర్వభూతఙ్గళాలుమ్, అఞ్జామల్ – భయప్పడామల్, నాన్ – సర్వశరణ్యానాన నాన్, అరుళ్కొడుప్పన్ – కృపై పణ్ణువేన్, ఇదుదాన్ – ఇదువే, ఓదుమిరుక్కాలుమ్–ఓదప్పడుకిఱ ఋక్కాలుమ్, "సంధాయాం సందధే బ్రహ్మైషః, రమతే తస్మిన్ ఉత జీర్ణే శయానే, నైనం జహాత్యహస్సు పూర్వేషు" ఎన్గిఱ శ్రుతియాలుమ్, ఎఴిల్ – విళఙ్గానిన్ఱ, మునివర్ – ఋషికళుడైయ, నినైవినాలుమ్ – సమ్మతియాలుమ్, ("ఆర్తో వా యది వా దృప్తః పరేషాం శరణా గతః, అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా" ఇత్యాది స్మృతికళాలుమ్ – ఎన్డపడి.) ఇవై యతివార్ శెయ్లుడన్–ఇన్ద శ్రుతిస్మృతికళై అఱియానిన్ఱ సత్తుక్కళుడైయ అనుష్ఠానత్తుడనే, (శెయల్ – కృత్యమ్, అనుష్ఠానపరమ్), ఎన్నిశైవాలుమ్ – ఎన్నుడైయ అంగీకారత్తాలుమ్, ("స్వస్య చ ప్రియ మాత్మనః, సమ్యక్సంకల్పజః" – ఎన్గిఱది నర్థ మితు) నెరుక్కాద – ఉపద్రవిక్కప్పడాత, నీళ్ విరతమెన క్కొన్డు – ఎనక్కొన్డు నీళ్ విరత మెన – స్వయమ్. ఎనక్కొరు దీర్ఘ**

ప్రతమ్. (శరణాగతరక్షణమాకిఅ వితుతాన్ (శ్రుత్యాదిసమ్మతమాన దీర్ఘవ్రత మెనక్కొన్డర్థమ్). ఎన్డు – ఇప్పడి, నెఱి యురైత్తార్ – శరణాగతిమార్గత్తై చ్చొన్నవరుడైయ, నిలై – స్థితియై, ఉణర్న్దు – అఱిన్దు, నిలై పెఱ్ఱోమ్ – నామ్ నిలైయై పెఱ్ఱోమ్. "నామ్ ఎన్ పడప్పుకుకిఱోమో!" ఎన్డు చలియాతే శరణ్యవాక్యత్తాలే ధైర్యత్తై యడైన్దో మెన్డపడి.

**శాశ్వతమైన ఫలమును ఆశ్రయింపకుండుట**

**17. పొన్నై యికళ్న్దు విరుకఙ్గళ్ పుల్లియ పుల్లుకన్దాల్**
**మన్నరెడుప్పద ప్పొన్నలతే మన్నులకనైత్తు**
**న్తన్నై యడైన్దిడ త్తానరుళ్ శెయ్యు న్తనిచ్చిలైయోన్**
**పొన్నడి నామడైన్దోమ్ పుఱమారెన్గొల్ శెయ్దిడినే**

విరుకఙ్గళ్ = మృగములు, పొన్నై ఇకళ్న్దు = బంగారమును (దాని విలువను తెలియక) త్యజించి, పుల్లియ పుల్ ఉకన్దాల్ = అల్పమైన గడ్డిని ప్రియముగా గ్రహించినను, మన్నర్ ఎడుప్పదు = రాజులు (ఆశపడి) స్వీకరించునది, అ ప్పొన్ అలదే = ఆ బంగారమే కదా! (అల్లే), మన్ ఉలకు అడైన్దిడ = తనను శరణముగా పొందగా (ఆశ్రయింపగా), తాన్ తాన్ అరుళ్ శెయ్యుమ్ = తాను కృపజేయువాడు, తని చ్చిలైయోన్= సాటిలేని వింటిని కలవాడును అగు శ్రీరాముని, పొన్ అడి నామ్ అడైన్దోమ్ = అందమైన బంగారమువలె స్పృహణీయమైన పాదములను మనము శరణముగా ఆశ్రయించితిమి, అర్ పుఱమ్ శెయ్దిడిన్ ఎన్ కొల్ = (దీనికి మారుగా, ప్రతిగా) ఎవరు వేఱు ఏ కార్యమును చేసినను, ఏమి (నష్టము)?

లోకములో మృగములు బంగారమును చూచినపుడు దాని విలువను గుర్తింపక ప్రక్కకు తోసి, తమకు ఆహారమగు తృణమునే ఆదరించి గ్రహించును. కాని, ప్రభువులు ఆ బంగారము గొప్పతనమును గుర్తించి, గ్రహింతురు. ఆ విధముగానే భగవానుని శ్రీ పాదముల గొప్పతనమును తెలియని అల్పులు వానిని గ్రహింపక, వేఱొక అల్పమైన వస్తువును ఆశ పడుదురు. కాని, దాని వలన మనకేమి నష్టము వాటిల్లును? తనను శరణుపొందిన వారికందఱికిని కృపజేయుటకు తహతహలాడు భగవానుని శ్రీ పాదములనే మనము రక్షకముగా ఆశ్రయించితిమి.

**"జ్ఞానేన హీనః పశుభి స్సమానః"** – అను న్యాయమునుబట్టి తత్త్వజ్ఞాన శూన్యులగువారిని దేశికులు ఇందు పశుప్రాయులుగా పల్కిరి. ఇందలి ఉపమాలంకారము



సహృదహృదయావర్జకము. ఛందస్సు కట్టళైక్కలిత్తుఱై. తరువాతి పాశురమును ఈ ఛందస్సులోనే రచింపబడినది. **"మృగ"** శబ్దము **"విరుకమ్"** అయినది.

**మిగిలిన యోగము (ఉపాయము) లకును ప్రపత్తియే సహాయకారి**

**18. వేదత్తిరళిన్ విది యుణర్న్దోర్కళ్ విరిత్తురైత్త**
**కాదలఙ్కతియైయు ఞానత్తైయు ఙ్కరుమఙ్గళైయు**
**ఞ్జాదిక్కవల్ల శరణాకతి తని నిన్దనిలై**
**యోద త్తొడఙ్గు మెఴుత్తిన్ఱిఅత్తి లుణర్మిన్కళే**

వేదత్తిరళిన్ = వేదసమూహముల (వేదవేదాంతముల), విది ఉణర్న్దోర్కళ్ = ఆజ్ఞను తెలిసిన పూర్వాచార్యులు, విరిత్తు ఉరైత్త = స్పష్టముగా వ్యక్తము చేసిన, కాదల్ కతియైయుమ్ = భక్తియను ఉపాయమును, ఞానత్తైయుమ్ = జ్ఞానయోగమును, కరుమఙ్గళైయుమ్ = కర్మయోగమును, శాదిక్కవల్ల = పూర్తిచేసి ఇవ్వగల్గిన శక్తిని కల, శరణాగతి = ప్రపత్తి, తని నిన్ద నిలై = (తానే సకల ఫలములను ఇచ్చునదియై) ప్రత్యేకమైన ఉపాయముగానున్న గొప్పతనమును, ఓద త్తొడఙ్గుమ్ = వేదమును అధ్యయనము చేయునపుడు మొదట అనుసంధింపబడుచున్న, ఎఴుత్తిన్ తిఅత్తిల్= (మొదటి) అక్షరమగు ప్రణవముయొక్క స్వభావముచే, ఉణర్మిన్కళ్ = తెలిసికొనుడు.

సకలవేదవేదాంతముల తాత్పర్యమును చక్కగా తెలిసిన పూర్వాచార్యులు కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము–అను వీని స్వరూపమును వివరించి తెలిపిరి. ఆ ఉపాయమును అనుష్ఠించునపుడు ఆయా సందర్భములలో చేయుటకు సాధ్యము కాని అంశలలో ప్రపత్తిని అనుష్ఠించినచో అవి పూర్తిగా నెఱవేరినట్లగును. ఇట్లు ప్రపత్తి మిగిలిన ఉపాయములను సాధించి ఇవ్వగల్గిన మహిమను కల్గినది. తానే సకలోపాయములను ఇచ్చు స్వతంత్రమైన ఒక ఉపాయముగానుండు ప్రపత్తియొక్క స్థితిని ప్రణవముద్వారా చక్కగా గ్రహింపవచ్చును. ఎట్లనగా–ప్రణవములోని అకార, ఉకార మకారములచే జీవుడు భగవానునికొఱకే ఉన్నాడని తెలుపబడుటచే, శరణాగతియే జీవుడు అనుష్ఠింపదగిన ఉత్తమోపాయమను విషయము అర్థాత్ సిద్ధము.

ఈ పాశురములో ప్రస్తావింపబడిన యోగములు, స్వరూపవివరములు అధికారసంగ్రహములోని 16వ పాశురములో తెలుపబడినది. ప్రణవము ఆత్మ నివేదనరూపప్రపత్తిని తెలుపుననుట **"ఓ మిత్యాత్మానం యుంజీత"** ఇత్యాది వేదవాక్యములవలన స్పష్టము.

### దోషములను సహించు శ్రీరాముని స్వభావము

(కాకాసురవృత్తాంతము)

**19.** మూవులకు న్తన్పిఴైయై త్తానే శాఱ్ఱి
మునివర్కళు న్దేవర్కళు మునిన్ద వన్నా -
ట్టావరిదా యెఴ్గుమ్ పోయ్ త్తళర్న్దు వీఴ్న్ద
తనిక్కాకన్తానిరన్ద వుయిర్ వఴ్గి -
క్కావలిని యెమక్కెఴ్గుఇ్కడనెన్టెణ్ణి
క్కాణనిలై యిలచ్చినై యన్టిట్ట వళ్ల
లేవల్పయనిరక్క మిదఱ్కాతెన్డాదు
మెఴిలుడైయా రిణైయడిక్కీఴిరుప్పో నామే

మూ ఉలకుమ్ = ముల్లోకములందు (తిరిగి తిరిగి), తన్ పిఴైయై = (పిరాట్టి విషయమున) తాను చేసిన అపరాధమును, తానే శాఱ్ఱి = తానే వ్యక్తీకరించి, పల్కి తనను రక్షింపుమని వేడగా, మునివర్కళుమ్ దేవర్కళుమ్ = ఋషులు, దేవతలును, మునిన్ద అన్నాళ్ = (అతనిపై) కోపించి తఱిమి కొట్టిన ఆ కాలమున, తావు అరిదాయ్= వేరు ఆశ్రయము (శరణము) లభింపక, ఎఴ్గుమ్ పోయ్ = లోకములలో అంతట తిరిగి చుట్టివచ్చి, తళర్న్దు విఴ్న్ద = అలసి సొలసి (శ్రీరాముని పాదసన్నిధిని చేరి) క్రిందపడిన, తని క్కాకమ్ ఇరన్ద = నిస్సహాయమైన కాకము యాచించిన, ఉయిర్ వఴ్గి= ప్రాణభిక్షను పెట్టి, ఇని ఎఴ్గుమ్ కాదల్ ఎమక్కు క్కడన్ = ఇకపై ఏ చోటనైనను (ఎవరినైనను) రక్షించుటయే మాకు కర్తవ్యము, ఎన్టు ఎణ్ణి = అని మనస్సున తలచి, కాణనిలై ఇలచ్చినై = ఒంటి కన్ను గ్రుడ్డివాడగునట్టి శాశ్వతమైన గుర్తును, అన్టు ఇట్ట వళ్ళల్ = అపుడు (కాకాసురునకు) ఇచ్చిన మహోదారుడు అగు శ్రీరాముని, ఏవల్ పయన్ = కైంకర్యమే (మనకు గొప్ప) పురుషార్థమగును. ఇదఱ్కు ఆఱు = ఈ ఫలమును పొందుటకు ఉపాయము, ఇరక్కమ్ ఎన్టు ఓదుమ్ = (మనము చేయు ప్రపత్తిచే ఆ స్వామికి మనపట్ల కలుగు) దయయే అని ఉపదేశించిన, ఎఴిల్ ఉడైయార్ = తేజస్సును పూర్ణముగా కల్గిన పూర్వాచార్యుల, ఇణై అడిక్కీఴ్= శ్రీ పాద ద్వంద్వముక్రింద, నామ్ ఇరుప్పోమ్ = మనము నిలచియుందుముగాక!

సీతాపిరాట్టి విషయమున అసహ్యాపచారమును చేసిన కాకాసురునిపై శ్రీరాముడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించినపుడు కాకాసురుడు తాను చేసిన అపరాధమును తెలిపి, తనను రక్షింపుడని లోకములో అంతట పరిభ్రమించి తిరిగి, అందఱిని ప్రార్థించెను. మహర్షులు, దేవతలును అతనిపై కోపించి, తఱిమి కొట్టిరి. లోకమంతట చుట్టి, వేఱెచటను శరణు పొందలేక, అలసి, శ్రీరాముని సన్నిధికే వచ్చి, పాదములపై పడి, ప్రాణభిక్షను వేడెను. ప్రపన్నుల నందఱను రక్షించుటయే తన కర్తవ్యముగా తలచు శరణ్యుడగు శ్రీరాముడు తాను ప్రయోగించిన అస్త్రము నిర్వీర్యము కాకుండునట్లు దానితో కాకాసురుని ఒక కన్నును మాత్రము గుడ్డిగా చేసి, శాశ్వతముగా దానిని అతనికి గుర్తుగా చేసి, అతని ప్రాణములను కాపాడెను. ఇట్టి మహోదారుడగు శ్రీరాముని కైంకర్యమే మనకు పురుషార్థము. దానిని పొందుటకు ముఖ్యమైన ఉపాయము మన ప్రపత్తివలన కల్గు అతని కరుణయే. ఈ అర్థములను పూర్వాచార్యుల మనకు ఉపదేశించిరి. వారి పాదచ్ఛాయలో నిలచి యుండి, మనము ఉజ్జీవించెదము గాక!



ఇచట కాకాసురుని వృత్తాంతమును తెలుపుటచే మనము అపరాధము చేసినను భగవానుడు తప్ప వేఱు గతి లేదని గుర్తించి, స్వామిని శరణు పొందినచో, స్వామి మనలను తప్పక కాపాడునని ఏర్పడుచున్నది. **"పిఴైయైత్తానే"** అనునపుడు **"తాన్"** అనునది నిరర్థకపాదపూరణపదము. ఈ పాశుర వృత్తాంతమునకు అనుగుణముగా **"స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్, వధార్హ మపి కాకుత్థః కృపయా పర్యపాలయత్"**, **"త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త మేవ శరణం గతః"** ఇత్యాది ఇతిహాసవచనములు స్మరణీయములు. ఛందస్సు ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము

### భూదేవికి శ్రీ వరాహస్వామి చేసిన ఉపదేశము(వరాహచరమశ్లోకము)

**20.** తిరుత్తమ్ పెరియవర్ శేరు న్తుత్తెయి ఱ్చెటివిలర్క్కు
వరుత్తమ్ కఴిన్ద వఴి యరుళెన్ట నమ్మణ్మకళార్
కరుత్తొన్ట వాదివరాక మురైత్త కతి యటివార్
పొరుత్త న్దెళిన్దురైక్క ప్పొయ్యిలా మతి పెఱ్ఱనమే.

తిరుత్తమ్ పెరియవర్ = సంస్కరింపబడిన జ్ఞానము, అనుష్ఠానమునుకల మహర్షులచే, శేరుమ్ తుత్తెయిల్ = అనుష్ఠింపబడు భక్తియోగము మొదలగు ఉపాయములలో, శెఱివు ఇలర్క్కు = ప్రవర్తించుటకు తగిన యోగ్యత లేనివారికి, వరుత్తమ్ కఴిన్ద= శ్రమలేక సులువుగా అనుష్ఠింపతగిన, వఴి అరుళ్ ఎన్ట = ఉపాయమును దేవరవారు అనుగ్రహింపవలెనని ప్రార్థింపగా, నమ్ మణ్మకళార్ = మన భూదేవియొక్క, కరుత్తు

ఒన్ఱ = అభిప్రాయమును తగినట్లు, ఆది వరాహమ్ ఉరైత్త = ఆదివరాహస్వామియై అవతరించి, భగవానుడు ఉపదేశించిన, కతి అతివార్ = (ప్రపత్తి అను) ఉపాయముయొక్క స్వరూపమును తెలిసిన మన పూర్వాచార్యులు, పొరుత్తమ్ తెళిన్దు ఉరైక్క = మన యోగ్యతను తెలిసి (ఆ ఉపాయమును) ఉపదేశింపగా, పొయ్ ఇలా మతి పెற்றనమ్ = దోషము లేని జ్ఞానమును పొందితిమి.

భూదేవి పూర్వము ఒకానొక సమయమున జ్ఞానము, శక్తియులేని సాధారణులైన అధికారులు భక్తియోగమును అనుష్ఠింపలేక సంసారమునందు చిక్కుకొని బాధపడుటను గమనించి, మనస్సున నలిగి, తల్లికి కల సహజమైన దయవలన వారిని ఉజ్జీవింపచేయగోరెను. సులభమై, అందఱు అనుష్ఠించునట్లు ఒక ఉపాయమును, ఉపదేశింపవలసినదిగా స్వామిని ప్రార్థించెను. స్వామియు రెండు శ్లోకములలో ప్రపత్తిని ఉపదేశించెను. అవియే వరాహ చరమశ్లోకమని పేరుపొందినవి. వానిలో తెలుపబడిన ప్రపత్తియే మనకు తగిన ఉపాయమని తలచి, ఆచార్యులు ఉపదేశించిరి. దానివలన గొప్ప జ్ఞానమును మనము సంపాదింపగల్గితిమి.

తరువాతి పాశురము, ఈ పాశురమును **"స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః, ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మా మజమ్, తత స్తం మ్రియ మాణం తు కాష్ఠపాషాణసన్నిభమ్, అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్"** అనుచు వరాహస్వామి భూదేవిని ఉద్దేశించి పల్కిన వరాహచరమశ్లోకమును దృష్టిలోనుంచుకొని రచింపబడినది. దీని వివరణరూపమే తరువాతి పాశురముకూడ. ఈ పాశురముమొదలు వరుసగా నాల్గు పాశురములు రహస్యశిఖామణి అను రహస్యగ్రంథములోనివి. ఛందస్సు కట్టళైక్కలిత్తుఱై.

**వరాహచరమశ్లోకార్థ వివరణము**

**21.** **ఇడమ్పెற்றరెల్లా మెన్నుడలాయ్ నిఱ్ప**
**విడర్ పిఱప్పెన్ఱివైయిల్లా వెన్నై యన్బా**
**లడమ్ పற்றమవనెన్ఱు నినైన్దాన్ యావ**
**నవనావి శరియుమ్బోదతివుమాఱి**
**యుడమ్బిற்றరుపలమ్బోల్కిడక్క నానే**



**యుయ్యుమ్ వకై నినైన్దుయర్న్ద కతియాలెన్ఱ**
**నిడమ్ పెற்றన్నుడన్ వాழ வెడుప్ప నెన్ఱ**
**వెమ్బెరుమా నరుళ్ పెற்று మరుళ్శెற்றோమే**

ఇడమ్ పెற்றర్ ఎల్లామ్ = (లోకమున) చోటు చేసికొన్నవి అన్నియు (సకలవస్తువులును), ఎన్ ఉడలాయ్ నిఱ్ప = నాకు శరీరముగా నిలువగా, ఇడర్ పిఱప్పు ఎన్ఱు = నాశము (మరణము), జన్మయు అను, ఇవై ఇల్లా ఎన్నై = వీనిని లేని నన్ను (ఈ దోషములు లేని సర్వేశ్వరుడనగు నన్ను), అన్బాల్ = ప్రీతితో, "అవన్ అడమ్ పற்று ఆమ్" అతడు ( ఏనాడును చేయివిడువని) దృఢమైన గతి కాగలడు", ఎన్ఱు యావన్ నినైన్దాన్ = అని ఎవడు తలచినవాడై; శరణు పొందుచున్నాడో, అవన్ ఆవి శరియుమ్ పోదు = అతని ప్రాణములు ఉత్క్రమణమగునపుడు, అతివు మాఱి= తన స్మృతిని పోగొట్టుకొని, తారు ఉపలమ్ పోల్ ఉడమ్బిల్ కిడక్క = కాష్ఠము (కట్టె) వలె, పాషాణము వలె (తన) శరీరములో నున్నపుడు, ఉయ్యుమ్ వకై నానే నినైన్దు= (ఆజీవుడు) ఉజ్జీవించు విధమును నేనే చేయదలచి, ఉయర్న్ద కతియాల్ = గొప్పది యగు అర్చిరాది మార్గమును, ఎన్ఱన్ ఇడమ్ పெற்று = నా స్థానమగు పరమపదమును పొంది, ఎన్నుడన్ వాழ= నాతో నుండి (సకలవిధకైంకర్యములను చేయుచు) ఉజ్జీవించునట్లు, ఎడుప్పన్ ఎన్ఱ = ఉత్తమగతిని కల్గింతును (ఉద్ధరింతును) అని ఉపదేశించిన, ఎమ్బెరుమాన్ అరుళ్ పెற்று = శ్రీ వరాహస్వామియొక్క కృపను పొంది, మరుళ్ శెற்றோమే = అజ్ఞానమును పోగొట్టుకొనగల్గితిమికదా!

శ్రీ వరాహస్వామి భూదేవికి ఉపదేశించిన వరాహచరమశ్లోక తాత్పర్య మీ పాశురము. – "లోకము మొత్తము నాకు శరీరభూతము. నాకు జన్మ మరణములు లేవు. నన్నే దృఢమైన శరణముగా విశ్వసించి, ఆశ్రయించినవాని మరణకాలములో అతడు తన స్మృతిని కోల్పోయి కట్టెవలె, పాషాణమువలె తన శరీరములో పడియున్నపుడు అతనిని ఉత్తమమగు అర్చిరాదిమార్గముద్వారా నా స్థానమగు పరమపదమునకు చేర్చి, నాకు అతడు సర్వవిధమైన కైంకర్యములను చేయునట్లనుగ్రహింతును – అనునది ఈ ఉపదేశసారము. ఇట్లు శ్రీవరాహస్వామి పల్కిన సూక్తిని మనము తలచి, అజ్ఞానమును పోగొట్టు కొంటిమి.

వరాహచరమ శ్లోకములోని **"కాష్ఠపాషాణసన్నిభమ్"** అను ప్రయోగము ప్రస్తుత పాశురములో **"తారు ఉపలమ్ పోల్"** అను సూక్తిద్వారా స్మారితము. **"తారు, ఉపల"** పదములు రెండు సంస్కృతములోని **"దారు, ఉపల"** శబ్దముల వికృతులు. ఇందలి ఛందస్సు ఎణ్‌శీర్ ఆశిరియ విరుత్తము

**ప్రపన్నునకు ముక్తిదశలో కర్మ సంబంధము లేకుండుట**

**22.** **ఇరణ్డురైయాద నమ్మేన మురైత్త వురై యిరణ్డిన్**
**న్తిరణ్డపొరుళ్‌కడెళిన్దడి శూడిన న్దిణ్ణరుళా**
**ఋరణ్డ నజ్ఞానచ్చుదరొళి శుఴుమ్ పరప్పదన్ మున్**
**పురణ్డదు నమ్ వినై పో మిడమ్ పార్త్తిని ప్పోమళవే**

ఇరణ్డు ఉరైయాత = రెండు మాటలను పలుకని (పల్కిన మాటను జవదాటని), నమ్ ఏనమ్ ఉరైత్త = మన వరాహస్వామి అనుగ్రహించిన, ఉరై ఇరణ్డిన్ = రెండు చరమ శ్లోకముల, తిరణ్డ పొరుళ్‌కళ్ తెళిన్దు = సారమైన అర్థములను (మేము) తెలిసికొని, తణ్ అరుళాల్ = (అతని) బలమైన కృపతో, అడి శూడినమ్ = (ఆ స్వామి) పాదములనే ఉపాయముగా, ఫలముగా గ్రహించితిమి, శురుణ్డ నమ్ ఞాన చ్చుదర్ ఒళి = (కర్మ సంబంధముచే అన్ని విషయములను తెలియలేక) సంకోచించియున్న మన జ్ఞానమను తేజస్సు (దీపము) యొక్క ప్రకాశము, శుఴుమ్ పరప్పదన్ మున్ = అన్ని చోట్ల వ్యాపించుటకుముందు (అన్నిటిని తెలిసికొను శక్తిని పొందుటకు ముందు), నమ్ వినై పురణ్డదు = మన కర్మలు తొలగిపోయినవి, ఇని పోమ్ ఇడమ్ పార్త్తు = ఇక తాము పోదగిన చోటును చూసి, పోమ్ అళవే = (అవి) పోవలసినదే మిగిలియున్నది.

తాను పల్కిన మాటను అతిక్రమింపని శ్రీ వరాహస్వామి అనుగ్రహించిన చరమశ్లోకద్వయముయొక్క అర్థమును బాగుగా గ్రహించితిమి. ఆ స్వామి కరుణచే అతని శ్రీ పాదముచే ఉపాయోపేయములుగా నమ్మితిమి. ఈ కర్మలోకములో కర్మవశముచే సంకోచించియున్న మన జ్ఞానము ముక్తిదశలో వికాసమును పొందుటకు ముందుగానే కర్మలు అన్నియు మనలను విడచి పోయినవి. ఇక మనము చేరవలసిన చోటుకు పోయి చేరుటయే మిగిలియున్నది. ఏమి ఆశ్చర్యము!

జీవుని ధర్మభూతజ్ఞానము ఈ కర్మభూమిలో కర్మవశముచే అన్నిటిని తెలియలేక సంకోచించియుండును. ముక్తిదశను చేరగానే ఆ జ్ఞానము వికసించి, అన్నిటిని గ్రహించును.



చేతనుడు ముక్తిని పొందునపుడు అన్ని కర్మలు అతనిని విడివడవలసియున్నది. **"తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ"** అని శ్రుతివాక్యము. కావున అతని పుణ్యకర్మలు అతని మిత్రులను, పాపకర్మలు అతని శత్రువులను **"సుహృదః సాధుకృత్యాం ద్విషంతః పాపకృత్యామ్"** అను శ్రుత్యుక్తరీతిలో చేరును. **"వానో మఱికడలో మారుతమో తీయకమో కానో ఒరుజ్గిఴుమ్ కణ్డిలమాల్, అనీన్ద కన్నుయర త్తామెఱిన్దు కాయుదిర్త్తార్ తాళ్ పణిన్దోమ్, వణ్‌తుయరై యావా! మరుఙ్గు"** అను పెరియతిరువన్దాది (54) సూక్తిని ఇచట స్మరింపనగును.

**మరణమునుగూర్చి భయపడువారికి సదుపదేశము**

**23.** **మలైయుమ్ కులైయుమె న్తెణ్ణియుమ్ వన్‌పెరుమ్ పుణ్డిరఙ్గి**
**త్తలైయుమ్ వెళుత్తపిన్నానే యఴియ విశైకిన్తిలీర్**
**అలైయు ఙ్కడల్ కొణ్డవైయ మళిత్తవన్ మెయ్యరుళే**
**నిలైయెన్ఱు నాడి నిలైనిన్ద పొయ్మ్మతి నీక్కుమినే**

మలైయుమ్ = (స్థిరమని మనము తలచు) పర్వతము కూడ, కులైయుమ్ = (ఒక సమయమున) నశించును, ఎన్ఱు ఎణ్ణియుమ్ = అని తెలిసియు, వన్ పెరుమ్ పుణ్ తిరఙ్గి = బలమైన, పెద్ద వ్రణముగానున్న శరీరముయొక్క దార్ఢ్యము తఱిగి, తలైయుమ్ వెళుత్త పిన్ = తల వెంట్రుకలు తెల్లబడిన పిదపకూడ, అఴియ ఇశైకిన్తిలీర్ = మరణించుటకు అంగీకరింపని చేతనులారా! అలైయుమ్ కడల్ కొణ్డ = అలలతోకూడిన ప్రళయసముద్రముచే గ్రహింపబడిన, వైయమ్ అళిత్తవన్ = లోకమును (ఆ సముద్రము నుండి) ఉద్ధరించి, రక్షించిన శ్రీ వరాహస్వామియొక్క మెయ్ అరుళే = సత్యమైన కృపచే అవతరించిన ప్రపత్తియే, నిలై ఎన్ఱు నాడి = స్థిరమైన ఉపాయమని తెలిసి, నిలై నిన్ఱ = (మీవద్ద చాలకాలముగా) వేరూనియున్న, పొయ్ మతి నీఙ్గుమిన్ = అజ్ఞానమును పోగొట్టుకొనుడు. (**"వెళుత్త పిన్నానే"** అనునపుడు **"తాన్"** అనునది నిరర్థకపదము, పాదపూరణార్థము ప్రయుక్తము.)

చేతనులారా! శాశ్వతమని మనము తలచు గొప్ప పర్వతము సైతము కొంతకాలమైన పిదప నశించునుకదా! దీనిని మీరు తెలిసికూడ మీ శరీరమును స్థిరమని భ్రమించియున్నారే ! మీరు శరీరములో ముడతలు పడి, తల తెల్లబడిన పిదపకూడ

మరణించుటకు సిద్ధపడకున్నారు. భయపడుచున్నారు. మీకున్న అజ్ఞానమును పోగొట్టుకొనుటకొక మార్గమున్నది. ప్రళయకాలమున సముద్రములో మునిగిన భూమిని ఉద్ధరించి, రక్షించిన కరుణామూర్తి శ్రీ వరాహస్వామి అనుగ్రహించిన ప్రపత్తియే ఉపాయముగా గ్రహించి, తరింపుడు.

ఈ పాశురార్థమునకు అనుగుణముగా **"సర్వోఽపి పాపకారిత్వా న్మృత్యో రుద్విజతే జనః, కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుమ్ ప్రియ మివాతిథిమ్"** అను శ్లోకము స్మరణీయము. ఇచట కృతకృత్యులనగా **"విదుః కృష్ణం బ్రాహ్మణా స్తత్త్వతో యే తేషాం రాజన్ సర్వయజ్ఞాః స్సమాప్తాః"** అనునట్లు, **"శెయ్‌ద వేళ్వియర్"** అనునట్లును భగవానుని సిద్ధధర్మరూపునిగా తలచి, ప్రపత్తిచేసిన అభిజ్ఞులేకదా! ఈ ప్రమాణములోని కృష్ణనామము **"కృషి ర్భూవాచక శ్శబ్దోణస్తు నిర్వృతివాచకః'** అను వ్యుత్పత్తినిబట్టి వరాహస్వామి పరముగా అన్వయించుటలో ప్రకృతమున స్వారస్యమున్నదికదా! భూమిని ఉద్ధకించినవాడుకదా వరాహస్వామి. ఇందలి ఛందము కట్టళైక్కలిత్తుఱై.

**అంజలివైభవము**

**24.** **కణ్ణన్ కÇన్టాÇ క్కూప్పియ కైయిన్ పెరుమైతనై**
**యెణ్ణ ఙ్గడక్క వెమునైత్తుఱైవ రియమ్బుదలాల్**
**తిణ్ణ మితు వెన్ఱు తేఱి తెళిన్దపిన్ శిన్‌మదియోర్**
**పణ్ణుమ్ పణితికళ్ పా®® ప్పÇన్తా®ల్ ప®®నమే**

కణ్ణన్ కÇల్ తొÇ = రక్షకుడగు భగవానుని శ్రీ పాదములను నమస్కరించుటకు, కూప్పియ కైయిన్ = జోడించిన చేతుల (అంజలియొక్క) యొక్క, పెరుమైతనై = ప్రభావమును, ఎమునైత్తుఱైవర్ = ఆళవన్దార్ (శ్రీమద్యామునులు), ఎణ్ణమ్ కడక్క= మన అభిప్రాయముయొక్క అవధిని మీఱినట్లు, ఇయమ్బుదలాల్ = (ఒక శ్లోకములో) అనుగ్రహించుటచే, ఇదు తిణ్ణమ్ ఎన్ఱు = ఇదియే దృఢమైన సిద్ధాంతము అని, తేఱి త్తెళిన్ద పిన్ = నిశ్చయించి తెలిసిన పిదప, శిన్ మదియోర్ పణ్ణుమ్ = అల్పబుద్ధిని కలవారు చేయుచున్న, పణితికళ్ పా®® = వాదములను పోగొట్టి, పÇమ్ తొ®ల్ ప®®నమ్ = ప్రాచీనమైయున్న కృత్యమగు ప్రపత్తిని (ఉపాయముగా) గ్రహించితిమి.

భగవానుని శ్రీపాదములను నమస్కరించుటకై చేయు అంజలియొక్క గొప్పతనము అవధిలేనిది–అని ఆళవన్దార్ స్తోత్రరత్నములోని ఒక శ్లోకరత్నమున



అనుగ్రహించిరి. ఇదియే తగిన సిద్ధాంతమని మనము నిశ్చయించి, తెలిసికొంటిమి. ఈ విషయమున వ్యతిరేకాభిప్రాయమునుగల ఇతరులు చేయు వాదముల నన్నిటిని ఖండించి, అంజలిని అనుష్ఠించితిమి.

చేతులను రెండిటిని జోడించుటకు అంజలి అని పేరు. **"అంజ్యతే అనేన భక్తి రిత్యంజలిః"** అనునది దీని సామాన్య వ్యుత్పత్తి. అనగా భక్తి దీనిచే వ్యక్తమగుచున్నదని భావము. **"అం జలయతి భగవంతం ద్రవీకరోతి"** అను వేఱొక వ్యుత్పత్తివలన అకారవాచ్యుడగు భగవానుని ద్రవీకరింపచేయునది కావున అంజలి అయినదను విశిష్టమైన అర్థము ఏర్పడుచున్నది. ఇట్లు అంజలి భక్తికి చిహ్నము, భగవానుని అనుగ్రహమునకు హేతువును అగుచున్నది. భక్తుడు ఈ అంజలిని చేయుటను చూచిన భగవానునకు కల్గు ఆనందము అనిర్వచనీయము. భగవానుని సన్నిధిలో తిరిగి ఏ పనిని చేయనవసరములేనట్లున్న స్థితిని ఈ అంజలి తెలుపుచున్నది.

ఈ సందర్భమున స్తోత్రరత్నములోని **"త్వదంఘ్రి ముద్దిశ్య కదాపి కేనచిత్ యథా తథా వాఽపి సకృత్ కృతోఽంజలిః, తదైవ ముష్ణాత్యశుభాన్యశేషతః , శుభాని పుష్ణాతి న జాతు హీయతే"** అను శ్లోకార్థము భావనీయము.

ఈ పాశురము అంజలి వైభవములోనిది. ఛందస్సు కట్టళైక్కలిత్తుఱై. పాశురములోని **"పణితి"** శబ్దము సంస్కృత ఫణితిశబ్దభవము.

**ముఖ్యమైన అర్థములనే గ్రహించుట**

**25.** **పొఙ్గుపున లాఱుకళి ల్భువనమెల్లామ్**
**పొఙ్కÇలాలళన్దవన్టన్టాళాల్ వన్ద**
**కఙ్గైయెను నదిపోల క్కడల్‌కళేÇ**
**ల్కమలై పిఱన్దవనుకన్ద కడలే పోల**
**చ్చఙ్గుకళి లవనేన్దు మ్జఙ్గే పోల**
**త్తారిలవన్టణ్డుళవత్తారే పోల**
**వెఙ్గళ్ కులపదికళివై మేలా మెన్ఱే**
**యెణ్ణియ నల్ వార్‌త్తైకణామిశై కిన్ఱోమే**

పొఙ్గు పునల్ ఆఱుకళిల్ = పొంగి ప్రవహించు జలమునుకల (లోకములోని) నదులలో, పువనమ్ ఎల్లామ్ = లోకమంతయు, పొన్ కÇలాల్ అళన్దవన్టన్ =

(త్రివిక్రమావతారములోతన) అందమైన, బంగారు పాదములతో కొలిచిన స్వామి యొక్క తాళాల్ వన్ద = పాదములనుండి వచ్చిన (పుట్టిన), కజ్గై ఎనుమ్ నదిపోల= గంగ అను నది (మహిమ కల్గినది) వలె, కడల్కళ్ ఏழిల్ = ఏడు సముద్రముల లోపల, కమలై పిఱన్దు = పిరాట్టి అవతరించుటచే, అవన్ ఉకన్ద కడలే పోల = ఆ భగవానునకు ప్రియమైన పాలసముద్రము (గొప్పతనము కల్గినది) వలె, శజ్గుకళిల్= శంఖములలో, అవన్ ఏన్దుమ్ శజ్గే పోల = ఆ భగవానుడు (హస్తమునందు) ధరించుచున్న (పాంచజన్యమను) శంఖము గొప్పది అయినట్లు, తారిల్ = పూమాలెలలో, అవన్ తణ్ తుళవత్తారే పోల = ఆ భగవానుడు అలంకరించుకొను, చల్లని తులసీమాల (గొప్పది) వలె, ఎజ్గళ్ కులపతికళ్ = మా ప్రపన్నకులమునకు అధిపతులగు ఆழ்వార్లు మొదలగువారు, ఇవై మేల్ ఆమ్ ఎన్ఱే ఎణ్ణియ = ఇవియే గొప్పవి అగును అని నిశ్చయించి, అనుసంధించిన, నల్ వార్త్తైకళ్ = మంచి ఉపదేశములను, నామ్ ఇశైకిన్ఱోమ్ = మనము అంగీకరించి నడచుకొంటిమి.

లోకములో నీరు నిండి ప్రవాహించు నదులు అనేకములున్నను, భగవానుని శ్రీ పాదములనుండి అవతరించిన గంగయే గొప్ప నదియై యున్నది. సముద్రములు ఏడింటిలో పిరాట్టి అవతరించిన పాలసముద్రమే సర్వేశ్వరునకు ప్రియమైన మహిమను కల్గియున్నది. పలు విధములైన శంఖములున్నను స్వామి శ్రీహస్తమున అమరియుండు భాగ్యమును కల్గియున్న దక్షిణావర్తమగు పాంచజన్యమే గొప్పది. సుగంధమును కల్గియున్న పూమాలెలు పలు ఉన్నను, భగవానుడు సంతోషముతో ధరించు తులసీమాలయొక్క గొప్పతనము మిగిలిన మాలెలకు లేదు. ఇట్లే, లోకమున ప్రకాశించు పలు శాస్త్రములున్నను, వానిలో ప్రపన్నజనకూటస్థులగు నమ్మాழ்వార్లు మొదలగు మహాత్ముల శ్రీసూక్తులే ఉత్కృష్టములైనవి – అని నిశ్చయించుకొని, వానిని అంగీకరించి, తదనుగుణముగా ప్రవర్తించెదము.

త్రివిక్రమావతారములో బ్రహ్మలోకమువరకు వ్యాపించిన భగవానుని పాదమునకు బ్రహ్మ తిరుమంజనము చేయగా, ఆ తీర్థమే పవిత్రగంగానది అయ్యెనని పౌరాణికగాథ. ఇది **"కుతై కొణ్డు నాన్ముకన్"** ఇత్యాది సూక్తులద్వారా దివ్యసూరులు ఈ వృత్తాంతమును ప్రస్తుతించిరి. ఏడు సముద్రములు – లవణ, క్షీర, మధు, ఘృత, దధి,జల, ఇక్షు సముద్రములు .

25,26,27వ పాశురములు ప్రధానదశకమను రహస్యములోవి. వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము



**భగవానుడే ఆచార్యుడై అవతరించి, రక్షించుట**

**26.** **శీర్క్కడలిన్తిరైయెణ్ణి త్తకవాన్ మిక్క**
**దేశికరాయ్ త్తిణ్ణిరుళా జ్కడలై నీక్కి**
**ప్పాఱ్కడలో న్తిరువణైయాయ్ నిన్ఱు పార**
**జ్కాణాద పవక్కడలై క్కడత్తుకిన్ఱాన్**
**ఈర్క్కు మరక్కలమెన్న విత్తైవరిన్బ**
**మెழுన్దழియు ఙ్కుమిழி యెన వికన్దొழிన్దో**
**మార్క్కిని నా మెన్కడవో నమక్కుమారెన్**
**కడవారెన్ఱదైన్దవర్కట్కఱివిత్తోమే**

పాఱ్కడలోన్ = క్షీరాబ్ధిలో శయనించియున్న భగవానుడు, శీర్ క్కడలిన్ తిరై ఎన్న = గొప్పతనమునుకల సముద్రములోని కెఱటములనునట్లు (పైపైకి విజృంభించు), తకవాల్ మిక్క దేశికర్ ఆయ్ = కరుణనిండిన ఆచార్యుడై అవతరించి, తిణ్ ఇరుళ్ ఆమ్ కడలై నీక్కి = (మనలను అజ్ఞానమను) దట్టమైన చీకటి అను సముద్రమును దాటి, తిరు అణైయాయ్ నిన్ఱు = గొప్ప వారధిగా తానే నిలచి, పారమ్ కాణాద = తీరము కనుపింపని, పవ క్కడలై క్కడత్తుకిన్ఱాన్ = సంసారమను సముద్రమునుండి (మనలను అజ్ఞానమను) దఱికి చేర్చుచున్నాడు, ఈర్క్కుమ్ మరక్కలమ్ ఎన్న = (మనుష్యులను) మోసికొనుపోవుచున్న ఓడ అని చెప్పబడునట్టి, ఇత్తైవర్ ఇన్బమ్ = (బ్రహ్మ మొదలగు) దేవతలయొక్క సుఖమును, ఎழுన్దు అழியుమ్ కుమిழி ఎన = (నీటిలో) పైకి లేచి, నశించు బుడగ అనునట్లు (అస్థిరమైనదని) తలచి, ఇకన్దు ఒழிన్దోమ్ = (అందు ఆసక్తిని) వీడితిమి. అడైన్దవర్కట్కు= (మన వద్దకు వచ్చి) చేరినవారికి, నామ్ ఇని ఆర్క్కు ఎన్ కడవోమ్ = (ప్రపన్నులగు) మనము ఇక ఎవరికి ఏ విషయమునందు ఋణము కల్గినవారము? నమక్కు ఆర్ ఎన్ కడవార్ = మనకు ఎవరు ఏ రీతిలో ఋణపడియున్నారు? (భగవానుడు, మనమును ఒకరికొకరు ఋణపడియున్నామంతియే) ఎన్ఱు అఱివిత్తోమ్ = అని ఉపదేశించితిమి.

భగవానుడే దయాపూర్ణుడైన ఆచార్యులుగా అవతరించి, మన అజ్ఞానమను చీకటిని పోగొట్టి తానే సంసారమను సముద్రమునకు వారధియై నిలచి, మనలను దాటించుచు, దఱిచేర్చుచున్నాడు. కావున బ్రహ్మ మొదలగు దేవతల భోగము కూడ బుద్బుదమువలె నశించు స్వభావమును కల్గినదనుటను తెలిసికొని, అందు ఆశను వీడితిమి. ప్రపన్నులమగు మనము ఎవరికిని ఋణగ్రస్తులము కాము. (మనకెవ్వరును

ఏ విధముగను ఋణపడిలేరు) మనము, భగవానుడును ఒకరికొకరు ఋణపడియున్నాము తప్ప వేఱెవ్వరికిని కాదు. ఈ విషయమును మనవద్దకు వచ్చినవారికిని ఉపదేశించితిమి.

బ్రహ్మాది దేవతలు చేతనులకు అల్పఫలములనే ఇవ్వగల్గినవారై, భగవానుని సహాయములేనిచో కార్యము చేయులేనివారై యున్నారు. **"మయైవ విహితాన్ హితాన్"** అని గీతాచార్యుడు పల్కెను కదా! కావున, కొంచెము దూరమే మనుష్యులను లాగుకొని పోగల్గినది, ఇతరుల సహాయములేక పోగల్గిన శక్తిలేనిది అగు ఓడ వారికి ఉపమానముగా చెప్పబడినది. భగవానుని వేదము సైతము **"ఏష సేతు ర్విధరణః"** అని, పంచమవేద గతమగు విష్ణుసహస్ర నామమును **"జగత స్సేతుః"** అనియు వారధిగా పల్కినవి. **"కృత్వా మర్త్యమయీం తనూమ్, మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యా చ్ఛాస్త్రపాణినా"**, **"పీతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు"** ఇత్యాది పలు సూక్తులద్వారా ఈ విషయము స్పష్టము. **"దేవర్షిభూతాప్తనృణాం పితౄణాం న కింకరో నాయ మృణీ చ రాజన్, సర్వాత్మనా యః శరణం శరణ్యం నారాయణం లోకగురుం ప్రపన్నః"** అను మొదలగు ప్రమాణములు ప్రపన్నుడు ఎవరికిని ఋణపడిలేదని తెలుపుచున్నవి. బ్రహ్మాదుల భోగముసైతము ప్రపన్నుడు ఆశింపడనుటకు **"ఇతరావసథేషు మా స్మ భూ రపి మే జన్మ చతుర్ముఖాత్మనా"** ఇత్యాది ప్రయోగమువలన తెలియవచ్చును. ఈ వృత్తము ఎణ్‌శీర్ ఆశిరియ విరుత్తము.

**వస్తువుల తారతమ్యమును తెలియుట**

**27.** **కాశినియిన్ మణియనైత్తు ఙ్కాయావణ్ణన్**
**కడైన్దెదుత్త కవుత్తువత్తిన్ శీరమ్మైక్కొవ్వా**
**కాశి ముదలాకియ నన్నకరియెల్లా**
**ఙ్కార్మేని యరుళాళర్ కచ్చిక్కొవ్వా**
**మాశిన్ మననైళి మునివర్వార్త్తైక్కొవ్వా**
**మాలుకన్ద వాశిరియర్ వకుత్త వెల్లా**
**వాశి యఱిన్దివై యురైత్తోమ్ వైయత్తుళ్ళీర్**
**వైప్పాక వివై కొణ్డు మకిழ్మినీరే**

కాశినియల్ మణి అనైత్తుమ్ = భూమిలోనున్న రత్నములు (గొప్పమణులు) అన్నియు, కాయా వణ్ణన్ కడన్దు ఎడుత్త = అతసీసుమవర్ణుడగు భగవానుడు (సముద్రమును) చిలికి (తన కొఱకై) వెలికిదీసిన, కవుత్తువత్తిన్ శీర్మైక్కు ఒవ్వా = కౌస్తుభమణి గొప్పతనమునకు



సాటిరావు, కాశి ముదలాకియ నల్ నకరి ఎల్లామ్ = వారణాసి మొదలగు పుణ్యక్షేత్రములన్నియు, కార్ మేని అరుళాళర్ కచ్చిక్కు ఒవ్వా = మేఘమువంటి రూపమునుకల శ్రీ వరదరాజస్వామి అధివసించియున్న కంచికి సరికావు, (ఆ విధముగానే), మాశు ఇల్=దోషములేని, మనమ్ తెళి మునివర్ = స్వచ్ఛమైన మనస్సునుకల మహర్షులు, వకుత్త ఎల్లామ్ = ప్రకాశింపజేసిన (శ్రుతి, స్మృతి, పురాణములు) అన్నియు, మాల్ ఉకన్ద ఆశిరియర్ = భగవానుని కృపకు పాత్రులైన ఆచార్యులు (భగవానుడు అభిమానించిన నమ్మాళ్వార్లు మొదలగు ఆచార్యులు), వార్త్తైక్కు ఒవ్వా = ఒక మాటకుకూడ సాటిరావు, వాశి అఱిన్దు ఇవై ఉరైత్తోమ్ = (అర్థముల) తారతమ్యమును తెలిసికొని, ఈ విషయముల హెచ్చుతగ్గులనుగూర్చి పల్కితిమి, వైయత్తుళ్ళీర్ = భూలోకవాసులారా! నీర్ ఇవై వైప్పాక కొణ్డు మకిழ్మిన్ = మీరు ఈ విషయములను అపూర్వనిధిగా గ్రహించి, ఆనందింపుడు.

భూమిలోని అనర్ఘములైన రత్నములన్నియు గొప్పతనమున భగవానుడు క్షీరాబ్ధిని చిలికి తనకై గ్రహించి, వక్షః స్థలమున అలంకరించుకొనిన కౌస్తుభమణితో సరితూగవు. కాశిమొదలగు పుణ్యక్షేత్రములు అన్నియు శ్రీ వరదరాజస్వామి అనెడి కారుమేఘము కరుణ అనెడి నీటిని వర్షించు చోటగు కాంచీ క్షేత్రముతో సాటిరావు. అట్లే, స్వప్రయత్నముచే పరిశుద్ధమనస్కులగు మహర్షులు వ్యక్తీకరించిన వేద–స్మృతి–పురాణాదులు అన్నియు **"మయర్వఱ మదినలమ్ అరుళినన్"** అను రీతిలో భగవానుని నిర్హేతుకకటాక్షముపనకు పాత్రులై, భ్రమ విప్రలంభాది దోషములు లేని పరిశుద్ధజ్ఞానమును కలవారగు నమ్మాళ్వార్ల వంటి ఆచార్యులు అనుగ్రహించిన. ఒక సూక్తితోకూడ సమము కావు. ఆస్తికులారా! ఇట్లు విషయములలోని తారతమ్యమును గుర్తించి, ఈ రహస్యములో మేము పల్కిన ప్రధానములగు అర్థవిశేషములను అన్నిటిని మన పూర్వులు సమీకరించి కూర్చిన **"వైత్తమానిది"** అనునట్లు మహానిధిగా తలచి, గ్రహించి, ఆనందింపుడు.

కాశిని సంస్కృతశబ్దము. భూమివాచకము. కౌస్తుభశబ్దముయొక్క వికృతియే **"కవుత్తువమ్"** అను రూపము. **"యో మద్భక్త స్స మే ప్రియః"** అని, **"స చ మమ ప్రియః"** అని భగవానుడు అభిమానించి పల్కిన భక్తులు నమ్మాళ్వార్లవంటివారే కదా! **"ఋషికళుక్కుమ్ ఆళ్వార్కళుక్కుమ్ పర్వతపరమాణు వాశిపోరుమ్"** ఇత్యాది పూర్వాచార్యవ్యాఖ్యా సూక్తి మహర్షి – దివ్యసూరుల మధ్యగల తారతమ్యమును తెలుపుచున్నవి.

ఈ వృత్తము పూర్వమువలె ఎణ్‌శీర్ ఆశిరియవిరుత్తము.

### భగవానుడు చేయు మహోపకారము

28. అన్దమిలా ప్పేరిన్బ మరున్దవేఴ్కు
 మడియోమై యఱివుడనే యెన్ఱు ఙ్కాత్తు
మున్దైవినై నిరైవఴియిలొఴుకాదెమ్మై
 మున్నిలైయా న్దేశికర్తమున్నే శేర్త్తు
మన్దిరము మన్దిరత్తిన్ వఴియు ఙ్కాట్టి
 వఴిపడుత్తి వానేఱ్ఱి యడిమైకొళ్ళ
త్తన్దైయెన నిన్ఱ తనిత్తిరుమాఱాళి
 ఱ్ఱలైవైత్తో ఞ్జడకోపనరుళినాలే

అన్దమ్ ఇలా పేర్ ఇన్బమ్ = అంతులేని గొప్ప మోక్షానందమును, అరున్ద ఏఴ్కుమ్ అడియోమై = అనుభవింపజేయుటకు తగిన దాసులమగు మనలను, ఎన్ఱుమ్ అఱివుడనే కాత్తు = ఎల్లప్పుడు నిత్యమైన ధర్మభూతజ్ఞానముతో (కూడియుండునట్లు) రక్షించి, ఎమ్మై = మనలను, మున్దై నిరై వినై వఴియిల్ ఒఴుకాతు = అనాదియై, అనుసరించి వచ్చు కర్మప్రవాహమున (దఱి చేరలేక) మునిగి పోకుండునట్లు, మున్ నిలై ఆమ్ = (మనకు అనుగ్రహించుటకు) మొదటిస్థానములోనున్న, దేశికర్ ఎమ్ మున్నే శేర్న్దు = ఆచార్యుల సన్నిధికి కొనిపోయి చేర్చి, మన్దిరముమ్ = తిరుమంత్రము మొదలగు మంత్రములను, మన్దిరత్తిన్ వఴియుమ్ కాట్టి = ఆ మంత్రమునందు చెప్పబడు (ప్రపత్తి అను) ఉపాయమును ఉపదేశించి, వఴిపడుత్తి = ఆ ఉపాయమును అనుష్ఠించునట్లు చేసి, వాన్ ఏఱ = పరమపదమునకు చేర్చి, అడిమై కొళ్ళ = (మనము చేయు) కైంకర్యమును స్వీకరించుటకు, తన్దై ఎన నిన్ఱ = (అంతటి మహోపకారమును చేయుటకు ముందుకు వచ్చుటచే) తండ్రి అనునట్లు నిలచిన, తని త్తిరుమాల్ తాళిల్ = సాటిలేని భగవానుని శ్రీ పాదములలో, శడకోపన్ అరుళినాల్ = నమ్మాఴ్వార్లు కృపతో, తలై వైత్తోమ్ = శిరస్సును పంచగల్గితిమి (నమస్కరింపగల్గితిమి)

భగవానుని దాసులమై, ఆ స్వామికి పుత్రస్థానీయులమగు మన కందఱకు మోక్షానందమును పొందు యోగ్యత, అధికారము ఉన్నది. సర్వేశ్వరుడు ఇట్టి జీవులమగు మనకు స్వరూపమును, ధర్మభూతజ్ఞానమును అనుగ్రహించి, రక్షించును. పూర్వవాసనవలన మఱల కర్మసముద్రములో మునిగి పోకుండునట్లు చేయదలచి, మనలను మహనీయులగు ఆచార్యుల సన్నిధిలో చేర్చి, ఆ ఆచార్యునివద్ద రహస్యార్థములను ఉపదేశముగా పొంది, ప్రపత్తిని అనుష్ఠించునట్లు చేయును. పిమ్మట మనలను ఈ శరీరపతనానంతరము పరమపదమునకు కొనిపోయి చేర్చి, మనము చేయు పరిపూర్ణకైంకర్యమును స్వీకరించుటకై మిక్కిలి ఆశతో నుండును. ఇట్లు మహోపకారమును చేసి, తండ్రియైనుండు భగవానుని శ్రీపాదములలో మనము శిరసా అభివందనము చేయగల్గితిమి. దీనికి కారణము ఆ శ్రీపాదముల గొప్పతనమును తమ శ్రీ సూక్తులద్వారా చూపిన శ్రీ శఠకోపులనెడి మన తల్లి కృపయే.



**“అడియోమై ఎన్ఱుమ్ కాత్తు”**, **“అడియోమై ఎన్ఱుమ్ అఱివుడనే కాత్తు”** అని రెండు విధములుగా అన్వయించినచో, భగవానుడు జీవుని స్వరూపమును, స్వభావమును మార్చగల్గినవాడైనను, తన నిత్యమైన సంకల్పముచే జీవుని నిత్యునిగా చేసి,జీవస్వరూపమును, ధర్మభూతజ్ఞానమును జీవుని వీడియుండని నిత్యగుణముగా చేసి, జీవస్వభావమును రక్షించుచున్నాడని తాత్పర్యము.

ఈ పాశురము నమ్మాఴ్వార్లు అనుగ్రహించిన తిరువిరుత్త ప్రబంధములోని మొదటి పాశురముయొక్క వ్యాఖ్యానమగు ఉపకారసంగ్రహమను రహస్యమునుగూర్చి రచింపబడినదగుటచే, ఇందు ఆఴ్వార్ల ప్రసక్తి వచ్చినది. **“తిరుమాల్ తాళిల్ శడకోపన్ అరుళినాల్ తలైవైత్తోమ్”** అను నపుడు నమ్మాఴ్వార్ల **“తుయరఱు శుడరడి తొఴుదు”** **“అడిక్కీఴ్ అమర్న్దు పుకున్దేనే”** అని మొదలుగాగల సూక్తులు భావ్యములు. 29,30 వ పాశురములును ఉపకారసంగ్రహములోనివే. వృత్తము పూర్వమువలె ఎణ్ శీర్ ఆశిరియ విరుత్తము.

### జీవస్వరూపమును తెలియుట

29. తాన్ఱనక్కు త్తన్నాలే తోన్ఱి త్తన్నో
 రొళి యణైక్కు ఙ్కుణత్తాలు న్తన్నై క్కణ్డు
తాన్ఱనక్కే న్ఱఱియాద తన్కుణత్తై
 త్తన్ కుణత్తాఱ్ఱా నిఱైయిఱ్ఱానే కూట్టి
యూన్ మరుత్తు ప్పులన్ మనమానాఙ్కారఙ్గ
 ళొరుమూలప్పిరకిరుతి యన్ఱి నిన్ఱ
నాన్ఱనక్కు త్తాన్ఱన క్కెన్ఱిశైవు తన్ద
 నారణనై నాన్ మఱైయా నాన్కణ్డేనే

తాన్ = జీవాత్మయగు తాను, తనక్కు త్తన్నాలే తోన్ఱి = తన కొఱకై తానే (నేను అని) భాసించి, తన్ ఓర్ ఒళి అణైక్కుమ్ కుణత్తాలుమ్ = తనయొక్క ఒక ప్రకారమువంటి ధర్మభూతజ్ఞానముతోను, తన్నై క్కణ్డు = జీవాత్మయగు తనను తెలిసికొని, తాన్ తనక్కు ఎన్ఱు అఱియాద = (అచేతనమగుటచే) తాను, తనకు అనెడి జ్ఞానము లేని, తన్ గుణత్తై = ధర్మభూతజ్ఞానమును, తన్ కుణత్తాల్ = తనకు లభించిన తత్త్వజ్ఞానముతో, తన్ ఇఱైయిల్ తానే కూట్టి = తాను సర్వస్వామియగు భగవానుని విషయములోనే ప్రవర్తింపజేసి, ఊన్ = మాంసమయమైన శరీరము, మరుత్తు = ప్రాణవాయువులు, పులన్ = ఇంద్రియములు, మనమ్ = మనస్సు, మాన్ = మహాన్ అను తత్త్వము, ఆఙ్కారఙ్గళ్ = అహంకారమను తత్త్వము, ఒరు మూల ప్పిరకిరుతి = అద్వితీయమైన మూల ప్రకృతి, అన్ఱి నిన్ఱ = అనెడి అచేతనములకంటె వేఱయిన, నాన్ = జీవాత్మయగు నేను, తనక్కు = సర్వేశ్వరుడగు తనకు, (దాసుడను), తాన్ తనక్కు ఎన్ఱు = భగవానుడగు తానే తనకు (స్వామి) అని, ఇశైవు తన్ద = (నేను) అంగీకరించునట్లు చేసిన, నారణనై = నారాయణుని, నాన్మఱైయాల్ = నాల్గు వేదములతో, నాన్ కణ్డేన్ = (ఒక విధముగా) నేను తెలిసికొంటిని.

జీవాత్మ తనకంటె వేఱయిన ఏ వస్తువునైనను తెలియవలెనన్న జ్ఞానముద్వారానే తెలియవలెను. ఈ జ్ఞానము ధర్మభూతజ్ఞానమనబడును. అజ్ఞానమునుకల జీవుడును జ్ఞానస్వరూపుడుగనే యుండుటచే ధర్మిభూతజ్ఞాన మనబడుచున్నాడు. జీవాత్మ తనను మాత్రము తెలిసికొనునపుడు ధర్మభూతజ్ఞానముయొక్క ఆవశ్యకత లేదు. జీవాత్మ స్వస్మై స్వయంభానమానుడు కావున తనకు తానే భాసించును. ఇట్లుండుట స్వయంప్రకాశకత్వమనబడును. జీవుడు, తాను భాసించుటవలన కల్గు ఫలమును తానే అనుభవించును. ఈ స్వభావమునకు ప్రత్యక్త్వమని పేరు. సూర్యుని ప్రకాశము సూర్యుని విడచియుండనట్లు, జీవుని ధర్మభూతజ్ఞానము జీవుని విడచియుండదు. జీవుని ధర్మమై – అనగా గుణమై యుండును. (కావుననే ధర్మభూతజ్ఞానమని పేరు). కావున జీవాత్మ తనను తెలిసి కొనునపుడు. ధర్మభూతజ్ఞానముయొక్క సహాయము లేకనే తెలిసికొనును. నిత్యమై యుండుట, అణువై యుండుట మొదలగు ధర్మములతో జీవుని తెలియవలెనన్న ధర్మభూతజ్ఞానము ఆవశ్యకము – అనునది సిద్ధాంతము. ఈ ధర్మభూతజ్ఞానము జ్ఞానశూన్యము. కావున అచేతనము. దీనిని భగవానుని విషయమున ప్రవర్తించినపుడే జీవుడు ఉజ్జీవింపగలడు. అట్లు చేయుటకు తత్త్వజ్ఞాన మావశ్యకము. అది కల్గినచో, శరీరముకంటె తాను భిన్నుడనని, భగవానునకు శేషభూతుడననెడి విశేషజ్ఞానము కల్గును.



ఈ జ్ఞానమును అనుగ్రహించిన భగవానుని వేదాంతశాస్త్రముద్వారా ఒక విధముగా తెలిసికొంటిని.

ఆత్మ స్వరూపమునుగూర్చి అఴ్వార్లు **"శెన్ఱు శెన్ఱు పరమ్పరమాయ్"** ఇత్యాది సూక్తిద్వారా స్పష్టీకరించిరి. ఇట్లు ఆత్మ దేహాది విలక్షణమనుట– **"దేహేంద్రియమనః ప్రాణధీభ్యోఽన్యః"** అను యామునసూక్తివలన, అజడమనుట **"హృదంతః జ్యోతిః పురుషః"**, **"విజ్ఞానఘనః"**, **"ఆత్మా జ్ఞానమయః"** ఇత్యాదులవలన, ఆనందరూపమనుట **"జ్ఞానానందమయ స్త్వాత్మా"**, **"జ్ఞానానందైకలక్షణమ్"** ఇత్యాదులవలన, నిత్యమనుట **"నిత్యో నిత్యానామ్"**, **"జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశనీశౌ"** ఇత్యాదులవలన, అణువనుట **"ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యః"** ఇత్యాదులవలన, అవ్యక్తము, అచింత్యమనుట – **"అవ్యక్తోఽయ మచింత్యోఽయమ్"** అనుటవలన, నిరవయవమనుట **"విజ్ఞానమయః"**, **"విజ్ఞానఘనః"** ఇత్యాదులవలన, నిర్వికారమనుట, **"అమృతాక్షరం హరః"**, **"ఆత్మాశుద్ధోఽక్షరః"** ఇత్యాదులవలన, భగవన్నియామ్యమనుట – **"య ఆత్మని తిష్ఠన్.... య ఆత్మాన మంతరో యమయతి"** ఇత్యాదులవలన, ధార్యమనుట– **"ఏష సేతు ర్విధరణః"**, **"ఏవ మేవ చాస్మిన్ ఆత్మని సర్వాణి భూతాని సర్వ ఏవాత్మాక స్సమర్పితా"** ఇత్యాదులవలన, శేష మనుట–**"యస్యాస్మి న త మంతరేమి,"** **"ఆత్మ దాస్యం హరేః స్వామ్యం స్వభావం చ సదా స్మర"** అనుమొదలగువానివలన, ఆత్మయొక్క అసంఖ్యాకత్వము **"నిత్యో నిత్యానామ్"** ఇత్యాదులవలన స్పష్టము అగుచున్నవి.

వృత్తము ఎణ్శీర్ ఆశిరియవిరుత్తము.

**భగవానుని సహాయము లెక్కకట్టలేనిది**

**30.** **కఴియాద కరువినైయి ల్పడిన్ద నమ్మై**
**క్కాలమిదు వెన్ఱొరుకా ల్కావల్శెయ్దు**
**పఴియాద నల్వినైయిల్పడిన్దార్ తాళి**
**ల్పణివిత్తు ప్పాశఙ్కళడైయ నీక్కి**
**చ్చుఴియాద శెవ్వఴియిఱ్ఱుణైవరోడే**
**తొలైయాద పేరిన్బ త్తరమేలేఱ్ఱ**
**యఴియాద వరుళాఴిప్పెరుమాన్ శెయ్యు**
**మన్దమిలా వుదవి యెలా మళప్పారారే**

కఴియాద కరు వినైయిల్ = తొలగని (వీడిపోని) గర్భవాసమును కల్గించు కర్మములలో, పడిన్ద నమ్మై = మునిగియున్న మనలను, ఇదు కాలమ్ ఎన్ఱు = ఇదియే తగిన సమయమని (తలచి), ఒరు కాల్ కావల్ శెయ్దు = (మన అదృష్టము పండిన) ఒక సమయములో రక్షించుటచు ముందుకు వచ్చి, పఴియాద నల్ వినైయిల్ = చెడిపోని (ఎట్టి దోషములేని) సత్కార్యమును ప్రపత్తి మార్గములో, పడిన్దార్ తాళిల్ పణివిత్తు = అభినివేశమును కల్గిన ఆచార్యుల పాదములలో (మనలను) నమస్కరింప చేసి, పాశఙ్గళ్ అడైయ నీక్కి = కర్మపాశములను పూర్తిగా పోగొట్టి, తొలైయాద పేరిన్బమ్ తర = నాశము లేని మహానందమనబడు మోక్షానందమును అనుగ్రహించుటకు, శుఴియాద శెవ్వఴియిల్ = తిరిగి వచ్చుట (పునరావృత్తి) లేని గొప్ప అర్చిరాదిమార్గముద్వారా, తుణైవరోడే మేల్ ఏఱ్ఱి =(ఆతివాహికులనబడు) సహాయములతో శ్రీ వైకుంఠమునకు చేర్చి, అఴియాద అరుళ్ ఆఴి ప్పెరుమాన్ శెయ్యుమ్ = నాశనము లేనివాదును, కరుణాసముద్రుడును అగు భగవానుడు చేతనునకు చేయునట్టి, అన్దమ్ ఇలా ఉదవి ఎల్లామ్ = ఎల్లలేని ఉపకారములన్నిటిని, అళప్పార్ ఆర్ = ఇంత అని, ఇన్ని అని లెక్కకట్టగల్గినవారు ఎవరు ? (ఎవరును లేరని భావము)

పేరరుళాళన్ (వరదరాజస్వామి) గర్భవాసదుఃఖమును కల్గించు పాపకర్మలయందే తగులు కొనియున్న (ఆసక్తులమైయున్న) మనలను రక్షింపగోరి, మన భాగ్యము పక్వమైన సమయములో ఆచార్యుని శ్రీ పాదములో మనలను ఆశ్రయించునట్లు చేయును. పిమ్మట ప్రపత్తి అను ఉపాయములో మనము ప్రవర్తించునట్లు చేసి, కర్మపాశములనన్నిటిని పోగొట్టి, అతివాహికులద్వారా అర్చిరాది మార్గమున పరమపదమునకు చేర్పించి, మోక్షానందమును అనుగ్రహింప ముందుకు వచ్చినాడు. ఇట్టి సర్వేశ్వరుడు మనకు చేయు ఉపకారపరంపరలు అనేకములు. అవి ఇన్ని అని, ఇంత అని లెక్క కట్టుటకు ఎవరికిని శక్తి లేదు.

ఈ పాశురములోని **"అరుళాఴి ప్పెరుమానై"** అను ప్రయోగము సాభిప్రాయకము. కంచి వరదరాజస్వామినిగూర్చి ప్రయోగింపబడినదని పెద్దల అభిప్రాయము. శరీరమును వీడి మోక్షమునకు వెడలు జీవునకు తమ తమ స్థానములలో ఉపచారములను చేసి, తోడ్కొని పోవువారికి ఆతివాహికులని పేరు. ఇంతకంటె ఇంకను వివరములు అధికారసంగ్రహములోని 28వ పాశుర వ్యాఖ్యలో చూడనగును. వృత్తము పూర్వమువలె ఎణ్శీర్ ఆశిరియవిరుత్తము.



**భగవానుని అయిదు అంగములతో ప్రపత్తి చేయుట**

**31.** నిన్నరుళా జ్కతి యన్ఱి మఱ్ఱొన్ఱిల్లేన్
నెడుఙ్కాలమ్ పిఴైశెయ్ద నిలై కఴిన్దే
నిన్నరుళుక్కినిదాన నిలైయుకన్దే
నున్ శరణే శరణెన్ను తుణివు పూణ్డేన్
మన్నిరుళాయ్ నిన్ఱ నిలై యెనక్కు త్తీర్త్తు
వానవర్తమ్ వాఴ్చ్చితర వరిత్తే నున్నై
యిన్నరుళాయిని యెనక్కోర్ పరమేఱ్ఱామ
లెన్తిరుమా లడైక్కల జ్కొళ్ళెన్న నీయే

ఎన్ తిరుమాల్ ! = నాకు స్వామివగు ఓ శ్రియఃపతీ ! నిన్ అరుళామ్ కతి యన్ఱి = నీ కృప అనెడి గతి తప్ప, మఱ్ఱు ఒన్ఱు ఇల్లేన్ = వేఱొక గతి లేనివాడనై యున్నాను, నెడుమ్ కాలమ్ పిఴై శెయ్ద నిలై కఴిన్దేన్ = అనాదికాలముగా అపరాధము చేసిన స్థితిని (ఇపుడు) దాటితిని, ఉన్ అరుళుక్కు ఇనిదాన నిలై ఉకన్దేన్ = నీ కృపను పొందుటకు తగిన మంచి ప్రపత్తిమార్గమును కోఱితిని, ఉన్ శరణే శరణ్ ఎన్నుమ్ తుణివు పూణ్డేన్ = నీ పాదములే ఉపాయమును నిశ్చయమును పొందితిని; మన్ ఇరుళాయ్ నిన్ఱ నిలై = ధృఢమైన, అజ్ఞానమయమై నున్న స్థితిని, ఎనక్కు త్తీర్త్తు = నాకు పోగొట్టి, వానవర్ తమ్ వాఴ్చ్చి తర = నిత్యసూరుల ఉజ్జీవనమును (నాకు) అనుగ్రహించునట్లు, ఉన్నై వరిత్తేన్ = నిన్ను ప్రార్థించితిని, ఇన్ అరుళాల్ = నీ (తీయని) కృపతో, ఇన ఎనక్కు ఓర్ పరమ్ ఏఱ్ఱామల్ = ఇకపై నాకు ఏ భారమును మిగిలియుంచకుండ, నీ ఎన్నై అడైక్కలమ్ కొళ్ = నీవు నన్ను రక్షింపవలసిన వస్తువుగా అంగీకరింపుము.

నాకు స్వామివగు ఓ శ్రియఃపతీ ! నీ కృపతప్ప దాసుడనగు నాకు వేఱొక గతి లేదు. అనాదికాలముగా నీ శ్రీపాదములలో అపరాధమును చేసిన స్థితి ఇపుడు పోయినది. నీ కృపను పొందుటకు అనుకూలమైన సాధనమగు ప్రపత్తిని అనుష్ఠించితిని. నీ పాదములనే రక్షకముగా విశ్వసించితిని. నా అజ్ఞానమును పోగొట్టి, నిత్యసూరుల ఉజ్జీవనమును నాకు అనుగ్రహించి, రక్షింపుమని నిన్ను ప్రార్థించితిని. నా పై కరుణ జూపి, ఇక నా పై ఏ భారమును ఉంచకుము. నన్ను రక్షింపవలసిన వస్తువుగా స్వీకరింపుము.

ఈ పాశురములో మొదటివాక్యమున కార్పణ్యము, రెండవవాక్యమున ప్రాతికూల్యవర్జనము, మూడవవాక్యములో ఆనుకూల్యసంకల్పము, నాల్గవవాక్యములో మహావిశ్వాసము, అయిదవ, ఆఱవవాక్యములలో గోప్తృత్వవరణము, ఏడవ, ఎనిమిదవ వాక్యములలో ఆత్మసమర్పణము తెలుపబడినదని గ్రహింపనగును. కావున అయిదు అంగములతోకూడిన ప్రపత్తిని ఈ పాశురము ప్రకాశింపచేయుచున్నదని పెద్దలందురు. ఈ అయిదు అంగముల వివరము అడైక్కలప్పత్తులోని అయిదవ పాశురవ్యాఖ్యలో గమనింపనగును. పాశురములోని మొదటి శరణశబ్దము చరణమను అర్థమును, రెండవ శరణశబ్దము శరణమను అర్థమును తెల్పును. **"శరణే శరణ్ నమక్కెన్ఱు"** అను తిరువాయ్మొழி ప్రయోగము. ఇచట స్మరణీయము.

ఈ పాశురము సారసంగ్రహమను రహస్యములోనిది. వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము.

**భగవత్కైంకర్యమును చేయవలెనను మనోనిశ్చయము**

**32.** **పరవు మఱైకళెలామ్ పదఞ్జేర్న్దొన్ఱ నిన్ఱ పిరా**
**నిరవన్ఱిరవియిన్ కాలత్తழைత్త వెழிప్పడైయోన్**
**అరవు ఙ్కరుడను మన్బుడనేన్దు మడి యిరణ్డు**
**న్తర వెన్దమక్కరుళాల్తళరా మన స్తన్దననే**

పరవుమ్ మఱైకళ్ ఎలామ్ = స్తోత్రము చేయు స్వభావమునుకల వేదములు అన్నియు, పదమ్ శేర్న్దు ఒన్ఱ = తన శ్రీ పాదములందు అభినివేశమును పొంది కీర్తింపగా, నిన్ఱ పిరాన్ = (అందుచే) ఉన్నతుడైయున్న స్వామియు, అన్ఱు = ఆనాడు, (భారతసమరములో), ఇరవియిన్ కాలత్తు = సూర్యుడు ప్రకాశించు పగటి సమయమున, ఇరవు అழைత్త = రాత్రిని కల్గించిన (సృష్టించిన), ఎழిల్ పడైయోన్ = ప్రకాశించు చక్రాయుధమును కల్గినవాడగు భగవానుడు, అరవుమ్ కరుడనుమ్ = ఆదిశేషుడు, గరుత్మంతుడును, అన్బుడన్ ఏన్దుమ్ = భక్తితో దాల్చి కైంకర్యమును చేయుచున్న, అడి ఇరణ్డుమ్ ఎమ్తమక్కుత్తా = శ్రీ పాదములను రెండిటిని (మేమును సేవించునట్లు) మాకు అనుగ్రహింప (దలచి), అరుళాల్ = కృపతో, తళరా మనమ్ తన్దనన్ = వికలము కాని మనస్సును అనుగ్రహించెను.

వేదములు మొత్తము భగవానుని శ్రీ పాదములను స్తుతించుచున్నవి. ఆ స్వామి భారతయుద్ధమున తన సుదర్శనచక్రముతో పగలును రాత్రిగా చేసిన గొప్పతనమును



కలవాడు. పెరియతిరువడి, ఆదిశేషుడు మొదలగు నిత్యసూరులు అందఱును ఆ స్వామి పాదములకు భక్తితో కైంకర్యమును చేయుదురు. అట్టి పాదములను మనకును కృప చేయవలెనని తలచి, వానికి కైంకర్యమును చేయదగిన మనోనిశ్చయమును మనకు కల్గించెను.

ఈ పాశురములో శేషునకు, గరుడునకునుమధ్య సహజముగా నుండతగిన విరోధము లేక, వారు ఇరువురు కలసి భగవత్కైంకర్యమును చేయుట, రాత్రియు పగలును కలిసియుండుట, ప్రకాశవంతమైన సుదర్శనముతో రాత్రిని కల్పించుట మొదలగు అపూర్వఘటనలు వర్ణింపబడుట గమనింపతగినది. దీనిరహస్యమేకదా విరోధపరిహారము. (దీనివలన భగవానుని అఘటితఘటనా సామర్థ్యము నిరూపితము)

భారతయుద్ధములో పదునాల్గవ దినమున, అర్జునుడు తన పుత్రుడైన అభిమన్యుని చంపిన జయద్రథుని (సైంధవుని) ఆనాడు సూర్యుడస్తమించుటకు పూర్వమే చంపలేక పోయినచో అగ్నిప్రవేశము చేసెదనని ప్రతిజ్ఞ చేసెను. దానిని వినిన దుర్యోధనాదులు జయద్రథుని బయటకు విడువక, మిక్కిలి జాగ్రత్తగా యుద్ధశిబిరములోనుంచి రక్షించుచుండిరి. సాయంకాల సమయమైనను తాను సైంధవుని వధింపలేకపోవుటచే అర్జునుడు విషాదమును పొందెను. అర్జునుని విచారమును పోగొట్టదలచిన శ్రీకృష్ణుడు తన చక్రాయుధముతో పగటిసమయములోనే సూర్యుని ఆచ్ఛాదించెను. అందుచే చీకటి ఆవరించి రాత్రివలె తోచెను. అర్జునుడు తన శపథమునకు అనుగుణముగా అగ్ని ప్రవేశము చేయసంకల్పించెను. అర్జునుడు అగ్నిలో ప్రవేశించుటను ఆనందముగా చూడవలెనని, శత్రువులు జయద్రథుని బయటకు తీసికొని వచ్చిరి. అపుడు కృష్ణుడు చక్రమును ఉపసంహరింపగా, మఱల పగలు ప్రకాశించెను. వెంటనే అర్జునుడు జయద్రథుని వధించెను. భారతములోని ఈ కథ ఈ పాశురములోని రెండవ పాదములో ప్రస్తావింపబడినది.

ఈ పాశురము విరోధపరిహారములోనిది. వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

**భగవద్రామానుజుల మహిమ**

**(సంభాషణరూపము)**

శ్రీ భాష్యకారుల శ్రీ పాదములందు అభినివేశమును కలవారు ఇద్దఱు ఒక కోనేటి తీరముననుండి, భాష్యకారుల కీర్తినిగూర్చి సంభాషించు రీతిలో నున్న ఈ పాశురము మిక్కిలి రసఘనము.

33. అలర్న్ద వమ్బుయత్తిరున్దు తేనరున్ది యిన్నక -
లల్‌కులారశైన్దడైన్ద నడై కొళాదతనమెనో
నలన్దవిర్న్దదాలతెన్గొలావిన్ వీఱిదన్దదా
నా వణజ్గు నాదర్ తన్ద నావిన్ వీఱిదన్దదెన్
శలన్దవిర్న్దు వాదు శెయ్దు శాడి మూణ్డ మిణ్డరై
చ్చరివిలే నెనక్కనైత్తురైత్త వెతిరాశర్ తమ్
నలన్దరుజ్కై నాయనార్ వళైక్కిశైన్ద కీర్త్తియార్
వారి పాల తామతెన్ఱు మాశిల్ వాழி వాழியే

**ఒకరు:-** అనమ్ అలర్న్ద అమ్బుయత్తు ఇరున్దు = హంస వికసించిన తామరపూవులో కూర్చునియుండి, తేన్ అరున్ది = (అందున్న) తేనెను ఆస్వాదించి, ఇన్ అకల్ అల్‌కులార్ = అందమైన, పొడవైన కేశపాశమునుగల స్త్రీల, అశైన్దు అడైన్ద నడై = ఒయ్యారముగా కదలుచు నడచు నడకను, కొళాదదు ఎన్ = గ్రహింపక (శ్రమపడి వాడి) యుండుటకు ఏమి కారణము?- అనగా -

**వేఱొకరు :-** నలమ్ తవిర్న్దదాల్ = తన గొప్పతనమును అది కోల్పోవుటచే

**ఒకరు :-** అదు ఎన్‌కొల్ = అది ఏమి?

**వేఱొకరు :-** నావిన్ వీఱు ఇదన్దదాల్ = (తన) నాలుకకు గల (పాలను, నీటిని విడదీయు) శక్తిని కోల్పోవుటచే

**ఒకరు :-** నా అణజ్గు నాదర్ తన్ద = వాగ్దేవతయగు సరస్వతికి నాథుడగు బ్రహ్మచే అనుగ్రహింపబడిన, నావిన్ వీఱు ఎన్ ఇదన్దదు ? = నాలుకయొక్క ఆశక్తి ఎందులకు పోయినది?

**వేఱొకరు :-** మూణ్డ మిణ్డరై = మాటిమాటికి వాదమునకు వచ్చిన మూఢులగు వాదులను, శలమ్ తవిర్న్దు వాదు శెయ్దు శాడి = ఎట్టి దోషము లేకుండ వాదించి, జయించి, శరివు ఇలేన్ ఎనక్కనైత్తు ఉరైత్త = (ఇంకను ఎవరు వాదము చేయవచ్చినను) అలసిపోను అని గర్జించి పల్కిన, ఎతిరాశర్‌తమ్ = యతిరాజుల, వలమ్ తరుమ్ కైనాయనార్ = (ఆశ్రయించినవారికి) బలమును ఇచ్చు హస్తమునుకల భగవద్రామానుజుల, వళైక్కు ఇశైన్ద కీర్త్తియాల్ = శంఖమువంటిదియగు కీర్తి (లోకమునందు అంతట) వ్యాపించుటచే, వారి పాలదు ఆమ్ = నీరు అంతయు పాలుగా మారినది, ఎన్ఱుమ్ మాశు ఇల్ అదు వాழி వాழி = ఏ కాలమునందును లోటు లేని ఆ కీర్తి వర్ధిల్లుగాక !



ఒక కోనేటిగట్టుపై ఇద్దఱు ఈ క్రిందివిధముగా సంభాషించుకొనుచుండిరి.

**ఒకరు** :- ఇచటనున్న హంస తామరపూవులో అమరియుండి, అందలి తేనెను ఎందులకు ఆస్వాదించుటలేదు? ఎందులకిట్లు సోమరిగానున్నది. మీకు తెలియునా?

**వేఱొకరు** :- తెలియును, దీనికిగల మహిమను కోల్పోవుటచే విచారముగా నున్నది.

**ఒకరు** :- అది ఏమి? వివరముగా తెలుపుడు.

**వేఱొకరు** :- హంసయొక్క జిహ్వకు పాలను, నీటిని విభజించు శక్తియున్నది కదా! ఆశక్తిని అది కోల్పోవుటచే దుఃఖించుచున్నది.

**ఒకరు** :- హంసలకు ఆ శక్తిని బ్రహ్మదేవుడు ఇచ్చినాడే ! దానిని అవి ఎందులకు పోగొట్టుకొన్నవి?

**వేఱొకరు** :- తెలిపెదను వినుడు. శ్రీ భాష్యకారులతో మూఢులు అగు ప్రతివాదులు మాటిమాటికి వాదింపవచ్చిరి. వారితో భాష్యకారులు దోషరహితములగు వాదములను చేసి, వారిని ఓడించిరి. ఇంకను వాదించుటకు ఎవరు వచ్చినను వెనుకంజవేయను అని గర్జించి పల్కిరి. ఇందుచే వారి భగవానుని శంఖమువంటి పవిత్రమైన, తెల్లని కీర్తి లోకములో అంతట వ్యాపించినది. అది అన్ని వస్తువులను తెల్లగా చేసినది. లోకములోని నీరు అంతయు తెల్లని పాలవలె అయినది. అందుచే హంసకు పూర్వమున్న పాలను, నీటిని వేఱు చేయుశక్తి ఉపయోగపడు అవకాశము లేకపోయినది. ఆ శక్తివలననేకదా హంసకు గొప్పతనము కల్గినది. దానిని తలచి, తన మహిమ పోవుటచే హంస ఇట్లు బాధపడుచున్నది. ఇట్టి ఏ దోషము లేని అట్టి భాష్యకారుల కీర్తి సర్వత్ర సర్వదా వర్ధిల్లుగాక!

**"శలమ్"** - ఛలమనే సంస్కృతశబ్దవికారము, ఇది వాదములోని ఒక విధమైన దోషము. **"ఏతిరాశర్"** - యతిరాజ శబ్దభవము. గణమునకు అనుగుణముగా ఇచట దీర్ఘము వచ్చినది. **"వారి"** సంస్కృతశబ్దము.

వృత్తము పదినాన్గుశీర్ ఛందవిరుత్తము

**అన్యదేవతలవలన సారార్థమును తెలియ వీలుకాదు**

**34.** శడైయన్ఱిఅలవర్‌కళ్ పెరుఞానక్కడలదనై
యిడైయమిழాదు కడక్కిను మీదళవెన్ఱఱియార్
విడైయుడనేదన్ఱదర్త్తవన్ మెయ్యరుళ్ పెఱ్ఱ నల్లో
రడైయ వఱిన్దురైక్క వ్వడియోము మఱిన్దనమే

శడైయన్ తిఱలవర్కళ్ = జటలను దాల్చు శివుని (అనుగ్రహ) వరబలఫలితముగా (జ్ఞానమును) పొందినవారు, పెరు ఞాన క్కడలదనై = గొప్ప జ్ఞానమను సముద్రమును, ఇడై అమిழ்దు కడక్కినుమ్ = మధ్యలో అణగిపోకుండ దాటినను, (ఎంత జ్ఞానమును పొందినను), ఈదు అళవు ఎన్ఱు అఱియార్ = ఇదియే (ఆ జ్ఞానసముద్రముయొక్క) పర్యంతము (తీరము) అని తెలియలేరు. అడియోముమ్ = భాగవతులగు మనముకూడ, అన్ఱు ఏழ் విడైయుడన్ అడర్త్తవన్ = పూర్వము ఒకనాడు ఏడు ఎద్దులను ఒకే సమయములో ఒకటిగా చేర్చి, అణచిన శ్రీకృష్ణుని, మెయ్ అరుళ్ పెఱ్ఱ నల్లోర్= స్థిరమైన అనుగ్రహమును పొందిన మహనీయులు (సత్పురుషులు), అడైయ అఱిన్దు ఉరైక్క = సంపూర్ణముగా (సారార్థములను తాము) గ్రహించి (మనకు) ఉపదేశింపగా, అఱిన్దనమ్ = జ్ఞానమును పొందితిమి కదా!

లోకములో శివునివద్దనుండి జ్ఞానమును **"జ్ఞానం మహేశ్వరా దిచ్ఛేత్" (శంకరాత్ జ్ఞాన మన్విచ్ఛేత్)** అను రీతిలో పొందవచ్చునని సాధారణ అధికారికి శాస్త్రము తెలుపుచున్నది. అట్లు శివుని ఉపాసించి, కొందఱు అధికారమును, ఎంత జ్ఞానమును పొందినను, వారు తెలియదగిన సారార్థము అంతయును తెలిసినవారు కారు. మనము శ్రీ కృష్ణభగవానుని కటాక్షమును పొందిన గొప్ప ఆచార్యుల ఉపదేశముచే సారార్థములను పూర్తిగా తెలిసికొనిన గొప్పతనమును పొందితిమి.

శ్రీ కృష్ణావతారమునందు నప్పిన్నైప్పిరాట్టిని వివాహ మాడగోరిన కృష్ణుడు, ఆమె తండ్రి కన్యాశుల్కముగా నిర్ణయించిన ఏడు వృషభములను తన బలముతో అణచి, ఆమెను పెండ్లి చేసికొనిన వృత్తాంతము తృతీయపాదములో ప్రస్తావింపబడినది.

వృత్తము కట్టళైక్కలిత్తుఱై

**భగవానుని విశ్లేషింపని స్థితిని పొందుట**

**35.** **పావళరు న్దమిழ்మఱైయిన్ పయనే కొణ్డ**
**పాణ్పెరుమాళ్ పాడియతోర్ పాడల్ పత్తి**
**ఱ్కావలను ఙ్కణవనుమాయ్ క్కలన్దు నిన్ఱ**
**కారణనై క్కరుత్తుఱ నాఙ్కణ్డ పిన్బు**
**కోవలను ఙ్కోమానుమాన వన్నాళ్**
**కురవైపిణై కోవియర్తఙ్కుఱిప్పే కొణ్డు**
**కోవలుడన్ పిరియాద పెడైపోల్చ్చేర్న్దు**
**తీవినైయోర్ తనిమై యెలా న్దీర్న్దో నామే**



పా వళతరుమ్ తమిழ் మఱైయిన్ = పాశురములతో నిండియున్న తమిళ వేదమను దివ్యప్రబంధములోని, పయన్ కొణ్డ = సారార్థములనే కలిగియున్నవియు, పాణ్ పెరుమాళ్ పాడియదు = తిరుప్పాణ్ ఆழ்వార్లచే గానము చేయబడినవియు అగు, ఓర్ పాడల్ పత్తిల్ = (అమలనాది పిరాన్ అను) సాటిలేని పదిపాశురములతో, కావలనుమ్ కణవనుమాయ్ కలన్దు నిన్ఱ కారణనై = అన్నిటిని కాపాడువాడై, నాయకుడై (అన్ని వస్తువులలో అంతర్యామియై) కలిసియున్న సర్వకారణుడగు భగవానుడే, నామ్ కరుత్తు ఉఱ కణ్డ పిన్బు = మనము మనస్సులో ఏర్పడునట్లు తెలిసిన పిదప, కోవలనుమ్ కోమానుమాన అన్నాళ్ = గోపాలుడు, (యదువంశ) నాయకుడై అంతరించిన ఆనాడు, కురవై పిణై = (అతని) రాసక్రీడను అర్థము చేసికొనినవారగు, కోవియర్తమ్ కుఱిప్పే కొణ్డు = గోపికల మనస్సులోని అభిప్రాయమును (అంతరంగమును) మనమును గ్రహించి, కోవలుడన్ పిరియాద = మగపక్షిని విడచియుండని, పెడైపోల్ శేర్న్దు = ఆడ (క్రౌంచ) పక్షివలె (మనముకూడ భగవానుని) కలసియుండి, తీ వినైయోర్ తనిమై ఎలామ్ = పాపాత్ముల నిస్సహాయస్థితిని అంతయు, నామ్ తీర్న్దోమ్ = మనము పోగొట్టుకొంటిమి.

తిరుప్పాణ్ ఆழ்వార్లు అనుగ్రహించిన **"అమలనాది పిరాన్"** అను ప్రబంధము తమిళవేదమనబడు దివ్యప్రబంధముయొక్క సారము మొత్తమును తనలో ఇముడ్చుకొన్నది అనదగినది. ఇట్టి గొప్పతనమును (అతిశయమును) కల ఈ సూక్తివలన భగవానుని సర్వరక్షకునిగా, సర్వేశ్వరునిగా, సర్వాంతర్యామిగా, సర్వకారణభూతునిగా తెలిసికొంటిమి. ఇక ముందు శ్రీ కృష్ణునియందు సంకోచములేని (తక్కువలేని) భక్తిని కలిగియుండి, ఆ స్వామిని సంశ్లేషించిన గోపికల నిష్ఠను పొంది, మగ క్రౌంచ పక్షిని విడచియుండని ఆడక్రౌంచ పక్షివలె మనమును భగవానుని చేరియుండి, నిస్సహాయస్థితిని రూపుమాపుకొంటిమి.

**"స్త్రీ ప్రాయమితరత్ సర్వమ్"** అని చెప్పబడు ఈ పాశురములో జీవాత్మల స్త్రీత్వము, భగవానుని పురుషోత్తమత్వమును ప్రతిపాదింపబడుట గమనింపతగినది. గోపికాశబ్దమే **"కోవియార్"** అయినది. ఏ సమయమునందైను ఒకదానిని వేఱొకటి విడచియుండని క్రౌంచపక్షులజంట ఇచట జీవేశ్వరులకు సమానముగా పల్కుట గమనింపతగినది. భగవానుని విడచినచో జీవుని అస్తిత్వమేలేదు కదా! వేదమును **"ద్వాసుపర్ణా"** ఇత్యాదిగా జీవ-పరమాత్మలను పక్షులనుగా పేర్కొనుటను కూడ ఇచట స్మరింపనగును. **"పాణ్ పెరుమాళ్"** అను ఇరామానుశ నూఱ్ఱన్దాది ప్రయోగము ఇచట యథాతథముగా గ్రహింపబడినది.

వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము. 35, 36, 37 వ పాశురములు మూడును మునివాహనభోగమను రహస్యగ్రంథములోనివి.

**అమలనాదిపిరాన్ తెలుపు నిష్ఠను పొందుట**

**36 ఆదిమఱై యెన వోఙ్గు మరఙ్గత్తుళ్ళే**
**యరుళారు కడలైక్కణ్డవ నమ్ పాణ**
**నోదియదోరిరునాన్గు మిరణ్డు మాన**
**వోరు పత్తుమ్ పఱ్ఱాక వుణర్న్దురైత్తోర్**
**నీది యఱియాద నిలై యఱివార్క్కెల్లా**
**నిలై యిదువే యెన్ఱు నిలై నాడి నిన్ఱోమ్**
**వేదియర్తమ్ విరిత్తురైక్కుమ్ విళైవుక్కెల్లామ్**
**విదైయాకు మిదు వెన్ఱు విళమ్బినోమే**

మఱై ఆది ఎన ఓఙ్గుమ్ = (రూపములో) వేదమునందలి మొదటి అక్షరమగు ప్రణవము అనునట్లు ఉన్నతమైయున్న, అరఙ్గత్తుళ్ళే = శ్రీ రంగనాథవిమానములో ప్రకాశించు, అరుళ్ ఆరుమ్ కడలై = కృప (అనెడి నీరు) నిండిన శ్రీరంగనాథుడగు సముద్రమును, కణ్డవన్ నమ్ పాణన్ = దర్శించి అనుభవించినవారగు మన తిరుప్పాణ్ ఆఴ్వార్లచే, ఓదియదు ఓర్ ఇరు నాన్గుమ్ ఇరణ్డుమ్ ఆన ఒరు పత్తుమ్ = అనుగ్రహింపబడినదై, నిత్యానుసంధేయములగు ఎనిమిది, రెండు అగు సంఖ్యలో సాటిలేని అమలనాదిపిరాన్‌లోని పది పాశురములను, పఱ్ఱు ఆక ఉణర్న్దు ఉరైత్తోమ్ = గతిగా తెలిసికొని అనుసంధించితిమి, నీది అఱియాద = (ఇతరమతములను ఖండించుటకు అవసరమైన) యుక్తులను తెలియనివారై, నిలై అఱివార్క్కెల్లామ్ = తత్త్వముల స్వరూపమును (మాత్రము) తెలిసినవారికి అందఱికి, ఇదువే నిలై ఎన్ఱు= ఈ ప్రబంధమే విశ్వాసమును కల్గింపగల్గినది అని (తలచి), నిలై నాడి నిన్ఱోమ్ = ఇందు తెలుపబడిన స్థితిని – అనుభవమును పొందగోరుచున్నాము; వేదియర్ తామ్ విరిత్తు ఉరైక్కుమ్ = వేదాంతులు తాము వివరముగా (తెలుపు) వ్యాఖ్యానించు, విళైవుక్కు ఎల్లామ్ = ఫలముల కన్నిటికిని, ఇదు విదై ఆకుమ్ ఎన్ఱు = ఈ ప్రబంధము మూలమగు విత్తువంటిది అని, విళమ్బినోమ్ = (ఈ రహస్యములో) పల్కితిమి.

వేదములో మొదట అనుసంధింపబడు ప్రణవముయొక్క ఆకారమును కల్గినది శ్రీరంగవిమానము. అందు కరుణ అనెడి నీరు నిండిన శ్రీరంగనాథుడు అను సముద్రము,



దర్శించువారి కన్నులు చల్లబడునట్లు ప్రకాశించుచున్నది. ఆ సముద్రమును చూచి, ఆనందించి, మన తిరుప్పాణ్ ఆఴ్వార్లు పాడిన పది పాశురములను మనలను ఉజ్జీవింపచేయు గతిగా ఆశ్రయించితిమి. ఇతరమతములను ఖండించుటకు అవసరమైన యుక్తుల తత్త్వముల స్వరూపమునుమాత్రము తెలిసినవారికి అందఱికిని ఈ ప్రబంధమే మనోవిశ్వాసమును కల్గింపగల్గినదని గ్రహించి, ఇందు తెలుపబడిన నిష్ఠను కోరితిమి. వేదాంతులు తెలుపు సకలఫలములకును ఈ ప్రబంధమే మూలముగానుండి, ఫలమును ఇచ్చునని ఈ రహస్యములో తెలిపితిమి.

ఇరామానుశనూఱ్ఱన్దాదిలో **"నమ్ పాణ్‌పెరుమాళ్"** అనుటనుబట్టి ఇచటను **"నమ్‌పాణ్"** అని ప్రయోగింపబడినది. వృత్తము ఎణ్శీర్ ఆశిరియవిరుత్తము.

**విశేషజ్ఞానమును పొందుటకు ఆచార్యుని ఆశ్రయించుట**

**37 కాణ్బనవు మురైప్పనవు మఱ్ఱొన్ఱిన్ఱి**
**కణ్ణనైయే కణ్డురైత్త కడియ కాద**
**ల్పాణ్పెరుమాళ్ అరుళ్ శెయ్ద పాడల్ పత్తుమ్**
**పఴమఱైయిన్ పొరుళెన్ఱు పరవుకిన్ఱోమ్**
**వేణ్పెరియ విరితిరైనీర్ వైయత్తుళ్ళే**
**వేదాన్తవారియ నెన్ఱియమ్బ నిన్ఱో**
**నాణ్పెరియో మల్లో నా నన్ఱు తీతు**
**నమక్కురైప్పా రుళ రెన్ఱు నాడువోమే.**

కాణ్బనవుమ్ ఉరైప్పనవుమ్ మఱ్ఱు ఒన్ఱు ఇన్ఱి = (తమ) కన్నులతో చూచునది, నోటితో పల్కునది వేఱు వస్తువు లేకుండ, కణ్ణనైయే కణ్డు ఉరైత్త = శ్రీ కృష్ణునియే దర్శించి, (ఆ స్వామిని గూర్చి) పల్కువారు, కడియ కాదల్ పాణ్ పెరుమాళ్ = (శ్రీరంగనాథుని పట్ల) ఉద్వేలమైన భక్తిని కలవారును అగు తిరుప్పాణ్ ఆఴ్వార్, అరుళ్ శెయ్ద పాడల్ పత్తుమ్ = అనుగ్రహించిన అమలనాదిపిరాన్ అను పది పాశురమును, పఴైమఱైయిన్ పొరుళ్ ఎన్ఱు పరవుకిన్ఱోమ్ = అనాదియగు వేదముయొక్క సారము అని (తలచి) స్తుతించుచున్నాము, వేణ్ పెరియ = ఆశచే పెద్దది (అందఱిచే మిక్కిలి ఆశింపబడుచున్నది), విరి తిరై నీర్ = విశాలమైన అలలు నిండిన (సముద్రము) నీటిచే చుట్టబడియున్నదగు, వైయత్తుళ్ళే = ఈ లోకములో, వేదాన్త ఆరియన్ ఎన్ఱు = వేదాంతాచార్యులు అని, ఇయమ్బ నిన్ఱోమ్ = (శ్రీరంగనాథుడు స్వయముగా) పొగడునట్టి స్థితిని పొందితిమి;

అందుచే, నామ్ నాణ్ పెరియోమ్ అల్లోమ్ = మేము అహంకారపూరితులము కాబోము, నన్ఱుమ్ తీదుమ్ = మంచి విషయములను, చెడ్డ విషయములను, నమక్కు ఉరైప్పార్ = మనకు ఉపదేశించు ఆచార్యులు, ఉళర్ ఎన్ఱు నాడువోమ్ = తప్పక ఉన్నారని (నిశ్చయించుకొని) వారిని అన్వేషింతుము.

తిరుప్పాణ్ అళ్వార్లు భగవానుని తప్ప (శ్రీరంగనాథుని తప్ప) తమ కన్నులతో దేనిని దర్శింపలేదు, నోటితో పలుకలేదు. భగవానునియందు ఇట్టి భక్తిని కల్గియుండు తిరుప్పాణ్ ఆళ్వార్లు అనుగ్రహించిన పది పాశురములను అనాదియగు వేదముయొక్క సారముగా గ్రహించి, కీర్తించుచున్నాము. అందఱును కర్మఫల మనుభవించు చోటగుటచే ఆదరించు సముద్రపరివేష్టితమగు ఈ లోకమున **"వేదాంతాచార్య"** లని శ్రీరంగనాథుడే మమ్ములను పొగడగా చూచితిమి. అయినను దీనిచే మేము అహంకారమును పొందక, ఆచార్యకటాక్షమే ఇట్టి గొప్పతనమునకు మూలమని తలచి, ఇపుడును విశేషజ్ఞానమును పొందుటకు ఆ జ్ఞానమును ఉపదేశించు ఆచార్యులకొఱకు అన్వేషించుచుంటిమి.

**"కాణ్బనవుమ్ ఉరైప్పవునమ్"** –ఇత్యాది సూక్తికి అనుగుణముగా భగవద్గీతలోని **"స మహాత్మా సుదుర్లభః"** అను సూక్తి భావింపనగును. **"విరితిరైనీర్"** అను ప్రయోగము తిరునెడున్దాణ్డకములోని 29వ పాశురములోగల అట్టి సూక్తిని తలపించును. వృత్తము ఎణ్శీర్ ఆశిరియవిరుత్తము.

**అమృతాస్వాదినీవ్యాఖ్య ముగిసినది.**



**శ్రీమతే వేదాంతగురవే నమః**

**పరమపదసోపానమ్ - సవ్యాఖ్యానము**

**ప్రవేశిక**

**తనియన్శ్లోకము**

**వ్యాజీకృత్య విముక్తిసౌధపదవీసోపానసద్వర్ణనం**
**శారీరార్ణవరత్నజాత మిహ యః ప్రాచీకశ త్సర్వశః ।**
**తస్మిం స్తిష్ఠతి వేంకటేశ్వరకవౌ శ్రీ భాష్యకారోపమే**
**యం కంచి త్పురుషం హ్యుపాసితు మయే మాగా మనః స్వస్తి తే ॥**

అయే మనః = ఓ మనస్సా! యః = ఎవరు, విముక్తిసౌధపదవీసోపానసద్వర్ణనం= ముక్తి అను సౌధమును అధిరోహించు మార్గముయొక్క మెట్లను చక్కగా వర్ణించుటను,



వ్యాజీకృత్య = నిమిత్తముగా (నెపముగా) గొని, ఇహ = ఈ భూమిలో, శారీరార్ణవ రత్నజాతం = సముద్రమువంటి వేదాంతశాస్త్రముల అర్థములనెడి రత్నసమూహమును, సర్వశః = పూర్తిగా, ప్రాచీకశత్ = (పరమపదసోపానమను గ్రంథము మూలముగా) వ్యక్తీకరించిరో, తస్మిన్ = ఆ, శ్రీభాష్యకారోపమే = భగవద్రామానుజులవంటివారు అగు, వేంకటేశ్వరకవౌ = శ్రీ వేంకటనాథుడను మహాకవి, తిష్ఠతి = ప్రకాశించుచుండగా, యం కంచిత్ పురుషం హి = వేఱొక అల్పమానవుని, ఉపాసితుమ్ = పూజించుటకు, మా గాః = వెడలకుము. (అట్లు పోకున్నచో), తే = నీకు, స్వస్తి = మంగళము(కలుగ గలదు).

ఓ మనస్సా! మోక్షమను సౌధమును అధిరోహించుటకు అనువైన మెట్లను (పరమపదసోపానమను గ్రంథమును) అనుగ్రహించుటద్వారా సముద్రమువలె అగాధమైన వేదాంతశాస్త్రములోని రత్నములవంటి రహస్యములను మనకు వెలికి తీసి ఇచ్చినవారు, భగవద్రామానుజులవంటివారగు వేంకటేశ్వరకవి (వేదాంతదేశికులు) వేంచేసియుండగా, వేరొక అల్పుని ఆశ్రయింపకుము. ఆ మహానుభావుని కొలిచిన నీకు మంగళము కల్గునుసుమా!.

**తనియన్ - శ్లోకము**

**2. తస్మై నమోఽస్తు గురవే తాదృశవిభవాయ వేంకటేశాయ ।**
**ప్రావర్తయ జ్జనానాం భూమౌ పరమపదహర్మ్యసోపానమ్ ॥**

(యః = ఎవరు), భూమౌ = ఈ భూమిలో, జనానాం = జనులకు, పరమపదహర్మ్యసోపానం = పరమపదమను సౌధమును అధిరోహించు సోపానములను (తెలుపు ఈ ప్రబంధమును), ప్రావర్తయత్ = ప్రవర్తింపచేసిరో (రచించిరో), తాదృశవిభవాయ = అట్టి గొప్పతనమును కల్గిన, తస్మై = ఆ, వేంకటేశాయ= వేంకటనాథులను, గురవే = ఆచార్యులకు, నమః అస్తు = నమస్కారము అగుగాక!

పరమపద సోపానమను గ్రంథమును రచించి, మోక్షమను సౌధమును ఎక్కుటకు వీలగు సోపానములను వివరించిన మహిమనుకలవారగు వేంకటేశకవి అను ఆచార్యులకు నమస్కారము.

**తనియన్ - పాశురము**

**3. తేనేఱు తామరైయా డిరుమార్బన్ఱ**
**న్నిణ్ణరుళాల వనడియిల్ వివేకమ్ పెఱ్ఱు**
**ఞ్నానేఱు పవక్కుఱైయై వెఱుత్తతఱ్పిన్**
**ఊర్ విరత్తియుడన్ వినైయొన్ఱిరళుక్కఞ్జి**

**క్కూనేఱు పిఱైయిఱైయోన్ శాప నీర్త్తాన్**
**కురైకழలే శరణడైన్దు కురమ్బై విట్టు**
**వానేఱుమ్ వழిప్పడికళడైవే కణ్డ**
**వణ్పుకழ తూప్పుల్ వళ్లలరుళ్ పెఱ్ఱోమే**

తేన్ ఏఱు తామరైయాళ్ = తేనె నిండిన తామర పూవులో నివసించు లక్ష్మీదేవిని, తిరు మార్బన్తన్ = వక్షఃస్థలమున కల్గిన భగవానునియొక్క, తిణ్ అరుళాల్ = బలమైన కృపతో, అవన్ అడియిల్ వివేకమ్ పెఱ్ఱు = అతని శ్రీపాదములో మంచిజ్ఞానమును పొంది, ఇఙ్గు = ఈ భూమిలో, ఊన్ ఏఱు పవ క్కுழియై = శరీరమును వృద్ధిచేయు సంసారమను పాడు గుంటను, వెఱుత్తతప్పిన్ = అసహ్యించుకొని, త్యజించిన పిదప, ఊర్ విరత్తియుడన్ = వ్యాపించు వైరాగ్యముతో, వినైయిన్ తిరళుక్కు అఞ్జి = పాపకూటమువలన కలుగు ఫలమునకు భయపడి, కూన్ ఏఱు = మిక్కిలి వంగిన, పిఱై ఇఱైయోన్ = చంద్రకళను ధరించిన శివుని, శాపమ్ తీర్త్తాన్ = శాపమును పోగొట్టిన భగవానునియొక్క, కురై కழలే శరణ్ అడైన్దు = (కడియము) శబ్దించు శ్రీ పాదములను శరణముగా ఆశ్రయించి, కురమ్బై విట్టు = శరీరమును విడచి, వాన్ ఏఱుమ్ వழி ప్పడికళ్ = పరమపదమును అధిరోహించు దారి మెట్లను, అడైవే కణ్డ = వరుసగా దర్శించి, తెలిసికొని వ్యక్తము చేసిన, వణ్ పుకழ = గొప్ప కీర్తిని కల, తూప్పుల్ వళ్ళల్ = తూప్పుల్ అను దివ్యదేశమున అవతరించిన మహోదారులగు శ్రీ దేశికుల, అరుళ్ పెఱ్ఱోమ్ = కృపను పొందితిమి.

**"ఊనక్కురమ్బై"** అని శరీరమును జీవుడు నివసించు గుడిసెగా ముదల్వార్లు పల్కిరి కదా! ఈ (హర్మ్యమను) పేరుతోనే ఒక రహస్యమును మణిప్రవాళశైలిలో శ్రీదేశికులు అనుగ్రహించిరి. అందలి పాశురములతో కూర్చినదగుటచే ఈ ప్రబంధమునకీ పేరు కల్గినది. మిక్కిలి ఉన్నతమైన ఒక చోటును అధిరోహించుటకు సోపానపంక్తిని నిర్మించి, వానిని ఎక్కి, ఆ చోటును చేరుట లోకములోని తీరు. పరమపదమనెడి చాల ఉన్నతస్థానమును పొందుటకు తొమ్మిది విషయములను మెట్లుగా కల్పించి, ఈ ప్రబంధములో వానిని దేశికులు వివరించిరి అందుచే ఈ ప్రబంధమున కిట్టి పేరు వచ్చినది. సోపానమనగా మెట్లు.

ఈ ప్రబంధములో తెలుపబడిన తొమ్మిది సోపానము లేవి? అనగా – 1.తత్త్వములు మొదలగువానిని క్రమమున తెలియుట, 2. మనస్సున నిర్వేదమును పొందుట, 3.లౌకికసుఖములలో ఆశలేకుండుట, 4. తమ పాపభూయస్త్వముచే ఇక కలుగబోవు నరకము మొదలగు దుఃఖములకు భయపడుట, 5. భగవానుడు మోక్షమును అనుగ్రహించుటకు కారణమగు ఉపాయమును అనుష్ఠించుట, 6. ఈ శరీరమునుండి



జీవుడు ముక్తుడగుట, 7. అర్చిరాదిమార్గముద్వారా పయనించుట, 8. శ్రీవైకుంఠమను దివ్యలోకమును చేరుట, 9. అచట సర్వేశ్వరుని కన్నులార దర్శించి, ఆనందించి అనుభవించి, ఆ ఆనందముననే మునిగియుండుట. ఈ తొమ్మిది విషయములను ఈ ప్రబంధములో సంగ్రహించియు, రహస్యములో వివరించియు శ్రీ దేశికులు సాయించిరి. **''వివేకనిర్వేదవిరక్తభీతయః ప్రసాదహేత్వాత్క్రమణార్చిరాదయః, ప్రకృత్యతిక్రాంతపదాధిరోహణం, పరాప్తి రిత్యత్ర తు పర్వణాం క్రమః"** అనెడి సంగ్రహశ్లోక మిచట భావనీయము.

**సంప్రదాయము ఏర్పడిన తీరు**

1. **అడల్పుళ్ళరశినుమ్ మన్దణర్ మాట్టినుమ్ ఇన్నముద**
**క్కడల్పళ్ళితన్నినుమ్ క్కావిరి యుళ్ళముకన్ద పిరా**
**నిడైప్పిళ్ళై యాకి యురైత్తతురైక్కుమ్ ఎతివరనార్**
**మడైప్పళ్ళివన్దమణమ్ ఎజ్గళ్ వార్త్తైయుళ్ మన్నియదే**

అడల్ పుళ్ అరశినుమ్ = బలముకల పక్షులకు ప్రభువగు గరుడునివద్దకంటె, అన్దణర్ మాట్టినుమ్ = బ్రాహ్మణుల ధనమగు వేదవేదాంతములందుకంటె, ఇన్ అముద క్కడల్ పళ్ళి తన్నినుమ్ = మధురమగు అమృతమైన పిరాట్టి అవరించిన క్షీరాబ్ధి అనెడి శయ్యలో కంటె, కావిరి = కావేరీతీరముననున్న శ్రీరంగము మొదలగు దివ్యదేశములలో, ఉళ్ళమ్ ఉకన్ద పిరాన్ = మనస్సున మిక్కిలి ఆసక్తుడై, వేంచేసియున్న స్వామి, ఇడై ప్పిళ్ళై ఆకి = గోపాలుడై అవతరించి, ఉరైత్తతు = వివరించిన భగవద్గీతాతాత్పర్యమునే, ఉరైక్కుమ్ = తన భాష్యములలో వ్యాఖ్యానించిన, ఎతివరనార్ = యతులలో గొప్పవారగు భాష్యకారులు, మడైప్పళ్ళి వన్ద మణమ్ = వంటశాలద్వారా వీచిన పరిమళము, ఎజ్గళ్ వార్తైయుళ్ = మేము ఆవిష్కరించు గ్రంథములలో, మన్నియదు = పొందికగా నున్నది. (ఏ–ఆశ్చర్యము)

సర్వేశ్వరుడు పెరియతిరువడిని వాహనముగా, ఆసనముగా కల్గియున్నాడు. **"బ్రాహ్మణానాం ధనం వేదః"** అనునట్లు బ్రాహ్మణులకు నశింపని ధనము అయిన వేదవేదాంతములలో కీర్తింపబడిన స్వామి, వానిని తన నివాసముగా కల్గియున్నాడు. పిరాట్టి అవతరించిన క్షీరాబ్ధిలో నిత్యవాసము చేయుచున్నాడు. అయినను ఈ స్థానముల కంటె శ్రీరంగము మొదలగు దివ్యశములలోనే మనస్సున అభినివేశము కలిగి, అందు వేంచేసియుండి, దాసులను అనుగ్రహించుచున్నాడు. అతడు లోకమును ఉజ్జీవింపచేయుటకు పూర్వము అనుగ్రహించిన భగవద్గీతయొక్క తాత్పర్యమును శ్రీ

భాష్యకారులు తమ భాష్యముద్వారా వివరించిరి. వారికి అంతరంగకైంకర్యమును చేసి, సర్వార్థములను పొందిన తిరుమడైప్పళ్ళియాచ్చాన్ (కిడాంబి యాచ్చాన్) ద్వారా వెలువడిన సారార్థములను మా సూక్తులలో ఇమిడియున్నవి.

ఈ పాశురములో **"అరశిలుమ్, మాట్టిలుమ్, తన్నిలుమ్ ఉళ్ళుమ్"** అను పాఠమును గ్రహించి, **"పుళ్ళరశిలుమ్"** అనుటచే భగవానుని పరరూపము, **"అన్దణర్ మాట్టిలుమ్"** అనుటచే అంతర్యామిరూపము, **"కడల్పళ్ళి తన్నిలుమ్"** అనుటచే వ్యూహరూపము, **"కావిరి యుళ్ళుమ్"** అనుటచే అర్చావతారమును, **"ఇడైప్పిళ్ళైయాకి"** అనుటచే విభవమును-ఇట్లు భగవానుని అయిదు విధములైన రూపములను తెలుపబడినవని పెద్దలందురు.

శ్రీ భాష్యకారుల వంటశాలలో అంతరంగ కైంకర్యమును చేయుచు, వారి వద్ద సకలరహస్యములను గ్రహించిన కిడాంబి యాచ్చాన్ ముఖమున మన సంప్రదాయము ప్రవర్తించి, వర్ధిల్లుటచే **"మడైప్పళ్ళి వన్ద మణమ్"** అని తెలుపబడినది. భుజింపతగిన, శ్రేష్ఠమైన వంటకములను సిద్ధపఱచి, వంటశాలలోనుంచి, అందఱికిని పెట్టినట్లు, చక్కగా అభ్యసించి, తెలిసికొని, అనుభవింపవలసిన వేదాంతరహస్యార్థములన్నిటిని శ్రీ భాష్యకారులు కిడాంబియాచ్చాన్‌కు ఉపదేశించి, ఆ ఆచార్యుల ముఖముగా లోకమునకు అందింపచేయుటచే కూడ ఆచ్చాన్‌కు మడైప్పళ్లి యాచ్చాన్ అను పేరు కల్గెనని పెద్దలందురు.

ఈ పాశురములోని వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

**వివేకము**

**2. కళ్ళమనత్తుడన్ కణ్డుముయన్ఱ కడువినైయా**
**నళ్ళిరు ళాఴియిన్దశువై యైన్దెన నాడియ వో**
**రళ్ళలి నాళుమ్ విఴున్దఴియావకై యారణనూల్**
**వళ్ళల్ వఴఙ్గియ వాన్‌పడియాన వఴి యిదువే.**

కళ్ళ మనత్తుడన్ = వంచన నిండిన మనస్సుతో, కణ్డు = (తత్త్వములను విపరీతముగా) తెలిసికొని, ముయన్ఱ కడు వినైయాల్ = చేసిన క్రూరకర్మలచే, నల్ ఇరుళ్ ఆఴియిల్ దృఢమైన (దట్టమైన) (అజ్ఞానమగు) చీకటి అనెడి సముద్రములో, ఐన్దు నల్ శువై ఎన= (రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములను) అయిదు ఇంద్రియముల (విషయముల)ను మంచి సారములని తలచి, నాడియ ఓర్ అళ్ళలిల్ = (మనచే) వెదుకబడిన ఒక గొప్ప బురదలో, నాళుమ్ = ఎల్లప్పుడును, విఴున్దు అఴియా వకై = పడి, నశించి



పోకుండునట్లు, వళ్ళల్ = (సకలార్థములను వ్యక్తీకరించుటచే) ఔదార్యమున గొప్పవాడగు, ఆరణ నూల్ = వేదవేదాంతములలో, వఴఙ్గియ = ఉపదేశింపబడినదియు, వాన్ పడియాన = పరమపదమునకు మొదటి సోపానమై యున్నదగు, వఴి = మార్గము, ఇదువే = ఈ పర్వమునందు తెలుపబడిన వివేకమే.

మనము ఇంతవరకు తత్త్వములనుగూర్చి విపరీతజ్ఞానమునే పొంది, క్రూరకర్మలను మఱింతగా చేయుచు అజ్ఞానమను చీకటిలో మునిగి, శబ్దాది అల్ప విషయములను భాగ్యములుగా తలచి, ఆ గొప్ప పంకమున పడి మునిగి యున్నాము. ఇట్టి మనలను ఉజ్జీవింపచేయుటకు వేదములు, వేదాంతములును మనపై కరుణ చూపి, వివేకమును ఉపదేశించినవి. పరమపదమునకు తగిన సోపానములో మొదటిది అగు వివేకమును ఈ రహస్యములో మొదటి పర్వమున వివరించితిమి.

ఒక్క పాశురములు వివేకపర్వములోనివి. ఈ పాశుర వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

**భగవానునిగూర్చి తెలిసికొనవలసిన ఆవశ్యకత**

**3. అరు వురు వానవై యనైత్తు మఱివారేను**
**మరుఙ్కలైకళ్ కఱ్ఱుఱైక్కవల్లారేను**
**న్తరుమవఴి యఴియామఱ్కాప్పారేను**
**న్తనిమఱైయి ఱ్ఱాత్పరియ న్తరువారేను**
**మిరువినైయి నొఴుక్కత్తా లేవలోరా**
**దిఙ్గే నాఙ్గిఱైయిరున్ద వీనన్తీర్క్కు**
**న్తిరుమకళార్ పిరియాద దేవన్ఱన్నై**
**న్తెళాతార్ తిణ్‌పడియి లేఱాతారే**

అరు ఉరు ఆనవై = రూపము లేని చేతనము, స్థూలమైన అచేతనము అను, అనైత్తుమ్ అఱివారేనుమ్ = సకలపదార్థములను తెలిసినవారైనను, అరుమ్ కలైకళ్ = అరుదైన విద్యను తాము అభ్యసించి, ఉరైక్క వల్లారేనుమ్ = ఇతరులకు ఉపదేశించుటలో సామర్థ్యమును కలవారైనను, తరుమ వఴి అఴియామల్ = ధర్మమార్గము నశింపకుండ, కాప్పారేనుమ్ = (దానికి అనుగుణముగా) అనుష్ఠించువారైనను, తని మఱైయిన్ = సాటిలేని వేదములో, తాత్పరియమ్ తరువారేనుమ్ = సారార్థమును ఇతరులకు బోధింపగలవారైనను, ఇరు వినైయిన్ ఒఴుక్కత్తాల్ = (పుణ్యపాపరూప) ద్వివిధకర్మమార్గములో నడచుటచే, ఏవల్ ఓరాదు = (మేము చేయవలసిన)

కైంకర్యమునుగూర్చి విచారింపకుండ, ఇజ్జే నామ్ శిఱై ఇరున్ద = ఈ సంసారములో మనము చెఱలోనుండుట అనెడి, ఈనమ్ తీర్క్కుమ్ = నైచ్యమును పోగొట్టునట్టి, తిరు మకళార్ పిరియాద = లక్ష్మీదేవిని (ఏనాడు) విశ్లేషింపనివాడగు, తేవన్ తిణ్ణమ్ తేరాదార్ = భగవానుని నిశ్చయమును తెలిసికొనలేనివారు, తిణ్ పడియిల్ ఏఱాదార్ ఏ = (మోక్షమునకు కొనిపోవు) దృఢమైన సోపానమును అధిరోహింపలేనివారే (ఏకారము నిశ్చయార్థకము).

లోకములో కొందఱు చేతనాచేతనముల స్వరూపము మొదలగువానిని బాగుగా తెలిసికొనియుండవచ్చును. అరుదైన పలు శాస్త్రములను తాము నేర్చి, ఇతరులకు ఉపదేశింపగలవారై యుండవచ్చును. పలు ధర్మములను తాము ఆచరించి, ఇతరులకు ఉపదేశించువారై యుండవచ్చును. అయినను ఏమి లాభము? సంసారసముద్రమునుండి చేతనులను తీరము చేర్చు శ్రీమన్నారాయణుని స్వరూపము, స్వభావము-మొదలగు వానిని తెలియకున్నచో మోక్షసోపానమును అధిరోహింప వారికి వీలు కానేకాదు.

హీనశబ్దమే ఈనమను వికారమును పొందినది. వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము. మాంసచక్షువులకు గోచరము కాని చిత్తు **"అరు"** అను పదముచే, గోచరమగు అచిత్తు **"ఉరు"** అను పదముచే నిర్దేశింపబడినది. తమలో గల అమూల్యములైన అర్థవిశేషములను అయోగ్యులైనవారికి కన్పడకుండునట్లు మఱుగుపఱచున్నవి కావున వేదములకు ద్రావిడమున **"మఱై"** అని పేరు వచ్చినది.

**నిర్వేదపర్వము**

**(వ్యర్థముగా గడచిన కాలమునకు వగచుట)**

4. **మఱు త్తార్ తిరువుడన్ మార్బిఱ్ఱరిత్తవన్ వాశకత్తై**
**మఱుత్తార్ మయక్కము మఱ్ఱదనాల్ వన్ద మా నరకు**
**నిఱుత్తార్ పవత్తి నెడునాళుఴన్ఱమై కణ్డదనాల్**
**వెఱు త్తారణనెఱియే వెళ్కి యోడ విరైవర్కళే**

మఱు = శ్రీ వత్సమను పుట్టుమచ్చను, తార్ = (వైజయంతీ) వనమాలను, తిరువుడన్= పిరాట్టితో, మార్బిల్ దరిత్తవన్ = వక్షఃస్థలమున దాల్చినవాడగు భగవానుని, వాశకత్తై = (గీత మొదలగు) ఉపదేశములను, మఱుత్తార్ = అతిక్రమించి ప్రవర్తించినవారి, మయక్కముమ్ = అజ్ఞానమును, మఱ్ఱ = మఱియు, అదనాల్ వన్ద మా నరకుమ్ = ఆ అజ్ఞానముచే కల్గు గొప్ప నరకములును, నిఱుత్తార్ = విమర్శించి తెలిసికొనిన వివేకము



గలవారు, పవత్తిల్ = సంసారములో, నెడు నాళ్ ఉఴన్ఱమై కణ్డు= చిరకాలము దుఃఖమును అనుభవించుటను చూచి, అదనాల్ వెఱుత్తు = అందుచే (సంసారమునందు) ఏవగింపును కలిగి, వెళ్కి = (ఇంతవరకు తాము ప్రవర్తించిన రీతికి) లజ్జించి, ఆరణ నెఱియే ఓడ = వేదమునందు తెలుపబడిన ఉపాయమును అనుష్ఠించుటకు, విరైవర్కళ్ = (వివేకము కలవారు) త్వరగా ముందుకు వత్తురు.

శ్రీ వత్సమను పుట్టుమచ్చను, శ్రీ వైజయంతి అను వనమాలను, లక్ష్మీదేవిని తన వక్షఃస్థలమునందు దాల్చిన సర్వేశ్వరుడు **"శ్రుతిస్మృతీ మమైవాజ్ఞా"** అనునట్లు శాస్త్రములద్వారా విధించిన కట్టడిని అజ్ఞానముచే అతిక్రమించి, నడచుకొనువారు క్రూరమైన నరకములను అనుభవించుతురు. వివేకులు ఈ విషయమును గమనించి ప్రవర్తింతురు. ఇంతవరకు తాము సంసారములో అలమటించుటను తలచి ఏవగించుకొని, గడచిన కాలమునకు వెఱతురు. పిమ్మట వేదాంతములలో తెలుపబడిన ఉపాయమును అనుష్ఠించుటకు తొందరపడుదురు. వృత్తము కట్టళైక్కలిత్తుఱై

**సంసారసుఖము నీచమైనది**

5. **వాన్ పట్ట మన్నరుళిన్ మయఙ్గుమాఱు**
**మతిన్డొరుకా లెనైయూళ్ శెన్ఱాలన్ఱో**
**రూన్ వట్ట వుడలాళ్ వినై యొఴుక్కి**
**లొరుకరైయు ఙ్కాణాదే యొఴుకుమాఱు**
**న్దేన్పట్ట విడమ్ పోల తిత్తిక్కిన్ఱ**
**శిఱు పయనే మఱు పయనెన్ఱిరున్ద మాఱు**
**న్దాన్పట్ట పడియిన్నోర్ తానే కణ్డు**
**తళర్న్దిడుమేల్ వళర్న్దిడుమే తక్కవాఱే**

(వివేకమునుకల చేతనులు) వాన్ పట్ట = మూలప్రకృతి చేరు చోటు అగు, మన్ ఇరుళిల్ = మహాతమస్సులో, మయఙ్గుమ్ ఆఱుమ్ = (ప్రళయములో) జ్ఞానహీనమై పడియుండు స్థితిని, ఎనై ఊళ్ శెన్ఱాల్ = (ఇట్లు) ఎన్నియో యుగములు గడచిన పిదప, అన్ఱు = సృష్టికాలములో, మతిన్డు ఒరు కాల్ = తిరిగి ఒక పర్యాయము, ఊన్ పట్ట ఉడల్ = మాంసప్రచురమైన శరీరమును కల్గించు, ఓర్ వినై ఊళ్ ఒఴుక్కిల్= సాటిలేని కర్మములనెడి సముద్రముయొక్క ప్రవాహములో, ఒరు కరైయుమ్ కాణాదే = ఏ తీరమును చూడలేక, ఒఴుకుమ్ ఆఱుమ్ = కొట్టుకొని పోవుచు అలమటించుచున్న స్థితిని, తేన్

పట్ట విడమ్ పోల్ = తేనెతో కలసిన విషమువలె, తిత్తిక్కిన్ఱ = (స్థూలముగా గమనించినచో) సుఖముగా తోచు, శిఱు పయనే = అల్పఫలములనే, అఱు పయన్ ఎన్ఱు = (తనకు) తగిన ఫలమని (తలచి), అరున్దుమ్ ఆఱుమ్ = అనుభవించు రీతిని, ఇన్నోర్ = ఇట్లే, తాన్ పట్ట పడి= తాను అలమటించిన రీతులను, తానే కణ్డు తళర్న్దిడుమ్ ఏల్= తానే చూచి, మనస్సు బాధపడినచో, తక్క అఱు వళర్న్దిడుమే = (తన స్వరూపమునకు) తగిన ఉపాయము వృద్ధి యగును (అనుష్ఠింపబడును) కదా!

వివేకమును పొందిన చేతనుడు ప్రళయకాలములో తాను శరీరేంద్రియములను (కరణకళేబరములను) లేనివాడై, తెలివిలేనివాడై, మహాతమస్సు అను గొప్ప చీకటిలో ఒకటిగా చేరియున్న స్థితిని, సృష్టికాలములో యుగయుగములుగా పలు పలు తీరులలో మనకు పలు శరీరములను కలుగజేసి శ్రమపడునట్లు చేయు కర్మ ప్రవాహముయొక్క తీరమును చూడలేక పరిభ్రమించుటను, తేనెతో కలసిన విషమని చెప్పతగినదియై తీయనిదిగా భ్రమింపజేయుచున్న అల్ప ఫలములనే గొప్పవి అని భ్రమించి, వానిని తానే అనుభవించుచు వచ్చుటను, ఇంకను తాను పడు పలు దుఃఖములను తానే గ్రహించి చూచి, మనస్సున బాధపడినచో, తగిన ఉపాయమును అనుష్ఠింపగలడు. ఇట్లు మనః క్లేశమును పొందుటయే రెండవ సోపానము.

వృత్తము ఎణ్శీర్ ఆశిరియవిరుత్తము.

**విరక్తిపర్వము**

**సంసారమున ఆశను వీడుట**

6. **ఉలకత్తుయర్న్దవ రొన్ఱుమ్ పయని లుఱు న్దుయరు**
**మలకి ల్పడాద వప్పోక ఙ్గవర్న్దెఴు మమ్బుయత్తోన్**
**కలకత్తొழిన్ మదుకైటబరాల్పడు ఙ్గట్ట మెణ్ణి**
**ల్పలకలై మెయ్యడియార్ పడియా రిక్కడుమ్బవత్తే**

ఉలకత్తు ఉయర్న్దవర్ ఒన్ఱుమ్ పయనిల్ = లోకములోని మహనీయులు అభిమానించి, అనుభవించు ఫలములో, ఉఱుమ్ తుయఱుమ్ = (మధ్యలో) వచ్చు దుఃఖమును, అలకిల్ పడాద = ఒక పరిధిలో ఇమడని, ఆ పోకమ్ కవర్న్దు = బ్రహ్మలోక సుఖమును అనుభవించి, ఎழుమ్ అమ్బుయత్తోన్ = ఉన్నతుడైయున్నవాడు, తామరపూవులో నుండువాడును అగు బ్రహ్మదేవుడు, కలక త్తొழిల్ మదుకైటబరాల్ = యుద్ధమునే ప్రవృత్తిగాగల మదుకైటభులనెడి అసురులచే, పడుమ్ కట్టమ్ ఎణ్ణిల్= అనుభవించు కష్టములను తలచి చూచినచో, పల కలై మెయ్ అడియార్ = పలు శాస్త్రములను



అధికరించిన, నిజమైన దాసులు, (భాగవతులు), ఇక్కడుమ్ పవత్తు= ఈ కఠిన సంసారములో, పడియార్ = అభినివేశమును పొందరు (విరక్తిని పొందెదరు)

ఈ కర్మభూమిలో మిక్కిలి గొప్పవారై, మనము గౌరవించు పలువురు మహనీయులు అనుభవించెడి ఫలముకూడ అంతయు సుఖరూపముగనే ఉండుటలేదు. దాని నడుమ దుఃఖముకూడ కలసియే యున్నది. **"స్వర్గేఽపి పాతభీతస్య క్షయిష్ణోః నాస్తి నిర్వృతిః"** అని కదా సూక్తి. బ్రహ్మదేవుడు తన లోకములో మనచే లెక్క కట్టుటకు వీలులేని ఆనందమును అనుభవించునని తలంతుము. అతడు మధుకైటభులను అసురులచే అనుభవించిన దుఃఖము అంతులేనిది. వీనిని చక్కగా గమనించుచు వివేకులు ఈ సంసారములో ఆశను కల్గియుండక విరక్తినే పొందుదురు.

పూర్వము మధు-కైటభులను అసురులు బ్రహ్మవద్దనుండి వేదములను అపహరించి, తీసికొనిపోవుటచే బ్రహ్మ కింకర్తవ్యతావిమూఢుడై, భగవానునివద్ద తన బాధను వెల్లడించెను. స్వామియు ఆ అసురులను వధించి, వేదములను తిరిగి బ్రహ్మ ఇచ్చెనను పౌరాణికగాథ మూడవపాదములో ప్రస్తుతింపబడినది. దీనిని ఆழ్వార్లు పలువురు ప్రస్తావించిరి. ఆ అసురులు వేదమును దొంగిలించినపుడు బ్రహ్మ **"వేదా మే పరమం చక్షుః వేదా మే పరమం ధనమ్"** అని మిక్కిలి దుఃఖించుట ఇచట స్మరింపనగును. **"కలహ"**మను సంస్కృత పదము కలకమని మాఱినది. మధుకైటభులు భగవానునితో యుద్ధమును చేయుటను ఆ భగవానుని వలన వరముగా పొందిరి. కావున **"కలకత్తొழిల్"** అను విశేషణము సాభిప్రాయకము.

వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

**వివేకమును కలవారికి స్వర్గమును నరకప్రాయమే**

7. **తన్దిరజ్గళళవిలరాయ్ త్తనత్తార్ మిక్క**
**తార్వేన్దర్ తొழ వైయ మాణ్డార్ మాణ్డార్**
**శన్దిరను ఇన్దిరియనమ్ వీయుమ్ కాల-**
**న్దారకైయిన్ వడము మలై త్తనివానాళు**
**మిన్దిరను మేఱుయర్త్త వీశన్దాను**
**మీరిరణ్డు ముకత్తాను మిల్లా వన్నాళ్**
**నన్దిరుమా నిలైకణ్డార్ నాకమెల్లా**
**నరకెన్ఱు నల్పదమే నాడువారే**

తన్దిరఙ్గళ్ అళవు ఇలరాయ్ = సేనను లెక్కలేకుండ గలవారై, తనత్తార్ మిక్క తార్ వేన్దర్ తొ౮ = సంపదలో గొప్పవారై మాలను దాల్చినవారగు ప్రభువులు (అందఱు తమకు) నమస్కరించునట్లు, వైయమ్ ఆణ్డార్= భూమిని పాలించినవారు (అగు మాంధాత మొదలగు వారు) మాణ్డార్ = మరణించిరి, తారకైయిన్ వడమున్ అ౦౦ = నక్షత్రముల వరుసయు నశించి, శన్దిరనుమ్ శూరియనుమ్ వీయుమ్ కాలమ్= చంద్రుడు, సూర్యుడును నశించు కాలమగు, వాన్ తని ఆళుమ్ ఇన్దిరనుమ్ = సర్వలోకములను తానొక్కడే ఏకచ్ఛత్రాధిపత్యముగా ఏలు ఇంద్రుడును, ఏఱు ఉయర్త్త ఈశన్ తానుమ్ = వృషభమును ధ్వజముగాకల శివుడును, ఈర్ ఇరణ్డు ముకత్తాన్= నాల్గు ముఖములనుకల బ్రహ్మయు, ఇల్లా అన్నాళ్ = లేకుండ పోయిన ఆ (ప్రళయ) కాలములో, నమ్ తిరుమాల్ నిలై కణ్డార్ = మన భగవానుని స్థాన (మగు పరమపదముయొక్క స్వభావ) మును తెలిసినవారు, నాకమ్ ఎల్లామ్ = (బ్రహ్మలోకము వరకుగల) దేవలోకములన్నియు, నరకు ఎన్ఱు = (పరమపదముతో పోల్చినపుడు) నరకమునకు సమమని తలచి, నల్ పదమే నాడువార్ = గొప్ప స్థానమగు వైకుంఠమును పొందుటకు ఆశపడుదురు.

అంతులేని సేనాబలమును కలవారై, పలువురు ప్రభువులు తమకు పాదా క్రాంతులై, సేవించునట్లుండి, ఈ లోకమును పూర్వము పాలించిన మాంధాత, మనువు మొదలగు చక్రవర్తులు ఇపుడు లేరు. వారు అందఱు మరణించిరి. అట్లే, నక్షత్రములు, చంద్రసూర్యులు, ఇంద్రుడు, శివుడు, బ్రహ్మ మొదలగు అందఱు లేకుండపోవు కాలముకు ఒకటి కలదు. అదియే మహాప్రళయకాలము అనబడును. అపుడును నశింపక, నిలచియుండునది భగవానుని స్థానమగు పరమపదము ఒక్కటియే. జ్ఞానులు ఈ మహిమను గుర్తించినపుడు స్వర్గము మొదలగు లోకములు నరకసమానములేనని తలచి, సంసారసుఖమును ఏవగించుకొందురు. ఇట్టి వైరాగ్యమును పొందుటయే మూడవసోపానము. **"న బ్రహ్మ నేశానః నేమే ద్యావాపృథివీ",** ఇత్యాదిశ్రుతులు ఇచట స్మరింపతగినవి. **"కాలమ్ ఇల్లా అన్నాళ్"** అని పదములను అన్వయింపనగును. ఈ పాశురార్థమునకు అనుగుణముగా **"మాంధాతా చ మహీపతి శ్చ కృతయుగాలంకారభూతో గతః"** ఇత్యాది భోజచరిత్రలోని శ్లోకము, **"న బ్రహ్మ నేశానో నేమే ద్యావా పృథివీ"** ఇత్యాది శ్రుతివాక్యము మొదలగునవి స్మరణీయములు. వృత్తము ఎణ్శీర్ ఆశిరియవిరుత్తము

**ప్రీతిపర్వము - (కర్మఫలమునకు భయపడుట)**

**8.** **తుఱవఱమే తుణివార్ తుఞక్క౦౦ విళన్దుణివో**
**రుఱవిలరాదలి నా ముయర్న్దారుడ నొన్దినిన్దో**



**మఱవ౭ మా౦౦ యెమ్మైయలై త్తీర్త్తవర్ మన్నరుళా**
**ఱుఱవై యుకన్ద పిరాన్క౮ల్ శూదు ఙ్కరుత్తినమే**

తుఱవఱమే = (సంసారబంధము పోవుటకొఱకు చేయు) నివృత్తిధర్మములనే, తుణివార్ = (గొప్పవిగా) నిశ్చయించుకొని ఆశ్రయించువారు, తుఞక్క అ౦౦= సంసారభయములేని, ఇళమ్ తుణివోర్ = పక్వము కాని నిశ్చయమును కలవారితో, ఉఱవు ఇలర్ = సంబంధమును కల్గియుండరు, ఆదలిన్ = అందుచే, నామ్ ఉయర్న్దారుడన్ = మనము (ఇట్లు చేయక) మహనీయులగు భాగవతులతో, ఒన్ది నిన్తోమ్ = కలసియున్నాము, మఱ వ౭ మా౦౦= (మనలను) పాపమార్గమునుండి నిరోధించి, నమ్ మైయలై త్తీర్త్తవర్ = మన అజ్ఞానమును పోగట్టిన ఆచార్యుల, మన్ అరుళాల్ = బలమైన కృపతో, కఱవై ఉకన్ద పిరాన్ = పశువులను మేపుటలో ఆసక్తినికల శ్రీ కృష్ణస్వామియొక్క, క౮ల్ శూడుమ్ కరుత్తినమ్ = శ్రీ పాదములను దాల్చి, కైంకర్యము చేయు నిశ్చయమును కలవారమైతిమి.

సంసారబంధమునుండి విడివడుటకు సాధనమగు గొప్ప ధర్మములు నివృత్తి మార్గములనబడును. వానినే స్వీకరించినవారు సంసారమునకు భయపడని మూఢులతో కలసి, ప్రవర్తింపరు. కావున మనము ముముక్షువులతోనే కలసి, వర్తించితిమి. మనలను పాపమార్గమునుండి నిషేధించి, అజ్ఞానమును పోగొట్టిన ఆచార్యుల కటాక్షముతో శ్రీ వైకుంఠముకంటె పశువులను మేపుటలో అభినివేశమునుకల శ్రీకృష్ణుని కైంకర్యమునే కోఱు మనోనిశ్చయమును పొందితిమి.

8వ, 9వ పాశురములు ప్రీతిపర్వమునకు చెందినవి. ఈ పాశురవృత్తము కట్టళైక్కలిత్తుఱై. **"కఱవై ఉకన్ద పిరాన్"** అనునపుడు **"తివత్తిలుమ్ పశునిరై మేయ్ప్పు ఉవత్తి శెఙ్గనివాయ్ ఎఙ్గళాయర్ తేవే"** అను నమ్మాళ్వార్లసూక్తి **"కఱవై ఉకన్ద పిరాన్"** అనునపుడు స్మరణీయము.

**కర్మఫలమునకు వెఱచి ఉత్తమోపాయమున అభినివేశమును పొందుట**

**9.** వన్దనపోల్ వరువనవు మనన్దమాకి
మాళాద తుయర్తరు వల్వినై నెరుప్పు
క్కిన్దనమా యెణ్ణిఅన్ద కాలమెల్లా
మిన్నము మిప్పవక్కు౭క్కే యి౭యా వణ్ణమ్

**వెన్దదొరు కుఴవియై నఱ్కుమరనాక్కుమ్**
**వెఱిత్తుళవ విత్తకనార్ విదియే కొణ్డార్**
**పన్దనమామవై యనైత్తుమ్ పాఱుకైక్కు**
**పుఴమఱైయిన్ పరమనెఱి పయిలువారే**

వన్దనపోల్ = (ఇంతవరకు) వచ్చిన (కల్గిన) దుఃఖములవలె, వరువనవుమ్ = ఇక రాబోవు దుఃఖమును, అనన్ద మాకి = అంతులేనివై, మాళాద = నశింపని, తుయర్ తరు = దుఃఖమును కల్గించు, వల్ వినై = బలమైన కర్మములనెడి, నెరుప్పుక్కు = అగ్నికి, ఇన్దనమాయ్ = ఇంధనమైయుండి, ఇన్నముమ్ = ఇంకను, ఎణ్ ఇఱన్ద కాలమ్ ఎల్లామ్ = అంతులేని కాలమంతయు, ఇప్పవ క్కుఴిక్కే = ఈ సంసారమను పాడు గుంటలో, ఇఴియా వణ్ణమ్ = పడి బాధపడకుండునట్లు, (తలచి), వెన్దదు ఒరు కుఴవియై = కాలిన కట్టె అయిన ఒక బాలుని (పరీక్షిత్తును), నల్ కుమరన్ ఆక్కుమ్ = అందమైన బాలునిగా చేసినవాడు, వెఱి త్తుళవ విత్తకనార్ = పరిమళమునుకల తులసీమాలను అలంకరించుకొనినట్టి అతిశయమునుకల భగవానుని, విదియే కొణ్డార్ = ("భక్తియోగమును అనుష్ఠింపుము, ప్రపత్తియోగమును అనుష్ఠింపుము" అను) నియమములను (గొప్పవిగా) స్వీకరించిన చేతనులు, పన్దనమామ్ అవై అనైత్తుమ్ = (సంసారమునందే) బంధించు ఆ కర్మలనన్నిటిని, పాఱుకైక్కు= నశింపచేయుటకు, పఴ మఱైయిన్ = అనాదియగు వేదమునందు చెప్పబడిన, పరమ నెఱి = గొప్ప (భక్తి–ప్రపత్తి అను) ఉపాయములలో, పయిలువార్ = అభినివేశమును పొందుదురు.

సంసారులగు చేతనులు ఇంతవరకు అనుభవించిన దుఃఖములకు అంతు లేదు. ఇంకను రాబోవు దుఃఖములకు అంతు లేదు. ఇట్టి కర్మములనెడి అగ్ని మఱింతగా దుఃఖమును కల్గించుచు, చేతనులను ఇంధనముగా గొని అది, జ్వలించుచున్నది. ఈ విధముగానే చేతనులు ఈ సంసారము అను పాడు గుంటలో పడి అలమటించుచున్నారు. దీనికి భయపడి, సూక్ష్మజ్ఞానమునుకల కొందఱు భగవానుడు విధించిన ఆజ్ఞను శిరసా వహించి, తమ నైచ్యమును పోగొట్టుకొనుటకు ముందుకు వచ్చి, తమ కర్మలన్నియు పోవుటకు వేదములలో తెలుపబడిన భక్తి–ప్రపత్తులలో ఒక ఉపాయమునందు అభినివేశమును పొంది, అనుష్ఠింతురు. ఇట్లు సంసారమునకు భయపడుటయే నాల్గవ సోపానము.

భారతసంగ్రామమున ద్రోణకుమారుడు అగు అశ్వత్థామచే ప్రయోగింపబడిన అపాండవాస్త్రప్రభావముతో ఉత్తరగర్భములోని శిశువు కాలిన కట్టెవలె మాఱగా, దానిని



శ్రీ కృష్ణుడు **"పాదేన కమలాభేన బ్రహ్మరుద్రార్చితేన చ, పస్పర్శ పుండరీకాక్ష ఆపాదతలమస్తకమ్"** అనునట్లు తన శ్రీ పాదముతో ఆపాదమస్తకము స్పృశించి, చక్కని బాలునిగా చేసెను. ఆ శిశువే పరీక్షిత్తు. ఈ వృత్తాంతము మూడవపాదములో ప్రస్తావించబడినది. **"ఇన్దనమ్, పన్దనమ్"** సంస్కృత శబ్దములు. వృత్తము ఎణ్శీర్ ఆశిరియవిరుత్తము

**ప్రసాదపర్వము– ఉపాయానుష్ఠానము**

10 **కరుమాలైయిల్ వరుఙ్కట్ట ఙ్కఴిక్కు ఙ్కరుత్తుడైయా**
**రొరుమాల్ పెరుకు ముయోకిన్ ముయన్లు మదన్తియు న**
**న్దిరుమాలడియిణై తిణ్శరణాకు మెన వరిత్తు**
**న్దరు మా వినియవై తానే యెన త్తకవెణ్ణువరే**

కరు మాలైయిల్ వరుమ్ కట్టమ్ = గర్భవాసము చేయుటవలన వచ్చు కష్టమును, కఴిక్కుమ్ కరుత్తుడైయార్ = పోగొట్టుకొను తలంపునుకల భాగవతులు, ఒరు మాల్ పెరుకుమ్ = సాటిలేని భక్తి వృద్ధికాదగిన, ఉయోకిన్ ముయన్లుమ్ = భక్తియోగములో ప్రవేశించుదురు. అదు అన్తియుమ్ = అది కాక (అందు శక్తి లేనివారు), నమ్ తిరుమాల్ అడి ఇణై = మన శ్రియఃపతియొక్క పాదయుగము, తిణ్ శరణ్ ఆకుమ్= దృఢమైన ఉపాయమగును, ఎన వరిత్తుమ్ = అని (తలచి వానిలో) ప్రపత్తి చేసిన, మాల్ = భగవానుడు, ఇనియవై = (రాబోవు) హితములను, తానే తరుమ్= తానే ఇచ్చును అని నిశ్చయించుకొనినవారై, తకవు = (ఆస్వామి) కృపయే, ఎణ్ణువర్= ఎదురుచూచెదరు.

గర్భవాసము మొదలగు సంసారదుఃఖములను పోగొట్టుకొనతలచిన భాగవతులు అధికాధికముగా భగవదనుభవరసము వృద్ధిపొందింపతగిన భక్తి యోగమును అనుష్ఠింతురు. అందులకు శక్తిలేనివారు భగవానుని శ్రీ పాదములందు ప్రపత్తిని చేయుదురు. ఇట్లు ఉపాయమును అనుష్ఠించిన పిమ్మట భగవానుడు తన కర్తవ్యముగా మంచిని చేయునని నమ్మి అతని కరుణనే ఎదురుచూతురు.

యోగశబ్దమే ఉయోగమైనది. జీవుడు గర్భములోనున్నపుడు పొందు యాతనలు విష్ణుపురాణము షష్ఠాంశములలో స్పష్టము చేయబడినవి. 10,11 పాశురములు రెండును ప్రసాదనపర్వము లోనివి. వృత్తము కట్టళైక్కలిత్తుఱై. **"తకవు శెయ్దిలై, తత్తువ మన్లు త్తకవన్లు"** ఇత్యాది దివ్యప్రబంధ సూక్తులలో **"తకవు"** అను పదము దయ అను అర్థములో ప్రయోగింపబడుట గమనింపతగినది. దృఢమను సంస్కృత శబ్దమే **"తిణ్ణమ్"** అయినదని పెద్దలందురు.

### ప్రపత్తి సకలపాపనివారకము

**11. మున్శెయ్ద వినైత్తిరళిన్ ముళైత్త తన్ఱి**
**ముఱ్ఱుళ్ళ ముదలరిన్దు ముళైత్త కూఱ్ఱిల్**
**ఱ్ఱన్శెయ్య తిరువరుళా లిశైవు పార్త్తు**
**త్తఴల్ శేర్న్ద తూల మెన త్తానే తీర్త్తు**
**ప్పిన్శెయ్ద వినైయి నినైవొన్ఱాదొన్జుమ్**
**పిఴై పొఱుత్తు వేఱుళదు విరకాన్మాఱ్ఱుమ్**
**మెన్ శెయ్య తామరైక్కట్పెరుమా నెణ్ణ**
**మెణ్ణాతా రెట్టిరణ్డు మెణ్ణాతారే**

మున్ శెయ్ద వినై త్తిరళిన్ = పూర్వము చేసిన పాపరాశిలో, ముళైత్తతు అన్ఱి = ఫలము నిచ్చుటను ఆరంభించిన పాపము కాక (ప్రారబ్ధము కాక) ఉళ్ళ ముదల్ = (సంచితములై) యున్న పాపములను, ముఱ్ఱుం అరిన్దు = మొత్తము పోగొట్టి, ముళైత్త కూఱ్ఱిల్ = ఫలమునిచ్చుటను ప్రారంభించిన (ప్రారబ్ధ) భాగములో, ఇశైవు పార్త్తు=(ప్రపన్నుని) అంగీకారమును ఎదురుచూచి (అతడు కోరినపుడు), తన్ శెయ్య తిరు అరుళాల్ = తన ఋజువైన గొప్ప కృపతో, తఴల్ శేర్న్ద తూలమ్ ఎన= అగ్నిలో చేరిన దూదిపింజ అనునట్లు, తానే తీర్త్తు = తానే పోగొట్టి, పిన్ శెయ్ద వినైయిల్ = (ప్రపత్తికి) పిమ్మట (ప్రామాదికముగా) పిమ్మట చేసిన పాపములలో, నినైవు ఒన్ఱాదు ఒన్జుమ్ = జ్ఞానము లేక (తెలియక) సంభవించిన, పిఴై పొఱుత్తు= పాపములను సహించి, వేఱు ఉళదు = తెలిసినను కార్పణ్యాదులచే చేసి తీరవలసినదియై, సంభవించిన పాపమును, విరకాల్ మాఱ్ఱుమ్ = ప్రాయశ్చిత్తము మొదలగువానిలో ప్రవేశింపచేసి, పోగొట్టువాడగు, శెయ్య తామరై క్కణ్ = ఎఱ్ఱని తామరవంటి నేత్రములనుకల, ఎన్ పెరుమాన్ = నాకు స్వామియగు సర్వేశ్వరుని, ఎణ్ణమ్ ఎణ్ణాదార్= మనస్సులోని అభిప్రాయమును తెలియనివారు, ఎట్టు ఇరణ్డుమ్ ఎణ్ణాదార్= ఎనిమిది అక్షరములనుకల అష్టాక్షరి, రెండు వాక్యములనుకల ద్వయము, చరమశ్లోకము–అను రహస్యత్రయమును తెలియనివారే అగుదురు.

చేతనుని కర్మములు 1 సంచితములని, 2. ప్రారబ్ధములని రెండు విధములు. రాబోవు కాలమున ఫలము నిచ్చునదియై, ప్రత్యేకముగా చేర్చి మూట కట్టినట్లుండునవి సంచితములనబడును. ఫలము నిచ్చుటకు మొదలిడిన కర్మలు ప్రారబ్ధకర్మ లనబడును. భక్తియోగము సంచితకర్మలను మాత్రమే పోగొట్టును. ప్రారబ్ధకర్మలను పోగొట్టలేదు.



ప్రపత్తియోగము సంచితకర్మలను పూర్తిగా పోగొట్టుటయేగాక, ప్రారబ్ధకర్మములలో మనము ఈ శరీరము ఉన్నంతవరకు ఫలము నీయవలసిన కర్మలనుతప్ప మిగిలినవానిని అన్నిటిని అగ్నిదూది పింజను రూపు మాపునట్లు **"యథా ఇషీక మగ్నౌ తూలం ప్రదూయేత"** అనునట్లు, **"తీయినిల్ తూశాకుమ్"** అనునట్లును నశింపచేయును. ప్రపత్తికి పిమ్మట తెలియకచేసిన పాపములను జీవుని అంటకుండునట్లు తొలగతోయును. కాలదేశవ్యక్తి విశేషములను పురస్కరించుకొని మనఃపూర్వకముగా చేయునట్లేర్పడిన పాపములు ప్రాయశ్చిత్తాదులద్వారా నశించును. (మనఃపూర్వకముగా చేయు పాపములను పోగొట్టు తీరు అధికారసంగ్రహము – 25 వ పాశుర వ్యాఖ్యలో తెలుపబడినది). కావుననే **"సాధ్యభక్తి స్తు సా హంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ"** అని తెలుపబడినది. ప్రాయశ్చిత్తము చేయని మూఢులకును అల్పమైన దండనను విధించి పాపములను పోగొట్టుచున్నది. ఈ శరీరము ఉన్నంతవరకు కల కాలవిడంబమును సహింపలేక, వెంటనే ముక్తిని కోరు ఆర్తులను వెంటనే సర్వపాపవినిర్ముక్తులను చేసి ఫలము నిచ్చుచున్నది. ప్రపత్తియొక్క మహిమ ఎంతటిది! ఇంతటి గొప్పతనము భక్తియోగమునకు లేదు. ఇట్లు ప్రపత్తిద్వారా అతనిసకలపాపములను పోగొట్టి, ప్రపన్నుని అనుగ్రహించుచున్నాడు భగవానుడు. ఆ స్వామి చల్లని చిత్తములోని అభిప్రాయమును తెలియనివారు రహస్యత్రయముల అర్థమును తెలియనివారే. **"ఇరణ్డుమ్"** అను పదములో **"ఉమ్"** (చకారార్థ) స్వారస్యమునుబట్టి చరమశ్లోకము చెప్పబడినదనవచ్చును. లేక, రెండు అను అర్థమును తెలుపు **"ఇరణ్డు"** శబ్దముచే ద్వయ, చరమములు చెప్పబడినవనియును చెప్పవచ్చును.

ఈ పాశురములో దేశికుల ప్రస్తుతించిన విషయములను ఆ ఆచార్యవర్యులచే ప్రోక్తమైన ఈ క్రిందిశ్లోకములో గమనింపవచ్చును. **"ప్రారబ్ధేతరపూర్వపాప మఖిలం ప్రామాదికం చోత్తరం న్యాసేన క్షపయ న్ననభ్యుపగతప్రారబ్ధఖండం చ నః, ధీపూర్వోత్తరపాప్మనా మజననా జ్ఞాతేఽపి తన్నిష్కృతేః కౌటిల్యే సతి శిక్షయాఽప్యనఘయన్ క్రోడీకరోతి ప్రభుః".** వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము.

### ఉత్క్రాంతిపర్వము – జీవుని శరీరోత్క్రమణము

**12. ఉఱ్ఱై యిట్ట వాళెన వూనుళుత్తైయు ముయోకియరై**
**నఱ్ఱై మట్టాఴ్వఱ్ఱ నఱ్ఱుళవేన్దియ నాయకన్నా**
**నిఱ్ఱై మట్టిలాద నెడుమ్పయన్ కాట్ట నినైన్దుదల**
**చ్చిఱ్ఱై వెట్టివిట్టు వఴిపడుత్తుమ్వకై శెయ్దిదుమే**

నఱై మట్టు ఒ ఱ్ ఱ = సువాసనను కల, తేనె వీడని, నల్ తుళవు= గొప్ప తులసీమాలను, ఏన్దియ నాయకన్ = ధరించిన సర్వేశ్వరుడు, ఉఱై ఇట్ట వాళ్ ఎన= ఒరలో ఉంచిన కత్తి అను రీతిలో, ఊనుళ్ ఉఱైయుమ్ ఉయోకియరై = శరీరములో నివసించు (భక్తులు, ప్రపన్నులు అను) యోగులను, మట్టు ఇలాద నిఱై = అవధి లేని గొప్పతనమునుకల, నెడుమ్ పయన్ = గొప్ప ఫలమగు మోక్షమును, కాట్ట నినైత్తు= అనుభవింపజేయవలెనని మనస్సులో తలచి, ఉడల శిఱై వెట్టివిట్టు = శరీరమనెడి చెఱను ఖండించి, వ ఱ్ పడుత్తుమ్ వకై = సంస్కరించునట్టి (ఉపయోగపఱచునట్టి) విధానమును, శెయ్దిడుమ్ = చేయును (**"తాన్"**-నిరర్థక పాదపూరణకపదము).

ఈ కర్మశరీరములోనున్న జీవాత్మకు, ఒరలోనున్న కత్తిని ఉపమానముగా చెప్పుట కలదు. ఒరలోనుండు కత్తి క్రమముగా పదును పోయి తుప్పుపట్టి, తాను చేయవలసిన ఖండనము చేయు సామర్థ్యమును పోగొట్టుకొనును. అట్లే, జీవాత్మ శరీరములో నున్నంతవరకు తనకు సహజముగానున్న జ్ఞానము సంకోచించి, తనకు తగిన, పరిపూర్ణమైన భగవత్కైంకర్యమును చేయుటకు శక్తిలేనిది అగును. ఇట్లు కర్మకు వశుడై యుండి, పిమ్మట భక్తి ప్రపత్తులలో ఒక ఉపాయమును అనుష్ఠించిన జీవాత్మకు భగవానుడు మోక్షమును అనుగ్రహింప నెంచి, శరీరమను చెఱనుండి ఆ ఆత్మను విడిపించును.

ఈ పాశురము, తరువాతి పాశురమును ఉత్క్రాంతిపర్వములోనివి. ఈ వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

**జీవుని శరీరమునుండి నిష్క్రమింపజేయు విధము**

**13.** **మున్ కరువి యీరైన్దు మనత్తిఱ్కూట్టి**
**ముక్కియమా మరుత్తిలవై శేర్త్తెల్లా**
**నన్గుణరు ముయిరినిఱ్చేర్త్తైమ్బూతత్తై**
**నణ్ణువిత్తు త్తాన్తన్పాల్ వైకున్నాత**
**ఒన్బదుడన్ వాశలిరణ్డుడైత్తా యుళ్ళే**
**యొరుకోటి తుయర్విళైక్కు ముడమ్బా యొన్రుమ్**
**వన్ శిఱైయి న్దలైవాశలిఱన్దు నమ్మై**
**వానేఱ వ ఱ్ పడుత్త మనముఱ్ఱానే**



మున్ = మొదట, కరువి ఈర్ ఐన్దుమ్ = (జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు అను) పది ఇంద్రియములను, మనత్తిల్ కూట్టి = మనస్సు అను ఇంద్రియముతో చేర్చి, అవై = ఆ పదునొకండు ఇంద్రియములను, ముక్కియమామ్ మరుత్తిల్ శేర్త్తు= ముఖ్యమగు ప్రాణవాయువులో చేర్చి, అదు ఎల్లామ్ = వానిని అన్నిటిని, నన్గు ఉణరుమ్= చక్కగా తెలియగల శక్తిని కల్గిన, ఉయిరినిల్ శేర్త్తు = జీవాత్మలో చేర్చి, (ఆ జీవాత్మను) ఐమ్బూతత్తై నణ్ణువిత్తు = అయిదు భూతములతో చేర్చి, (ఆ జీవాత్మయొక్క శ్రమను తీర్చుటకొఱకు), తాన్ తన్‌పాల్ వైక్కుమ్ నాతన్ = తాను తనతోచేర్చి జీవాత్మ అలసటను తీర్చు సర్వేశ్వరుడు, ఒన్బదుడన్ ఇరణ్డు వాశల్ ఉడైత్తాయ్ = పదకొండు ద్వారములను కల్గినదై, ఉళ్ళే ఒరు కోటి తుయర్ విళైక్కుమ్ = లోపల కోటిసంఖ్యలో దుఃఖములను కల్గించు, ఉడమ్బాయ్ ఒన్రుమ్ = శరీరమై (జీవునితో) చేరియున్న, వన్ శిఱైయిన్ = బలమైన చెఱలో, తలై వాశల్ తిఱన్దు = మొదటిద్వారమగు బ్రహ్మరంధ్రమును తెఱచి, నమ్మై వాన్ ఏఱ వ ఱ్ పడుత్త = మనలను పరమపదము చేరుటకై ప్రయాణము చేయించుటకు, మనమ్ ఉఱ్ఱాన్ = మనస్సును కల్గిన వాడయ్యెను.

మరణకాలమున భగవానుడు మొదట జీవాత్మయొక్క జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను మనస్సుతో చేర్చును. పిమ్మట ఆ మనస్సును ప్రాణవాయువుతో ఒకటిగా చేయును. ఆ పిమ్మట ఆ ప్రాణవాయువును జీవాత్మతో కలుపును. ఆ స్థితిని పొందిన పిమ్మట జీవాత్మను అయిదు భూతములతో చేర్చును. ఆ పిమ్మట దీనిచే జీవాత్మకు కల్గిన శ్రమ తీరునట్లు దానిని తనతో కలుపుకొనును. అనంతరము, పదకొండు ద్వారములను కల్గినదై, ఇంతవరకు ఆ జీవాత్మకు అంతులేని దుఃఖమును కల్గించు శరీరమను చెఱనుండి అర్చిరాది మార్గమునకు ప్రధానద్వారమగు బ్రహ్మరంధ్రముద్వారా వెలికితీసికొని వచ్చుటకు తలంచును. ఇట్లు జీవుడు శరీరమునుండి నిష్క్రమించుటయే ఆఱవ సోపానము.

శరీరము, ఇంద్రియములును నిలుచుటకు ప్రాణవాయువు కారణమగుటచే, దానిప్రాధాన్యమునుబట్టి అది ముఖ్యప్రాణమనబడునని ఉపనిషత్తు తెలుపుచున్నది.

జ్ఞానేంద్రియము లైదు - కన్ను,ముక్కు, చెవి, నాలుక, చర్మమును.
కర్మేంద్రియము లైదు - నోరు, చేయి, కాలు, పాయువు, ఉపస్థలు.

తొమ్మిది ద్వారములు – రెండు కన్నులు, రెండు చెవులు, ముక్కు ద్వారములు రెండు నోరు, మలద్వారము, మూత్రద్వారము అనునవి. వేఱొక రెండు, ద్వారములు – నాభి, బ్రహ్మ రంధ్రము – ఇవి కలసి మొత్తము పదకొండు. వాయువు అను సామాన్యార్థమిచ్చు **"మరుత్"** శబ్దము ఇచట ముఖ్య ప్రాణవాయువును నిర్దేశించును.

ఈ పాశురభావమునకు అనుగుణముగా – **"మనసి కరణగ్రామం ప్రాణే మనః పురుషే చ తం ఝటితి ఘటయన్ భూతేష్వేనం పరే చ త మాత్మని, స్వవిద విదుషో రిత్థం సాధారణే సరణే ర్ముఖైః నయతి పరతో నాడీభేదై ర్యథోచిత మీశ్వరః"** అను శ్లోకార్థము అనుసంధేయము. ఇందలి వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము.

## అర్చిరాదిపర్వము – అర్చిరాదిమార్గము

**14.** **తెరుళార్ పిరమపురత్తిఱై శేర్న్దిడర్ తీర్న్దవర్ తా**
**మరుళార్ పిరమపురచ్చిఱై తీర్న్దపిన్ వన్దెదిర్ కొ**
**ణ్డరుళాలమరర్ నడత్త విమ్మాయై కడన్దదఱ్పిన్**
**శురుళార్ పవనరకచ్చుழలాற్றిన్ శుழఱ్చియిలే**

తెరుళ్ ఆర్ = జ్ఞాన పూర్తిని కలవాడు, పిరమ పురత్తు ఇఱై శేర్న్దు = శరీరముయొక్క అధిపతియు అగు అంతర్యామితో చేరి, ఇడర్ తీర్న్దవర్ తామ్ = దుఃఖమును పోయి (అలసట తీరి) జీవులు, మరుళ్ ఆర్ = అజ్ఞానము నిండిన, పిరమపుర చ్చిఱై = శరీరమను చెఱను, తీర్న్ద పిన్ = విడిచి వెడలిన పిదప, అరుళాల్ = (భగవానుని) కృపతో, అమరర్ = ఆతివాహికులగు దేవతలు, ఎదిర్ కొణ్డు వన్దు నడన్ద = ఎదురువచ్చి, ఆహ్వానించి, పిలుచుకొనిపోగా, ఇమ్మాయై కడన్దతన్ పిన్ = ఈ ప్రకృతిమండలమును దాటిన పిదప, పవ నరక చ్చుழల్ ఆற్றిన్ = సంసారమనెడి నరకము (సుడిగుండములు నిండిన) నదిలోని, శుழఱ్చియిల్ = సుడిలో, శురుళార్= (తిరిగి) పరిభ్రమింపరు.

జీవుని శరీరము పంచభూతాత్మకము. ఆ శరీరములో నడుముకుపై భాగములో స్తంభములవంటి మూడు ఎముకలు ఒకదానితో వేఱొకటి కలసియున్నవి. వానికి త్రిస్థూణమని పేరు. మరణకాలమున ఈశ్వరుడు వానిని దాటి అచటినుండి అయిదు భూతములలోని సూక్ష్మమైన అంశమును గొని, అందు జీవుని చేర్చును. ఇట్లు ప్రవేశింప జేయునపుడు జీవునకు మిక్కిలి శ్రమ కల్గును. ఈ వేదన తీరుటకు ఆ జీవుని ఈశ్వరుడు తనతో కలుపుకొనును. (ఈ అంశములన్నియు మరణించు అందఱకు సమానములే).

పిమ్మట మోక్షమునకు పోవుటకు యోగ్యుడైన జీవుడు స్థూలశరీరమునుండి నిష్క్రమించునపుడు, ఆ జీవునకు అగ్ని మొదలగు ఆతివాహికులు ఎదురేగి, ఆహ్వానించి,



మార్గమున కొనిపోయి, ఉపచారములను చేసి, తమ తమ స్థానములవరకు తీసికొని పోయి విడుతురు. ఇట్లు ప్రకృతిమండలమును దాటి వెడలినవారు మరల సంసారమను నరకములో బాధలను పొందరు.

ఈశ్వరుడు జీవుని శరీరములలో అంతర్యామియై యుండుటచే, బ్రహ్మకు స్థానమైన ఈ శరీరము బ్రహ్మపురమని చెప్పబడుచున్నది–అని ఉపనిషద్వాక్యము. **"అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే"** ఇత్యాది ఛాందోగ్య వాక్య మిచట ప్రమాణము. ఆతివాహికుల వివరము అధికారసంగ్రహము. 28 వ పాశురవ్యాఖ్యలో చూడనగును.

14, 15 వ పాశురములు రెండు అర్చిరాదిపర్వములోనిది ఈ పర్వము ఏడవ పర్వము. ఇందలి వృత్తము కట్టళైక్కలిత్తుఱై.

## మోక్షమార్గమును చూచి ఆనందించుట

**15.** **విழియల్లాల్ వేలిల్లై విణ్ణిన్ మాతర్**
**మేని యల్లాల్ విల్లిల్లై మీనవఱ్కు**
**మొழి యిల్లాలముదిల్లై యెన్ఱు మున్నాళ్**
**ముత్తివழి మునిన్దడైన్ద మోకన్తీర్న్దోమ్**
**కழియల్లా ఱ్కడలిల్లై యెన్బార్ పోల**
**క్కారియమే కారణ మెన్ఱురైప్పార్ కాట్టుమ్**
**వழియల్లా వழియెల్లా ఙ్గడన్దో మற్றుమ్**
**వానేఱుమ్ వழి కణ్డో మకిழన్దిట్టోమే**

మున్నాళ్ = పూర్వము, ముత్తి వழి మునిన్దు = మోక్షమార్గమును కాదని, మీనవఱ్కు = మత్స్యమును ధ్వజములో గుర్తుగా కల్గిన మన్మథునకు, విణ్ణిన్ మాతర్= దేవలోక స్త్రీలగు అప్సరసలకుయొక్క, విழి అల్లాల్ వేల్ ఇల్లై = నేత్రములుతప్ప వేఱొక వేలాయుధము లేదు, మేని అల్లాల్ విల్ ఇల్లై = (ఆ స్త్రీల) శరీరముతప్ప వేఱొక విల్లు లేదు, మొழి అల్లాల్ అముదు ఇల్లై = (వారు మాటలాడు) మాటలు తప్ప వేఱు అమృతము లేదు, ఎన్ఱు అడైన్ద = అని (మనము) పొందిన, మోకమ్ తీర్న్దోమ్ = మోహమును పోగొట్టుకొంటిమి, కழి అల్లాల్ కడల్ ఇల్లై = (సముద్ర తీరములోని గుంటలలోగల నీటిని మాత్రము చూచి) ఆ నీరు తప్ప వేఱు సముద్రము లేదు, (అని) ఎన్బార్ పోల = అని పల్కు మూఢులవలె, కారియమే కారణ మెన్ఱు = (పరబ్రహ్మనుండి పుట్టిన) కార్యమగు జగత్తును కారణమని (తలచి, అది తప్ప వేఱొక పరబ్రహ్మము లేదని), ఉరైప్పార్ కాట్టుమ్

=పల్కు మతాంతరులచే చూపబడుచున్న, వఴి అల్లా వఴి ఎల్లామ్ = సన్మార్గము కాని మార్గములన్నియు, కడన్దోమ్ = దాటితిమి, మఱ్ఱుమ్ వాన్ ఏఱుమ్ వఴి కణ్డోమ్ = మఱియు పరమపదమునకు పోవు అర్చిరాది మార్గమును దర్శించితిమి (అందుచే) మకిఴ్న్దోమ్ = ఆనందించితిమి.

ఇంతవరకు దుష్కర్మవలన మోక్షమార్గమునందు మనస్సును ప్రవేశింపచేయని మనలను మన్మథుడు దేవతా స్త్రీల కన్నులనెడి వేలాయుధమును, వారి శరీరములనెడి వింటిని గొని మోహింపజేయగా, మనమును వారు పల్కు పలుకులను అమృతమని తలచి, స్వర్గసుఖముగా గొప్పది అని మోహించితిమి, భ్రమించితిమి. ఇపుడు సదాచార్య కటాక్షమువలన ఆ మోహము తీరినది. సముద్రతీరములోని గుంటలలో గల నీటినే సముద్రమని భావించు మూఢులవలె, పరబ్రహ్మనుండి పుట్టిన ఈ లోకమును చూచి ఇది కాకుండ దీనికి కారణమైయున్న బ్రహ్మమును అంగీకరింపకుండ, ఏదియో వదరు అన్యమతములకు చెందినవారు ప్రయోగించిన వలలో పడకుండ, తప్పుకొంటిమి. ఇపుడు పరమపదమును చేర్చు అర్చిరాదిమార్గమున పయనించు అతిశయమును సంపాదించితిమి. అచట ఆతివాహికులు చేయు ఉపచారములచే సంసారములో అనుభవించిన దుఃఖములు తీరి ఆనందమును పొందితిమి. ఈ అర్చిరాదిమార్గమే ఏడవ సోపానము. వృత్తము ఎణ్శీర్ ఆశిరియ విరుత్తము.

**దివ్యదేశప్రాప్త్యధికారము (పరమపదమును చేరుట)**

**16.** **వన్పఱ్ఱుడన్ మయల్ పూణ్డు మఱ్ఱోర్ కతియాలిననా**
**ళెన్ పెఱ్ఱదు పెఱున్తానము మెత్తనై పోదుళదామ్**
**తున్బఱ్ఱ తన్తుణివాఱ్ఱుయర్ తీర్క్కు స్తుఴాయ్ముడియా**
**నిన్బుఱ్ఱ నల్వఴియాలేఱ్ఱు నణ్బద మెణ్ణువమే**

వన్ పఱ్ఱుడన్ = (మనము అల్పవిషయములలోని) బలమైన ఆశ వలన, మయల్ పూణ్డు= అజ్ఞానమును పొంది, మఱ్ఱు ఓర్ కతియాల్ = (మనకు తగని) వేఱొక దారిలో నడచుటచే, ఇన నాళ్ = ఇట్లు పలుదినములుగా, పెఱ్ఱదు ఎన్ = పొందిన ఫల మేమి? పెఱుమ్ తానముమ్ = (ఆ దారిలో) పొందదగిన బ్రహ్మపదమువరకుగల) స్థానమును, ఎత్తనై పోదు ఉళదామ్ = ఎంతకాలము నిలచియుండును?, తున్బు అఱ్ఱు = దుఃఖము లేనివాడును, తన్ తుణివాల్ = తననుగూర్చిన (భక్తి, ప్రపత్తి అను ఉపాయమను) జ్ఞానముతో, తుయర్ తీర్క్కుమ్ = సంసారదుఃఖములను



పోగొట్టువాడును, తుఴాయ్ ముడియాన్ = తులసీమాలను తలపై అలంకరించుకొనినవాడును అగు సర్వేశ్వరునిచే, ఇన్బు ఉఱ్ఱ నల్ వఴియాల్ ఏఱ్ఱుమ్ = సుఖము నిండిన గొప్ప (అర్చిరాది) మార్గముచే పొందబడుచున్న, నల్ పదమ్ ఎణ్ణువమ్ = గొప్ప స్థానమగు పరమపదమును అనుసంధింతుము.

మనము ఇంతవరకు అల్పములైన లౌకికసుఖములలో అభినివేశమును కల్గినవారమై, మనకు తగని మార్గమున ప్రవర్తించుటచే ఏమి ఫలమును పొందితిమి? ఒకవేళ మనము బ్రహ్మపదవియే పొందినను, అది ఎంతకాలము నిలచియుండును? కావున సంసారులమగు మనకు భగవానుడు చూపిన భక్తి-ప్రపత్తులలో ఒక దానిని అనుష్ఠించి, దానిచే పొందబడు శ్రీ వైకుంఠమను దివ్యస్థానమును అనుసంధించి, ఆనందించెదము. ఇట్లు శ్రీ వైకుంఠమును చేరుటయే ఎనిమిదియవ సోపానము.

16వ, 17వ పాశురములు రెండు దివ్యదేశప్రాప్తిపర్వములోనివి. భక్తి ప్రపత్తులను ఉపాయములు జ్ఞానవికాసరూపములుగానే పరిణమించుటచే, జ్ఞానమను అర్థ మిచ్చు **"తుణివు"** అను పదముచే అవి సూచింపబడినవి. **"శేముషీ భక్తిరూపా"** అని, **"భక్తి స్తు జ్ఞానవిశేషరూపః"** అని మొదలుగాగల సూక్తులు ఇచట భావ్యములు. వృత్తము కట్టళైక్కలిత్తుఱై. స్థానపదమే తానమైనది.

**శ్రీ వైకుంఠముయొక్క ప్రకారానుసంధానము**

**17.** **పణ్డై యిరువినైయాఱ్ఱిల్పడిన్దు పార**
**జ్ఞాణాదే యొఴుకియ నామ్ పాక్కియత్తాల్**
**వణ్డమరు మలర్మాతర్ మిన్నాయ్ మన్న**
**వైశయన్తి మణివిల్లాయ్ విళఙ్గ వాన్శేర్**
**కొణ్డలరుణ్మఴై పొఴియ వన్ద తొప్పా**
**ఙ్గుళిర్న్దు తెళిన్దముతాయ్ విరిశైయాఱ్ఱై**
**కణ్డణుకి క్కరుత్తాలే కడన్దు మీళా**
**క్కరైకణ్డోర్ కతియెల్లా ఙ్కతిత్తిట్టోమే**

పణ్డై ఇరు వినై = అనాదియైన (పుణ్యపాపములను) రెండు కర్మలనెడి, ఆఱ్ఱిల్ పడిన్దు= నదిలో మునిగి, పారమ్ కాణాదే = (దాని) తీరమును చూడలేక, ఒఴుకియ నామ్= (దానిద్వారా) ప్రయాణము చేయుచున్న మనము, వణ్డు అమరుమ్ మలర్ మాతర్=

తుమ్మెదలు ధ్వనించు తామరపూవులోనున్న లక్ష్మీదేవి, మిన్నాయ్ మన్న = మెఱపువలె నిలిచియుండగా, వైశయన్తి = వైజయంతి అను వనమాల, మణి విల్లాయ్ విళఙ్గ= అందమైన హరివిల్లువలె ప్రకాశింపగా, వాన్ శేర్ కొణ్డల్= (పరమపదమనెడి) ఆకాశములోనున్న భగవానుడను మేఘము, అరుళ్ మழై పొழியు = కరుణ అనెడి వర్షజలమును కురియగా, వన్దతు ఒప్పామ్ = (దానిచే) వచ్చినట్లున్న, కుళిర్న్దు తెళిన్దు అముదాయ్ = చల్లని, నిర్దుష్టమైన, తేటపడిన అమృతముతో నిండిన, విరిశై ఆఱై = విరజానదిని, కణ్డు అణుకి = దర్శించి, సమీపించి, కరుత్తాలే కడన్దు = మన సంకల్పముతో దాటి, మీళా క్కరై కణ్డోర్ = పునరావృత్తిలేని ఆ తీరమనెడి శ్రీ వైకుంఠమును దాటినవారియొక్క, కతి ఎల్లామ్ = ప్రకారములన్నియు, పాక్కియత్తాల్= (మన) అదృష్ట విశేషముచే, కతిత్తిట్టోమ్ = అనుసంధించితిమి.

అనాదికాలముగా పుణ్యపాపములను కర్మలకు వశులమై, సంసారమున దుఃఖములను అనుభవించిన మనము ప్రపన్నులగు జీవులు అర్చిరాదిగతిద్వారా చేరి విరజానదిని సంకల్పముతో దాటి, శ్రీ వైకుంఠమును పొందుటను భాగ్యవినోదముచే అనుసంధించి, మనమిపుడు ఆ ఫలమును పొందగలమని సంతోషించుచున్నాము.

ఈ పాశురములో పరమపదమున వేంచేసియున్న భగవానుని ఆకాశములోనున్న మేఘముగా, లక్ష్మీదేవిని (శాశ్వతమైన) మెఱపు తీగగా, పలు వర్ణములను కల దివ్యపుష్పములతో కూర్చిన వైజయంతీ మాలను పలు రంగులను కల ఇంద్రధనుస్సుగా, విరజానదిని అచట ప్రవహించు అమృతమయమైన నదిగా వర్ణించు కవి భావనా చాతుర్యము అనుభవైకవేద్యము, సహృదయైకవేద్యమును, **"వైశయన్తి, విరిశై"** అనునవి **"వైజయంతీ, విరజా"** అను సంస్కృతపదముల వికారరూపములు.

**ప్రాప్తిపర్వము-(పరిపూర్ణబ్రహ్మానుభవము)**

**18.** **పూవళరు న్తిరుమాదు పుణర్న్ద నమ్ పుణ్ణియనార్**
**తావళమాన తని త్తివఙ్జేర్న్దు తమరుడనే**
**నా వళరుమ్ పెరునాన్మఱై యోదియ కీత మెలామ్**
**పావళరు న్తమిழ் ప్పల్లాణ్డిశైయుడన్ పాడువమే**

పూ వళరుమ్ = పూవులో వికసించునట్టి, తిరుమాదు = లక్ష్మీదేవిచే, పుణర్న్ద = ఆలింగనము చేసికొనబడినవాడును, నమ్ పుణ్ణియనార్ = మన పుణ్యస్వరూపమైన



భగవానునకు, తావళమాన = నివసించు తోటగు, తని త్తివమ్ శేర్న్దు = సాటిలేని పరమపదము చేరి, తమరుడనే = (నిత్యసూరులు, ముక్తులు అను) భాగవతులతో, నా వళరుమ్ = నాలుకలో నివసించు, పెరు నాన్ మఱై = గొప్ప నాల్గు వేదములలో, ఓదియ కీతమ్ ఎలామ్ = అధ్యయనము చేయబడు గానమునంతటిని, పా వళరుమ్= పాశురములు నిండియున్న, తమిழ் పల్లాణ్డు = ద్రావిడమున మంగళాశాసనము(తిరుప్పల్లాణ్డు) మొదలగు దివ్యసూక్తులను, ఇశైయుడన్= రాగపూర్వకముగా పాడువమ్ = పాడెదము. (వేదము, ప్రబంధము-అను రెండు గీతములను పాడెదము)

లక్ష్మీదేవి ఎల్లప్పుడు ఎడబాయక నివసించునట్టి వక్షఃస్థలమునుకల శ్రీమన్నారాయణుని దివ్యస్థానమగు శ్రీ వైకుంఠమును మనము చేరి, అచట నిత్య కైంకర్యమును చేయు నిత్యసూరులతో, ముక్తులతో కలసి సామగానమును, ఆழ்వార్ల శ్రీసూక్తులను తీయని గానమును చేసి, శ్రీ వైకుంఠనాథుని నిత్యముగా అనుభవించెదము.

తిరుప్పల్లాణ్డు ప్రబంధముచివరలో గల **"పరమాత్మనై శూழ்న్దిరున్దేత్తువర్ పల్లాణ్డే"** ఇత్యాది సూక్తిని ప్రకృతమున భావింపనగును. నిత్యముక్తులు చేయు సామగానమును గూర్చి తైత్తిరీయమున **"హావు హావు హావు అహ మన్న మహ మన్న మహ మన్నమ్ అహ మన్నాదోఽహ మన్నాదోఽహ మన్నాదః"** ఇత్యాదిగా కీర్తించినది. భగవానుడు పుణ్యస్వరూపుడనుట **"పుణ్యానా మపి పుణ్యోఽసౌ"** అని, **"నమ్మాళ్ పోఱ్ఱప్పత్తై తరుమ్ పుణ్ణియన్"** అని మొదలుగాగల సూక్తులు తెలుపుచున్నవి. వృత్తము కట్టళైక్కలిత్తుఱై. 18, 19 పాశురములు రెండును ఈ ప్రాప్తిపర్వములోనివి.

**ముక్తజీవునకు చెప్పబడు ఆఱు ఉపమానములు**

**19.** **అడలురక ముణ్డుమిழ்న్ద వరుక్కన్ పోల**
**వழுక్కడైన్దు కழுవియ నఱ్ఱరళమ్పోల**
**క్కడలొழுకి క్కరై శేర్న్ద కలమే పోల**
**క్కాట్టుత్తీ క్కులన్దొழிన్ద కళితే పోల**
**మడల్ కవరు మయల్ కழிన్ద మాతర్ పోల**
**వన్ శిఱైపోయ్ మన్నర్ పదమ్ పెఱ్ఱార్ పోల**
**వుడన్ ముదలా వుయిర్ మఱైక్కు మాయై నీఙ్గి**
**యుయర్న్ద పద మేఱి యుణర్న్దొన్ఱినోమే**

అడల్ ఉరకమ్ = బలమునుకల (రాహువు అను) సర్పముచే, ఉఞ్జు ఉమిழ்న్ద= మింగి, వెడల గ్రక్కిన, అరుక్కన్ పోల = సూర్యునివలెను, అழுక్కు అడైన్ద కழுవియ = మురికితో నిండియుండి, పిమ్మట కడుగబడిన, నల్ తరళమ్ పోల= గొప్ప ముత్యమువలెను, కడల్ ఒழுకి క్కరై శేర్న్ద = సముద్రములో దిక్కు తెలియక తిరిగి, పిమ్మట (దైవవశముచే) తీరమును చేరిన, కలమే పోల = నావవలెను, కాట్టు త్తీక్కు అలన్దు = దావాగ్నిచే (చుట్టు ముట్టబడి) తపించి, ఒழிన్ద = (పిమ్మట ఆ దుఃఖము) తీరిన, కళిఱే పోల = ఏనుగువలెను, మడల్ కవరుమ్ మయల్ కழிన్ద = మడల్ అనుష్ఠించునట్లు కామాతురత తీరిన, మాతర్ పోల = ఉత్తమస్త్రీవలెను, వన్ శిఱై పోయ్ = (చిరకాలము చెఱలోనుండి పిమ్మట ఆ) బలమైన చెఱపోయి, బయటకు వచ్చి, మన్నర్ పదమ్ పెற்றార్పోల = రాజపదవిని పొందినవారివలెను, ఉడల్ ముదలా = కర్మశరీరమునకు కారణమై, ఉయిర్ మఱైక్కుమ్ = జీవాత్మస్వరూపమును (మనము తెలిసికొన వీలుకానట్లు) మఱుగుపఱచునదియైయున్న, మాయై నీజ్గి = ప్రకృతిసంబంధము పోయి, ఉయర్న్ద పదమ్ ఏఱి= గొప్ప స్థానమగు పరమపదమును అధిరోహించి, ఉణర్న్దు = (శ్రీ వైకుంఠనాథుని) అనుభవించి, ఒన్ఱినోమ్ = (ఆ స్వామితో) కలసి అభినివేశమును పొందితిమి.

సంసారములో మునిగి, దుఃఖించు జీవుడు సంసారబంధము తీరి పరమ పదమునకు పోవునపుడు పొందు తేజస్సు, గొప్పతనమును ఈ పాశురములో ఆఱు ఉపమానములద్వారా వివరింపబడినది. రాహువు అను సర్పము పట్టుకొని, విడచిన పిమ్మట సూర్యుని ప్రకాశము మిక్కిలి అధికముగా శోభించును. మురికి చేరిన మంచి ముత్యము, బాగుగా కడుగబడిన పిమ్మట దానికిగల సహజమైన కాంతి ప్రకాశించును. సముద్రములో ప్రయాణించు నావ దారి తప్పి, పయనించుచు, పిమ్మట దైవబలముచే తీరమును చేరినచో, ఆ నావలోని యాత్రికులు పొందు ఆనందమునకు అంతు ఉండదు. గజము గొప్ప దావాగ్నిలో చిక్కుకొని తపించి, పిమ్మట, అదృష్టవశమున ఆ అగ్ని చల్లారగా, అందుండి బయటపడిన పిమ్మట ఆ గజము పొందు ఆనందము చెప్ప వీలుకానిది. ఒక నాయిక తాను వలచిన నాయకుని పొందగోరి, అది సాధ్యము కాకపోయిననపుడు, మడల్ అనుష్ఠింపవలెనని ప్రయత్నించి, ఇష్టసిద్ధిని పొందినచో, ఆమె అంతులేని ఆనందము అనుభవించును. అట్లే, నాయిక కొఱకు మడల్ అనుష్ఠించు నాయకుడును తనకు ఇష్ట సిద్ధి కల్గినపుడు మిక్కిలి సంతోషించును. ఒక రాజు తన



తప్పిదముచే కొంతకాలము కారాగారవాసదుఃఖము అనుభవించినను, పిమ్మట అతడు ఆ తప్పు సరిదిద్దుకొని, చెఱవీడి మరల తన రాజ్యమును పొందినచో, అతడు ఆనందసాగరమున మునుగును. ఆ విధముగానే ఇంతవరకు మనము నిజమైన స్వరూపమును తెలియకుండచేసిన ప్రకృతిసంబంధము తొలగినపుడు మనము శ్రీ వైకుంఠములో శ్రీమన్నారాయణునితో కలిసి, అతనికి కైంకర్యమును చేసి, ఆ స్వామిని ఆనందముగా అనుభవింతుము. ఇట్లు పరిపూర్ణకైంకర్యమును చేసి, అనుభవమును పొందుటయే తొమ్మిదియవ సోపానము. ఇదియే ముఖ్యమైన ఫలముకూడ.

**మడల్ :-**

తమిళాలంకారసంప్రదాయమునుబట్టి, ఒక నాయకుడు తాను ప్రేమించిన నాయికను పొందలేని స్థితిలో, ఆమె రూపమును చిత్రించిన తాటిమట్టను తీసికొని, ఊరిలోని వారందఱు చూచునట్లు తిరుగుట. లేతమట్టను నిర్దేశించు **"మడల్"** అను ఈ పదము ఇచట అందు వ్రాసిన చిత్తరువును తెలుపును. మడల్ అనుష్ఠించు విధానమునకు సంబంధించిన వివరములు తమిళాలంకారలక్షణ గ్రంథములలో కాననగును.

ఇట్లు తాము కోరిన నాయకుని (నాయికను) పొందలేక పోవుటచే మడల్ అనుష్ఠించు దశను పొంది, పిమ్మట తమ మనోరథము నెఱవేరినచో ఆ దుఃఖము తీరిన నాయికలు (నాయకులు) ఇచట సంసార బంధము పోయి, ముక్తిని పొందు జీవునకు ఉదాహరణముగా చెప్పబడిరి.

తిరువాయ్మొழிలోని **"ఆవారార్ తుణైయెన్రు అలైనీర్కడలుళ్ అழுన్దుమ్ నావాయ్పోల్"** అను సూక్తి ఇచట స్మరణీయము. ఈ పాశురములోని అయిదవ ఉపమానములో **"మాదర్ పోల"** అను పాఠమే ప్రచురముగా కన్పించుచున్నది. నాయికను ఉద్దేశించి నాయకుడు మడల్ అనుష్ఠించునే కాని, నాయకునిగూర్చి నాయిక మడల్ ఎత్తుట సంప్రదాయముకాదని తమిళ ఆలంకారికుల సమయము **"మాదర్ మడలూరార్"** అను సూక్తి ఈ అర్థమునే తెలుపుచున్నది. కాని, తిరుమజ్గైయాழ்వార్ తాము నాయికాభావనను పొంది, భగవానుని విషయమున మడల్ అనుష్ఠింప నిశ్చయించుకొని పాడిన మడల్ ప్రబంధములలో, స్త్రీలు మడల్ ఎత్తుట సంప్రదాయముకాదను తమిళ ఆలంకారిక నియమమున్నను, తాము దానిని గణింపక, సంస్కృతాలంకారిక సమయమును అనుసరించి, స్త్రీలు తమ నాయకుని లోకములో అందఱు తెలియునట్టి

రీతి అవలంబించియే, మడల్ ఎత్తుటకు నిశ్చయించిరని చెప్పనగును. ఈ విధానమును బట్టి ఇచట **"మాతర్"** అను పాఠమును గ్రహించుట సరి అయినదే. **"మాన్దర్"** అను పాఠాంతరమును గ్రహించినచో ఈ పదము ఆడ-మగ అను ఇద్దఱిని చెప్పునది కావున, ఇది రెండు రీతులకు (స్త్రీలు, పురుషులు అనుష్ఠించు మడల్‌కు) ఇది సరిపోవునని గ్రహింపనగును. అందుచే **"మాతర్, మాన్దర్"** అను రెండు పాఠములును పొసగును. అని పూర్వుల వ్యాఖ్య. కాని **"స్త్రీప్రాయ మితరత్ సర్వమ్"** ఇత్యాది ప్రమాణములను బట్టి **"మాదర్"** అనుపాఠమే యుక్తతరము.

ఈ పాశురముతో తొమ్మిది సోపానముల వివరణము పూర్తి అయినది. ఇక తరువాతి పాశురములో పూర్వోక్తములగు తొమ్మిది సోపానములు కలిపి ప్రస్తావించబడుచున్నవి. వృత్తము ఎణ్‌శీర్ ఆశిరియవిరుత్తము.

**తొమ్మిది సోపానముల పునః ప్రస్తావన**

**20.** **మణ్ణులకిన్ మయతీర్న్దు మన స్తతుమ్బి**
**మన్నాద పయనికన్దు మాలేయన్ఱి**
**కణ్ణిలతెన్ఱఞ్జి యవన్ కÇలే పూణ్డు**
**కడుఞ్జిఱైపోయ్ క్కరై యేఱు జ్కతియే శెన్ఱు**
**విణ్ణులకిల్ వియప్పెల్లామ్ విళఙ్గ క్కణ్డు**
**విణ్ణవర్‌తఙ్కుÇాఙ్గళుడన్ వేదమ్ పాడి**
**ప్పణ్ణులకిల్పడియాద విశైయా ల్పాడుమ్**
**పల్లాణ్డే పల్లాణ్డుమ్ పాడువోమే**

మణ్ణులకిల్ మయల్ తీర్న్దు = ఈ కర్మభూమిలో అజ్ఞానము తీరి (1-వివేక పర్వము), మనమ్ తతుమ్బి = (వ్యర్థముగా పోయిన కాలమును తలచి) మనస్సున తపించి, (2-నిర్వేద పర్వము) మన్నాద పయన్ ఇకన్దు = అస్థిరములైన సంసార సుఖములలో ఆశ తీరి, (3- విరక్తిపర్వము), మాలే అన్ఱి = భగవానుడు తప్ప, కణ్ ఇలదు ఎన్ఱు = (సంభవించు నరకమును అడ్డుకొనుటకు) వేఱు గతి లేదు అని, అఞ్జి= భయపడి (4-ప్రీతి పర్వము), అవన్ కÇలే పూణ్డు = (భక్తి లేక ప్రపత్తిచే) ఆ స్వామి శ్రీపాదములనే ఆశ్రయించి (5-ప్రసాదనపర్వము), కడుమ్ శిఱై పోయ్= శరీరమను కఠినమైన కారాగారమునుండి బయటకు వచ్చి (6-ఉత్క్రమణ పర్వము) తీరమును చేరు



అర్చిరాదిగతిలో పయనించి (7- అర్చిరాది పర్వము), విణ్ణులకిల్ = పరమపదములోనున్న, వియప్పు ఎల్లామ్ = ఆశ్చర్యములన్నియు, విళఙ్గ క్కణ్డు = స్పష్టముగా దర్శించి (8- దివ్యదేశప్రాప్తిపర్వము), విణ్ణవర్‌తమ్ కుÇాఙ్గళుడన్ = నిత్యసూరుల, ముక్తుల గోష్ఠితో, వేదమ్ పాడి = వేదమును గానము చేసి, పణ్ ఉలకిల్ పడియాద ఇశైయాల్ = సంగీత ప్రపంచమున కానరాని దేవగానముతో, పాడుమ్ = పాడబడుచున్న, పల్లాణ్డే = పల్లాణ్డు అని ప్రారంభమగు దివ్యప్రబంధమునే, పల్ ఆణ్డుమ్ పాడువోమ్ = చిఱకాలము (నిత్య ముక్తులతో కలసి) పాడి, భగవానుని అనుభవించెదము. (9- ప్రాప్తిపర్వము).

ఈ కర్మభూమిలో సదాచార్యకటాక్షమువలన వివేకమును పొంది, ఇంత వరకు నిష్ఫలముగా గడచిన కాలమునుగూర్చి మనస్సున బాధపడి, సంసార సుఖములలో అభినివేశమును పోగొట్టుకొని, రాబోవు నరకానుభవమునకు భీతిల్లి, ఉపాయమును అనుష్ఠించి, శరీరమునుండి నిష్క్రమించి, అర్చిరాదిగతిలో పయనించి, పరమపదమును చేరి, అచట నిత్యముక్తులతోకలసి వేదమును గానము చేయుచు, సంగీతలోకములో కానరాని దేవగానముతో దివ్యసూరుల శ్రీ సూక్తులను పాడి, భగవద్గుణానుభవమును పొందెదము. వృత్తము ఎణ్‌శీర్ ఆశిరియవిరుత్తము.

**ప్రపత్తి చేసిన పిమ్మటకూడ మన మీ లోకమున నుండుటకు హేతువు**

**21.** **మాళాద వినై యనైత్తు మాళ నామ్ పోయ్**
**వానేఱి మలర్ మకళారన్బు పూణు**
**న్తోళాద మామణిక్కు త్తొణ్డు పూణ్డు**
**తొÇుదుకన్దు తోత్తిరఙ్గళ్ పాడియాడి**
**క్కేళాద పÇైమఱైయిన్ కీతమ్ కేట్టు**
**క్కిడైయాద పేరిన్బమ్ పెరుక నాళు**
**మీళాద పేరడియై క్కన్బు పెÇÇో**
**మేదినియి లిరుక్కిన్ఱోమ్ విదియినాలే**

మాళాద వినై అనైత్తుమ్ = నశింపని కర్మలు మొత్తము (అన్నియు), మాళ = మనము అనుష్ఠించిన ఉపాయముతో నశింపగా, నామ్ పోయ్ = మనము అర్చిరాదిగతిలో పయనించి, వాన్ ఏఱి = పరమపదమును పొంది, మలర్ మకళార్ = తామర పూవులో నివసించు లక్ష్మీదేవి యొక్క, అన్బు పూణుమ్ = ప్రేమను పొందినవాడు, తోళాద మా

మణిక్కు = తొలచబడని (రంధ్రము చేయుబడని) గొప్ప ఇంద్రనీలరత్నమువంటివాడగు భగవానునకు, తొణ్డు పూణ్డు = కైంకర్యమును చేసి, తొழுదు = నమస్కరించి, ఉకన్దు = సంతోషించి, తోత్తిరజ్గళ్ పాడి = స్తోత్రానుసంధానము చేసి, ఆడి = నర్తించి, కేళాద పழై మఱైయిన్= (ఇంతవరకు) వినియుండని, ప్రాచీనమైన వేదముయొక్క, కీతమ్ కేట్టు = దివ్యప్రబంధమును విని, కిడైయాద పేరిన్బమ్ = (మిగిలిన వారికి) లభింపని గొప్ప (మోక్షరూప) ఆనందమును, నాళుమ్ పెరుక = ఎన్నడును పొందునట్లు, మీళాద పేరడిమైక్కు = (ఈ కర్మభూమికి) పునరావృత్తిలేని, గొప్ప కైంకర్యమునకు కారణమైన, అన్బుపెற்றోమ్ = (భగవానుని) ప్రీతిని పొందితిమి, విదియినాల్ = (మనలను పురస్కరించుకొని చేతనులను ఉజ్జీవింపచేయువలెనని తలచిన భగవానుని) నియమనముచే, (లేక, అర్చావతారమున అభినివేశమును పొందుటకు, శ్రీ సూక్తులను అనుభవించుటకును కారణమగు) భాగ్య విశేషమువలన, మేదినియిల్ ఇరుక్కిఱోమ్= ఈ కర్మభూమిలో జీవించుచుంటిమి.

చిఱకాలముగా నశింపకుండనున్న కర్మలన్నియు మనము అనుష్ఠించిన ఉపాయ ఫలితముగా రూపుమాసినవి. పిమ్మట పరమపదమును చేరి, దివ్యదంపతులకు కైంకర్యము చేసి, ఆనందముతో ఆడి, పాడి, వేదముల దేవగానములను విని, ఈ కర్మభూమికి పునరావృత్తి లేక, ఆ అనుభవములోనే మునిగియుండునట్లు భగవానుని కృపను పొందితిమి. అయినను, వెంటనే ఆ అనుభవమును పొందక, ఇంకను మనము ఈ కర్మభూమిలో ఉండుటకు కారణము ఏమనగా – మనలను పురస్కరించుకొని చేతనులను ఉజ్జీవింపచేయవలెవని మనస్సున తలచిన భగవానుని సంకల్పము, అర్చావతారమున ప్రావణ్యమును పొంది, అనుభవించుటకు కారణమైన భాగ్యవిశేషము, శ్రీ భాష్యము, దివ్యసూరి సూక్తులు, వానికి పూర్వాచార్యులు కృపజేసిన వ్యాఖ్యలు – మొదలగువానిని సేవించి, అనుభవింపవలసిన పుణ్యవిశేషమును (ఇందులకు కారణము) **"అనావిద్ధమ్ రత్నమ్"** అనునట్లు తొలచబడని రత్నము శోభ గొప్పది కదా! కావున అది భగవానునకు ఉపమానముగా తెలుపబడినది.

వృత్తము ఎణ్శీర్ ఆశిరియవిరుత్తము. స్తోత్రమను సంస్కృత పదము **"తోత్తిరమ్"**గా మాఱినది.

**పరమపదసోపానవ్యాఖ్య ముగిసినది.**

